ఆంధ్రప్రదేశము సాహిత్య అకాడెమీ ప్రచురణ

# తురుష్క ప్రజాస్వామికము

## మధ్యప్రాచ్య దేశములు

గ్రంథకర్త:
అయ్యదేవర కాళేశ్వరరావు

ఆదర్శగ్రంథమండలి, విజయవాడ

# తొలిపలుకు

తురుష్కదేశము క్రీ. శ. పదునాలుగవ శతాబ్దమునుంచి ప్రాముఖ్యతవహించి ఉచ్ఛస్థితికి వచ్చినది. ఆశియా, ఆఫ్రికా, యూరపు ఖండములు కలియుచోట నొక గొప్ప సామ్రాజ్యమును స్థాపించినది. ఇదియొక ముసల్మాను సామ్రాజ్యము. తురుష్కులయొక్క అసలుపేరు తురకలు. వీ రదివరకు కొన్ని శతాబ్దములక్రింద చైనా సామ్రాజ్యములోని తురుష్క పర్వత ప్రాంతమునుండి అనటోలియా దేశమునకు కాపురమునకు వెళ్ళినారు. అప్పటినుంచి అనటోలియాకు తురుష్కదేశమని తుర్కీయని పేరువచ్చినది. ఈ జాతివారందరు ముసల్మానుమతమును స్వీకరించినారు. ముసల్మానులలో తురకలు, అరబ్బులు, అఫ్ఘనులు, పారసీకులు వేరు వేరు తెగలైయున్నారు. వీరి భాషలుకూడ వేరువేరుగనున్నవి. తురకలు గొప్ప సామ్రాజ్యమును స్థాపించుకొనుటవలన మన ఆంధ్రదేశములో మహమ్మదీయులనందరిని సర్వసాధారణముగ తురకలని, ఉరుదుభాషను తురకభాషయని పిలచుట జరుగుచున్నది. ఉరుదుభాష మన దేశములో పుట్టిన భాష గాని తురకలు బైటినుంచి తెచ్చిన భాష కాదు. తురుష్కసామ్రాజ్యము బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ప్రాబల్యముక్రింద కొన్ని శతాబ్దములలో క్షీణించి పతనమైనది. మొదటి ప్రపంచయుద్ధానంతరము మిత్రమండలివారు చేసికొనిన సెవరను సంధివలన తురుష్కదేశము కూడ విచ్ఛిన్నమై స్వతంత్రము గోల్పోవుస్థితికి వచ్చినది. ముస్తఫా కెమాల్‌పాషా (కెమాల్ అటా టర్క్) తురుష్క

జాతీయ నాయకత్వమునువహించి స్వతంత్రపోరాటము సాగించి సంపూర్ణ స్వాతంత్రమును నిలబెట్టినాడు. ఈ దేశము అప్పటి నుంచి శాంతియుతముగ అభివృద్ధిచెందుచున్నది. నిరంకుశ సుల్తానును తీసివేసి సంపూర్ణ ప్రజారాజ్యమైనది. స్త్రీల పరదాను నిషేధించి స్త్రీలకు సర్వతోముఖమైన వికాసము కలుగ చేయబడినది. ముసల్మాను మతతత్వమునకు పీఠమైన ఖిలాఫతును రద్దుపరచి తురుష్క రాజ్యము సెక్యులరు స్టేటు, అనగ ఏమతమునకు సంబంధములేని రాజ్యమైనది. మన ఇండియాకంటె ముందే సెక్యులరు స్టేటు అయిన దేశమది. ద్వితీయ ప్రపంచసంగ్రామములో తటస్థముగనుండి ఎట్టి వ్యయమునకు జననష్టమునకు లోబడకుండ నిలువబడగలిగినది. ముస్తఫా కెమాల్‌పాషా యొక్క రాజనీతి కార్యక్రమములు ఇతర దేశములకు అనేక గుణపాఠములు నేర్పగలిగి యున్నవి. ఆయన మరణించినపిమ్మట ప్రస్తుత రాజకీయనాయకులు పాశ్చాత్యరాజ్యముల బృందమువైపుకు మొగ్గియున్నారు. మధ్యప్రాచ్య దేశముల ప్రస్తుత రాజకీయ ఆర్థిక సమస్యలలో తురుష్క దేశముకూడ ప్రముఖస్థానము వహించియున్నది. అందువలన తురుష్క దేశచరిత్రను వ్రాయుచు దానితోపాటు ఇతర మధ్యప్రాచ్య దేశముల పరిస్థితులనుగూర్చి కూడ గుణక ప్రత్యేక అధ్యాయమును చేర్చియున్నాను. ఇరువదియైదు సంవత్సరములకు పూర్వము తురుష్క దేశముయొక్క చరిత్రను నేను ఆంధ్రమునవ్రాసి, ప్రచురించియుంటిని. అప్పటినుంచి పరిస్థితులన్నియు ఎన్నియోవిధముల మారినవి. కావున ఆ తురుష్క దేశచరిత్రను పూర్తిగ సవరించి నేటివరకును తీసు

కొనివచ్చి నూతనముగ ఇతర మధ్యప్రాచ్య దేశములచరిత్రను కూడ చేర్చియున్నాను. ఆంధ్రభాషలో నవీన విజ్ఞానమునిచ్చు దేశచరిత్రలను, సాంఘిక, ప్రకృతిశాస్త్రములను వ్రాయించి ప్రచురించుటకై గతనెల పదునాలుగవ తేదీన హైదరాబాదులో నేర్పడిన చరిత్ర శాస్త్రముల తెలుగు ఎకాడెమి పక్షమున ఈ గ్రంథమును ప్రథమకుసుమముగా ప్రచురించడమైనది. ఈ గ్రంథముయొక్క ప్రూఫులన్నియు సరిగ దిద్దించి త్వరితముగ ముద్రింపించిన ఆదర్శగ్రంథమండలి సంపాదకులగు గద్దె లింగయ్య గారికి నా కృతజ్ఞతను వెల్లడించుచున్నాను. ఈ గ్రంథము వలన కొంత అంతర్జాతీయ పరిజ్ఞానము ఆంధ్రులకు కలుగ గలదని ఆశించుచున్నాను.

1–1–1959,
నాగార్జున విహార్
హిమాయత్‌నగర్,
హైదరాబాదు

అయ్యదేవర కాళేశ్వరరావు.

# BIBLIOGRAPHY.


| | |
|---|---|
| Modern Turkey | Mears |
| Turkey | Toymbee & Kirkwood |
| Turkey Today | Grace Ellison |
| Imperialism And world Politics | Doctor Moon |
| Mustapha Kemal of Turkey | Wortham |
| Eminent', Asians | Joseph Hall |
| Egypt | Young |
| Outlines of the History of the World Vol. II | H. G. Wells |
| Europe after 1814 | Hazen |
| These Eventful years | Encyclopadia Brita—nnica Co., (New York) |
| 1932 Issues of Current History | |
| The Saracens | Gillman |
| Middle East | 1957 and 58. |

# విషయసూచిక



మధ్యప్రాచ్య దేశములు (Middle East)

# తురుష్క ప్రజాస్వామికము

## 1 తురుష్కసామ్రాజ్యము

### (1)

### అనటోలియా ప్రాచీననాగరికత

తురుష్కదేశము పూర్వకాలమున అనటోలియా యనుపేర పిలువబడుచుండెను. అనటోలియా దేశము ఆశియాఖండమునందు పశ్చిమమున నున్నది. దానిని ఆసియా మైనరు అనికూడ పిలిచెదరు. ఇటీవల జరిగిన ప్రాచీన పరిశోధనలవలన నచట క్రీస్తు పుట్టకపూర్వము నాలుగువేల యేండ్లక్రిందట గొప్ప శిల్పములు, కళలు, శాస్త్రములు ప్రబలి యుండెనని స్పష్టమగుచున్నది. భరతవర్షము, చైనా, ఈజిప్టు దేశములవలెనే, ఆశియాఖండములోని పశ్చిమప్రాంతములును, యూరపుఖండవాసులు అనాగరికులై అడవులలో సంచరించుచుండిన ప్రాచీనకాలమున సర్వతోముఖమయిన గొప్ప నాగరికత కాలవాలమై యుండెను. ప్రపంచమునందలి గొప్ప మతము లన్నియు భరతవర్షమునందును పశ్చిమఆశియాయందును పుట్టినవి. హిందూ బౌద్ధ జైన మతములు భరతవర్షమునందును, జొరాస్టరుమతము పారసీక దేశమునందును, యూదులమతము క్రైస్తవమతము పాలస్తైయిన్‌దేశము నందును మహమ్మదీయమతము అరేబియాదేశమందును పుట్టియున్నవి. యూరపుఖండము మతమును, విజ్ఞానమును నాగరికతను ఆశియాఖండము నుండియే, నేర్చుకొనెను.

### పూర్వపురాజులు

అనటోలియాదేశము క్రీస్తుపుట్టువునకు రెండువేల సంవత్సరము లకు పూర్వము హిట్టయిటులను జాతికిచెందిన రాజులచే పాలింపబడెననియు, ఇపుడు 'బోఘాజుకోయి' యను పట్టణమున్నచోట నాకాలమున వారి రాజ

ధానియగు గొప్ప నగరరాజముండెననియు తెలియుచున్నది. అచట భూమిలో త్రవ్వగ నాకాలమునాటి యద్భుతమగు శిల్పచాతురిని తెలుపుకట్టడములు కన పడినవి. వారు "కారాబేల్" మొదలగు ప్రదేశములందు కొండలలో తొలిపిం చిన చిత్తరువులు నేటికిని చూపరుల కాశ్చర్యమును కలిగించుచున్నవి. తరు వాత అనటోలియా కొంతకాలము "లిడియను"రాజులచే పాలింపబడినది. లిడియనులుకూడ మిగుల నాగరికులు. వారిపద్దనుండి గ్రీకులు నాగరికతను నేర్చుకొనిరి. పిమ్మట అనటోలియాదేశము గ్రీకులక్రిందకును, పారసీకుల క్రిందకును వచ్చెను. అటుతరువాత నలెగ్జాండరు చక్రవర్తి యా దేశమును జయించి కొంతకాలము పాలించెను. ఆయన మరణించిన పిమ్మట ఆ దేశము రోమకసామ్రాజ్యమునం దొక భాగమయ్యెను. కాపున నాదేశమునందు గ్రీకు నాగరికత వ్యాపించుటయేగాక రోమకసామ్రాజ్యముక్రింద వందలకొలది అందమైన పట్టణములు దేశముయొక్క అన్నిప్రాంతములను విలసిల్లెను. మహమ్మదీయమతము పుట్టి విజృంభించిన తరువాత నా దేశము అరబ్బు సామ్రాజ్యముక్రిందకు వచ్చి ప్రజలు చాలవరకు మహమ్మదీయమతమును స్వీకరించిరి.

## తురుష్కులు

క్రీస్తు పుట్టినతరువాత 1071 సంవత్సరమునను అటుపిమ్మటను తురుష్కులను పశువులకాపరులగు జాతివారు తమ పశువులను వెంటనిడి కొని కుటుంబములతోకూడ అనటోలియాకు వలసవచ్చిరి. వీరు చైనారాజ్య ములో వాయువ్యమూల నున్న "తుర్కు" అను పర్వతప్రాంతములనుండి వచ్చినందున వీరు తురకలని లేక తురుష్కులని పిలువబడుచువచ్చిరి. వీరి నుండియే అనటోలియాకు తురుష్కదేశమని పేరువచ్చెను. తురుష్కులు గూడ శీఘ్రకాలముననే మహమ్మదీయమతము నవలంబించి యా దేశము యొక్క ప్రాతకాపురస్తులతో సంబంధబాంధవ్యముల నేర్పరచుకొనిరి. క్రీ॥ శ॥ 1299 వ సంవత్సరమున తురుష్కతెగల నాయకుడగు ఉస్మాన్ అను నతడు అనటోలియాపైన రాజ్యాధికారమును స్థాపించుకొనెను. తమ రాజవంశమునకు తన తండ్రిపేర అట్టోమాణ్ వంశమని పేరిడికొనెను. అట్టోమాణ్ వంశీకులగు రాజులు సుల్తాను బిరుదముతో తురుష్కదేశమును

1922 వ సంవత్సరమువరకును పాలించిరి. తురుష్కభాష దేశములో ప్రధాన మగు భాషఅయ్యెను. దానిని అరబ్బీలిపిలో వ్రాసిరి. మహమ్మదీయ మత గ్రంథములన్నియు అరబ్బి పారసీభాషలలో నుండుటవలన తురుష్కపండితులు అరబ్బి, పారసీభాషలను బాగుగ నేర్చుకొని తురుష్కములో అరబ్బి పారసీ పదములను విశేషముగ చేర్చిరి. ఆంధ్రవాఙ్మయము సంస్కృతపద భూయిష్ఠమై యున్నటుల తురుష్కవాఙ్మయము అరబ్బిపారసీపదభూయిష్ఠ మయ్యెను. తురుష్కదేశమునందు క్రైస్తవులగు గ్రీకులును ఆర్మీనియనులును గూడ గలరు. యూదులును అరబ్బులును మిగుల స్వల్ప సంఖ్యాకులుగ నున్నారు. తురుష్కభాషకు తరువాత గ్రీకుభాషయే రెండవభాషగ నున్నది.

## అట్టోమాన్ సామ్రాజ్యవిజృంభణము

అట్టోమాన్ సుల్తానులు కొన్ని తరములవరకును యుద్ధవిశారదులై పరాక్రమమునకు పేరెన్నికగన్నవారై రాజకార్యనిపుణులై చుట్టుపట్టులనున్న దేశములనన్నిటిని జయించి యొక గొప్పసామ్రాజ్యమును స్థాపించిరి. 1326 సంవత్సరమున బ్రూసాను జయించిరి. పిమ్మట గల్లిపోలీని జయించిరి. 1369 వ సంవత్సరమున యూరపుఖండములోని థ్రేసు వీరికి లోబడెను. 1369 వ సంవత్సరమున యూరపుఖండములోని బల్గేరియా వీరిక్రిందికి వచ్చెను. పిమ్మట మాసిడోనియా జయించబడెను. 1389 వ సంవత్సరమున సర్బియాను వీరు స్వాధీనమును పొందిరి. తరువాత గ్రీసుదేశమును జయించిరి. ఆ పిమ్మట సలోనికా స్వాధీనమయ్యెను. ట్రబీజాండ్, ఖారామాన్, కాఫా, టానా మొదలగు ప్రాంతములన్నియు వీరికి స్వాధీనపడెను.

## కాన్‌స్టాంటినోపిలును జయించుట

1453 వ సంవత్సరమున రెండవ మహమ్మదుసుల్తాను కాన్‌స్టాంటినోపిలును జయించెను. కాన్‌స్టాంటినోపిలు నగరరాజము రోమకసామ్రాజ్యాధీశుడగు కాన్‌స్టాంటయిను చక్రవర్తిచే నిర్మింపబడి రోమకసామ్రాజ్యమునకు రాజధానిగ నుండెను. పన్నెండు పదమూడు శతాబ్దములలో రెండువందల సంవత్సరము లెడతెగక పాలెస్తైయిన్ దేశములోని యాత్రాస్థలములకొరకు యూరపుఖండములోని క్రైస్తవులమధ్యను ఆశియాఖండములోని ముసల్మా

సులమధ్యను జరిగిన మతయుద్ధములలో మునల్మానులే మొత్తముమీద జయములుపొందినను, కాన్‌స్టాంటినోపిలు నేలుచున్న క్రైస్తవచక్రవర్తులు మునల్మానులను యూరపుఖండములో తూర్పునుండి ప్రవేశించకుండమాత్ర మరికట్టగలిగిరి. తురుష్క-సామ్రాజ్యస్థాపనకు పిమ్మట అట్టోమాన్ సుల్తాను లు రెండుమూడుసార్లు కాన్‌స్టాంటినోపిలుపై దండెత్తి ముట్టడించిరి గాని జయించలేకపోయిరి. తుదకు 1453 వ సంవత్సరమున తురుష్క-సుల్తాను లక్షఏబదివేలమంది సైనికులతో కాన్‌స్టాంటినోపిలును ముట్టడించి ఫిరంగు లతో కోటగోడలను పడగొట్టి నగరములో ప్రవేశించి అప్పుడా నగరము నేలుచున్న కాన్‌స్టాంటైన్ చక్రవర్తిని హత్యగావించి పట్టణమును స్వాధీనము పొందెను. అప్పటినుండియు కాన్‌స్టాంటినోపిలు నగరము తురుష్క-సామ్రాజ్యమునకు రాజధానియయ్యెను. కాన్‌స్టాంటినోపిలునగరమందును దానినంటియున్న థ్రేసురాష్ట్రమందును తురుష్కులు విరివిగ వలసవచ్చి నివసించుటవలనను అచటిజనులలో నత్యధికసంఖ్యాకులు మహమ్మదీయ మతము నవలంబించుటవలనను ఆ ప్రాంతమంతయు తురుష్క-దేశములో ప్రధానభాగమయ్యెను. యూరపుఖండములోని తుర్కీనసామ్రాజ్యమంతయు తురుష్కము పోగొట్టుకొనినను కాన్‌స్టాంటినోపిలు నగరమును థ్రేసురాష్ట్రమును నేటికిని తురుష్క-దేశములో భాగములుగ నున్నవి. కాన్‌స్టాంటినోపిలుసింహాసన మధిష్ఠించుటవలన తురుష్క-చక్రవర్తులు రోమకచక్రవర్తులకు వారసులయిరి.

## ఖిలాఫతుపదవి నధిష్ఠించుట

1514 వ సంవత్సరమున మోసలు రాష్ట్రము, 1516 వ సంవత్సరమున సిరియా, అరేబియా, పాలెస్తైయిన్ దేశములును, పిమ్మట హంగెరీ, బొహీమియా, మెసపొటేమియా దేశములును అట్టోమాన్ సుల్తానులచే జయించబడెను. 1517 వ సంవత్సరమున ఈజిప్టు జయింపబడెను. ఉత్తర ఆఫ్రికాయంతయు స్వాధీనపర్చుకొనబడెను. ఈజిప్టును జయించుటవలన ఈజిప్టుసుల్తానుల కపుడు చెందియున్న ఖిలాఫతుపీఠమును కాన్‌స్టాంటినోపిలుకు గొనివచ్చి అట్టొమానుసుల్తానులు ఖలీఫాలై ప్రపంచములోని మహమ్మదీయులకు గురుస్థానమును వహించిరి. ఈ విధమున రెండువందలసంవత్సర

ములలో అరబుదేశములు, బాల్కన్‌రాష్ట్రములు గ్రీసు, బొహీమియా, హంగెరీ దేశములు, ఈజిప్టుదేశము, ఉత్తరాఫ్రికా మొదలగుదేశముల నన్నిటిని జయించి, అట్టోమాన్ సుల్తానులు ఆశియా, ఆఫ్రికా, యూరపుఖండములు కలియుచోట సుప్రసిద్ధమగు నొక సామ్రాజ్యమును స్థాపించిరి. మరియు లోకములోని మహమ్మదీయులకందరకును గురుస్థానమును పొందిరి.

## ఉచ్ఛస్థితి

1520 మొదలు 1566 వరకు నేలిన సులేమాన్ చక్రవర్తి కాలమున అట్టోమాన్‌సామ్రాజ్య ముచ్ఛస్థితియందుండెను. ఆకాలపు పద్ధతులను బట్టి సుల్తాను నిరంకుశప్రభువుగను, మహమ్మదీయమత సంరక్షకుడుగను నుండెను. చట్టములన్నియు మహమ్మదీయమతమునను సరించి చేయబడెను. కాని సామ్రాజ్యములోని మహమ్మదీయులుగాని యితరమతస్థుల కందరకును సంపూర్ణమగు మతస్వేచ్ఛ యుండెను. వారు తమతమ మతగురువులకు లోబడి తమ మతచట్టములప్రకారమే నడచుకొనుచు తమ వ్యవహారముల విషయమున తమ మతగురువులచే న్యాయవిచారణను పొందుటకు హక్కును కలిగియుండిరి. మతవిచక్షణలేకుండ అందరికిని అన్నియుద్యోగములు నీయబడెను. చాలకాలము ప్రభుత్వములోని ప్రధానయుద్యోగములన్నియు గ్రీకుల కీయబడెను. ఆకాలమునాటి యూరపుఖండములోని క్రైస్తవదేశములలోకన్న అనేకరెట్లెక్కువగ తురుష్కసామ్రాజ్యములో మతస్వేచ్ఛ కలదని చెప్పుటలో నెట్టి యతిశయోక్తియు లేదు.

## (2)
## తురుష్కసామ్రాజ్యపతనము

అన్నిసామ్రాజ్యములవలెనే ఈ సామ్రాజ్యముకూడ కాలవశమున కూలిపోయినది. ఇది కూలిపోవుటకు నాలుగువందలసంవత్సరములు పట్టెను. ఇంతకాలము నిలిచిన మరియొక సామ్రాజ్యము లేదనియే చెప్పవచ్చును.

తురుష్కసామ్రాజ్యము వ్యాపించునాటికి పాశ్చాత్యజాతులు నాగరికతయందును విజ్ఞానమునందును చాల వెనుకబడి చాల బలహీనులుగనుండిరి. మహమ్మదీయసామ్రాజ్యవ్యాపనము యూరపుఖండములోని క్రైస్తవజాతు

లకు మిగుల దుస్సహమైయున్నను మహమ్మదీయుల సైనికబలము ఎదుట వారు నిలువలేకుండిరి. మహమ్మదీయదండయాత్రల నెదిరించి యోడిపోవు చుండిరి. 1453 వ సంవత్సరమున తూర్పుక్రైస్తవ సామ్రాజ్యమునకు రాజధానియగు కాన్‌స్టాంటినోపిలు తురుష్కుల వశముకాగనే చాలమంది గ్రీకు పండితులు తురుష్కరాజ్యములోనుండనొల్లక, స్పెయిన్, ఫ్రాన్సు, ఇంగ్లాండు, జర్మనీ మొదలగు దేశములకు తమ గ్రంథరాజములతో వలస వెళ్ళిరి. ఆ దేశములలో ప్రాచీన గ్రీకుభాషను గ్రీకువాఙ్మయమునందలి శాస్త్రములను, కళలను, స్వతంత్రభావములను నేర్పుటకై పాఠశాలలను స్థాపించిరి. అందువలన యూరపుఖండములోని దేశములలో గొప్ప మానసికవికాసము కలిగెను. మూఢవిశ్వాసములకు బదులు హేతువాదము, పుక్కిటిపురాణములకు బదులు ప్రకృతిశాస్త్రములు, ఉన్నస్థితితో తృప్తిచెందు జడత్వమునకుబదులు జ్ఞానసంపాదనాకుతూహలము ప్రబలెను. ప్రకృతిశాస్త్రజ్ఞానము విశేషముగ నభివృద్ధిచెందెను. అచ్చు కనిపెట్టబడెను. గ్రంథములు వేలకొలదిగ అచ్చు వేయబడి జ్ఞానవ్యాపక మపరిమితముగ జరిగెను. పాశ్చాత్యజాతులు త్వరితముగ నభివృద్ధిజెందనారంభించెను.

## పాశ్చాత్యజాతుల యభివృద్ధి

ఇంతేగాక కాన్‌స్టాంటినోపిలు తురుష్కులక్రిందికి వచ్చుటవలనను, ఆశియా, ఆఫ్రికా, యూరపుఖండముల కూడలి యంతయు తురుష్కుల స్వాధీనమగుటవలనను, అదివరకు శతాబ్దములనుండి పాశ్చాత్యజాతులు ఆసియాఖండములోని హిందూదేశము, చైనా మొదలగు నాగరికదేశములతో వర్తకవ్యాపారములు చేయుచుండిన త్రోవలన్నియు తురుష్కుల వశమయ్యెను. తురుష్కసుల్తానుల అనుగ్రహము పొందనిది యా మార్గముల గుండ వెళ్ళి, వర్తకముచేసికొనుటకు వీలులేదయ్యె. కావున పాశ్చాత్యజాతులు సముద్రములమీద హిందూదేశము, చైనా మొదలగు దేశములకు పోవుటకు నూతనములగు త్రోవలను కనిపెట్టసాగిరి.

స్పెయిన్, పోర్చుగల్, ఫ్రాన్సు, డచ్చి, ఇంగ్లాండుదేశములవారు సముద్రములమీద త్రోవలను కనుగొనుటయేగాక ఆఫ్రికా, అమెరికాఖండములను కనిపెట్టి అచట వలసల నేర్పరచుకొనియు, ఆశియాఖండముతో

సముద్రవర్తకమును అభివృద్ధిచేసికొనియు, విశేషముగ ధనవంతులగుచు వచ్చిరి. వీరిలో వీరికి చాల పోటీలున్నను, మహమ్మదీయరాజ్యము యూరపు ఖండమున వ్యాపించకుండ ఆటంకపరచుటలో వీరందరికిని యైక్యభావమే యుండెను.

## తురుష్కులు ఆస్ట్రియాను జయించలేకపోవుట

1683 వ సంవత్సరమున తురుష్కసుల్తాను ఆస్ట్రియాను జయించవలెనని దండెత్తినపుడు క్రైస్తవరాజ్యములన్నియు నేకమై పోరాడి, తురుష్కసుల్తాను నోడించి వెనుకకు తరిమిరి. కొద్దికాలములో హంగెరీనికూడ సుల్తాను పోగొట్టుకొనెను. 1774వ సంవత్సరమున రష్యావారు తురుష్కసామ్రాజ్యముపై దండెత్తి నల్లసముద్రమున కుత్తరమునను, ఈశాన్యమునను నున్న క్రిమియా, జార్జియా మున్నగు ప్రాంతములను స్వాధీనమును పొందిరి.

## ఈజిప్టు

1804 వ సంవత్సరమున మహమ్మదాలీ యను నతడు బలవంతుడై ఈజిప్టును వశపరచుకొని స్వాతంత్ర్యమును ప్రకటించెను. తురుష్కసుల్తానులకును మహమ్మదాలీకిని చాలకాలము పోరు జరిగెను. ఒకప్పుడు వారును, మరియొకప్పుడు వీరును జయముల నొందుచుండిరి. మహమ్మదాలి తురుష్కసామ్రాజ్యములోని సిరియా మొదలగు దేశములపై దండెత్తి జయించెను. మరలనాతని అట్టోమాన్ సుల్తాను వెడలగొట్టెను. తుదకు 1841వ సంవత్సరమున మహమ్మదాలీ ఈజిప్టుదేశమునకు "పాషా"యను బిరుదుతో తురుష్కసుల్తానునకు సామంతరాజుగ నుండునటులను, ప్రతి సంవత్సరమును కొంత కప్పమును సుల్తానుకు చెల్లించుచు తన యిచ్చవచ్చినటుల పరిపాలన మును చేసికొనునటులను సంధిజరిగెను.

   

## యూరపుజాతుల సంబంధములు

తురుష్క-సామ్రాజ్యము పశుబలము, నిరంకుశత్వములమీద నిర్మింపబడిన అన్నిసామ్రాజ్యములవలెనే కాలక్రమమున సహజమైన నైతికపతనమును పొంది బలహీనమైనది. పందొమ్మిదవశతాబ్దమువచ్చునరికి ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యా, ఆస్ట్రియా, జర్మనీలు చాల బలవత్తరమైన జాతులయినవి. ఇంగ్లాండు ఆశియాఖండములో తురుష్క-సామ్రాజ్యమున కనతిదూరమున నున్న హిందూదేశమునందు గొప్ప సామ్రాజ్యమును స్థాపించుకొనినది. రుష్యాచక్రవర్తికి కాన్స్టాంటినోపిలుసింహాసన మధిష్ఠించవలెననియు, తురుష్క-దేశమును మ్రింగవలెననియు కోరిక గలదు, అటులగావించినచో, నల్లసముద్రము మర్మరాసముద్రము, బాస్ఫరసు, డార్డనల్సు జలసంధులగుండా తమసైన్యములు సరుకులు మధ్యధరాసముద్రమునకు తెచ్చి, అక్కడనుండి ప్రపంచములోని యన్నివైపులకు వ్యాపించవచ్చును. కాని ఆస్ట్రియాకు రుష్యాయం దసూయగలదు. మరియు ఇంగ్లాండుకు, రుష్యా తురుష్క-ములో ప్రవేశించగనే హిందూదేశముమీద వచ్చిపడునను భయము గలదు.

ఆస్ట్రియాకు తురుష్క-సామ్రాజ్యముక్రిందనున్న బాల్కను రాష్ట్రములను తనక్రిందకు చేర్చుకొనవలెనను తలంపు గలదు. ఆస్ట్రియా వాటిని స్వాధీనముపొందుటకు రుష్యాకిష్టములేదు ఇంగ్లాండును మెల్లమెల్లగ తురుష్క-సామ్రాజ్యములో పలుకుబడిని సంపాదించుకొనవలెననియు, దానిక్రిందనున్న ఆఫ్రికాఖండములోనిభాగములను స్వాధీనముపొందవలెననియు కోరికయుండెను.

"తురుష్క-సామ్రాజ్యములో ఎవరు ఎక్కువ సంపాదించవలెనను ప్రాక్సమస్య నూరుసంవత్సరములు పాశ్చాత్యజాతులలో మితిలేని కష్టములు కలిగించెను. 1852 వ సంవత్సరమున రష్యాచక్రవర్తియగు (జారు) మొదటి నికలసుయొక్క యుపపాదనను ఇంగ్లాండు అంగీకరించియుండినచో ఈ ప్రాక్సమస్య చాలకాలముక్రిందటనే పరిష్కారమైయుండెడిది. తురుష్క-సామ్రాజ్యములోని క్రైస్తవజాతులు సౌఖ్యమును పొందెడివి. ప్రపంచశాంతి కాపాడబడెడిది. 1853 వ సంవత్సరమున జరిగిన క్రిమియాయుద్ధము, 1876-78లలో జరిగిన రుష్యా-టర్కీ-యుద్ధము, 1912-13లలో జరిగిన

బాల్కనుయుద్ధములు జరుగుచుండెడివి." అని వైకంటు జేమ్సు బ్రైసు (Viscount James Bryce) అను సుప్రసిద్ధ ఆంగ్లేయ చరిత్రకారుడు 1920 వ సంవత్సరమున వ్రాసియున్నాడు. 1852 వ సంవత్సరమున రుష్యా జారు మొదటినికలసు ఇంగ్లాండుకు చేసిన యుపపాదన మేమనగ, తురుష్కసామ్రాజ్యమును రుష్యా, ఇంగ్లాండులు పంచుకొనవలెనని అయియున్నది. తురుష్కసామ్రాజ్యములో రుష్యాను చేరనిచ్చినయెడల తమ హిందూదేశసామ్రాజ్యమునకు రుష్యావలన అపాయమువాటిల్లునను భయము వలన ఆంగ్లేయరాజకీయవేత్తలు ఈ యుపపాదన నంగీకరించి యుండలేదు.

## ఇంగ్లాండుయొక్క రాజనీతి

ఇంగ్లాండు ప్రాక్సమస్యలనుగూర్చి యవలంబించిన రాజనీతి యంతయు హిందూదేశసామ్రాజ్యమును కాపాడుకొని బలపర్చుకొనుదృష్టి తోడనే యవలంబింపబడినది. ఇందును గూర్చి కొంతకాలము హిందూదేశమునకు రాజప్రతినిధిగను బ్రిటిషువిదేశవ్యవహారమంత్రిగను నుండిన కర్జను ప్రభువు ఇటుల చెప్పియున్నాడు.

"బ్రిటిషురాజ్యాంగవిధానమునందు మనకుగల సామ్రాజ్యము హిందూదేశము మాత్రమేనని ఎవరైనను చెప్పినచో నది యంగీకరించక తప్పదు. బ్రిటిషువారిరాజనీతియొక్క యవలంబనమునందును రాజ్యవ్యాపకమునందును హిందూదేశము ప్రధానస్థానము నాక్రమించియున్నది. తూర్పుదేశములలోను మధ్యధరాసముద్రమునకు దక్షిణమునున్న ప్రదేశములలోను బ్రిటిషువారి యధికారమును వ్యాపింపజేసికొనుటలో హిందూదేశమునకుగల సంబంధము ముఖ్యముగ నాలోచింపబడుచువచ్చినది. మధ్యమయుగమునందు క్రైస్తవేతరుల స్వాధీనమునుండి క్రైస్తవయాత్రాస్థలములను స్వాధీనమునుపొందుటయే ముఖ్యసమస్యగనుండెను. ఒకసారి హిందూదేశములో స్థావర మేర్పరచుకొనినప్పటినుండియు ప్రాగ్దేశములసమస్య, కొద్దిగ కాన్స్టాంటినోపిలును గూర్చియైనను, హిందూదేశముమీద మనరాజ్యమును సురక్షితముగ కాపాడుకొనుటమీదనే మన యావత్తు ప్రపంచవ్యవహారనిర్వహణమును నిజముగ నాధారపడ్డబడినది. హిందూదేశముకొరకు గాకపోయినచో దీకన్నుఫీల్డు

ప్రభువు సూయజుకాలువలో భాగములు కొని యుండడు. సూయజుకాలువ కొరకు గాకపోయినచో మనము ఈజిప్టులో నిప్పు డుండము. నూరుసంవత్సరములు రష్యాతో మనకుగల చరిత్రాత్మకమగుకలహములు, హిందూదేశపు సరిహద్దులనుండి వారిని చాలదూరముగనుంచు ఆవశ్యకతను బట్టియే కలిగినవి. హిందూదేశముకొరకు గాకపోయినచో దక్షిణాఫ్రికాలోని కేపుకాలనీని మనము స్థాపించియుండము. దక్షిణాఫ్రికాలో మనము జరిపిన సుప్రసిద్ధమగు రాజ్యవ్యాపనము జరిపియుండము."

## ఫ్రాన్సు

ఫ్రాన్సుకు చిరకాలమునుండియు తురుష్కులతో సంబంధముగలదు. తురుష్కసామ్రాజ్యముక్రిందనున్న క్రైస్తవుల పక్షమున ఫ్రాన్సు అప్పుడప్పుడు తురుష్కముతో పోరాడుచువచ్చినను, మొత్తముమీద ఫ్రాన్సునకును తురుష్కమునకును స్నేహమే యుండెను. ఫ్రెంచివారు తురుష్కసామ్రాజ్యములో వర్తక వ్యాపారహక్కులను ప్రథమమున సంపాదించిరి. ఫ్రెంచి భాషను తురుష్కులు బాగుగ నేర్చుకొనిరి. తురుష్కవిద్యాధికులకందరకును సామాన్యముగ ఫ్రెంచిభాష వచ్చును. జనానాలలోని స్త్రీలుగూడ ఫ్రెంచి భాషను నేర్చుకొనిరి.

## జర్మనీ

జర్మనీ తురుష్కసామ్రాజ్యములో పలుకుబడిని ప్రాబల్యమును పొందుటకు స్నేహమార్గములనే యవలంబించెను. జర్మనురాజ్యాంగవేత్తలు ఎట్లైన జర్మనురాజధానియగు బెర్లిన్ నగరమునుండి తురుష్కసామ్రాజ్యములోగుండ పారసీకసముద్రమువరకును రైలుమార్గములు వేసి తమ యాధిపత్యముక్రింద తురుష్కసామ్రాజ్యము నుంచుకొనవలెనను ప్రయత్నములను సలిపిరి.

ఈ పాశ్చాత్యజాతులలో నోర్వలేమి, స్పర్థలు, పోటీలు లేకపోయినచో చిరకాలముక్రిందటనే తురుష్కసామ్రాజ్యము తేలికగ పిడిలో నెవరిచలననో మ్రింగబడియుండెడిది.

## (3)

## క్రైస్తవజాతుల స్వతంత్రప్రయత్నములు

ఇంకను రెండుకారణములవలన తురుష్క-సామ్రాజ్యము మిగుల బలహీనమగుచువచ్చెను. ఒకటి, కాలక్రమేణ తురుష్కుని క్రిందనున్న క్రైస్తవజాతులలో (బాల్కను రాష్ట్రములలోను, గ్రీసుదేశములోను) ప్రక్క నున్న యూరపుఖండజాతులలోవలెనే జాతీయభావములు ప్రబలెను. విదేశ ప్రభుత్వమగు తురుష్క-ప్రభుత్వమునుండి స్వతంత్రమును పొందవలెనను ప్రయత్నములను వారు సల్పుచుండిరి. ఆ ప్రయత్నములను యూరపుజాతుల వారు ప్రోత్సహించుచుండిరి. రష్యాచక్రవర్తి తనసామ్రాజ్యములో సంపూర్ణ మగు నిరంకుశత్వమువహించి తనప్రజలు చేయుచున్న స్వపరిపాలనా ప్రయత్నములను మిగుల దారుణమగుపద్ధతులచే సణచుచున్నను, బాల్కన్ రాష్ట్రప్రజలుగాని గ్రీసుదేశీయులుగాని, తురుష్కుము నెదిరించి స్వపరిపాలన పొందుటకు యత్నించినచో ప్రోత్సహించుచుండెను. ఇంగ్లాండు మొదలగు జాతులవారు తురుష్కముక్రింది క్రైస్తవజాతులు చేయుచుండిన స్వతంత్ర ప్రయత్నములకు ప్రోత్సాహ మొసగుచు తురుష్క-ప్రభుత్వమును వారును పోరాటములు సల్పుచున్నపుడు తాము మధ్య ప్రవేశించి, కొంత రాజ్యసంపా దనమునుగాని వర్తకహక్కులనుగాని పొందుచువచ్చిరి. ఈ క్రైస్తవజాతులు సల్పుచున్న స్వతంత్రప్రయత్నములను తురుష్క-సుల్తానులు మిగుల క్రూర మగుపద్ధతులతో సణచివేయుచుండిరి.

## గ్రీకులు స్వతంత్రమును పొందుట

1821 వ సంవత్సరమునుండియు గ్రీసుదేశము స్వతంత్రమును పొందుటకు ప్రయత్నించెను. తురుష్క-ప్రభుత్వముక్రింద నుద్యోగములను జేయుచుండిన గ్రీకులు రహస్యముగ సహాయమును జేయుచుండిరి. కొన్ని సంవత్సరములు గ్రీసుదేశములో తిరుగుబాటులు జరుగుచుండుటయు, తురుష్క-ప్రభుత్వమువారు క్రూరముగ సణచుచుండుటయు జరిగెను. గాని గ్రీకు స్వతంత్రాగ్ని చల్లారలేదు. తురుష్క-ప్రభుత్వమువారి హింసావిధానము గ్రీకులలో నింక నెక్కుడుగ స్వతంత్రదీక్షను బలపరచెను. గ్రీసుదేశము

తమకు నాగరికతను నేర్పినదను గురుభక్తి పాశ్చాత్యజాతులకు గలదు. గావున 1829 వ సంవత్సరమున గ్రీకులస్వాతంత్ర్యపక్షమున ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యా ప్రభుత్వములు తురుష్కులపై యుద్ధమున్ప్రకటించెను. నెవరీనా యుద్ధములో తురుష్కులు పూర్తిగ నోడింపబడిరి. గ్రీసుదేశము యొక్క సంపూర్ణమగు స్వాతంత్ర్యము తురుష్కప్రభుత్వముచే సంగీకరింపబడెను. బాల్కనురాష్ట్రీయుల స్వాతంత్ర్యపోరాటము లప్పుడప్పుడు 1913 వ సంవత్సరమువరకును జరుగుచునేయుండెను.

## ఆర్థిక దాస్యము

తురుష్కసామ్రాజ్యము బలహీనమగుటకు రెండవ ప్రబలకారణము, తురుష్కసుల్తానులు పాశ్చాత్యషాహుకారులవద్ద విశేషముగ ఋణములు జేయుటయు, పాశ్చాత్యజాతులకు తురుష్కసామ్రాజ్యములో వర్తక హక్కులు, న్యాయవిచారణాస్వాతంత్ర్యములు, ప్రత్యేకమగు ఆర్థికహక్కులు, గనులుత్రవ్వుకొనుట, రైళ్ళువేయుట మొదలగు ధనసంపాదనాసౌకర్యములు కలుగజేసి పాశ్చాత్యజాతుల పలుకుబడిని, ప్రాబల్యమును, అధికారమును అత్యంతముగ వృద్ధిగానిచ్చుటయునై యున్నది. తురుష్కప్రభుత్వము కొంత కాలము తన సామ్రాజ్యముక్రిందనున్న దేశములమీద పరిపాలనాధికారము కలిగియుండినను, పైనజెప్పిన కారణములచేత పాశ్చాత్యజాతులక్రింద ఆర్థిక దాస్యమును పొందెను. పాశ్చాత్య జాతులకు తురుష్కప్రభుత్వముపొందిన ఆర్థికదాస్యము తురుష్కసామ్రాజ్యము పూర్తిగనాశనమగుటకును తురుష్కజాతి చాలకాలమువరకు దుర్భరమగు దైన్యమును పొందుటకును, ప్రబల కారణమయినది. ఈ ఋణములనుగూర్చియు పాశ్చాత్యుల కివ్వబడిన ప్రత్యేక హక్కులను (Capitulations) గూర్చియు ఆర్థికదాస్యమునుగూర్చియు రాబోవు అధ్యాయములలో వివరింపబడును. 1881 వ సంవత్సరముతో తురుష్కముయొక్క ఆర్థికదాస్యము పూర్తిగ స్థాపింపబడెనని మాత్ర మిచట చెప్పిన చాలును. 1875 వ సంవత్సరమున తురుష్కప్రభుత్వము పాశ్చాత్య షాహుకార్లకు రుణములకు వడ్డీకూడ చెల్లించలేక దివాళాఅయ్యెను. పాశ్చాత్య రుణదాతల వత్తిడిచే 1881 వ సంవత్సరమున వారికి తురుష్కప్రభుత్వము చెల్లించవలసినరుణములను తీర్మానించుటకు, కాన్‌స్టాంటినోపిలు

నందు ఆంగ్లేయ, ఫ్రెంచి, డచ్చి, జర్మను, ఆస్ట్రియా, ఇటలీ ప్రభుత్వముల ప్రతినిధుల సంఘమొకటి అట్టోమాన్ ఋణసంఘమను (Council of Ottoman Public Debt) పేర నేర్పరచబడెను. ఈ సంఘమునకు తురుష్క ప్రభుత్వమునకు ప్రజలనుండి వచ్చుపన్నులలో చాలభాగము స్వాధీన తాకట్టుపెట్టబడెను. ఈసంఘమే తురుష్క ప్రభుత్వముయొక్క పన్నులు వసూలుచేయు శాఖలమీద యాజమాన్యమును వహించి ఆ శాఖలకుసంబంధించిన యుద్యోగస్తులందరిమీదను అధికారము చలాయించుచు తాకట్టుపెట్టబడిన పన్నులనన్నిటిని వసూలుచేసెను. కాలక్రమేణ దాదాపుగ నన్నిపన్నులను వసూలుచేసెను. ఈ సంఘముయొక్క యనుమతిలేనిది తురుష్క ప్రభుత్వమునకు క్రొత్తఋణములను తెచ్చుటకుగాని, విదేశసరుకులమీద పన్నులువేయుటకుగాని, వృద్ధిచేయుటకుగాని, తాకట్టుక్రిందనున్న పన్నుల నేవిధముగను మార్చుటకుగాని అధికారములేదు. అటుపిమ్మట పాశ్చాత్యజాతులు తురుష్క సామ్రాజ్యమును మిగుల తేలికగ మ్రింగుటకు అడ్డులేకుండెను. తరువాత జరిగిన ప్రతియుద్ధములోను తురుష్క మోడిపోవుచువచ్చెను. పాశ్చాత్య జాతులమధ్య ప్రబలియున్న అసూయలవలనను, తురుష్కసామ్రాజ్యమును పంచుకొనుటకు వారిలోవారికి పంపిణీలు కుదరకపోవుటవలనను మాత్రమే కొంతకాలము తురుష్కసామ్రాజ్యము నిలచియుండెను. పాశ్చాత్యదేశముల సరుకులు అడ్డులేక తురుష్కములోని అంగళ్ళను పూర్తిగనింపెను. తురుష్క పరిశ్రమలు సంపూర్ణముగ నశించి తురుష్కము కేవలము వ్యవసాయికదేశమయ్యెను. పాశ్చాత్యులపరిశ్రమలకు కావలసిన ముడిపదార్థములను వారికి కావలసిన ఆహారపదార్థములను సప్లయిచేయుటకు మాత్రము తురుష్కవ్యవసాయము ప్రోత్సహించబడెను. తురుష్కములో పాశ్చాత్యుల యాధిక్యత తురుష్కులనైచ్యము స్థాపించబడెను. తురుష్కము పేదరికములో గ్రుంకెను.

* * * *

## యూరపుఖండపురోగి

1853 వ సంవత్సరమున రష్యాచక్రవర్తియగు జారు మొదటి నికలసు రష్యాలోని బ్రిటిషురాయబారితో తురుష్కదేశమునుగూర్చి ప్రసంగిం

చుచు "మనచేతులలో నొక రోగి కలడు. మిగుల జాడ్యగ్రస్తుడు ....... ఆయన మనచేతులలో నాకస్మికముగ మరణించవచ్చును" అనిచెప్పెను. అప్పటినుండియు తురుష్కదేశమునకు "యూరపుఖండపు రోగి" (Sick Man of Europe) అను పేరు పరిప్రాప్తమగుచున్నది. ఈ రోగి యొక్క మరణమునకై పలువురు ఎప్పటికప్పుడు ఎదురు చూచుచుండిరి. కాని రోగి మాత్రము మరణింపక ఎటులనో బ్రతుకుచుండెను. 1918 వ సంవత్సరమున తురుష్కమునకు సామ్రాజ్యము పూర్తిగ పోయినతరువాత అదివరకు భుజముమీదనుండిన మోయలేనిబరువు పోయి రోగము కుదర నారంభించినది. సుల్తానుయొక్క ప్రభుత్వ మంతరించినవెంటనే తురుష్కము నకు రోగము పూర్తిగ కుదిరి పునస్స్వస్థమునుపొంది నవయౌవనమును దాల్చి నది. నవీన తురుష్కము రోగమువలనను అశక్తతవలనను తప్పక నాశన మగునని మరల చాలమంది పాశ్చాత్యులు తలంచిరి. అటుల తలంచినవారికి ఆశాభంగముకలిగెను. తురుష్కము క్రుళ్ళిపోయిన ప్రాత ప్రతిష్ఠాపనలను పాశ్చాత్యులయాధిక్యతను నాశనముచేసి మిగుల తేజోవంతమైనజాతి అయి నది. ఆ కథయే మన మిప్పుడు చదువబోవునది. తన అధికారగర్వమున తురు ష్కమునకు "రోగి" యని పేరిడిన రష్యాచక్రవర్తి మాత్రము 1917 వ సంవత్సరమున రష్యాలో జరిగిన ప్రజాస్వతంత్రవిప్లవమునందు గూలి పోయినాడు.

* * * *

## తురుష్కమునుగూర్చి దురభిప్రాయముల వ్యాపనము

1878 వ సంవత్సరమున రాబర్టు కళాశాలాధ్యక్షుడగు డాక్టరు సైరసుహామ్లిన్ అను నాయన రచించిన "Among the Turks" (తురు ష్కులమధ్య) అను గ్రంథమునందు కేవలము తురుష్కులమీద చెడు అభి ప్రాయములను కలిగించు సమాచారములను మాత్రము ఇతరదేశములలో వ్యాపింపజేయు నుద్దేశ్యముగల యొకసంఘము లండనుపట్టణమున స్థాపింప బడినదని వ్రాసెను. ఆ సంఘమువారు తురుష్కజాతినిగూర్చి అబద్ధపుసమా చారములను సంవత్సరములకొలది ప్రచురించి తురుష్కులమీద విరోధభావ మును, అసహ్యమును వ్యాపింపజేసిరనియు, ప్రాగ్దేశములనుగూర్చి ఏవైన

సమాచారములుగల పత్రిక దొరికినపుడెల్ల నాసమాచారములను నమ్మకుండు శక్తిని తనకు ప్రసాదించవలెనని తాను భగవంతుని ప్రార్థించుచుంటిననియు నాయన వ్రాసెను. "పాశ్చాత్యులు చేసెడి యత్రమములను పత్రికలలో ప్రచురించకుండ నా ప్రభుత్వము ఆపివైచి, తురుష్కులకు వ్యతిరేకమైన సమాచారములను మాత్రము ప్రచురించనిచ్చుటవలన, పాశ్చాత్యదేశములలోని ప్రజలకు తురుష్కులనుగూర్చి యథార్థము తెలియకపోవుటయేగాక అబద్ధపు సంగతులు మాత్రము వ్యాపించుచువచ్చె"నని "నవీనతురుష్కము" **(Modern Turkey)** అను గ్రంథమును రచించిన మీయర్సు వ్రాసి యున్నాడు.

హిందూదేశమునుగూర్చియు చైనాదేశమునుగూర్చియు ఇటులనే పాశ్చాత్యదేశములలో అబద్ధపుసంగతులు వ్యాపింపజేయుటకై కొంతమంది గ్రంథకర్తలును, పత్రికాధిపతులును, క్రైస్తవమతబోధకులును దీక్షతో పనిచేయుచుండుట చూచుచున్నాము. అట్టివారిలో "మదరుఇండియా" **(Mother India)** ను రచించిన మేయోకన్య ఒకతె.

* * * *

## (4)

## బాల్కన్‌రాష్ట్రములలో కొంతభాగముపోవుట

1875 వ సంవత్సరమున బాల్కనురాష్ట్రములలోని బాస్నియా, హెర్జ గోవినా, బల్గేరియారాష్ట్రములు తురుష్కప్రభుత్వముపై తిరుగుబాటులను ప్రారంభించెను. తురుష్కసుల్తాను వాటిని కఠినముగ నణచివేయుచుండెను. ఆ రాష్ట్రములపక్షమున రష్యా, ఇంగ్లాండు, ఆస్ట్రియాలు జోక్యముకలుగ చేసికొని సంధికుదుర్చుటకు యత్నించుచుండెను. బాల్కనురాష్ట్రములలో రాజకీయసంస్కరణములను ప్రవేశపెట్టి అచట ప్రజలను తృప్తిపరచ వలెనని సుల్తానుకు సలహానిచ్చిరి. కాని 1877 వ సంవత్సరమున వాటి నమలుజరుపుటకు సుల్తాను అబ్దుల్‌హమీదు నిరాకరించెను. వెంటనే రష్యాచక్రవర్తి తురుష్కముపై యుద్ధమును ప్రకటించెను. ఇతరప్రభుత్వము లూరక చూచుచుండెను. యుద్ధమునందు తురుష్కము పూర్తిగ నోడింప

బడెను. కాన్‌స్టాంటినోపిలువరకును రష్యావారు నెట్టుకొనివచ్చిరి. తురుష్కము రష్యాకు పాదాక్రాంతయయ్యెను. బాల్కన్‌రాష్ట్రము లన్నిటిని త్రేసును తురుష్కము వదలుకొనునట్లుల శాన్‌స్టిఫెనో (San Stephano) సంధికి సుల్తానంగీకరించకతప్పనదికాదు. గాని యిందువలన రష్యా మిగుల బలవంతమగునను భయము ఇంగ్లాండు, జర్మనీప్రభుత్వములకు కలిగెను. ఆ రెండుప్రభుత్వములవారును జోక్యముకలుగచేసికొని జర్మనీదేశపు రాజధాని యగు బర్లిన్‌నగరమున 1878 వ సంవత్సరము జూలై నెలలో మరియొక సంధిసమావేశమును సమకూర్చిరి. బర్లిన్‌లో జరిగిన సంధివలన శాన్‌స్టిఫెనో సంధియావత్తు మార్చివేయబడినది. బర్లిన్‌సంధివలన (1) రొమేనియా, మాంటినిగ్రో, సర్బియా రాష్ట్రములు స్వతంత్రదేశములుగ నంగీకరింపబడెను. (2) బాస్నియా, హెర్జగోవినా రాష్ట్రముల పాలనము ఆస్ట్రియా క్రింద నుంచబడి యా రాష్ట్రములమీద నామమాత్రావశిష్టమగు నధికారము తురుష్కమున కివ్వబడెను. (3) బల్గేరియానుండి రొమేలియాయను చిన్న రాష్ట్రమును స్వతంత్రముగచేసి మిగిలిన బల్గేరియా తురుష్కమునకే ఇవ్వబడెను. రొమేలియామీదకూడ తురుష్కమునకు నామమాత్రావశిష్టమగు నధికార మివ్వబడెను.

## సైప్రసు పోవుట

ఈ సమావేశమును సమకూర్చి తురుష్కమునకు కొంత మేలును కలుగజేసినందుకు ప్రతిఫలముగ మధ్యధరాసముద్రములోనున్న సైప్రసు ద్వీపము తురుష్కముచే నింగ్లాండున కివ్వబడెను. దీనిమీదకూడ అట్టోమాను సుల్తానుకు నామమాత్రావశిష్టమగు నధికార ముంచుకొనబడెను. ఇట్లుల బాల్కన్‌రాష్ట్రములప్రజల స్వపరిపాలనావాంఛను తృప్తిపరచక అట్టోమాన్ సుల్తాను అబ్దుల్ హమీదు కొంత రాజ్యమును పోగొట్టుకొని ప్రతిష్ఠను గోల్పోయెను.

* * * *

## ట్యునిసును ఫ్రెంచివారాక్రమించుట

1881 వ సంవత్సరమున ఉత్తరాఫ్రికాలో నున్న ట్యునిసు (**Tunis**) దేశముమీద ఫ్రెంచివారు సంరక్షకత్వమును (**Protectorate**) స్థాపించిరి. ఫ్రెంచివారి అల్జీరియా (**Algeria**)కు ప్రక్కన ట్యునిసుదేశము గలదు. తురుష్కసుల్తానుకు లోబడిన యొక మహమ్మదీయప్రభువు దానిని పాలించుచుండెను. అచట మంచి గనులు గలవు. తెల్లవారు వలసవచ్చి నివసించుటకు అనుకూలమైన శీతోష్ణస్థితులు గలవు. ఫలవంతమైన వ్యవసాయక భూములు గలవు. దీనిని ఫ్రెంచివారు స్వాధీనపర్చుకున్నచో తమ అభ్యంతరములేదని ఆంగ్లేయులు చెప్పిరి. ట్యునిసులో అల్లరులు జరుగుచున్నవనియు అటుల జరుగుట తమ అల్జీరియాకు నష్టమనియు సాకుచెప్పి ఫ్రెంచిసైన్యములు 1881 వ సంవత్సరము మేనెలలో ట్యునిసులో ప్రవేశించెను. మహమ్మదీయప్రభువు లోబడెను. ఆయన యావత్తురాజకార్యనిర్వహణము ఫ్రెంచివారి యుత్తరువులప్రకారము జరుపుటకు నొడంబడికనుచేసికొని వారి సంరక్షకత్వము నంగీకరించెను. దుర్బలుడైన అట్టోమాన్ చక్రవర్తి ఏమియు చేయజాలక ఊరుకొనెను.

* * *

## సూయజుకాలువను త్రవ్వుట

ఈజిప్టుదేశమును మహమ్మదాలీ పాషా తురుష్కసుల్తానుక్రింద సామంతరాజుగ పాలించుచుండుట చూచియున్నాము. ఆయన తన పాలనమునకు ఫ్రెంచియుద్యోగస్థులసహాయమును తీసికొనెను. ఆయనమనుమడగు ఇస్మాయిల్ పాషా పాఠశాలలు పెట్టించుట, రైళ్ళువేయించుట, కాలువలు త్రవ్వించుట, టెలిగ్రాములువేయించుట మొదలగు మంచిపనులకు చాల సొమ్మును వ్యయముచేసెను. దీనితోపాటు మిగుల డంభముగ పాశ్చాత్యులతో సహవాసములు సల్పుచు, యూరపురాజులను వైభవముతో సత్కరించుచు ఎక్కువ దుబారాఖర్చులుకూడ చేయుచుండెను. "పాషా" యనుబిరుదు తన గౌరవమునకు తగినదికాదని యెంచి, తురుష్కసుల్తానుకివ్వవలసిన కప్పము నెక్కువగ చెల్లించునటుల నొప్పుకొని, "పాషా" అను బిరుదుకు

బదులు "ఖెడీవ్" అను గొప్పబిరుదమును వహించెను. 1856 వ సంవత్సరమున సూయజుకాలువను త్రవ్వుటకును, యాజమాన్యమును వహించుటకును ఫర్డినాండు డిలెస్సెప్సు అను ఫ్రెంచి ఇంజనీయరుయొక్క అధిపత్యమున నొకకంపెనీ నేర్పరచెను. సూయజుకాలువ లేనపుడు యూరపుఖండమునుండి ఆఫ్రికాఖండముయొక్క దక్షిణపుకొనను చుట్టి సముద్రములమీద హిందూదేశమునకు రావలసియుండెను. అపుడు ఇంగ్లాండునుండి హిందూదేశమునకు పొగయోడలమీద వచ్చుటకు మూడునెలలు పట్టెను. సూయజుకాలువను త్రవ్వించు కంపెనీ నాలుగులక్షలభాగములు గలది. అందులో నొక లక్షడెబ్బదిఆరువేలభాగములు ఈజిప్టుఖెడీవ్ తీసికొనెను. కాలువ త్రవ్వుటకైన ఖర్చులలో సగమంతను ఖెడీవ్ భరించెను. మిగిలిన భాగములలో ఎక్కువ భాగములు ఫ్రెంచివారును, తరువాత నింగ్లీషువారును, కొద్దిగ నితరపాశ్చాత్యులును తీసికొనిరి. 1856 మొదలు 1869 వరకు సూయజుకాలువ త్రవ్వబడెను. 1870 వ సంవత్సరమునుండియు నా కాలువ యూరపుఖండమునుండి హిందూదేశమునకు వచ్చుటకు ప్రధానమార్గమయ్యెను. ఇపుడు ఇంగ్లాండునుండి హిందూదేశమునకు పదునైదుదినములలో రావచ్చును.

## సూయజుకాలువ నాంగ్లేయులు కొనుట

పైన చెప్పబడిన ఖర్చులన్నిటికిని ఇస్మాయిల్ ఖెడీవ్ పాశ్చాత్య షాహుకార్లవద్ద విశేషముగ ఋణములనుచేసెను. ఆ ఋణము నూటరెండు కోట్ల రూప్యములయ్యెను. క్రొత్తఋణములు దొరకుటలేదు. ఋణములుతీర్చు మార్గము కనపడలేదు. 1875 వ సంవత్సరమున సూయజుకాలువకంపెనీలోని తనభాగములనన్నిటిని ఇస్మాయిల్ ఖెడీవ్ ఫ్రెంచివర్తకుల కమ్మజూపెను. ఈసంగతి ఆంగ్లేయ ప్రధానమంత్రియగు బీకన్సు ఫీల్డు ప్రభువునకు తెలియుట తోడనే మరియొకరి చెవినిబడకుండ నతిత్వరితముగ తనక్రిందియుద్యోగస్థులను బంపి అయిదుకోట్ల నలుబదివేలరూప్యములను ఇస్మాయిల్ ఖెడీవ్‌కు చెల్లించి ఇంగ్లాండుప్రభుత్వపక్షమున నాభాగముల నన్నిటిని కొనెను. పైగ ఖెడీవ్‌కు కావలసిన ఋణము నాంగ్లేయులిచ్చునటుల నొప్పుకొనెను. భాగములను కొనునపుడు ఆంగ్లేయబొక్కసములో ద్రవ్యము లేదు. పైగ పార్లమెంటువారియనుమతియు లేదు. రాత్‌షైల్డు అను కోటీశ్వరులవద్ద బీకన్సు

షీల్డుప్రభువు అప్పుతెచ్చి కొనెను. పార్లమెంటువారి అనుమతికొరకు కొనిన తరువాత పెట్టిరి. కొంత చర్చజరిగెను. సూయజుకాలువను కొనుట హిందూ దేశసామ్రాజ్యమున కత్యావశ్యకమని ప్రధానమంత్రి చెప్పగ పార్లమెంటువా రంగీకరించిరి. ఇంతటిలో సూయజుకాలువలో నింగ్లాండుప్రభుత్వము తక్కిన యందరకన్న మిగుల పెద్దభాగస్వామియయ్యెను. సూయజుకాలువ ఆంగ్లేయుల యాజమాన్యముక్రిందికి వచ్చెను.

## ఈజిప్టుయొక్క ఆర్థికదాస్యము

ఖెడీవ్ ఇస్మాయిలుకు ఇచ్చెదమన్న ఋణము నిచ్చుటకుగాను ఈజిప్టు ప్రభుత్వముయొక్క ఆదాయ వ్యయములను పరీక్షించుటకై ఆంగ్లప్రభుత్వ మొక యుద్యోగస్తుని బంపెను. ఆయన సలహాపైన ఖెడీవ్‌కు అప్పునిచ్చుటకు తీర్మానింపబడెను గాని, ఈజిప్టుప్రభుత్వముయొక్క ఆర్థికవ్యవహారములను నడుపుట కొక ఆంగ్లేయయుద్యోగస్థుని, నొక ఫ్రెంచియుద్యోగస్థుని నియమించవలెనని ఖెడీవ్‌ను నిర్బంధించిరి. ఆయన వారినిద్దరిని నియమించెను. ఇంతటితో ఈజిప్టుప్రభుత్వము ఆంగ్లేయ, ఫ్రెంచిప్రభుత్వముల ఆర్థిక దాస్యములోనికి వచ్చెను. ఆ యుద్యోగస్తుల యనుమతిలేనిది సొమ్ము ఖర్చు పెట్టవీలులేదు.

## ఇస్మాయిలు రాజ్యభ్రష్టుడయ్యెను

ఈ స్థితి ఈజిప్టులోని ప్రముఖుల కసంతృప్తిని కలుగజేసెను. గావున 1879 వ సంవత్సరమున ఖెడీవ్ ఇస్మాయిల్ ఫ్రెంచి, ఆంగ్లేయ యుద్యోగస్తులనిద్దరిని తీసివేసి, తానే పాలనమును వహించెను. ఋణములను తానే యొడంబడికప్రకారము తీర్మానించెదనని చెప్పెను. ఇది ఆంగ్లేయ ఫ్రెంచి ప్రభుత్వముల కిష్టములేకుండెను. వారు వెంటనే జోక్యముపుచ్చుకొని ఇస్మాయిలును రాజీనామానిచ్చి పొమ్మనిరి. ఇస్మాయిలు రాజీనామానిచ్చుటకు నిరాకరించెను. ఆంగ్లేయ ఫ్రెంచి ప్రభుత్వములవారు తురుష్కసుల్తానువద్ద నుండి యిస్మాయిలును రాజ్యభ్రష్టునిచేయించుచు నుత్తరువును తెచ్చిరి. దివాళాదీసిన సుల్తాను ఆంగ్లేయులును ఫ్రెంచివారును కోరినయుత్తరువులను

వ్రాసియివ్వక ఏమిచేయగలడు? ఇస్మాయిలు భయపడి ఈజిప్టుసింహాసనమును త్యజించి వెళ్ళెను. ఆంగ్లేయులును ఫ్రెంచివారును ట్యూఫికు పాషాను సింహాసనారూఢునిగ గావించిరి. ట్యూఫికు పాషా మరల ఆంగ్ల ఫ్రెంచి ప్రభుత్వప్రతినిధులను నియమించి ఈజిప్టుప్రభుత్వపు ఆర్థికవ్యవహారములన్నియు వారిక్రింద నుంచెను. ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వములతో గాక మరి యే యితరప్రభుత్వముతో సంబంధముపెట్టుకొన్నను ఇస్మాయిలుకుపట్టిన గతియే పట్టునని ట్యూఫికు పాషా మందలింపబడెను. 1879 మొదలు 1882 వరకును ఈజిప్టు ఆర్థికముగ ఆంగ్లేయ ఫ్రెంచిప్రభుత్వముల యధికారము క్రింద నుండెను. ఆర్థికయధికారము పోయిన తరువాత రాజకీయయధికారము నామమాత్రావశిష్టమేకదా.

## ఈజిప్టును ఆంగ్లేయులు స్వాధీనముపొందుట

ఈ యార్థికదాస్యము ఈజిప్టులోని దేశాభిమానులకు దుస్సహముగ నుండెను, విదేశదాస్యమునుండి మాతృదేశమును స్వతంత్రముగ చేయుట కొరకొక జాతీయపక్ష మేర్పడెను. ఈ పక్షమునకు నాయకుడగు అరబీ పాషా ఈజిప్టుప్రభుత్వమంత్రులలో నొకడయ్యెను. ఆంగ్లేయులను ఫ్రెంచివారిని అవసరమైనచో నెదిరించి వెడలగొట్టుటకు సైన్యములను తయారుచేసెను. ఈసంగతిని ఆంగ్లేయులు కనిపెట్టిరి. ఫ్రెంచివారితో సంప్రదించకుండగనే ఆంగ్లేయప్రభుత్వమువారు 1882 వ సంవత్సరము మేనెలలో తమసైన్యములను ఈజిప్టుపైకి పంపిరి. ఈజిప్టుదేశమంతయు నాంగ్లేయులచే లోబర్చుకొనబడెను. జాతీయవాదులనాయకుడగు అరబీపాషాను ఆంగ్లేయులు పట్టుకొని యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్షనువిధించి సింహళద్వీపమునకు(Ceylon) బంపిరి. జాతీయోద్యమ మణచివేయబడెను. ఆంగ్లేయప్రభుత్వమువారు ఈజిప్టుదేశము నాక్రమించుటకు ప్రధానకారణము సూయజుకాలువ యొక్క యాజమాన్యముపోవునమభయమేనని ఆంగ్లప్రభుత్వపు సహాయకార్యదర్శియగు సర్ ఛార్లెసు డిల్కి పార్లమెంటులో చెప్పెను. హిందూదేశసామ్రాజ్య సంరక్షణకొరకు సూయజుకాలువ నాక్రమించుటయు, సూయజుకాలువయొక్క సంరక్షణకొరకు ఈజిప్టుదేశము నాక్రమించుటయు అవసరమని ఆంగ్లేయ

సామ్రాజ్యవాదులు తలచిరి. ఈజిప్టులో అల్లరులణగి ఖెడీవ్ యొక్క అధికారము బాగుగ స్థాపితమువాగనే, ఈజిప్టునువదలివేసెదమని ఆంగ్లేయ ప్రధానమంత్రియగు గ్లాడుస్టన్ ప్రకటించెను. గాని అట్టిదిన మింతవరకును రాలేదు.

* * * *

## (5)

## బాగ్దాదురైలుమార్గమును జర్మనులు వేయుట

1895 వ సంవత్సరమున ఆంగ్లేయ ప్రధానమంత్రియగు శాలిస్బరీ ప్రభువు యూరపు ప్రభుత్వములవారు తురుష్కసామ్రాజ్యమును పంచుకొనవలెనను సూచనను రహస్యముగ బంపెను.పంపిణీ న్యాయముగ కుదరదనియు నెక్కుడు తగాదాలకు కారణమగుననియు చెప్పి జర్మను కైజరా సూచన నంగీకరించలేదు. జర్మను కైజరుకు (చక్రవర్తికి) తురుష్కసామ్రాజ్యములో గొప్ప పలుకుబడిని, వర్తకహక్కులను సంపాదించవలెనను దిట్టమైనకోరిక యుండెను. 1889 వ సంవత్సరమున నొకసారి కైజరు తురుష్కమునకేగి సుల్తానును దర్శించి తన స్నేహభావమును వెల్లడించి వచ్చెను. 1898 వ సంవత్సరమున జరూసలేముకు యాత్రసేయుచు కైజరు త్రోవలో రెండవ సారి కాన్‌స్టాంటినోపిలును దర్శించెను. తాను లోకములోని ముసల్మానులకు గొప్పస్నేహితుడనని ప్రకటించెను. సుల్తాను చాలగ సంతోషించెను. ఈ దర్శనమునకు ఫలితముగ జర్మనీకి తురుష్కసామ్రాజ్యమునందు గొప్ప వర్తకలాభములు కలిగెను. కాన్‌స్టాంటినోపిలుకెదురుగ ఆశియాఖండములో నున్న హైదరుపాషాయను రేవును వృద్ధిచేయుటకును, బర్లిన్‌నగరమునుండి కాన్‌స్టాంటినోపిలుకు తంతిని వేయుటకును, హైదరుపాషానుండి అంగోరాకు వేయబడుచున్న రైలుమార్గమును అంగోరానుండి మోసలుమీదుగ బాగ్దాదువరకును, అచటనుండి బాస్రామీదుగ పారసీకసముద్రమువరకును, వృద్ధిచేసి తురుష్కసామ్రాజ్యములో 2400 మైళ్ళపొడుగున రైళ్ళువేయుటకును, ఒక జర్మనుకంపెనీ 99 సంవత్సరములకౌలును పొందినది. జర్మనీ వారికి కౌలునిచ్చుట ఆంగ్లేయులకును రష్యావారికిని ఇష్టములేదు. ఈ

కౌలులోచేరిన రైలుమార్గమును బాగ్దాదురైలువే యని పిలుచుచున్నారు. మొదట కౌలునుపొందినప్పుడు పశ్చాత్యరాజనీతిజ్ఞులకు సందేహముగనున్న దని పశ్చాత్యులు తగాదాపెట్టినందున దానిని గురించి సమాధానములను కూర్చిరి. తగాదాలన్నియు గడచి అఖరుకు కౌలుసంతకముచేయబడినపిదప 1903 వ సంవత్సరమువరకు గడచెను. అటుపిమ్మట పని ప్రారంభమయ్యెను. ఈ రైలువే వేయబడుమార్గమునకిరుప్రక్కలను పంద్రెండున్నరమైళ్ళదూరము వరకు యావత్తు భూమిలోనున్నగనులను త్రవ్వుకొనుటకును ఇటుకలు,పెంకులు చేయించుకొనుటకును, అడవులలోనికలపను తీసికొనుటకును నదీప్రవాహ ములనుండి విద్యుచ్ఛక్తిని తయారుచేసికొనుటకును, గిడ్డంగులు కట్టుకొనుట కును సంపూర్ణమగు హక్కులుగూడ రైలువేసువేయు జర్మనుకంపెనీ కివ్వ బడెను. రైలువేయుటవలన నష్టమురాకుండ తురుష్కప్రభుత్వము జవాబు దారినికూడ వహించెను. ఈ హక్కులు రైలువేలువేసిన ఇతర పాశ్చాత్య కంపెనీలకన్నిటికిని తురుష్కప్రభుత్వమువారు కలుగచేసియున్నవే. గాని ఇంత పొడుగున తురుష్కసామ్రాజ్యముయొక్క యొకకొననుండి మరియొకకొన వరకును రైలుమార్గమునువేయుహక్కులుపొందిన కంపెనీ మరియొకటి లేదు. మరియు పారసీకసముద్రమువరకును రైలువేయుటవలన జర్మనులు హిందూదేశమునకు అతిసమీపముగ వచ్చుచున్నారను భీతి యాంగ్లేయులకు కలిగెను. ఈ రైలుమార్గమునుండి పాలస్తయిను వరకు నొక శాఖను వేసి సూయజుకాలువకును ఈజిప్టుకును అతి సమీపముగ జర్మనులు రావచ్చునను భీతికూడ నాంగ్లేయులకు కలిగెను.

## ఆంగ్లేయుల యభ్యంతరములు

ఈ రైలువే వడుటతో ఆంగ్లేయులు తమకు తురుష్కములోగల పలుకుబడిని వినియోగించి పెక్కు ఆటంకములు కలుగజేయుచువచ్చిరి. ఒక వెయ్యిమైళ్ళవరకు రైలుమార్గముపేయుట పూర్తియయ్యెను. ఆంగ్లేయులకును జర్మనులకును మధ్య కొన్ని రాజీప్రయత్నములుగూడ జరిగెను. బాస్రావరకు మాత్రమే రైలునువేసి, ఆపైన పారసీకసముద్రమువరకును వేయకుండ నాపుటకు జర్మను లంగీకరించిరి. పారసీకసముద్రములోనికి జర్మనునరకులు జర్మనుసైన్యములు దిగకూడదని ఆంగ్లేయులు పట్టుదలను కలిగియుండిరి.

మెసపొటేమియాలో. నీటిపారుదలనిర్మాణములనన్నిటిని చేయుహక్కును, గనులుత్రవ్వుకొనుహక్కును ఆంగ్లేయులే పొందుచుండిరి,అందుకు జర్మనులు పోటీకిరాకుండనుండునట్లును జర్మను లొప్పుకొనిరి. ఈ రహస్యపు బొడం బడికలు దస్కతులుచేసికొన సిద్ధపడుచుండగనే 1914 వ సంవత్సరమున ప్రపంచయుద్ధము ప్రారంభమై యొడంబడికలు చెడిపోయెను.

* * *

## ఫ్రెంచివారు మొరాకోనాక్రమించుట

అల్జీరియా, ట్యూనిసు దేశములు స్వాధీనమునుపొందినతరువాత ఫ్రెంచిసామ్రాజ్యవాదులకు వాటి వెంట కానుకొనియున్న మొరాకోదేశమును స్వాధీనమునుపొందుకోరిక కలిగెను. కొంత సామ్రాజ్యమున్నచో దానిని బలపర్చుకొనుటకు మరింత సామ్రాజ్యము కావలెను. మొరాకో యొక్క శీతోష్ణస్థితులును తెల్లవారివలసకు చాల అనుకూలమైనవి. అది మిగుల ఫలవంతమయినట్టియు, సుందరమైనట్టియు దేశము. ఫ్రాన్సుదేశమంత వైశాల్యముగలది. దానిని తురుష్క సుల్తానుయొక్క సామంతరాజు పాలించు చుండెను. దానిని ఫ్రెంచివారు స్వాధీనమునుపొందుటకు సుల్తాను అటకా యించజాలడు, కాని యితర పాశ్చాత్యజాతులయభ్యంతర ముండునను భయము కలదు. వెనుక నొకసారి స్పెయిన్‌వారు స్వాధీనమునుపొందప్రయ త్నించగ ఇంగ్లీషువారు అటకాయించిరి. ఇపుడు ఫ్రెంచివారు రహస్య ప్రయత్నములుజేసి ముఖ్యులగు పాశ్చాత్యజాతుల నొప్పించిరి. 1899 వ సంవత్సరమున ఇటలీవారు తురుష్కసామ్రాజ్యములోజేరిన ట్రిపోలీని స్వాధీన పర్చుకొనుటకు ఫ్రెంచివా రభ్యంతరంపెట్టరని ఇటలీకి తెల్పగా, ఫ్రెంచివారు మొరాకో నాక్రమించుటకు ఇటలీ యంగీకరించినది. తమకు మొరాకోలో నుత్తరమునసున్న కొద్ది ప్రదేశము నిచ్చినచో మిగతదేశమునంతను ఫ్రెంచి వారు స్వాధీనమునుపొందుటకు తమ యభ్యంతరములేదని స్పెయిన్‌వారు చెప్పిరి.

## ఆంగ్లేయులతో నొడంబడిక

ఆంగ్లేయులు ఫ్రెంచివారియనుమతి లేకుండ 1882 వ సంవత్సరమున ఈజిప్టుదేశము నాక్రమించుట చూచియున్నాము. అందువ ఫ్రెంచివారికిగలకోపమును ఇంగ్లాండు పల్లార్పవలెను. మరియు ప్రపంచవర్తకములో ఇంగ్లాండునకు సర్వవిధములను జర్మనీ పోటీతగులుచున్నది. 1903 వ సంవత్సరమున 2400 మైళ్ళపొడవున బాగ్దాదురైలుమార్గమును వేయుటకు జర్మనులు తురుష్కసుల్తానునుండి కౌలునుపొందుటయు, నది యాంగ్లేయుల కపరిమితమగు భీతిని గలుగజేయుటయు పైన వివరింపబడినది. కావున జర్మనీకి 1870 వ సంవత్సరమునుండియు బద్ధశత్రువైన ఫ్రాన్సుతో ఇంగ్లాండు చేరవలెను. ఇంగ్లీషువారి ఈజిప్టుఆక్రమణకు ఫ్రెంచివారొప్పుకొనుటులను, మొరాకోను ఫ్రెంచివారు స్వాధీనమునుపొందుటకు ఇంగ్లీషువా రొప్పుకొనుటులను, 1904 వ సంవత్సరమున ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యొడంబడిక జరిగెను. ఫ్రెంచివారు మొరాకో నాక్రమించి అచటనున్న రాజుపై సంరక్షకత్వమును వహించిరి. కాని కొంతకాలమున కా రాజు ఫ్రెంచివారిపై తిరుగబడినందున, ఆయనను వెడలగొట్టి 1912 వ సంవత్సరమున మొరాకోలోని పండ్రెండువంతులలో పదకొండువంతులను ఫ్రెంచివారు స్వాధీనమును పొందిరి. మిగిలిన పండ్రెండవవంతును స్పెయినువారికి వశపరచిరి.

## జర్మనీని తృప్తిపరచుట

ఫ్రెంచివారు మొరాకోను స్వాధీనపర్చుకొనుట జర్మనీకి అయిష్టముగ నుండెను. జర్మనీ యభ్యంతరపెట్టెను. ఫ్రెంచివారికిని జర్మనులకును మరల యుద్ధముజరుగునేమోననుభీతి కలిగెను. అపుడు ఇంగ్లీషువారు ఫ్రెంచివారిపక్షమున జోక్యముకలుగజేసికొని, జర్మనీని బెదరించి జర్మనీకి ఫ్రెంచి కాంగోలోని కొద్ది ప్రదేశమునిప్పించి జర్మనీయొక్క యభ్యంతరమును వదలించిరి. తురుష్కసుల్తాను నిస్సహాయుడై తన రాజ్యముల నెవరు మ్రింగుచున్నను చూచుచు నూరకుండెను.



# తురుష్కప్రజాస్వామికము

## 2 యౌవన తురుష్కకక్షి

### (1)

### యౌవనతురుష్కకక్షి

పందొమ్మిదవశతాబ్దముయొక్క మధ్యభాగమున తురుష్కదేశములో సుల్తానుయొక్క నిరంకుశత్వమును పాలద్రోసి ప్రజాపాలనమును స్థాపింపవలెనను కక్షి యొకటి బయలుదేరెను. ఈ కక్షికి యౌవనతురుష్కకక్షియని పేరు (Young Turks). ఈ కక్షిలో చేరుటకు వయసుతో పనిలేదు. వయసుమీరిన దేశాభిమానులుకూడ నిందు చేరిరి గాని, దీని ముఖ్యబలము విద్యావంతులగుయువకులు గావున దీనికి యౌవనతురుష్కకక్షియని పేరిడికొనిరి. తురుష్కమునకు సమీపమున నున్న ఇటలీదేశీయులు 1848 వ సంవత్సరమునుండియు మేజినీ మహాశయుని నాయకత్వమున యౌవన ఇటలీకక్షిని స్థాపించుకొని తమ దేశముయొక్క స్వతంత్రముకొరకును, ఐక్యతకొరకును అస్ట్రియాసామ్రాజ్యముతో పోరుసలుపుచుండిరి. యూరపు ఖండములోని ఫ్రాన్సు, జర్మని, పోలండు, హంగెరీ మొదలగుదేశములలో కూడ ప్రజాస్వతంత్రోద్యమములు ప్రబలియుండెను. ఈ యుదాహరణములన్నియు తురుష్కులనుగూడ స్వతంత్రభావపూరితులుగచేసెను. తురుష్కసుల్తానులు పాశ్చాత్యషాహుకార్లవద్ద ఋణములుచేసి పాశ్చాత్యదేశీయులకు తురుష్కములో ప్రత్యేకహక్కుల నిచ్చి పాశ్చాత్యులకు తురుష్కములో గొప్పపలుకుబడిని, అధికారమును కలుగచేయుటయు, తురుష్కసామ్రాజ్యము పాశ్చాత్యప్రభుత్వములచే తేలికగ నోడింపబడుచు విచ్ఛిన్నమగుచుండుటయు, యౌవనతురుష్కకక్షిని దేశములో ప్రజారంజకముగ చేసెను. సుల్తానులయొక్క అధికారము నామమాత్రావశిష్టముగచేసి సామ్రాజ్యాధికారమంతయు

## సుల్తాను అబ్దుల్ హమీదు

1875 వ సంవత్సరమున సుల్తాను అబ్దుల్ అజీజు దివాళాఅయ్యెను. పాశ్చాత్యషాహుకార్లకు ఋణమును వడ్డీనిగాని చెల్లింపలేకపోయెను. బాల్కన్ రాష్ట్రములు తిరుగుబాటును ప్రారంభించెను. 1876 వ సంవత్సరమున యౌవనటర్కీకక్షివారు గొప్ప తిరుగుబాటును లేవదీసి అబ్దుల్ అజీజును రాజ్యభ్రష్టునిగావించి. అయిదవమురాదును సుల్తానుగజేసిరి. మురాదు ప్రజాప్రతినిధిసభను స్థాపించి వారియాజ్ఞానుసారము పాలించుట కొప్పుకొనెను. కాని మూడునెలలకే మురాదు చిత్తచాంచల్యముగలవాడని కనుగొనబడినది. ఆయనతమ్ముడగు సుల్తాను అబ్దుల్ హమీదు సింహాసనముపై నధిష్ఠింపచేయబడెను. అబ్దుల్ హమీదు ప్రజాప్రతినిధిసభను స్థాపించుననియు, దానికి బాధ్యతగల మంత్రులను నియమించి వారి యాలోచనలతో రాజ్యపాలనము చేయుదుననియు 1876 వ సంవత్సరము డిసెంబరు 23 వ తేదీన ప్రకటనము గావించెను. యౌవనటర్కీకక్షి నాయకుడగు మిద్ధతు పాషాను ప్రధానమంత్రిగ నియమించెను.

### (2)

## మిద్ధతు పాషా

కాని కొలదికాలములోనే సుల్తాను అబ్దుల్ హమీదు తన నిరంకుశమును మరల స్థాపించుకొనెను. బాల్కనురాష్ట్రములలో సంస్కరణములను స్థాపింపవలెనను మిద్ధతు పాషాయొక్క సలహాను త్రోసివేసెను. మిద్ధతు పాషాను మంత్రిపదవినుండి తొలగించి దేశభ్రష్టుని గావించెను. ప్రజాప్రతినిధిసభను (పార్లమెంటును) విచ్ఛిన్నముగావించి, మరల ముప్పదిసంవత్సరములవరకును పిలువనేలేదు. పత్రికలు తన నిరంకుశత్వమునకు అడ్డుతగులుచున్నవని యెంచి పత్రికల నాపివేసెను. పత్రికాధిపతులలోను రాజకీయ సంస్కర్తలలోను తనకు లోబడినవారికి గొప్పయుద్యోగముల నిచ్చి వారి నోళ్ళనుమూసెను. తనకు లోబడనివారిని దేశభ్రష్టులుగ చేసెను. ఈవిధముగ స్వతంత్రోద్యమమును కొంతకాలము అరికట్టగలిగెను.

సుల్తాన్ అబ్దుల్‌హమీదు బాల్కనురాష్ట్రములలో సంస్కరణములను స్థాపించనందున వాటిపక్షమున 1877 వ సంవత్సరమున రష్యాచక్రవర్తి తురుష్కముపై యుద్ధమును ప్రకటించుటయు, తురుష్కసుల్తాను పూర్తిగ నోడిపోయి రష్యాను పాదాక్రాంతుడై మిగుల అగౌరవమైన షరతులతో శాన్‌స్టిఫెనోసంధి కొప్పుకొనుటయు, ఇంగ్లాండునకు జర్మనీకిని రష్యా యందుగల అసూయ, భయములవలన ఆ రెండు ప్రభుత్వములవారును జోక్యముకలుగచేసికొని బర్లిన్‌సమావేశమును సమకూర్చి తురుష్కసుల్తానుకు కొంచెమెక్కువ అనుకూలముగనున్న షరతులతో రాజీ కుదుర్చుటయు, వెనుకటి అధ్యాయమున చూచియున్నాము. బర్లిన్ సమావేశమువలన తురుష్కసుల్తాను రక్షింపబడెనేగాని, కొన్ని బాల్కనురాష్ట్రములు స్వాతంత్ర్యమును పొందుటయు, సైప్రసుద్వీపము ఇంగ్లాండున కివ్వబడుటయు జరిగినది. తురుష్కసుల్తాను మిగుల బలహీనుడని తేలినది. తురుష్కసామ్రాజ్యమునందు పాశ్చాత్యులహక్కులు, పలుకుబడి, అధికారము, ధనార్జనము మిగుల హెచ్చెను. తురుష్కప్రజల నిస్సహాయత, పేదరికము చాలగ వృద్ధిచెందెను.

## సుల్తానుయొక్క నిర్బంధవిధానము

1881 వ సంవత్సరమున మిధతుపాషా మరల తురుష్కమునకు రాగా, నాయనను సుల్తాను రాజద్రోహనేరమునకై ఖైదులోపడద్రోసి 1884 వ సంవత్సరమున ఖయిదులోనే హత్యగావించెను. తన దేశస్వాతంత్ర్యమునకై యౌవనతురుష్కనాయకుడగు మిధతుపాషా తనప్రాణముల నర్పించెను. కొందరు యౌవనతురుష్కనాయకులు దేశమువిడిచి పారిపోయి స్విట్జర్లండు, ఫ్రాన్సు, ఇంగ్లాండుదేశములలో నివసించిరి. కొందరు చెరసాలలలోవేయబడుచువచ్చిరి. సుల్తాను అబ్దుల్‌హమీదుయొక్క పాలనము దుస్తరముగనుండెను. ఆయన పత్రికలను, పుస్తకములను, సభలను నిషేధించెను. యోగ్యులైన ప్రతిపురుషుని, ప్రతిస్త్రీని పోలీసుశాఖయొక్కనిఘాలో నుంచెను. ఆయనయొక్క ముప్పదిసంవత్సరములపాలన మిట్టి నిర్బంధములలోనే గడచెను. ఆయన కొంతకాలము ప్రకృతిశాస్త్రములకును వాఙ్మయమునకును పోషకుడుగనుండి ఉత్తమపాఠశాలలను, ఒక విశ్వవిద్యాలయమును స్థాపించెను, కాని వాటిలో చదువుచుండిన విద్యార్థులలో చాలమంది యౌవన

తురుష్కకక్షిలోచేరి స్వతంత్రభావములను పొందుచున్నందున వాటినిగూడ ఆయన నిరుత్సాహపరచసాగెను. మహమ్మదీయమతమును తాను సంరక్షించుటకు పాటుపడుచున్నట్లు నటించుచు, తురుష్కములోని మహమ్మదీయ మతగురువులయొక్కయు నితరదేశములలోనున్న మహమ్మదీయుల యొక్కయు సానుభూతిని పొందుట కాయన యత్నించుచుండెను. తులసి ఉండలు ఎన్నిపాపములనైన కప్పిపుచ్చునుగదా! ఆయన నిర్బంధప్రయోగ ముల మూలమున తన నిరంకుశత్వమును తన ప్రజలమీద నిలువబెట్టుకొనెనే గాని పాశ్చాత్యప్రభుత్వములయెదుట కేవలము నిస్సహాయుడుగ నుండెను. తురుష్కసామ్రాజ్యము కూలిపోవుచుండెను. తురుష్కసామ్రాజ్యములోచేరిన ట్యునిసు, ఈజిప్టు, మొరాకో దేశములను, సైప్రసుద్వీపమును, కొన్ని బాల్కన్‌రాష్ట్రములను ఈయనకాలములోనే పాశ్చాత్యులు స్వాధీనమును పొందిరి. మిగిలిన సామ్రాజ్యముకూడ కూలిపోవుటకు అడ్డుయేమియులేదు.

(3)

## రహస్యసంఘములు తిరుగుబాటులు

1890 సంవత్సరమునుండియు స్వతంత్రోద్యమము రహస్యసంఘముల లోనికిని తిరుగుబాటులుచేయవలెనను కుట్రలలోనికిని దిగెను. రహస్యముగ విప్లవగ్రంథములు, కరపత్రములు, పత్రికలు ప్రచురింపబడి పంచిపెట్టబడు చుండెను. వీటివ్యాపనముసకై తరుచుగ విదేశీయులపోస్టాఫీసు లుపయోగ పడుచుండెను. 1894 వ సంవత్సరమున ఆర్మీనియనులు తిరుగుబాటులుచేసిరి. సుల్తాను వారిని ఘోరమగు హత్యలుగావించెను. ఈ హత్యలు తురుష్క దేశాభిమానులకు కంటకముగ తోచెను. విశ్వవిద్యాలయముయొక్క వైద్య కళాశాలలలోని నలుగురువిద్యార్థులు అబ్దుల్‌హమీదుయొక్క పాలనము నంత మొందించు నుద్దేశ్యముతో "ఐక్యత అభివృద్ధిసంఘము, (**Committee of Union and Progress**) అను నొకసంఘమును రహస్యముగ స్థాపించిరి. ఈ సంఘము ముందుముందు చాల ప్రసిద్ధికెక్కవలసియున్నది. విద్యార్థులలో విప్లవభావములు త్వరితముగ వ్యాపింపచేయబడెను. 1895 వ సంవత్సరములో కాన్‌స్టాంటినోపిలు, డియార్‌బేకరు, వాన్, మొదలగు ప్రదేశము

లలో తిరుగుబాటులు జరిగెను. 1895 వ సంవత్సరము నవంబరు 16 వ తేదీన తురుష్క దేశాభిమానులు సమావేశమునను ప్రజాపాలనమును కోరుచు నొక ప్రఖ్యాతమగు ప్రకటనముగావించిరి. 1896 వ సంవత్సరమున అట్టోమాన్ బ్యాంకిని యౌవనతురుష్కు లాక్రమించిరి. అనేక రాష్ట్రములలో విప్లవోద్దేశ్యములు వ్యాపింపచేయబడెను. కాని సుల్తాను తిరుగుబాటుల నతి క్రూరముగ నణచెను. అనుమానగ్రస్తులనెల్ల గుంపులు గుంపులుగ పట్టుకొని చెరసాలలయందు పడవేయించెను. అనేకులు దేశాంతరములలో సంచరించిరి. అనేకులు పెక్కుహింసలకు లోనైరి. అనేకులు విదేశములకు పారిపోయిరి. “ఐక్యత అభివృద్ధి” సంఘమును స్థాపించినవారును విదేశములపాలైరి. యౌవనతురుష్కకక్షిపక్షమున కైరో, జినీవా, పారిసు, లండను మొదలగు పట్టణములలో పత్రికలు ప్రకటింపబడుచుండెను. విదేశములలో తురుష్క స్వతంత్రముకొరకు విప్లవసంఘములు స్థాపింపబడెను. పాశ్చాత్యప్రభుత్వము లను జోక్యముకలుగచేసికొని తురుష్కములోని సుల్తానుయొక్క నిరంకుశ పాలనమును తుదముట్టించి ప్రజాపాలనమును స్థాపించుటకు తోడ్పడుమని తురుష్కజాతీయవాదులు కోరిరి. కాని వారు తురుష్కప్రజాస్వతంత్రపక్ష మున కెట్టి సహాయమును చేయలేదు. ఏదేశముయొక్క స్వతంత్రమునైనను ఆ దేశప్రజలు త్యాగములుచేసి సంపాదించుకొనవలసినదేగాని, ఇతరులు సంపాదించిపెట్టుదురని తలచుట వట్టిభ్రమ.

## ప్రజాపాలనము స్థాపితమగుట

1903 వ సంవత్సరమున జర్మనులు తురుష్కసామ్రాజ్యములో బాగ్దాదు రైలువేను వేసికొనుటకు హక్కును పొందుటయు, ఆస్ట్రియావారు మాసిడోనియారాష్ట్రములో బలపర్చుకొనుచుండుటయు, 1904 వ సంవత్సర మున ఈజిప్టు, మొరాకోలవిషయమున ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని జరి గిన ఒడంబడికయు, 1906 వ సంవత్సరమున పారసీకమును ఆంగ్లేయులును రష్యావారును తమ తమ పలుకుబడిక్రిందనుండు నుభయముల పంచుకొనుటయు, యౌవనతురుష్కకక్షికి మరల దేశములో ప్రాబల్యమును కలుగచేసెను. సుల్తాను అబ్దుల్ హమీదు సామ్రాజ్యమును కాపాడనేరడనియు తమ రక్షణము నకు యౌవనతురుష్కకక్షియే గతియనియు అందరును తలచిరి. ఈ కాల

మునకు స్వతంత్రోద్యమము సైన్యములలో వ్యాపించెను. స్కుటారీయను చోట నొక రహస్యసంఘము సైనికోద్యోగులచే స్థాపించబడెను. "ఐక్యత అభివృద్ధి సంఘము" పునరుద్ధరించబడెను. 1907 వ సంవత్సరమున మొనాస్టిరులోను, ఎడ్రియనుపోలు శాఖలేర్పడెను. తురుష్క సైన్యములు 1908 వ సంవత్సరమున అకస్మాత్తుగ తిరుగబడెను. సుల్తాను అబ్దుల్ హమీదుయొక్క నగరుపై దండెత్తెను. అబ్దుల్ హమీదు లోబడెను. రాజకీయస్వతంత్రముల నిచ్చుటకు సమ్మతించెను. 1908 సంవత్సరము జులై నెల 23 వ తేదీన ప్రజా పాలనమును స్థాపించెను.

## అబ్దుల్ హమీదును వెడలగొట్టుట

విదేశములలోనున్న యౌవనతురుష్కు లీవిధముగ నాకస్మికముగ తమ దేశమునందు నిరంకుశత్వము కూలిపోవుటకు మిగుల నాశ్చర్యపడిరి. విదేశపత్రికలు చాల సంతోషమును వెలిబుచ్చెను. వెంటనే యౌవనతురుష్క కక్షియొక్క నాయకులు (Committee of union and progress) ఐక్యత అభివృద్ధి సంఘమనుపేర ప్రభుత్వమును స్వాధీనమునుపొందిరి. కాని మరల అబ్దుల్ హమీదు యౌవనతురుష్కకక్షిపై కొందరిచేత తిరుగుబాటులుచేయించినందున, 1909 వ సంవత్సరము ఏప్రియల్ 27 వ తేదీన సుల్తానుఅబ్దుల్‌హమీదు సింహాసనమునుండి తొలగించబడెను. అయిదవమహమ్మదు సుల్తానుసింహాసనారూఢుడయ్యెను. ఇంతటితో తురుష్కములో సుల్తానుల నిరంకుశత్వ మంతరించెను. ప్రజాప్రతినిధిసభ శాశ్వతముగ నేర్పడెను. ప్రజలకు బాధ్యతవహించిన మంత్రులపాలన మేర్పడెను. సుల్తానుయొక్క అధికారము నామమాత్రావశిష్టమయ్యెను.

(4)

## యౌవన తురుష్కకక్షియొక్క కష్టములు

కాని ఇంతటిలో యౌవన తురుష్కకక్షియొక్కయాశయము లీడేర లేదు. సామ్రాజ్యమునందు స్వతంత్రము, శాంతి ఏర్పడలేదు. కష్టములవెంట కష్టములు వారి నెదుర్కొనెను. ప్రథమమున అబ్దుల్ హమీదు లేవదీసిన

పూర్వాచారపరాయణులకక్షితో వీరు పార్లమెంటు ఎన్నికలలో పోటీపడవలసి వచ్చెను. కొంతకాలము వారు పార్లమెంటునాక్రమించిరి. తరువాత జరిగిన ఎన్నికలలో యౌవనతురుష్కులే జయమంది, 1918 వరకును రాజ్యపాలనము సాగించిరి. గాని పాశ్చాత్యప్రభుత్వముల రాజ్యకాంక్షతో యౌవన తురుష్క లెడతెగకుండ పోరాడవలసివచ్చినది. ఆ పోరాటములో యౌవన తురుష్కకక్షివారు అడుగడుగుకును ఓడిపోయి తుదకు పడిపోయిరి. తురుష్కసామ్రాజ్యముయొక్క పన్నులలో చాలభాగము అట్టోమాన్ పబ్లికు ఋణసంఘమువారికి స్వాధీనతసఖాపెట్టబడియుండెను. పన్నులు చాలవరకు వారే వసూలుచేసికొనుచుండిరి. వారిఅనుమతిలేనిది పన్నులు సంస్కరించ వీలులేదు. వారిఇష్టములేనిది ఋణములిచ్చువారుండరు. యౌవనతురుష్కకక్షి నాయకులు సంఘసంస్కారప్రియులు. మొగపిల్లలకును, ఆడుపిల్లలకును ప్రాథమికవిద్యను నిర్బంధముగను ఉచితముగను నేర్పువట్టుల శాసనము గావించిరి. కాన్‌స్టాంటినోపిలులో ఆరు ఉన్నతపాఠశాలలను స్థాపించిరి. ఇంకను కొన్నిచోట్ల స్త్రీల ఉన్నతపాఠశాలలను స్థాపించిరి. విశ్వవిద్యాలయమును వృద్ధిచేసి అందులో స్త్రీలుగూడ చదువుటకు సదుపాయములను చేసిరి. ఇంకను ఎన్నియో అభివృద్ధికరములగుపనులు చేయవలెనని యత్నించిరి గాని, ద్రవ్యలోపము బాగుగనుండెను. విదేశీయులకు పెట్టబడిన పన్నులతనఖాను, విదేశీయులప్రత్యేకహక్కులను రద్దుపరచి తురుష్క సామ్రాజ్యమును స్వతంత్రముగచేయుట వీరి యుద్దేశ్యమేగాని పాశ్చాత్య ప్రభుత్వములతో యుద్ధముకలుగునను భయమువలన చర్యపుచ్చుకొనుటకు సందేహించుచుండిరి.

## ఇటలీతో యుద్ధము

ఇంతలో ఆస్ట్రియాచక్రవర్తి బాస్నియా, హెర్జెగోవినా రాష్ట్రములను తనసామ్రాజ్యములో కలుపుకొనినట్టుల ప్రకటించెను. వాటిపైన తురుష్కమునకుగలఅధికారమును నిరాకరించెను. ఇటలీప్రభుత్వమువారు ఉత్తరాఫ్రికాలో తురుష్కసామ్రాజ్యముక్రిందనున్న ట్రిపోలిపై దండెత్తి స్వాధీనమును పొందిరి. కొంతకాలమునుండియు ఇటలీవారు ట్రిపోలిపై కన్నువేసియుండిరి. తమకు అడ్డుతగలకుండ ఇంగ్లీషు, ఫ్రెంచిప్రభుత్వములవారిని రహస్యముగ

నంగీకరింపజేసిరి. ఇంగ్లీషువారి ఈజిప్టుఆక్రమణను, ఫ్రెంచివారి ట్యునిసు, మొరాకోల ఆక్రమణను ఇటలీవారు అంగీకరించునటులను, ఇటలీవారు ట్రిపోలీని ఆక్రమించినపుడు ఆంగ్లేయ ఫ్రెంచి ప్రభుత్వములవారు హర్షించు నటులను, రహస్యపుటొడంబడికలు జరిగెను. ఇటలీవారు, ట్రిపోలీని ఆక్ర మించగ యౌవనతురుష్కులు ఊరుకొనువెటులు? ఇటలీపై యుద్ధమును ప్రక టించిరి. 1912 వ సంవత్సరమున ఇటలీకిని తురుష్కమునకును ఘోరమైన యుద్ధము ప్రారంభమయ్యెను.

## మొదటి బాల్కన్ యుద్ధము

ఆ యుద్ధము జరుగుచుండగనే బల్గేరియాదేశము తురుష్కసామ్రా జ్యమునుండి సంపూర్ణ స్వతంత్రమును ప్రకటించినది. గ్రీసు, బల్గేరియా, మాంటినీగ్రో, సర్బియా దేశములు రహస్యసంఘముగ చేరినవి. బాల్కన్ రాష్ట్రములనన్నిటిని తురుష్కులయధికారమునుండి స్వతంత్రముగచేయు టయే గాక తురుష్కమును యూరపుఖండమునుండి తరిమివేయవలయునని గూడ నీ రహస్యసంఘమువారు కుట్రనుపన్నిరి. చాలమంది యూరపుజాతుల వారు కుట్రదారులతో సానుభూతిని చూపిరి. 1913 వ సంవత్సరము అక్టో బరునెలలో "బాల్కన్ రహస్యపుసంఘమువారు" తురుష్కముపై యుద్ధమును ప్రకటించిరి. అటు ఇటలీయుద్ధములోను ఇటు బాల్కన్ యుద్ధములోను తురు ష్కులు ప్రతిచోటను ఓడిపోవుచువచ్చిరి.

## తురుష్కుల అపజయములు

ట్రిపోలిపైన తురుష్కమునకు నామమాత్రావశిష్టమగు నధికారముండు నటుల ట్రిపోలిని ఇటలీవారికి వదలివేసి ఇటలీతో యౌవనతురుష్కులు రాజీ పడిరి. బాల్కన్ యుద్ధములో తురుష్కులు గ్రీకులచేతను, సర్బియనులచేతను, మాంటినీగ్రోలచేతను పెక్కు యుద్ధములలో నోడింపబడిరి. తురుష్కసైనిక కళాశాలలో జర్మనులు ఉపాధ్యాయులుగ నియమింపబడిరి. వారిచే తురుష్క సైనికులు మంచి శిక్షణమునుపొందిరి. మిగుల ధైర్యముతో పోరుసలిపిరి. సామర్థ్యమును పరాక్రమమును ప్రదర్శించిరి. గాని పెక్కుమందితో తురు ష్కము పోరుసలుపవలసివచ్చెను. బల్గేరియనులు రెండు గొప్ప యుద్ధము లలో తురుష్కుల నోడించిరి. కాన్స్టాంటినోపిలును సంరక్షించుచున్న

చటల్జాకోటలవరకు నెట్టుకొనివచ్చిరి. మంచి సురక్షితముగనున్నదని ఎంచ బడెడి ఏడ్రియానోపిలు పట్టణమును స్వాధీనముపొందిరి. క్రైస్తవ జాతులు నిర్ణయించెడి షరతులకెల్ల నొప్పుకొని రాజీపడుటకన్న తురుష్క ప్రభుత్వమునకు గత్యంతరములేదు. లండనునందు రాజీనిమిత్త మొక సమా వేశ మేర్పాటుచేయబడెను.

## రెండవ బాల్కను యుద్ధము

ఇటుల సంధిప్రయత్నములు జరుగుచుండగ బాల్కన్ రాష్ట్రములవారి మధ్య నకస్మాత్తుగ మరియొక గొప్పయుద్ధము ప్రారంభమయ్యెను. బల్గేరి యనులు తురుష్కము నోడించుటలో నెక్కువ కష్టపడినామని తలచి తురు ష్కమును పంచుకొనుటలో సలొనీకా తమవంతుకు రావలెననిరి. గ్రీకులు సలొనీకా తమకు చేరవలెననిరి. ఉభయులమధ్యను తీవ్రముగ వివాదములు కలిగెను. మిగిలినవారందరును గ్రీకులతో చేరిరి. 1913వ సంవత్సరము జూన్ నెలలో ప్రారంభమయిన గొప్పయుద్ధములో నందరును కలిసి బల్గేరియాను చావగొట్టిరి. ఈ సందుచూచుకొని తురుష్కము యుద్ధములో ప్రవేశించి, మరల ఆడ్రియానోపిలును స్వాధీనమును పొందెను. ఈ రెండవ బాల్కన్ యుద్ధములో బాల్కన్ రాష్ట్రములవా రొకరిమీదనొకరు చేసిన ఘోర హత్యలు వర్ణనాతీతము.

## బాల్కను రాష్ట్రములు స్వతంత్రమును పొందుట

1913 సంవత్సరము ఆగష్టునెలలో మరల సంధిసమావేశము జరిగెను. తురుష్కసామ్రాజ్యము శాశ్వతముగ బాల్కన్ రాష్ట్రములను గోల్పోయెను. కాని తురుష్కదేశమునకు కాన్‌స్టాంటినోపిలు, అడ్రియానోపిలు, థ్రేసు మొదలగు యూరపుఖండములోనిభాగమంతయు దక్కెను. బాస్నియా, హెర్జెగోవినాలు ఆస్ట్రియాక్రింద చేరెను. గ్రీసుకు సలొనీకా ఇవ్వబడెను. తక్కిన బాల్కను రాష్ట్రములన్నియు స్వతంత్రములుగచేయబడెను.

ఇంతటితో ఆశియా, యూరపుఖండములలో నేకముగనున్న తురుష్క దేశము సంరక్షింపబడెను. తురుష్కసామ్రాజ్యముక్రింద ఆశియాఖండములోని అరబుదేశములుమాత్రము మిగిలియుండెను. యూరపు, ఆఫ్రికా ఖండములలోని యావత్తు సామ్రాజ్యమును తురుష్కము పూర్తిగ పోగొట్టుకొనెను.

# తురుష్క ప్రజాస్వామికము

## 3 ప్రపంచయుద్ధము

### (1)

### ప్రపంచయుద్ధకారణములు

1914 వ సంవత్సరము జులై నెల 28 వ తేదీనుండి ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను. ప్రపంచయుద్ధకారణములనుగూర్చి యిచట విశేషముగ వ్రాయబూనుకొనలేదు. యూరపుజాతుల మితిలేనిధనకాంక్ష, సామ్రాజ్యతృష్ణల వలన కలిగిన పరస్పరపోటీలును ద్వేషములును యుద్ధమునకు ప్రధానకారణములు. పందొమ్మిదవశతాబ్దమునందు యంత్రశాలలను విరివిగస్థాపించుకొని, యూరపుజాతులు తమదేశముల కవసరమగువాటికన్న యనేకరెట్లెక్కువగ పారిశ్రామికసరుకులను తయారుచేసెను. వాటిని యూరపుఖండములోని యితర దేశములు కొనవు. గావున ఆశియా ఆఫ్రికాఖండములలో వాటినమ్ముటకు అంగళ్ళను సంపాదించవలెను. మరియు తమపరిశ్రమల కవసరమగు ప్రత్తి, లోహములు, యంత్రములనూనెలు, రబ్బరు మొదలగు పదార్థములు దొరకు ప్రదేశములు కావలెను. బియ్యము, గోధుమ, పంచదార, కొబ్బరి, కాఫీ, తేయాకు, కోకో మొదలగు నాహారపదార్థములు దొరకుచోట్లు కావలెను. తమదేశములలోని షాహుకార్ల వద్దమూలుగుచున్న మూలధనమును పెట్టుబడి పెట్టి విశేషలాభములను గడించుటకు రైళ్ళువేయుట, గనులుత్రవ్వుట, తోటలువేయుట, బ్యాంకీలుపెట్టుట, వర్తకసంఘములుపెట్టుట మొదలగు అవకాశములను కలుగజేయు వెనుకబడియున్న ప్రదేశములు తమ యాజమాన్యమున నుండవలెను. వీని అన్నిటికొరకును ఆశియా, ఆఫ్రికాఖండములలో సామ్రాజ్యములు (Empires), వలసలు (Colonies), సంరక్ష

కత్వములు (Protectorates). పలుకుబడిగలప్రదేశములు (Spheres of influence) ప్రత్యేక హక్కులు (Capitulations) సంపాదించుటకు యూరపుజాతులు విశ్వప్రయత్నములుచేయుచున్నవి. తమసరుకులను తమసేనలను ఆశియా, ఆఫ్రికా ఖండములలోని మారుమూలలకు పంపుటకును, అచటనుండి ముడిపదార్థములను ఆహారపదార్థములను గొనివచ్చుటకును, స్టీమరులు, రైళ్ళు, టెలిగ్రాములు వేయబడుచున్నవి. ఇదియే నవీనప్రపంచమునందు తాండవమాడుచున్న సామ్రాజ్యతత్వము. ఈ ప్రయత్నములో యూరపుఖండములోని ప్రధానజాతులలో నేర్పడిన గొప్ప పోటీలవలన ప్రపంచయుద్ధము జరిగెను.

## ఇంగ్లాండు జర్మనీల పోటీ

పందొమ్మిదవశతాబ్దములో మున్పాతికభాగమువరకును ఇంగ్లాండు పారిశ్రామికసంపదలో సాటిలేనిదిగ నుండెను. ముఖ్యముగ నాంగ్లేయుల వస్త్ర, ఇనుప, ఉక్కు పరిశ్రమలు అత్యున్నతముగ వృద్ధిచెందియుండెను. అప్పటినుండియు నింగ్లాండుతో పోటీచేయుగల బలవత్తరమైనజాతియొకటి బయలుదేరెను. 1870 వ సంవత్సరమున జాతీయైక్యతను పొందినప్పటినుండియు, జర్మనీ అత్యాశ్చర్యకరమైన యభివృద్ధినిపొందుచున్నది. ఇరువదవ శతాబ్దప్రారంభమునకు కొన్ని జర్మనుపరిశ్రమలు ఇంగ్లాండుకన్నకూడ మించినవి. 1870 వ సంవత్సరమున ఇంగ్లాండు 5960 వేలటన్నుల ఇనుపసరకులు తయారుచేసెను; జర్మనీ 1390 వేలటన్నుల ఇనుపసరకులు మాత్రము తయారుచేసెను. 1903 వ సంవత్సరమున ఇంగ్లాండు 8935 వేలటన్నులను తయారుచేయగ, జర్మనీ 9860 వేలటన్నులను తయారుచేసెను. 1870 నుండి 1900 సంవత్సరమువరకు ఆంగ్లేయులు విదేశములకు ఎగుమతిచేసెడి సరకులు నూటికి 45 వంతున వృద్ధికాగ, జర్మనులు ఎగుమతిచేసెడి సరకులు నూటికి 200 వంతున వృద్ధిఅయ్యెను. పారిశ్రామికసరకుల అమ్మకపుపోటీలో జర్మనీ ఇంగ్లాండును మించుట ఇంగ్లాండుకు మిగుల కంటకముగ నుండక మానదు. సైనికబలమునందు జర్మనీ త్వరితముగ నింగ్లాండునుమించి ప్రపంచములో మొదటిస్థానమును పొందెను. నావికాదళమునుగూడ జర్మనీ అత్యంతముగ వృద్ధిచేసికొనుచు సముద్రములకు రాణియని పేర్గాంచిన ఇంగ్లాండు

కన్న కొంచెము తక్కువైనస్థితికి వచ్చెను. జర్మనీ ఆఫ్రికాయందును, పసిఫికుమహాసముద్రములోని లంకలయందును పలసల నేర్పరచుకొనుచుండెను. బలహీనమైన చైనా, తురుష్కసామ్రాజ్యములలో ప్రత్యేకహక్కులు, వర్తక సౌకర్యములు, రైళ్ళువేయుట, గనుల్ త్రవ్వుకొనుట మొదలగు ద్రవ్యార్జనచేసి కొను మార్గములు. ధీర్ఘకౌళ్ళు, పలుకుబడిప్రదేశములు మొదలగువాని సంపాదనమునందు జర్మనీ ఇంగ్లాండుకు తీసిపోవుటలేదు. తురుష్కసామ్రాజ్యములో పారసీకసముద్రమువరకును 2400 మైళ్ళపొడుగున బాగ్దాదురైలును వేయు హక్కును జర్మనులు సంపాదించుట చూచియున్నాము. ఇందువలన తమక్రిందనున్న హిందూదేశముమీదను ఈజిప్టుమీదను జర్మనీ వచ్చిపడు నేమోననుభయము, తాము సంపాదింపయత్నించుచున్న హక్కులను జర్మనీ కొట్టుకొనిపోయెనను అసూయ ఆంగ్లేయులకు కలిగెను. మొరాకోను సంపాదింపవలెనని జర్మనులకు కోరికయుండగ, జర్మనీకి శత్రువగు ఫ్రెంచివారి కిప్పించి జర్మనీ కచట స్థానములేకుండ ఇంగ్లాండుచేసినందున జర్మనీకి ఇంగ్లాండుమీద చాల కోపము కలిగెను. గావున ఇంగ్లాండుకును జర్మనీకిని మధ్య గొప్ప స్పర్ధ, అసూయ ఏర్పడి దినదినప్రవర్ధమానమగుచుండెను. 1870 వ సంవత్సరమున జర్మనీచేతులలో ఫ్రాన్సు పూర్తిగ నోడిపోయి, ఆల్సేసు, లోరైన్ రాష్ట్రములను పోగొట్టుకొని, అమితమైన ధనమును జర్మనీకి నష్టపరిహారముగ నివ్వవలసివచ్చినప్పటినుండియు, జర్మనీతో మరల యుద్ధముచేసి, యా రెండురాష్ట్రములను లాగుకొనవలెననియు జర్మనీని మంచిదెబ్బకొట్టి కసితీర్చుకొనవలెననియు ఫ్రాన్సు తయారగుచున్నది. ఫ్రెంచి పాఠశాలలలోని తరతరములవిద్యార్థులకును జర్మనీమీద కసితీర్చుకొనవలెనను భావము బోధించబడుచున్నది. రష్యావారు హిందూదేశముమీద వచ్చిపడుదురను భయము ఆంగ్లేయులకు క్రమముగ తగ్గి, జర్మనీయందు భయమే ఆంగ్లేయులకు దినక్రమేణ హెచ్చుచున్నది. జర్మనులు బాగ్దాదురైలు వేసి తురుష్కముతో స్నేహముగనుండుటవలన కాన్‌స్టాంటినోపిలుసింహాసనముమీద తాను కూర్చొనుటకును, డార్డనెల్సుజలసంధిగుండ సముద్రములమీదకు పోవుటకును చిరకాలమునుండి రష్యాచక్రవర్తి పెట్టుకొనియున్నఆశ నిరర్థకమైనది. తనకు అడ్డమువచ్చెనని రష్యాచక్రవర్తి జర్మనుకైజరును ద్వేషించెను. గావున 1904 సంవత్సరమునను 1906 వ. సంవత్సరమునను ఇంగ్లాండు

జర్మనీయందు ద్వేషముగల ఫ్రాన్సుతోను రష్యాతోను ఒడంబడికలు చేసి కొనెను. ఆస్ట్రియాక్రింద కొందరు స్లావుప్రజ లుండిరి. వారు ఆస్ట్రియాపై తిరుగుబాటుచేయుటకు స్లావుదేశమగు సర్బియావారు ప్రోత్సహించుచున్నారని ఆస్ట్రియాకు కోపము. ప్రక్కనున్న బాల్కన్‌రాష్ట్రములను సర్బియాను ఏదోసాకున మ్రింగవలెనని ఆస్ట్రియాయొక్క ఉద్దేశ్యము. రష్యాప్రజలుకూడ స్లావుజాతివారే. రష్యాచక్రవర్తి సర్బియా మొదలగు స్లావుప్రజలస్వతంత్రమునకు రక్షకుడుగనుండి ఆస్ట్రియాయొక్క కోరికలకడ్డుగనుండెను. జర్మనీ ఆస్ట్రియా యొకటిగ నుండిరి. యూరపుఖండములోని ప్రధానజాతులమధ్య గొప్ప యుద్ధము రాకతప్పదని దూరాలోచనగలవారు తలచుచుండిరి. ఆ జాతులన్నియు పందొమ్మిదవశతాబ్దాంతమునను ఇరువదవశతాబ్దములోను అత్యద్భుతముగ వృద్ధిచెందిన ప్రకృతిశాస్త్రజ్ఞానమును మానవసముదాయములను బహుతేలికగ నాశనముచేయుసాధనములను కనిపెట్టుటలో నుపయోగించుచు సైనికబలమును అత్యంతముగ వృద్ధిచేసుకొనుచుండిరి. తుపాకిమందు వెదజల్లబడియుండెను. నిప్పుపుల్ల గీసి ఏమూలనో ముట్టించుటయే తడవుగ నుండెను.

## యుద్ధప్రారంభము

1914 వ సంవత్సరము 28 వ జూన్ తేదీన ఆఖరుకు యుద్ధకారణము కలిగినది. ఆస్ట్రియారాజ్యమునకు వారసగు ఫ్రాన్సిసు ఫెర్డినాండు ప్రభువు బాస్నియారాష్ట్రపు ముఖ్యపట్టణమగు సరజీవోను దర్శించవెళ్ళినపుడు ఆయనయు ఆయనభార్యయు హత్యగావింపబడిరి. సర్బియారాజ్యమువారీ హత్యకు కారకులని ఆస్ట్రియా నేరారోపణచేసెను. సర్బియా తాను నిరపరాధినని చెప్పెను. జూలై 28 వ తేదీన ఆస్ట్రియావారు సర్బియాపై యుద్ధమును ప్రకటించిరి. వెంటనే యూరపుఖండములోని జాతులన్నియు ఒకరివెంటనొకరు ఏదోపక్షమున యుద్ధములోనికి దుమికిరి. ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యా, ఇటలీ, సర్బియా, బెల్జియం, గ్రీసు, రొమేనియా దేశము లొకపక్షమున చేరిరి. వీరికి మిత్రమండలి (**Allies**) యని పేరు. వీరికివ్యతిరేకముగ జర్మనీ, ఆస్ట్రియా, బల్గేరియా, తురుష్కములు చేరెను.

## (2)
## తురుష్కము జర్మనీపక్షమున చేరుట

తురుష్కప్రభుత్వమువారు 1914 వ సంవత్సరము నవంబరు 14 వ తేదీన జర్మనుపక్షమున యుద్ధములోనికి దిగి తా మట్లుచేయుటకు కారణము లీ క్రిందివిధమున ప్రకటించిరి.

"1. ప్రపంచయుద్ధము ప్రారంభముగాకముందు, రెండు గొప్ప యుద్ధ నావలు ఇంగ్లాండులోని పడవలనిర్మాణశాలలలో మేము చేయించుకొను చుంటిమి. యుద్ధము ప్రారంభముకాగనే ఆంగ్లేయప్రభుత్వ మెట్టి కారణము లేకుండ నా రెండునావలను అపహరించినది. మాకు నష్టపరిహారమివ్వలేదు. మా సామ్రాజ్యసంరక్షణమునకుగాను వెంటనే "గోబెను" "బ్రెస్లా" యను రెండు యుద్ధనావలను జర్మనీనుండి మేము సంపాదించితిమి. జర్మనీనుండి మేమేల వాటిని సంపాదించవలెనని ఇంగ్లాండు ప్రశ్నించుచున్నది. జర్మనీ వారు స్నేహభావముతో మా కిచ్చిన నావలను మేము తీసికొనుటలో మా తప్పులేదు. ఇందు కాంగ్లేయులే జవాబుదారులు.

2. డార్డనల్సుజలసంధిని మేము మూసివేసితిమని ఇంగ్లాండు మామీద నేరారోపణచేయుచున్నది. దీనికిని ఇంగ్లాండుయొక్క నిరంకుశచర్యలే కారణము.మా నావికాసైన్యమున జర్మనులగు సైనికోద్యోగులను నియమించితిమను నెపమున మా నావలను ఆంగ్లేయులు డార్డనల్సుజలసంధి ముఖద్వారమున ముంచుచుండిరి. మే మెవరిని యుద్యోగులుగ పెట్టుకున్నను విదేశ ప్రభుత్వముల కేమి సంబంధము ? మేము యుద్ధములో తటస్థముగనుంటిమి. గాని యాంగ్లేయులు మా నావలను నిర్హేతుకముగ ముంచుచుండుటవలన మేము మా రాజధానిని సంరక్షించుకొనుటకు డార్డనల్సును మూసితిమి.

3. బాల్కను యుద్ధములలో జోక్యముకలుగచేసికొని సంధిని కుదర్చవలెనని ఆంగ్లేయులను కోరితిమి. వా రెంతవరకును మా సామ్రాజ్యానాశనమునకు తోడ్పడుపనులే చేయుచుండిరి. మేముపోగొట్టుకొన్న ఆడ్రియా నోపిలును మరల స్వాధీనమునుపొందినపుడు మాతో సానుభూతినిచూపుటకు మారుగ మేము వెంటనే ఆడ్రియానోపిలును వదలిపెట్టనిచో మమ్ములను శిక్షింతుమని ఆంగ్లేయప్రధానమంత్రి బెదిరించెను.

4. పారసీకసముద్రము నాంగ్లేయులు స్వాధీనమును పొందుటయే గాక ఆప్రక్కనున్న మా రాజ్యమగు అరేబియాలోకూడ అక్రమముగ ప్రవేశించుచుండిరి. అరేబియాను మ్రింగవలెనని ఆంగ్లేయులు దురాశాపరులై యున్నారు.

5. ఇంగ్లాం డెల్లప్పుడును తురుష్కముయొక్క నాశనమునే కోరుచుండెను. మా ప్రభుత్వమును బాగుచేసికొని మాదేశములో సంస్కరణములను ప్రవేశపెట్టయత్నించగ నింగ్లాం డడ్డుతగులుచున్నది. మా కవసరమగు (Experts) నిపుణులు యూరపుఖండమునందు దొరకకుండ ఆంగ్లేయులు కుట్రలుచేసిరి. జర్మనుచక్రవర్తి మాత్రము ఆంగ్లేయులను లక్ష్యపెట్టక మా సైన్యము నుత్తమపద్ధతులమీద తరిబీయతు వృద్ధిచేయుటకు లిమాన్‌వాన్ సాండర్సుఅను యుద్ధనిపుణుని మా కిచ్చెను. ఆయనయొక్క ఏర్పాటులక్రింద మా సైన్యము బాగుగ శిక్షణముపొందియున్నది. మేము ఇంగ్లాండుయొక్క సేనలను లక్ష్యపెట్టనవసరములేనిస్థితియం దున్నాము.

6. మొరాకో, ఈజిప్టులమీద మా యధికారమును నాశనముచేసి తాము కాజేసిన 1904 వ సంవత్సరపు ఆంగ్లేయ పరాసు ఒడంబడిక, మా ప్రక్కనున్న పారశీకదేశమును పంచుకొనుచు చేసికొన్న 1906 వ సంవత్సరపు ఆంగ్లేయ — రష్యా ఒడంబడిక ఆంగ్లేయులదురాశకు నిదర్శనములు.

7. వెయ్యేల, నూరుసంవత్సరములనుండియు అన్ని మహమ్మదీయ దేశములయొక్క స్వతంత్రమును హరించి ఆ దేశములనుండి ఆంగ్లేయవర్తకులు ధనమును గొనిపోవుటయే, ఆంగ్లేయప్రభుత్వముయొక్క రాజనీతియై యున్నది.

8. గావున మేము ఆంగ్లేయులకు వ్యతిరేకముగ యుద్ధమును ప్రకటించవలసివచ్చినది. లోకములోని మహమ్మదీయులకు శత్రువులగు ఇంగ్లాండు, రష్యా, ఫ్రాన్సు దేశములనుండి మహమ్మదీయులను కాపాడుటకు జయమును మాకు దయామయుడగు భగవంతుడు ప్రసాదించునుగాక!"

అని యౌవన తురుష్కకక్షినాయకులు ప్రకటనముగావించిరి. (మీయర్సు రచించిన "నవీన తురుష్క" గ్రంథముయొక్క 608 వ పేజీలో

నుదహరించబడిన నెం 1 రు దస్తావేజు.) అపుడు యౌవన తురుష్కకక్షి నాయకులుగ తురుష్కప్రభుత్వము నడుపుచున్నవారిలో ఎన్వరుపాషా, తలాతు పాషా, జమాల్‌పాషాగార్లు ముఖ్యులు.

## మహాసంక్షోభము

1914 వ సంవత్సరము ఆగష్టునెలనుండి 1918వ సంవత్సరము నవంబరునెలవరకు ప్రపంచమునంతను దారుమారుచేసి అదివరకు కనివిని యెరుగని సంక్షోభమును కలుగచేసిన మహాయుద్ధము నీ గ్రంథములో వివరించ దలచలేదు. ఈ యుద్ధమున ఉభయపక్షములనుకలిసి మూడుకోట్ల ఏబది లక్షలమంది సైనికులు హతులైరనియు, ఆరుకోట్లమంది అంగవైకల్యము మొదలగు ఘాతలుపొందిరనియు అంచనావేయబడినది. వ్యయపడిన కోట్ల ధనము నెవరును లెక్కింపలేకున్నారు. ప్రతి ప్రభుత్వమును కోట్లకొలది ఋణమునుచేసెను. యుద్ధ మనేకరంగములలో భూమిమీదను, కందకములలోను, సముద్రములమీదను, సముద్రములయడుగునను, ఆకాశములోను జరిగెను. యుద్ధముకొరకు ఏబదిమైళ్ళదూరమున నున్నవాటిని భస్మీపటలముచేయు పెద్ద మరఫిరంగులు, ఆగ్నేయాస్త్రములు, విషవాయువులు, గొప్ప బాంబులు, ఆకసమున సంచరించు గొప్ప విమానపుటోడలు, సముద్రపుటడుగున విహరించు జలాంతర్గాములు, మొదలగు అత్యద్భుతమగు నూతనరకపు యుద్ధపరికరములెన్నియో కనిపెట్టబడినవి. నూతనసృష్టిలో జర్మనులు ముందుగ దారి దీయుటయు ఆంగ్లేయులును పరాసువారును వారి ననుకరించుటయు జరిగెను.

## హిందూదేశముయొక్క సహాయము

యుద్ధమునందు హిందూదేశ మాంగ్లేయులపక్షమున మిగుల తోడ్పడెను. తురుష్కులతో సానుభూతిగల కొన్నివందలమందిని హిందూదేశపు ప్రభుత్వమువారు విచారణలేకుండ నిర్బంధవాసములలో నుంచినను, మొత్తముమీద హిందూదేశీయులు హిందువులును, మహమ్మదీయులును, సిక్కులును, క్రైస్తవులును బ్రిటిషుప్రభుత్వమునందు రాజభక్తినిచూపి తోడ్పడిరి. హిందూదేశ నాయకులగు మహాత్మాగాంధి, అనిబిసెంటుసతి మొదలగువా రాంగ్లేయ ప్రభుత్వమునకు సహాయముచేయుటకే ప్రజలను ప్రోత్సహించిరి. హిందూ

దేశ మీ యుద్ధముకొరకాంగ్లేయులకు రెండువందల పదికోట్లరూప్యములను పన్నెండులక్షలమంది మనుష్యులను ఇచ్చెను. ఇదిగాక హిందూదేశప్రభుత్వము వారు నాలుగువందలకోట్ల రూప్యములు యుద్ధమునకుగాను వెచ్చించిరి. యుద్ధము ముగియగనే హిందూదేశమునకు స్వరాజ్యములో గొప్ప భాగమిచ్చి పిమ్మట కొంతకాలమునకు పూర్తిగ స్వరాజ్యమిచ్చెదమని యుద్ధకాలమున నాంగ్లేయప్రభుత్వమువారు ప్రకటించిరి. ఇది భారతజాతీయవాదులకు గొప్ప ఆశలను కలుగచేసెను. భారతీయముసల్మానులు కొన్నిచోట్ల తమ తోటిముసల్మానులగు తురుష్కులతో పోరాడవలసివచ్చెను. భారతీయముసల్మానులరాజభక్తి చెడకుండ నిలుపుటకై యుద్ధములో తాము గెల్చినను ఖిలాఫతునకు (తురుష్కమునకు) అపాయముకలుగచేయమని యుద్ధకాలమున నాంగ్లేయ మంత్రులు ప్రకటించిరి.

## (3)

## తురుష్కముయొక్క జయము

1914వ సంవత్సరము నవంబరునెలలో తురుష్కము జర్మనుపక్షమున యుద్ధములోనికి దిగి ఈజిప్టుపై దండెత్తుటకు సిద్ధపడుచుండెను. 1915వ సంవత్సరము ఏప్రియలునెలలో తురుష్కరాజధానియగు కాన్‌స్టాంటినోపిలును స్వాధీనపర్చుకొనుటకై ఆంగ్లేయ ఫరాసు సైన్యములు సముద్రముమీద ప్రయాణముచేసి గెల్లిపోలిప్రాంతమున దిగెను. ఫిబ్రవరినెలలోనే మిత్రమండలివారి నౌకాదళము టర్కీవారి డార్డనల్సుజలసంధిని ముట్టడించిరి గాని, నిష్ప్రయోజనమయ్యెను. ఇందువలన తురుష్కులు మేల్కొని యుద్ధమునకు బాగుగ సిద్ధపడిరి. ఏప్రియలునెలలో "గెల్లిపోలి"లో మిత్రమండలి సేనలు దిగినపుడు తమకంటె నెక్కువ బాగుగ కందకములు త్రవ్వుకొని మంచి యుద్ధసామాగ్రిని కలిగి తురుష్కులు తయారగుటను చూచిరి. మిత్రమండలివారు దండెత్తయత్నించుచున్నారను వర్తమానము బహుశః జర్మనుకైజరుయొక్క బావమరదియగు గ్రీకురాజు పంపియుండవచ్చును. సముద్రముమీదనుండికూడ మిత్రమండలివారు తురుష్కులను ముట్టడించ తలచిరి గాని, జర్మనుజలాంతర్గాములు మిత్రమండలివారి పెద్ద యుద్ధనౌకలను ముంచివేసినవి. తురుష్కులు

మిత్రమండలివారిసేనల నోడించిరి. మిత్రమండలివారు చాలమందిసైనికులను చాలసామగ్రిని పోగొట్టుకొని. 1916 వ సంవత్సరము జనవరినెలలో గెల్లిపోలీని విడిచి తమదేశములకు వచ్చిచేరిరి.

## అరబుదేశములలో యుద్ధము

ఆసియాఖండములోని అరబుదేశమగు మెసపొటేమియాను ఆంగ్లేయ ప్రభుత్వమువారు హిందూదేశమునుండి హైందవసేనలను తీసికొనివెళ్ళి ముట్టడించిరి. 1914 సంవత్సరము నవంబరునెలలో హైందవసేనలు బాస్రాలో దిగెను. 1915 వ సంవత్సరంప్రారంభమున బాగ్దాదు నాక్రమించెను. తురుష్కసేనలు హైందవసేనలను దీకొనెను. ప్రథమమున టెసిఫణ్‌వద్ద తురుష్కలోడిపోయిరి. గాని క్రొత్తసైన్యములువచ్చి తురుష్కులను చేరెను. హైందవసేనలు కట్‌వరకును మరలిరావలసివచ్చెను. అక్కడ నీ హైందవసేనలను తురుష్కులు చుట్టుకొని యాహారపదార్థములులేకుండచేసినందున 1916 వ సంవత్సరము ఏప్రిలు 29 వ తేదీన సేనాధిపతియగు జనరలు టౌనుషెండుతో కూడ హైందవసేనలు తురుష్కులకు లోబడెను.

## తురుష్కముపై అరబుల తిరుగబాటు

అరబుదేశములగు మెసపొటేమియా (ఇరాకు), హెజాజి (అరేబియా), ట్రాన్సుజార్డను, సిరియా, పాలస్తైన్ దేశములు తురుష్కముక్రింద నుండెను. అరబుజాతులలో తురుష్కమునుండి స్వాతంత్రమునుపొందుటకై కొంత సంచలనము కలిగెను. 1914 వ సంవత్సరమునాటికి అరబులలో స్వాతంత్రభావములు వ్యాపించియుండెను. తురుష్కప్రభుత్వమునం దిష్టము లేదు. స్వాతంత్రమునల్మాసురాజ్యము కావలెను. తెల్లవారిరాజ్యము కూడదు, అని అరబుల యాశయములు; గాని నడుపుటకు మంచి నాయకుడు లేడు. తురుష్కముతో యుద్ధము ప్రారంభమయినదిమొదలు ఎటులైన అరబ్బులను తురుష్కముపై తిరుగబడునట్లుల పురిగొలుపవలెనని ఆంగ్లేయులు ప్రయత్నించసాగిరి. 1915 వ సంవత్సరము అక్టోబరునెలలో మక్కాలోని షెరీఫు హుస్సేనుకు ద్రవ్యమిచ్చి చీలదీసిరి. పిమ్మట మరియొక అరబుప్రముఖుడగు ఇబిన్‌సౌదుతో రహస్యపుటొడంబడిక చేసికొనిరి. 1916 వ సంవత్సర

ప్రారంభమునకు ఇంకను అరబ్బులు బాగుగ నాంగ్లేయులతో చేరలేదు. ఆంగ్లేయులను అనుమానముతోడనే చూచుచుండిరి. ఆంగ్లేయులు ద్రవ్యము నిచ్చుచుండిరి గాని, తురుష్కులు మహమ్మదీయులు కాలక్రమమున ఆంగ్లేయుల బంగారునాణెములే జయమందెను. అరబుతెగల నాయకులలో చాల మందిని ఆంగ్లేయులు లోబరచుకొనిరి. కర్బాలా ప్రముఖుడు మహమ్మదాలీకి ఆంగ్లేయులధన మెంతయో ఉపయోగపడెను. తురుష్కులకు మిత్రుడుగ నున్న ఇబిన్‌రషీదు ద్రవ్యముకొరకు ఆంగ్లేయులతో చేరెను.

## కలనల్ లారెన్సు

ద్రవ్యముతోపాటు యుద్ధము ముగియగనే స్వతంత్రమును కలుగ జేతుమను బోధకూడ బాగుగ చేయించిరి. కలనల్‌లారెన్సు అను ఆంగ్లేయ యువకుడు అరబులకు స్వతంత్రముకలుగునను ఉద్బోధనచేయుటకు ప్రత్యేకముగ పూనుకొనెను. ఆయనకు కావలసిన ద్రవ్యము ఆంగ్లదేశమునుండి విరివిగ వచ్చుచుండెను. ఆయన అరబ్బీభాషను ధారాళముగ మాటలాడనేర్చుకొనెను. ఖురానును బాగుగ చదివెను. మహమ్మదీయమతమును స్వీకరించితినని చెప్పెను. అరబువేషమునుధరించి షా యని పేరుపెట్టుకొనెను. అరబ్బులు చాల గొప్పజాతియనియు వారి పూర్వులు చాల గొప్పవారనియు విదేశీయులగు తురుష్కులక్రిందనుండుట చాల అవమానకరమనియు అరబ్బులు మరల స్వతంత్రమును సంపాదించి పూర్వపు టౌన్నత్యమును పొందుకొరకే తనజీవితమును అర్పణచేయదలచితిననియు వారికి యుపన్యాసముల నిచ్చుచుండెను. ఈ సమయము పోగొట్టుకొనక మిత్రమండలితోచేరి తురుష్కులను వెడలగొట్టి స్వతంత్రమును స్థాపించుకొమ్మని పురిగొల్పుచుండెను. చేతిలో బంగారునాణెములు కనపడుచున్నవి. పైగ స్వతంత్రము కలుగునను ఆశ కలుగుచున్నది. 1917 వ సంవత్సరమున అరబులు అనేకచోట్ల తురుష్కులపై తిరుగబడిరి. మిత్రమండలివారితో పోరుసల్పుట, అరబులతిరుగబాటుల నణచుట యను రెండుపనులు తురుష్కులు చేయవలసివచ్చెను. కొంత

కాలము జర్మనుసైన్యములు తురుష్కులకు సహాయముచేసెను. అప్పుడు తురుష్కసైన్యములు జయములనొందెను. రష్యావారిని పారసీకదేశములో నోడించిరి. కాని జర్మనుసైన్యములు అనేకరంగములకు పోవలసివచ్చెను. తురుష్కులు వరుసగ నపజయములను పొందిరి.

## తురుష్కుల అపజయములు

1917 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో జనరలు మాడు సేనానిక్రింద హైందవసేనలు "కట్"ను మరల స్వాధీనమునుపొందెను. వీరికి మక్కా షెరీఫుయొక్క కుమారుడగు అమీర్ ఫైసలు తన అరబుసేనలతో ఒంటెల మీదవచ్చి తోడ్పడెను. మాడు సేనానిక్రిందిసేనలు తురుష్కులను నెట్టుకొని పోవుచు మార్చినెల 11 వ తేదీన బాగ్దాదునందు ప్రవేశించెను. పిమ్మట మెసపొటేమియాదేశమునంతను ఆక్రమించెను. అరబులు నలువైపులనుండియు నాంగ్లేయులకు సహాయముచేయుచుండిరి. ఈజిప్టునుండివచ్చిన ఆంగ్లేయ సేనలు పాలెస్టైనులో చొచ్చుటకు ప్రయత్నించగ "గాజా"వద్ద తురుష్కు లడ్డగించిరి. చాలకాల మాంగ్లేయులు ముందుకు పోజాలరైరి. 1917 వ సంవత్సరము అక్టోబరునెలలో మరియొక ఆంగ్లేయసైన్యము అల్లెనుబిసేనాని క్రింద వేరొకమార్గమున పాలెస్టైనులో ప్రవేశించెను. 1917 వ సంవత్సర మాఖరుగునసరికి పాలెస్టైనుదేశమంతయు నాంగ్లేయులక్రిందికి వచ్చెను. 1918వ సంవత్సరమున అరబుదేశములన్నియు నాంగ్లేయసేనలస్వాధీనమం దుండెను. ఆ సంవత్సరము నవంబరునాటికి తురుష్కసామ్రాజ్యమంతలోను ఇరువది లక్షల సైన్యములను ఆంగ్లేయులు నిలువయుంచిరి.

బ్రిటిషువారు మెసపొటేమియాను పాలెస్టైనును ఆక్రమించిన తరువాత యుద్ధకాలమున రైళ్ళువేయుటకును, నీటిపారుదల యేర్పాట్లుచేయుటకును కోట్లకొలది రూప్యములను ఖర్చుచేసిరి. ఒక్క మెసపొటేమియాలో ముప్పదికోట్లరూప్యములను ఖర్చుచేసినట్లుల అంచనావేయబడినది. ఇంత సొమ్ము పెట్టుబడిపెట్టుటవలన నా దేశమును దమక్రిందనుంచుకొనుటకు హక్కును పొందిరి. లేదా అంతసొమ్ము వారికి ముజరా యివ్వవలెను.

## (4)

## జర్మను జయములు

యూరపుఖండములోని యితర రంగములలో 1916 వ సంవత్సర మాఖరువరకును జర్మనులే మొత్తముమీద ఎక్కువ జయములనుపొంది జర్మనీయొక్క ప్రతిష్ఠ యుచ్చస్థితిలో నుండెను. బెల్జియము, సర్బియా, రొమేనియా దేశములను పూర్తిగ జర్మనీ ఆక్రమించినది. ఫ్రాన్సు, రష్యా దేశములలో చాలభాగము జర్మనులు స్వాధీనమును పొందిరి. కాని ఫ్రాన్సును పూర్తిగ మ్రింగకుండగను ఇంగ్లాండుపై పడకుండగను మిత్రమండలివారు ప్రతిఘటింపగలిగిరి. జర్మనీకైనను అంత్యజయములు కలిగి యుద్ధమాఖరగు సూచనలు కనపడుటలేదు.

## రష్యా విప్లవము

1917 సంవత్సరమున రష్యాజారు పడిపోయెను. ప్రజాప్రభుత్వము స్థాపితమయ్యెను. కొంతకాలమునుంచి రష్యాలో జారుయొక్క నిరంకుశత్వమును కూలద్రోసి ప్రజాప్రభుత్వమును స్థాపించవలెనను స్వతంత్రోద్యమము పనిచేయుచుండెను. దానిని అణచుటకు రష్యాచక్రవర్తి (జారు) నిర్బంధ ప్రయోగములుచేసినకొలదియు రహస్యసంఘములు స్థాపింపబడి ప్రభుత్వోద్యోగులును చక్రవర్తిసలహాదార్లును చంపబడుచుండిరి. 1881 వ సంవత్సరమున విప్లవకారులచే జారు రెండవ అలెగ్జాండరు హత్యగావింపబడెను. ఆయనతరువాత వచ్చిన మూడవ అలెగ్జాండరు క్రూరమగు నిర్బంధవిధానము ప్రయోగించి కొంతకాలము స్వతంత్రోద్యమము నరికట్టగలిగెను. తరువాత రాజ్యమునకువచ్చిన జారు రెండవ నికలసు కూడ నిర్బంధములనే ప్రయోగించెనుగాని, జపానుచే రష్యా ఓడిపోయినవెంటనే రష్యాలో విప్లవోద్యమము విజృంభించి నలుపైపులను తిరుగబడుట ప్రారంభమయ్యెను. జారు రెండవ నికలసు ప్రజలకు లొంగెను. 1906 వ సంవత్సరమున పన్నులమీదను, చట్టములుచేయుటకును అధికారముగల "డ్యూమా" యను ప్రజాప్రతినిధి సభను స్థాపించెను. ఇంతటితో ప్రజాప్రభుత్వము శాంతముగ నేర్పడునను ఆశలు కలిగెను. కాని కొలదికాలములోనే డ్యూమాకును, చక్రవర్తికిని అధి

ప్రాయభేదములు వృద్ధియయ్యెను. స్వతంత్రముగనున్నందున మొదటి డ్యూమానే చక్రవర్తి విచ్ఛిన్నము చేసెను. రెండవడ్యూమాను పిలచెను. అది కూడ జారుకు లొంగలేదు. దానినికూడ విచ్ఛిన్నముచేసెను. జారు రెండవ నికలసుకును ఆయనభార్యకును ముఖ్యసలహాదారుగ మిగుల అవినీతిపరు డును క్రూరుడునగు రాసపుటిన్ అను మతగురువు కలడు. ఆ మతగురువు నకు జారుభార్యమీద అత్యంతమైన పలుకుబడి యుండెను. జారు కేవలము తన భార్యచేత నడుపబడుచుండెను. జారుప్రభుత్వమువారు అతివాదులను నిర్బంధములలోనుంచియు, దేశభ్రష్టులను గావించియు ఎన్నికలుజరిపి, ప్రభుత్వోద్యోగులు ఎన్నికలలో జోక్యముకలిగించుకొని, మూడవడ్యూమాలో మితవాదులు, జోహుకుములు వచ్చునట్లుచేసిరి. కాని డ్యూమాలో శాంతి కలుగలేదు. జారుయొక్క నిరంకుశత్వము మితవాదులుకూడ సహించలేనిదిగ నుండెను. ఇంతలో ప్రపంచయుద్ధము వచ్చెను. రష్యాజారు మిత్రమండలిలో చేరి జర్మనీపై యుద్ధమును ప్రకటించెనుగాని ఆయనపై ప్రజలలో మితిలేని అసంతృప్తి ప్రబలియుండెను. ఆయనయును ఆయననాశ్రయించియున్న బృందమును నీతిరహితముగను క్రూరముగను ప్రవర్తించుచుండిరి. అజా గ్రత్తవలనను, కుట్రలవలనను, అక్రమప్రవర్తనలవలనను జారుయొక్క యుద్యోగస్థులు యుద్ధమును బాగుగ నడుపులేదు. సైనికులకు తగినదుస్తులు గాని ఆయుధములుగాని లేకుండగనే యుద్ధమునకు బంపిరి. గుంపులు గుంపు లుగ సైనికులు జర్మనులచేతిలో చనిపోయిరి. పాప మీ సైనికులు కొంత కాలము పశువులవలె నన్నికష్టములను సహించిరి. గాని బాధను సహించు టకు మితిగలదు. జారునందును ఆయనప్రభుత్వమునందును సైనికులలో కూడ నయిష్టము వృద్ధియగుచుండెను. అందనేకులు సేనలను వదలి పారి పోవుచుండిరి. 1916 వ సంవత్సరము డిశంబరు 29 వ తేదీన రాసపుటిను నొక విందుసమయమున రష్యనుప్రజలలో కొందరు హత్యగావించిరి. ప్రభు త్వముపై తిరుగుబాటులు ప్రారంభమయ్యెను. 1917 వ సంవత్సరము మార్చి నెలలో పెట్రోగ్రాడు నగరమున కూలిప్రజలు తిండికై అల్లరులుచేయ సాగిరి. యుద్ధమువలన ప్రజలు దుస్సహమైన క్షుద్బాధ ననుభవించుచుండిరి. విద్యాధికులు విద్యార్థులు మొదలగువారు విప్లవమును బోధించుచుండిరి. విప్లవ

ప్రయత్నములు వృద్ధియగుచుండెను. జారుయొక్క నిరంకుశత్వమువలన దేశమునకు మితిలేని కష్టములు కలుగుచున్నవని దేశమందంతటను బోధలు జరిగెను. జారు విప్లవమునణచుటకు తిరిగి నిర్బంధములను ప్రయోగించెను. "డ్యూమాను" (ప్రజాప్రతినిధిసభను) తీసివేసెను. కొందరు ప్రజానాయకులను ఖయిదుచేసెను. గాని విప్లవము చెలరేగెను. మార్చి 15 వ తేదీన జారు సింహాసనమును త్యజించెను. ల్వాఫు రాకొమారుని యాధిపత్యముక్రింద తాత్కాలికప్రభుత్వమొకటి యేర్పడెను. నూతనరాజ్యాంగవిధానమును తయారు చేయ యత్నించిరి. క్రొత్త జారుక్రింద మితవాదులప్రభుత్వముగల డ్యూమా స్థాపింపబడునని కొద్దికాల మగపడెను; గాని రష్యాప్రజలకు రాజులయందును ప్రభువులయందును జమీందార్లయందును ధనవంతులయందును విశ్వాసము పోయినది. మిత్రమండలివారి ప్రతినిధులు నూతనప్రభుత్వమును త్వరలో నేర్పరచుటకు సహాయముచేయుచుండిరి. మిత్రమండలివారియందును యుద్ధమునందును ప్రజలకు అయిష్టము కలిగెను. తాము పొందుచున్న మితిలేనిదారిద్ర్యము, అజ్ఞానము, దుఃఖమునుండి వెంటనే విముక్తిరావలెనని ప్రజలు కాంక్షించిరి. యుద్ధమువలన తమ కెట్టి లాభము లేదని గ్రహించిరి. జారు తన స్వలాభమునిమిత్త మిందులో ప్రవేశించెనని తలచిరి. క్రొత్త జారును నిలువబెట్టుట అసంభవమయ్యెను.

## ప్ర జా స్వా మి క ము

కావున రష్యాలో నొక సంపూర్ణప్రజాస్వామికము (**Republic**) స్థాపింపబడినది. దీనికిఅధ్యక్షుడగు కెరెన్స్కి మిత్రమండలియొక్క పలుకుబడిలో నుండెను. మిత్రమండలివారిసహాయమువలననే కెరెన్స్కికక్షి ప్రభుత్వమునకు వచ్చెనుగాని నిజముగ ప్రజలలో సంపూర్ణమగు పలుకుబడిగలకక్షి మరియొకటి గలదు. దానికి నాయకులు వేరుగా నుండిరి. వారు మిత్రమండలితో నేకీభవించినవారు గారు. మిత్రమండలివారికి రష్యాప్రజల నిజమైనభావములు తెలియకుండెను. ఎటులైనను రష్యాదేశము తమనుండి జారిపోకుండ నాపుటయు రష్యాచే తమపక్షమున యుద్ధముచేయించుటయు మిత్రమండలివారియుద్దేశ్యము. కెరెన్స్కిప్రభుత్వమువారు మిత్రమండలిపక్షమున యుద్ధమును సాగించిరి. జర్మనులు సముద్రమునుండియు భూమిమీదను 'రీగా'ను ముట్టడించిరి. ఆంగ్ల

పరాసులు సహాయముచేయజాలకపోయిరి. బాల్టికుసముద్రములోనికి జర్మను నౌకాదళముపై తమనౌకలను పంపుటకు భయపడిరి. నూతన రష్యాప్రజా స్వామ్యము జర్మనులచే పూర్తిగ నోడింపబడెను. రష్యాప్రజలు యుద్ధము సంపరింపజేయుటకు నిశ్చయించిరి.

## సో వి య టు

పెట్రోగ్రాడులో సోవియటు అను పేరుగల కార్మికులయొక్కయు సైనికులయొక్కయు సంఘమొకటి స్థాపించబడెను. రష్యాలోని సామాన్య ప్రజలలోను కార్మికులలోనుసాంఘికసాముదాయవాదము (Communism) బాగుగ వ్యాపించియుండెను. ఈ సోవియటుసంఘమువారు వివిధదేశములలోని సాంఘిక సాముదాయవాదుల సమావేశమొకటి స్టాకుహోములో కూర్చుటకు ప్రయత్నించిరి. ఇందుమూలమున వివిధదేశములలోని ప్రజాప్రతినిధులు సమావేశమై న్యాయమైనసంధిచేసికొనుటకును, ప్రజలకు పీడాకరముగనున్న యుద్ధమును ముగింపుచేయుటకును యత్నించెదమని వీరు తలచిరి. అపుడు జర్మనీ ఆస్ట్రియాలలోగూడ యుద్ధము ప్రజలకు చాల భారముగ తోచెను. అక్కడ గూడ సాంఘికసాముదాయవాదము ప్రజలలో వ్యాపించియుండెను. ఇట్టి సమావేశము స్టాకుహోములో జరుగనిచ్చినచో బహుశః 1917వ సంవత్సరముననే జర్మనీ, ఆస్ట్రియాలలోగూడ విప్లవములుకలిగి ప్రజాస్వామికము లేర్పడి యుద్ధ మంతరించియుండవచ్చును. కెరెన్స్కి ప్రజాభిప్రాయమును గుర్తించి స్టాకుహోము సమావేశమున కిష్టపడెను. గాని తనకు ప్రాపుగనున్న మిత్ర మండలిప్రభుత్వములకు వ్రాసెను. వారు సమ్మతించలేదు. స్టాకుహోముసమావేశము జరుగలేదు. జులై నెలలో తిరిగి మిత్రమండలివారికోరికపై కెరెన్స్కి జర్మనులతో పోరాడెను. తిరిగి రష్యాసేనలు చాలగ హతులైరి. రష్యా ఓడిపోయెను.

## బోల్షివికుప్రభుత్వస్థాపనము

కెరెన్స్కి మిత్రమండలివారిలాభముకొరకు వృధగ రష్యనులను జర్మనులకు బలియిచ్చుచున్నాడనుభావము ప్రజలలో కలిగెను. రష్యాప్రజలు కెరెన్స్కిప్రభుత్వముపై తిరుగబడిరి. సోవియటులో జేరిరి. రష్యావారి సేన

లలోకూడ తిరుగబాటులు కలిగెను. 1917 వ సంవత్సరము నవంబరు 7 వ తేదీన కెరెన్స్కీ యధ్యక్షతక్రింద నుండిన ప్రజాస్వామ్యము పడద్రోయబడెను. బోల్షివికు సాంఘికసాముదాయ సిద్ధాంతముల నవలంబించిన సోవియటు ప్రజాస్వామ్యము(Soviet Republic) స్థాపింపబడెను. ఈ ప్రజాస్వామ్యమునకు బోల్షివికుపక్షమునకు నాయకుడగు లెనిన్ మహాశయుడు అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. బోల్షివికు సోవియటువారు వెంటనే మిత్రమండలినుండి చీలిపోయిరి. స్వతంత్రముగ జర్మనీతో సంధిచేసికొనిరి. జర్మనీ బోల్షివికులనుండి ఎట్టినష్టపరిహారమును కోరలేదు. కొంతకాలమునకు మిత్రమండలివారు కెరెన్స్కీపక్షమున రష్యాప్రజలలో నొకకక్షిని బయలుదేరదీయయత్నించియు అక్కడక్కడ కొన్ని తిరుగబాటులుచేయించియు, బోల్షివికుప్రభుత్వమున కడ్డుకలుగజేయ యత్నించిరి, గాని కెరెన్స్కీపక్షమువారు బోల్షివికులచే నోడింపబడిరి. రష్యాలో బహుస్వల్పసంఖ్యాకులు తప్ప మిగిలినవారందరును బోల్షివికుప్రభుత్వ మంగీకరించిరి. రష్యాదేశము యుద్ధరంగమునుండి అస్పృశ్యమయ్యెను. మిత్రమండలివారు మిగుల బలహీనులైరి. జర్మనుపక్షము మిగుల బలవంతమయ్యెను.

## (5)

## అమెరికా యుద్ధములో దిగుట

ఇట్టిస్థితిలో అమెరికా సంయుక్తరాష్ట్రములు యుద్ధములోకిలాగబడెను. జర్మనుచక్రవర్తి దురాశాపరుడై తన పశుబలముచే పూర్వకాలపు హిరణ్యాక్షునివలె భూమినంతను చాపగచుట్టుటకు ప్రయత్నించుచున్నాడనియు, తాము మాత్రము స్వల్పజాతుల సంరక్షణకొరకును ధర్మసంస్థాపనకొరకునుయుద్ధములోనికి దిగినామనియు మిత్రమండలిపక్షమున అమెరికాలో ప్రచారము బాగుగ చేయబడి అమెరికనులసానుభూతి మిత్రమండలిపక్షమున పొందుటకు ప్రథమమునుండియు యత్నింపబడినది. గాని అమెరికావారు తటస్థముగనుండి యుద్ధమును జాగ్రత్తగవీక్షించుచుండిరి. 1914వ సంవత్సరముననే తానుమధ్యవర్తిగనుండి సంధిచేసెదనని విల్సనుసభాపతి యూరపుఖండపుప్రభుత్వములకు తంతినిచ్చెను. గాని ఎవరును లక్ష్యపెట్టలేదు. మొదటినుండియు నమెరికావారు యూరపువ్యవహారములలోను కుట్రలలోను ప్రవేశించకుండుటయే సాంప్ర

దాయసిద్ధమగు నాచారమైయున్నది. అట్టిపద్ధతినే యిపుడుకూడ నవలంబించిరి. గాని యుద్ధముజరుగుచున్నకాలదియు మిత్రమండలివారిలో ముఖ్యముగ నాంగ్లేయుల విదేశపక్షము నాశనముచేయుటకై జర్మనులు ప్రథమమున సముద్రములమీద సంచరించెడి సరుకులపడవలను, పిమ్మట మనుష్యులు ప్రయాణముచేయుచున్న పడవలను ముంచుచుండిరి. 1915 సంవత్సరము మే నెలలో ల్యూసిటానియా యను ప్రయాణీకుల పడవను ముంచినపుడు అందులోని కొంద రమెరికనుప్రయాణీకులు మరణించిరి. దీని నమెరికను ప్రభుత్వము ఖండించెను. జర్మనులు లక్ష్యపెట్టలేదు. 1916వ సంవత్సరమంతయు జర్మనుజలాంతర్గాములు విశేషముగ ఆంగ్ల నౌకలను మాత్రము ముంచుచుండెను. 1917 వ సంవత్సరము జనవరినెలలో తాము ఆంగ్లేయదేశముయొక్కయు ఫరాసుదేశముయొక్కయు రేవుల నన్నిటిని ముట్టడించుచున్నామనియు తటస్థదేశములవారినౌక లేమియు నిచట నుండగూడదనియు, ఉన్నచో వాటినిగూడ ముంచివేతుమనియు జర్మను కైజరు ప్రకటించెను.

అంతవరకు ఆంగ్లేయనౌకలు సముద్రములమీద తిరుగుట తగ్గిపోయెను. గాని అమెరికా మొదలగు తటస్థదేశములవారు తమనౌకలలో సరుకులనుపంపి యూరపులో కలహించుచున్న దేశములవారి కమ్మి చాల లాభమును పొందుచుండిరి. ఆంగ్లేయ ఫరాసుదేశముల కెచటనుండియు ఎట్టి సరుకులను రాకుండ ఎండగట్టవలెనని జర్మను లీ ప్రకటనమును గావించిరి. 1917 సంవత్సరము ఏప్రియలు నెల 6వతేదీన అమెరికాప్రభుత్వమువారు జర్మనీపై యుద్ధమును ప్రకటించి మిత్రమండలిపక్షమున చేరిరి. గావున 1917 వ సంవత్సరమున జర్మనీకి శత్రువగు రష్యా యుద్ధమును వదలిపోగ మరియొక మిగుల బలవంతుడగు క్రొత్తశత్రువు (అమెరికా) జర్మనీపై యుద్ధమును ప్రకటించి యూరపునకు తెచ్చుటకు మంచి సేనలను, తగిన యుద్ధపరికరములను తయారుచేసికొనుచుండెను. మిత్రమండలికి యుద్ధముసాగించుటకు అమెరికా కోట్లకొలది రూప్యముల ఋణమునిచ్చెను.

## జర్మను జయములు

అమెరికావారిసైన్యములు రణరంగము చేరులోపల మిత్రమండలి నోడించి యుద్ధము నంతరింపజేయవలెనని జర్మనులు విశ్వప్రయత్నములు

చేసిరి. ఇటలీవారిపైనను ఆంగ్లపరాసులపైనను జర్మనులు 1917-18 సంవత్సరములలో గొప్ప జయములనందిరి. గాని వాటివలన యుద్ధమంతరింపలేదు. ఇంతలో 1918 వ సంవత్సరమధ్యభాగమున అమెరికానుండి లక్షమందిసైనికులు దిగిరి. ఆంగ్లేయులును క్రొత్తసైన్యములను తెచ్చుకొనిరి.

## (6)
## విల్సను సభాపతి

అమెరికా యుద్ధములోనికి దిగినతరువాత నే యుద్దేశ్యములతో తామీ యుద్ధమున ప్రవేశించిరో తెలియపరచుచు అమెరికా యధ్యక్షుడగు విల్సను సభాపతి గొప్ప ధర్మసందేశములతో గూడిన సుప్రసిద్ధ ప్రకటనమును గావించెను. అది యన్నిజాతులదృష్టి నాకర్షించెను. అందరికిని ఆశలు కలిగించెను. "జాతులమధ్య న్యాయము వర్ధిల్లవలెను. యుద్ధము అంతరించిపోయి ధర్మము స్థాపింపబడవలెను. ఇంతటినుంచియైన మానవజాతులు శాంతముగను స్నేహముగను నివసించుటకు నేర్చుకొనవలెను. జాతులమధ్య రహస్యపుటొడంబడికలు గూడదు. ప్రతిజాతియు తన యదృష్టమును తన యభివృద్ధిని తనకుకావలసిన ప్రభుత్వపద్ధతిని స్వయముగ నిర్ణయించుకొనవలెను. పశుబలము (సైనికబలము) నశింపవలెను. సముద్రములమీద ప్రయాణముచేయుటకు మానవకోటికంతకును స్వేచ్ఛయుండవలెను." అని ఆయన నుడివిన భావములు చీకటిలో చిటాలున చంద్రోదయమైనట్లుగ వివిధజాతులహృదయములలో ఆశాకిరణములను ప్రసరింపజేసెను. ఇట్టి మాటలు ప్రపంచములోకెల్ల బలవంతుడగు అమెరికాసభాపతినోట వచ్చుట మానవకోటియొక్క యదృష్టమని తలచసాగిరి. విల్సను సభాపతి సత్యయుగమును ప్రారంభింపజేయబోవుచున్నాడని ఆశించుచుండిరి. ఇకముందెట్టి యుద్ధములు జరుగకుండ జాతులమధ్య న్యాయమును ధర్మమును పరిష్కరించుటకు అంతర్జాతీయసమితి యొకటి యేర్పడవలెనని కూడ నాయన చెప్పెను. జర్మనుల దురాశను, రాజ్యకాంక్షను, సైనికబలముయొక్క దుష్టత్వమును, శిక్షించుటకు మాత్రమే తాము యుద్ధముచేయబోవుచున్నామనియు, జర్మనీమీద తమ కెట్టిద్వేషము లేదనియు తాము యుద్ధములో గెలిచినను జర్మను

జాతికిని తక్కినజాతులతోపాటు న్యాయమునే కలుగజేసెదమనియు, నాయన శలవిచ్చెను. విల్సను ప్రపంచము నుద్ధరించుటకు పుట్టిన యవతారమూర్తి యని యూరపుఖండములోను ఆశియాఖండములోను భావించసాగిరి.

## పదునాలుగు సూత్రములు

1918 సంవత్సరము జనవరి నెల 8 వ తేదీన అమెరికా కాంగ్రెసు సభలో (పార్లమెంటులో) విల్సను సభాపతి యీ క్రింది పదునాలుగుసూత్రములను ప్రతిపాదించెను : (1) వివిధజాతులమధ్య జరుగు ఒడంబడికలు బహిరంగముగ జరుగవలెనుగాని వానిలో నెట్టి రహస్యము లుండగూడదు. (2) శాంతిసమయములోను యుద్ధసమయములోను కూడ నన్ని సముద్రములమీదను అన్నిజాతులకును ప్రయాణముచేయుటకు హక్కుండవలయును. (3) అన్నిజాతులకును సమానమైన స్వాతంత్ర్యములును వర్తకపుహక్కులు నుండవలెను. (4) ప్రతిజాతియు దేశసురక్షితమునకుమాత్రము చాలిన సేనల నుంచుకొని తక్కిన సేనలనన్నిటిని తీసివేయవలెను. (5) వలసరాజ్యముల ననుగురించినహక్కులు న్యాయముగను ఆ యా ప్రజల యోగక్షేమముల ననుసరించియు పరిష్కరింపబడవలెను. (6) జర్మనీవారు రష్యాలో నాక్రమించుకొనిన ప్రదేశమును వదలివేయవలెను. రష్యాప్రజల కన్నిజాతుల వారును సహాయముచేయవలెను. (7) బెల్జియముదేశమును జర్మనువారు వదలి పోవలెను. (8) ఫ్రాన్సుదేశమున జర్మనులస్వాధీనమందున్న ప్రదేశమును జర్మనులు వదలివేయవలెను. ఆల్సేసు, లోరైన్ రాష్ట్రములవిషయమున ఫరాసువారికి జరిగిన అన్యాయమును జర్మనులు సరిచేయవలెను. (9) జాతీయతనుబట్టి ఇటలీదేశపుసరిహద్దులు నిర్ణయించవలెను. (10) ఆస్ట్రియాకు లోబడినజాతులకు ప్రజాపాలన మివ్వవలెను. (11) బాల్కన్‌రాష్ట్రములను ఇతరదేశములవారు వదలి ఖాళీచేయవలెను. సర్బియాకు సముద్రపురేవు నివ్వవలెను. బాల్కన్‌రాష్ట్రములు స్వతంత్రముగ నుండవలెను. (12) తురుష్కులక్రిందనున్న జాతులన్నియు స్వతంత్రమును పొందవలెను. డార్డనల్సు లోనికి అన్నిజాతులవారును పోవుటకు వీలుండవలెను. తురుష్కులు కాపురమున్నప్రదేశములలో తురుష్కులప్రభుత్వమే యుండవలెను. (13) పోలండు స్వతంత్రమును పొందవలెను. (14) పెద్దరాష్ట్రములకును చిన్నరాష్ట్రముల

కును స్వతంత్రము స్థిరముగ నుండవలెను. ఇందుకొరకొక అంతర్జాతీయ సమితి (League of Nations) స్థాపనకావలెను. ఇవి ఆయన ఏర్పరచిన ప్రఖ్యాతివంతమగు పదునాలుగుసూత్రములు. ఈ సూత్రముల సమలులో బెట్టుటకు తాము యుద్ధములో దిగుచున్నామని విల్సనుసభాపతి చెప్పెను. వీటిని యొప్పుకొనినచో సంధిచేసికొనుట కెట్టి యభ్యంతరము లేదనియు నుడివెను.

## నిష్పక్షపాతమగు సంధి జరుగవలెను

1918 వ సంవత్సరము సెప్టెంబరునెల 27 వ తేదీన "సంధిజరుగు నపుడే అంతర్జాతీయసమితి నేర్పరచవలెను. ఈలోపున నేర్పరచుటకు వీలు లేదు. యుద్ధసమయమున నేర్పరచినచో జర్మనీని వదలిపెట్టవలసివచ్చును. జర్మనీనికూడ నందులో జేర్చుకొనుట కవకాశములేనిసమయమున దాని నేర్పరచినచో నది యొక మిత్రమండలియే యగును. ఇందువలన దాని యుద్దేశ్యము చెడిపోవును. మన మన్నిజాతులకును సమానముగ న్యాయము గలుగజేయుటయే యుద్దేశ్యముగాని మనపక్షమున బోరాడినవారికిని మనకు వ్యతిరేకముగ బోరాడినవారికిని మధ్యకూడ పక్షపాతము చూపగూడదు." అని ఆయన చెప్పెను. ఇట్టి షరతులతో యుద్ధముముగియుటకు జర్మనీలో గాని, ఇంగ్లాండులోగాని, ఫ్రాన్సులోగాని ఎవరికిని యభ్యంతరము లుండ కూడదు. మిత్రమండలివారిమంత్రులుకూడ స్వల్పరాష్ట్రముల సంరక్షణకొరకును స్వయంనిర్ణయధర్మసంస్థాపనకొరకును, మానవకోటియొక్క స్వతంత్రముకొరకును, దురాశాప్రేరితులయిన జర్మనుపశుబలముమీద యుద్ధము చేయుచున్నామని యుపన్యసించుచుండిరి.

## (7)

## జర్మనీ, ఆస్ట్రియాదేశముల ప్రజలు యుద్ధమునంతరింపజేయగోరుట

జర్మనీ, ఆస్ట్రియాదేశములలో దక్కిన దేశములోవలెనే ప్రజలు యుద్ధముతో విసుగుజెందియుండిరి. ఎచట జూచినను అశాంతి సంక్షోభము చెలరేగెను. అమెరికా సంయుక్తరాష్ట్రములసభాపతి నుడివిన ధర్మసూత్ర

ములనుబట్టి న్యాయమైన సంధిజేసికొనుటయే యుక్తమనియు, యుద్ధము వలన ప్రజల కెట్టి లాభము లేదనియు నను అభిప్రాయములు వ్యాపించెను. యుద్ధముగూడదను సాంఘిక సాముదాయవాదులును విప్లవకారులును ప్రబల మగుచుండిరి. తగినవారు క్రొత్తసైనికులుగజేరుట కష్టతరమయ్యెను. 1918వ సంవత్సరము జూన్‌నెలలో ఆస్ట్రియావారు ఇటలీవారిని ముట్టడించి యోడి పోయిరి. ఆనెలలోనే పరాసువారు మారన్‌నదీప్రాంతమున జర్మనులను ముట్టడించిరి. జులై 18 వ తేదీన అమెరికావారు జర్మనులనోడించి వెనుకకు నెట్టిరి. ఆగస్టునెలలో మిత్రమండలివారిసేనలు జర్మనులను అమీన్సునుండి వెనుకకునెట్టిరి. అక్టోబరునెలలో పరాసుదేశములోను బెల్జియములోను ప్రతి చోటను జర్మనులోడిపోవుచుండిరి. ప్రతిదినమును పత్రికలలో జర్మనుల అపజయములను జదివి చాలమంది యాంగ్లేయులే నమ్మజాలకుండిరి. అంత త్వరితముగ జర్మను లోడిపోయిరి. సెప్టెంబరునెలలోనే మిత్రమండలివారు బల్గేరియాపై దండెత్తి యాక్రమించగ, బల్గేరియా మిత్రమండలికి లోబడి సంధిచేసికొనుట కొడంబడెను. 1918 వ సంవత్సరము అక్టోబరునెల 30 వ తేదీన తురుష్కప్రభుత్వమువారు మిత్రమండలికి లోబడి మిత్రమండలి నిర్ణ యించిన షరతులకెల్ల నొప్పుకొని ముద్రాసు (Mudros) వద్ద తాత్కాలి కపుసంధిజేసికొనిరి.

## జర్మనీ లోబడుట

నవంబరు నాల్గవతేదీన ఆస్ట్రియావారు యుద్ధము మానివేసి మిత్ర మండలికి లోబడిరి. నవంబరు నెల 5వ తేదీన మిత్రమండలివారు పదు నాలుగుసూత్రములప్రకారము సంధిచేసికొనెదమని జర్మనుప్రభుత్వమునకు దెలియజేసిరి. జర్మను కెయిజరు రాజ్యమును వదలిపోయినచో న్యాయమైన సంధి జరుగునని మిత్రమండలిమంత్రులు సూచించిరి. కెయిజరు మరల సేన లను బాగుగ వోగుజేసి యుద్ధమును జయప్రదముగ నడపుటకే యత్నించెను. తన ప్రజాప్రతినిధిసభను పిలచెను. జర్మను ప్రజాప్రతినిధిసభవారు యుద్ధ ముతో విసిగియున్నామనియు, పదునాలుగుసూత్రములప్రకారము సంధిజేసి కొనెదమనియు జెప్పిరి. మిత్రమండలివలన మోసపోవలదని కెయిజరు చెప్పెను. కెయిజరుమాటలు జర్మనుప్రజలు వినలేదు. కెయిజరు జర్మను

సింహాసనమును త్యజించి కుటుంబముతోగూడ హాలండుదేశమునకుపోయి నివసించెను. జర్మనీలో వెంటనే రాజులేని ప్రజాస్వామికము స్థాపించబడెను. నవంబరు 11 వ తేదీన జర్మనుప్రజాప్రభుత్వమువారు యుద్ధమును మానివేసి మిత్రమండలవారికి లోబడిరి. ప్రపంచమునంతను నాలుగుసంవత్సరముల మూడునెలలు మిగుల బాధించిన ఘోరయుద్ధ మింతటితో ముగిసినది.

## మూడు గొప్ప కిరీటములు కూలెను

ఈ యుద్ధముయొక్క ఫలితముగ ముగ్గురు గొప్ప చక్రవర్తులకిరీటములు కూలిపోయెను. రష్యాచక్రవర్తి జారు, జర్మనుచక్రవర్తి కెయిజరు, ఆస్ట్రియాచక్రవర్తి కారలు సింహాసనములను త్యజించిరి. రష్యా, జర్మను, ఆస్ట్రియా సామ్రాజ్యములు నాశనమై, ఆ దేశములలో సంపూర్ణమగు ప్రజాస్వామికము లేర్పడెను. ముద్రాసు తాత్కాలికపుసంధివలన తురుష్కము అరబుదేశములపై సామ్రాజ్యాధికారము వదలుకొనినది. తురుష్కసుల్తాను క్రింద తురుష్కదేశము మాత్రము మిగిలినది.



# తురుష్క ప్రజాస్వామికము

## 4 అంధకారము

### (1)

### సామ్రాజ్యనాశనము పూర్తి అయ్యెను

1918 వ సంవత్సరము అక్టోబరునెల 30 వ తేదీన జరిగిన ముద్రాసు తాత్కాలికపు సంధివలన అరబుదేశములన్నియు మిత్రమండలికి స్వాధీనపర్చబడినవి. ఆంగ్లేయులస్వాధీనమందుండియున్న ఈజిప్టుదేశముపైనను, సైప్రసుద్వీపముపైనను, ఫ్రెంచివారిస్వాధీనమందున్న ట్యునిసు, మొరాకో దేశములపైనను, ఇటలీవారిస్వాధీనమందున్న ట్రిపోలీదేశముపైనను, తురుష్కసుల్తానుకుగల నామమాత్రావశిష్టమగు అధికారము(Suzereinty) కూడ తీసివేయబడెను. ఇంతటితో తురుష్కదేశముక్రిందనున్న సామ్రాజ్యముయొక్క నాశనము పూర్తియయ్యెను. యుద్ధకాలమున అరబుదేశములలో తురుష్కప్రభుత్వముపై తిరుగబాటులను పురిగొల్పి మిత్రమండలికి విశేషముగ సహాయముచేసినందున, మక్కా షెరీఫ్ హుస్సేనును అరేబియా దేశమునకు రాజుగను గావించిరి. ఆయనకుమాళ్ళగు అమీరు పైసలు, అమీరు అబ్దుల్లాలను మెసపొటేమియా (ఇరాకు), ట్రాన్సుజార్డను దేశములకు రాజులుగ జేసి వారికి సంరక్షకులుగ నాంగ్లేయులు తమ యధికారమును స్థాపించుకొనిరి.

పాలెస్తైన దేశమును యూదులకు మాతృదేశముగ నిర్ణయించి దాని నాంగ్లపాలనమున చేర్చికొనిరి. సిరియాపై ఫ్రెంచిపాలన మేర్పరుపబడెను. మెసపొటేమియా, ట్రాన్సుజార్డను,పాలెస్తైన్ దేశములలోని ప్రజలు ఆంగ్లేయులును, సిరియాదేశములోని ప్రజలను ఫ్రెంచివారును బాగుచేసెదమని కరారుచేసి, యా దేశములను తురుష్కమునుండి విడదీసి, అంతర్జాతీయ సమితి (League of Nations) మూలమున నా దేశములను స్వాధీనము

చేసికొనిరి. ఇటుల స్వాధీనపరచుకొనుటకు మాండేటులని పేరు. ఈ మాండేటులను గూర్చి రాబోవుఅధ్యాయములందు విపరముగ తెలిపెదము.

## మాతృదేశమైనా దక్కునా ?

ఇక చాలభాగ మాసియాఖండములోను కొద్దిగ యూరపుఖండములోను గల తురుష్కదేశము మాత్రము తురుష్కప్రభుత్వమునకు మిగిలినది. వారి మాతృదేశమైనను స్వతంత్రముగ తురుష్కులకు దక్కునా? తురుష్కదేశములో ఆర్మీనియనులు, కర్డులు కాపురమున్న ప్రాంతములనుకూడ విడదీసి తమక్రిందికిచేర్చుకొనవలెనని మిత్రమండలివారి సంకల్పము. తురుష్కరాజధానియగు కాన్స్టాంటినోపిలును, దానిచుట్టుపట్లనున్న ఏడ్రియానోపిలు మొదలైన ప్రదేశములనుకూడ లాగుకొని తురుష్కులను యూరపుఖండము నుండి పూర్తిగ వెడలగొట్టవలెననికూడ మిత్రమండలివారి యుద్దేశ్యము. యుద్ధము ముగిసినను తురుష్కరాజధానిలో మిత్రమండలివారిసేన లుంచబడెను. మధ్యధరాసముద్రముమీదనున్న తురుష్కరేవుపట్టణములలోకూడ నాంగ్లేయసేనలుండెను. మోసలురాష్ట్రము మాంగ్లేయులయధీనముందుండెను. సైలీషియారాష్ట్రము డార్డనల్సుజలసంధి, మిత్రమండలియొక్కస్వాధీనమందుంచుకొనబడెను. నల్లసముద్రము మీదనున్న బాటం, బాకు రేవులలో మిత్రమండలివారినావికాదళ ముండెను. పైగ ముద్రాసు తాత్కాలికసంధివలన తురుష్కసేనలన్నియు విచ్ఛిన్నముచేయబడి తురుష్కుల యుద్ధనావలు, ఆయుధములు, మందుగుండుసామానులు, తంతి (టెలిగ్రాం) పరుసలు మిత్రమండలికి వశముచేయబడెను. తురుష్కదేశపుసరిహద్దులను సంరక్షించుటకును దేశములో శాంతిని కాపాడుటకును మాత్రము కొద్దిసైన్యమును తురుష్కప్రభుత్వమువా రుంచుకొనుటకు మిత్రమండలి యనుమతినిచ్చిరి. దేశములోని బొగ్గు, నూనె, కిరసనాయిలు, నావికాద్రవ్యములు విదేశములకు పంపగూడదు. మిత్రమండలివారి యాధీనముందుంచవలెను.

1919 సంవత్సరము జనవరినెల 18 వ తేదీని యుద్ధములో ప్రవేశించియుండిన వివిధజాతులమధ్యను సంధిగావించుకొనుటకు పారిసుపట్టణమున సంధిసమావేశము ప్రారంభమయ్యెను. ఆ సమావేశములో తమవిషయములను చెప్పుకొని విల్సను సభాపతిని దర్శించి తక్కిన దేశముల

రాజ్యము తమ కేమియు లేకుండపోయినను సరే, తమ మాతృదేశమగు తురుష్కముయొక్క స్వతంత్రతనైన దక్కించుకొనవలెనని తురుష్కప్రతినిధులు పారిసునగరమునకు వెళ్ళిరి. గాని వీరి నాదరించువారును, వీరి మాటలను ఆలకించువారును అక్కడ కనపడక మరలివచ్చిరి. మిత్రమండలిదేశములవారికి జర్మనీ, ఆస్ట్రియా మొదలగు దేశములతోగల వ్యవహారములు, యుద్ధపరిహారసమస్యలు, ఆంగ్ల ఫరాసులసామ్రాజ్యములవిషయములు పరిష్కరించుకొనుటతోనే సుమారు ఒకసంవత్సరముపైగా కాలము గడచెను. తురుష్కదేశమునుగూర్చి చర్చించి పరిష్కరించుటకు మిత్రమండలికి తొందర యేమియు నగుపడుటలేదు. తురుష్కమంతయు మిత్రమండలివారి యధీనమున నున్నది.

## తురుష్కదేశమందు నిరాశ

తురుష్కదేశమందంతటను దుఃఖపూరితమగు నిరాశ గలిగెను. ఎనిమిదిసంవత్సరములనుండియు నెడతెగని యుద్ధములు జరిగెను. అన్ని యుద్ధములలోను తురుష్కము పాశ్చాత్యజాతులచే నోడిపోవుచుండెను. లక్షలకొలది పురుషులు మరణించిరి. కొన్ని లక్షలమందికి గాయములు తగిలెను. ట్రిపోలి, బాల్కన్‌రాష్ట్రములు, అరబుదేశములు శత్రువులకు వశమయ్యెను. సుప్రసిద్ధులగు అట్టోమాను సుల్తానులచే సంపాదించబడి ఆరుశతాబ్దములు ప్రకాశించిన అట్టోమానుసామ్రాజ్యభానుడు అస్తమించెను. మాతృదేశస్వతంత్రతనైన దక్కించుకొను మార్గము గానరాదయ్యెను. గృహములలో దుఃఖము. దేశములో పేదరికము మిగిలెను. భర్తలను పుత్రులను గోల్పోయిన స్త్రీల సంఖ్య అధికముగ నుండెను. యుద్ధములను నడిపిన యౌవన తురుష్కకక్షి యొక్క నాయకులగు ఎన్వరుపాషా, తలాత్‌పాషా, జమాల్‌పాషాలు దేశము విడిచి పారిపోయిరి. రాజధానిలోనున్న తురుష్కసుల్తాను దేశస్వతంత్రతను సంరక్షించలేక నిస్సహాయుడై మిత్రమండలియధీనములో కీలుబొమ్మగ నుండెను. తురుష్కులకు అంతయు అంధకారమయముగ నుండెను. దయామయుడగు అల్లా తప్ప చూపుమేరలో శరణ్య మగుపడుటలేదు,

## (2)

## ఇటలీవారు అడేలియారాష్ట్రముపై దండెత్తుట

ఇట్టిస్థితిలో 1919 సంవత్సరము ఏప్రియలునెల 29 వ తేదీని ఇటలీ సైన్యములు తురుష్కదేశములోని అడేలియారాష్ట్రముపై దండెత్తివచ్చి స్వాధీనమొనరించుకొనెను. స్మర్నానుకూడ స్వాధీనము జేసికొందుమని బెదరించుచుండిరి. ప్రపంచయుద్ధము జరుగుచున్నకాలములో మిత్రమండలిలో చేరిన దేశములమధ్య తురుష్కసామ్రాజ్యమును పంపిణీచేసికొను విషయమున వివిధములగు రహస్యపుటొడంబడికలు జరిగియుండెను. వానిలో 1915 సంవత్సరము ఏప్రిలునెల 26 వ తేదీని జరిగిన లండనుఒడంబడిక ననుసరించి అడేలియారాష్ట్రము యుద్ధము ముగియగనే ఇటలీవారి కిచ్చునటుల ఆంగ్లేయ, పరాసు, రష్యా ప్రభుత్వములవారు కరారుచేసి ఇటలీని యుద్ధములో తమపైపున చేరునటుల గావించిరి. యుద్ధము ముగిసినను ఆంగ్ల పరాసులు ఇటలీకి అడేలియారాష్ట్రమును అప్పగింతచేయలేదు. పారిసు సంధిసమావేశములో ఇటలీకిని మిగతామిత్రమండలిదేశములకును 'ఫ్యూము' ను ఇటలీకిచ్చువిషయమున నభిప్రాయభేదములు కలిగి, ఇటలీప్రతినిధియగు సీనరు ఆర్లెండో సంధిసమావేశమును విడిచి లేచిపోయెను. మరియు 1917 సంవత్సరము 17 వ ఏప్రిలు తేదీని సెంటు జీనుడిమూరినుపట్ట జరిగిన రహస్యపుటొడంబడికప్రకారము ఇంగ్లాండు, ఫ్రాన్సుప్రభుత్వములవారు స్మర్నాప్రాంతమునంతనుకూడ ఇటలీకి స్వాధీనముచేయుట కొప్పుకొనియుండిరి. ఈ యొడంబడిక రష్యాచక్రవర్తివలన ఖాయపరుపబడవలసియుండెను. యుద్ధము ముగియకమునుపే 1917 సంవత్సరములోనే రష్యా జారు రాజ్యభ్రష్టుడు గావింపబడి, రష్యాదేశమునందు బోల్షివికుప్రజాప్రభుత్వము స్థాపింపబడెను. రష్యాజారువలన ఖాయపరుపబడలేదు గనుక స్మర్నాను స్వాధీనమొనరించుకొనుటకు ఇటలీకి హక్కులేదని ఆంగ్లేయ పరాసు ప్రభుత్వములు చెప్పెను. ఎటులైన స్మర్నానుకూడ మ్రింగవలెనని ఇటలీయొక్క సంకల్పమైయుండెను. మిగిలిన తురుష్కసామ్రాజ్యమునంతను చాలవరకాంగ్లేయులును, కొంతవరకు పరాసువారును ఏదోయొకవంకచే స్వాధీనమొనరించుకొని

యచట వారియధికారమును, వర్తకాభివృద్ధిని ద్రవ్యలాభములను పొందుచుం డగ, యుద్ధములో జర్మనీపైపును వసలి ఆంగ్లేయులతోను పరాసులతోను చేరి జయమునకు తోడ్పడిన ఇటలీ తురుష్క ప్రదేశములోని అడేలియా రాష్ట్రములో తృప్తిచెందక, స్మర్నారాష్ట్రమునుకూడ కావలెనని కోరుట స్వభావసిద్ధమై యుండెను. కావున ఆంగ్లేయులతోను పరాసులతోను సంప్ర తించకుండగనే ఇటలీప్రభుత్వము అడేలియారాష్ట్రమును స్వాధీనపర్చుకొనిరి. స్మర్నాలో జొరబడుటకు సిద్ధముగనుండిరి.

## కాలయాపన

యుద్ధకాలమున తురుష్క సామ్రాజ్యమును పంచుకొనువిషయమున ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, రష్యాదేశములమధ్య జరిగిన వివిధములగు రహస్యపుటొడంబడికలు పరస్పరవిరుద్ధములుగనుండి అమలుజరుపుటకు సాధ్యముకానందునను, ఆ యొడంబడికలప్రకారమైనను నడచుకొనుట కిష్టములేక నింక నెక్కుడుభాగములు సంపాదించవలెనని మిత్రమండలిలోని కొందరియుద్దేశ్యము గనుకను, తురుష్క వ్యవహారములపరిష్కారవిషయ మున చాల కాలయాపన జరుగుటకు మరియొక కారణమయ్యెను.

## మొదటి యొడంబడిక

1915 సంవత్సరము మార్చినెల 18 వ తేదీని ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యాలమధ్య జరిగిన రహస్యపుటొడంబడికప్రకారము తురుష్క రాజధాని యగు కాన్‌స్టాంటినోపిలును, బాస్ఫరసుజలసంధియొక్క రెండుతీరములను, మర్మరాసముద్రముయొక్కయు డార్డనల్సుజలసంధియొక్కయు యూరపుఖండ తీరములనున్న ప్రదేశములను, థ్రేసురాష్ట్రములోని దక్షిణభాగమును రష్యా చక్రవర్తి కిచ్చునటుల ఏర్పాటుజరిగెను. రష్యాచక్రవర్తులకు ఈ ప్రాంతముల నన్నిటిని మ్రింగి తురుష్కరాజధానిని స్వాధీనమొనరించుకొనవలెనను కోరిక చిరకాలమునుండియు నుండెను. కాని రష్యావారు తురుష్కరాజధానిని మ్రింగి యా చుట్టుపట్లనున్న సముద్రములమీద నధికారమును పొందినచో తమక్రిందనున్న హిందూదేశముమీదకువచ్చిపడుదురేమోనను భయమువలన నందు కాంగ్లేయు లడ్డుతగులుచుండిరి. ఇపుడు రష్యాయొక్క భయ మంతగ

లేదు. జర్మనీని పడగొట్టుటకు రష్యాయొక్క సహాయము కావలెను. కావున రష్యావారుకోరిన వరములనెల్ల నిచ్చి ఆంగ్లేయులును పరాసువారును రష్యాను యుద్ధములో తమవైపున చేర్చుకొనిరి. రష్యాకు కాన్‌స్టాంటి నోపిలునిచ్చినందుకు బదులుగ (ఇరాను) పర్షియా దేశములో తటస్థప్రదే శమునంతను (Neutral zone) ఆంగ్లేయులపలుకుబడిక్రిందికి చేర్చుకొను టకు రష్యావారు సమ్మతించిరి. 1907 వ సంవత్సరములో నాంగ్లేయులకును రష్యావారికిని పర్షియా(ఇరాను)నుగూర్చి యొక యొడంబడిక జరిగియుండెను. పర్షియాదేశమును మూడుభాగములుగ విభజించి యుత్తరభాగము కేవలము రష్యావారిపలుకుబడిక్రిందను (Sphere of influence), దక్షిణభాగము ఆంగ్లేయులపలుకుబడిక్రిందను, మధ్యభాగము ఇద్దరికిని తటస్థప్రదేశముగ నుండునట్లును ఆ యొడంబడికవలన నిర్ణయించుకొనిరి. ఇపుడు తటస్థ ప్రదేశమంతయు నాంగ్లేయులపలుకుబడిక్రిందికి వచ్చెను. పర్షియాదేశము తురుష్కముకన్న హిందూదేశమునకు సమీపమున నున్నది. పర్షియాలో నెక్కువబలమును సంపాదించుచే ఆంగ్లేయుల హిందూదేశసామ్రాజ్యము నకు బలమును కలుగజేయును. ఈ రహస్యపుటొడంబడికప్రకారము అరబు దేశములను తురుష్కమునుండి విడదీసి యొక స్వతంత్రదేశముగ చేయుట కును మహమ్మదీయుల యాత్రాస్థలములనన్నిటిని వేరొక మహమ్మదీయ రాజ్యముగ చేయుటకును అంగీకరించిరి.

## లండను ఒడంబడిక

1915 వ సంవత్సరము ఏప్రిలు 26వ తేదీని లండనులో ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యా, ఇటలీలమధ్య రెండవ రహస్యపుటొడంబడిక జరిగినది. ఈ యొడంబడికననుసరించియే ఇటలీవారు యుద్ధములో మిత్రమండలిపక్షమున చేరిరి. దీనినిబట్టి ఇటలీకి తురుష్కదేశములోని అదేలియా, లిబియా రాష్ట్ర ములు నీయవలెను. తురుష్కమునుండి పొందెడి యుద్ధపరిహారములో న్యాయమైనభాగము ఇటలీ పొందవలెను. అరబుదేశములను, మహమ్మదీయ యాత్రాస్థలములను వేరువేరు మహమ్మదీయ స్వతంత్రదేశములుగ చేయు టకు ఇటలీ సమ్మతించెను.

## మక్కా షెరీఫుతో సంధి

1915 సంవత్సరము అక్టోబరు 24 వ తేదీన ఆంగ్లేయులు మక్కా షెరీఫగు హూస్సేనుతో మరియొక రహస్యపుటొడంబడికను చేసికొనిరి. ఇందువలన బాగ్దాదు, బాస్రా రాష్ట్రములు ఇంగ్లీషువారిస్వాధీనముగావలెను. మిగిలిన యావత్తు అరబుదేశములను స్వతంత్రరాజ్యముగ చేయుటకు ఆంగ్లేయులు సమ్మతించిరి. బాగ్దాదు, బాస్రా రాష్ట్రములు మిగుల ఫలవంతమైనవి. చాల గనులు గలవి. హిందూదేశమునకు సమీపమున నున్నవి. వాటిమూలమున పారసీకసముద్రము ఆంగ్లేయులక్రింద నుండును. ఈ రెండురాష్ట్రములను తాము స్వాధీనముచేసికొందుమని ఆంగ్లేయులు ఫ్రాన్సు, ఇటలీ, రష్యాలతో చేసుకున్న యొడంబడికలలో నుదహరించియుండలేదు. మరియు మక్కా షెరీఫుతోచేసికొన్న యొడంబడికలో మహమ్మదీయయాత్రాస్థలములను అరబురాజ్యమునుండి వేరుపరచెదమని చెప్పియుండలేదు. మహమ్మదీయయాత్రాస్థలములుకూడ అరబుదేశములలోనే యున్నవి. యుద్ధములో మక్కా షెరీఫు అరబ్బులను తురుష్కులపై తిరుగబాటులుచేయించి యాంగ్లేయులకు తోడ్పడవలెను. మక్కా షెరీఫు ప్రవక్తయగు మహమ్మదుయొక్క వంశమునకు చెందినవాడు. అరబుదేశములన్నియు, ముసల్మానుయాత్రాస్థలములన్నియు ప్రవక్త మహమ్మదుయొక్క వంశీకుడగు తనక్రింద స్వతంత్రమగు గొప్ప రాజ్యమగునని ఆయన యూహించెను. తురుష్కసామ్రాజ్యమునుండి విడిపోయి యుద్ధము ముగియగనే అరబ్బులందరును ఐక్యతను స్వతంత్రతను మరల పొందెదరని అరబ్బుప్రజలకు బోధించబడెను. మక్కా షెరీఫుకు కావలసిన ఆయుధములను ఖర్చులను ఇచ్చుటయేగాక నెలకు ఇరువై వేలరూప్యములను ఆంగ్లేయులు మక్కా షెరీఫు కిచ్చుచుండిరి.

## ఇబనుసౌదుతో సంధి

ఒక్క మక్కా షెరీఫుతోనే పని పూర్తికాదని తెలిసికొని, ఆయనకు బలవద్విరోధియు అరేబియాలోని వహాబీతెగకు నాయకుడునునగు ఇబను సౌదుతోను ఆంగ్లేయులు రహస్యపుటొడంబడికను చేసిరి. ఇబనుసౌదు చాల బలవంతుడు. ఆయనకు కె.సి.ఐ.యి. అను బిరుదమును ఆంగ్లేయప్రభు

త్వమువా రిచ్చి, నెలకు ముప్పదివేలరూప్యములవేతనమును, తురుష్కుల మీద చేసెడి తిరుగబాటులకయ్యెడి ఆయుధసామగ్రి యితరఖర్చులను కూడ యిచ్చునటుల ఏర్పాటుచేసికొనిరి. మక్కా-షెరీఫుతో జరిగిన యొడంబడిక ఇబనుసౌదుకును, ఇబనుసౌదుతో జరిగిన యొడంబడిక మక్కా-షెరీఫుకును, తెలియకుండగ దాచియుంచిరి. మక్కా-షెరీఫుకు పంపిన వేతనము ఇతర ఖర్చులు ఇంగ్లాండుప్రభుత్వపుబొక్కసములోనుండి ఇవ్వబడుచుండగ, ఇబను సౌదుకు ఇవ్వబడిన వేతనము ఇతరఖర్చులు హిందూదేశపుబొక్కసములో నుండి ఖర్చుచేయబడెను. ఒక్కొక్కప్పుడు ఆంగ్లేయులు పంపిన ఆయుధ ములతోడనే ఇబనుసౌదు, మక్కా-షెరీఫులు తమలోతాము పోరాడుచుండు టయు జరిగినది.

## సైక్సు-పికటు ఒడంబడిక

1916 వ సంవత్సరము మేనెల 16 వ తేదీన ఇంగ్లాండు, ఫ్రాన్సు, రష్యాలమధ్య మరియొక రహస్యపుటొడంబడిక జరిగెను. దీనికి సైక్సు-పికటు ఒడంబడికయని పేరు. దీనివలన తురుష్క-దేశములోని ఎర్జరము, ట్రెబిజాండు, వాన్, బిట్లీసు, దక్షిణకుర్దిస్థాన్ రాష్ట్రములుకూడ రష్యాచక్ర వర్తి కిచ్చివేయబడినవి. ఇందువలన తురుష్క-దేశములో చాలభాగము రష్యా క్రింద చేరును. ఫ్రాన్సుకు తురుష్క-దేశములోని అడానారాష్ట్రమును, అరబ్బుదేశములలోని సిరియాదేశమును ఇవ్వబడెను. పాలస్టైన్-దేశమును మహమ్మదీయయాత్రాస్థలములును ఇంగ్లాండు, రష్యా, ఫ్రాన్సులు నిర్ణయించు ప్రకార మొక ప్రత్యేకప్రభుత్వముక్రింద నుంచబడును. ఇంగ్లాండు యావత్తు మెసపొటేమియాను, హైఫా, ఏకరు అనురేవుపట్టణములను తీసికొనవలెను. మిగిలిన అరబుదేశములన్నియు ఫ్రాన్సుయొక్కయు ఆంగ్లేయులయొక్కయు పలుకుబడిక్రింద నుండునట్లు పంపకముజరిగి, ఎవరి పలుకుబడిక్రిందనుండెడి ప్రదేశములలో **(Sphere of influence)** వారు సంరక్షకరాజ్యముల నేర్పాటుచేసి ధనసంపాదనమును, వర్తకాభివృద్ధిని చేసికొనవలెను. ఈ సైక్సు - పికటు ఒడంబడిక మక్కా-షెరీఫుతో చేసికొన్న యొడంబడికకు కేవలము విరుద్ధముగ నున్నది. మక్కా-షెరీఫు తనక్రిందికి వచ్చుననుకొన్న

సిరియాదేశము ఫ్రెంచివారికిని, ఇరాకుదేశము ఆంగ్లేయులకును, మహమ్మదీయయాత్రాస్థలములను పాలస్తైన్ దేశమును ఇంగ్లాండు, రష్యా, ఫ్రాన్సులు నిర్ణయించెడి ప్రత్యేకప్రభుత్వమునకును చెందును. మిగిలిన అరబుదేశములు గూడ స్వతంత్రముగ నుండక ఇంగ్లాండు, ఫ్రాన్సుల పలుకుబడిక్రింద (Sphere of influence) పంపకముచేయబడును. గాని యీ సైక్సు-పికొ ఒడంబడిక మక్కా-షెరీఫుకు తెలియనేతెలియదు. తనతో నాంగ్లేయులు చేసిన యొడంబడిక స్థిరముగ నున్నదను నమ్మకముతోడనే యుద్ధము ముగియువరకును మక్కా-షెరీఫు ప్రవర్తించుచుండెను. వేతనము పుచ్చుకొనుచుండెను. తురుష్కులపై తిరుగబాటులను అరబులలో పురిగొల్పుచుండెను. అరబులకు స్వతంత్రతకలుగుననునాశను కలుగజేయుచుండెను.

## సెంటుజీన్ డిమారిను ఒడంబడిక

1917 సంవత్సరము ఏప్రియలునెల 17వ తేదీన ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీలమధ్య సెంటుజీన్ డిమారినునద్ద మరియొక రహస్యపుటొడంబడిక జరిగెను. దీనినిబట్టి ఇటలీవారు సైక్సు-పికొ ఒడంబడిక నంగీకరించిరి. ఇటలీకి తురుష్కదేశములోని స్మర్నారాష్ట్రమును తురుష్కములోని పశ్చిమ భాగమంతయునుగూడ ఇవ్వబడెను. ఇదివరకే అడేలియా, లిబియా రాష్ట్రములను పొందెను. దీనితో తురుష్కసామ్రాజ్యముయొక్కయేగాక తురుష్కదేశముయొక్క పంపకముగూడ పూర్తియైనది. ఇంగ్లాండు, రష్యా, ఫ్రాన్సు, ఇటలీలు ఏమియు విడిచిపెట్టకుండ పూర్తిగ పంచుకొనినవి. ఈ సెంటుజీన్ డిమారిను ఒడంబడిక రష్యాచక్రవర్తిచే నంగీకరింపబడవలెను.

కాని యీ యొడంబడిక నంగీకరించకముందే రష్యాలో విప్లవము జరిగి రష్యాచక్రవర్తి చంపివేయబడె. సోవియట్ప్రజాస్వామికము స్థాపింపబడినది. సోవియట్ప్రజాస్వామికము యుద్ధమధ్యముననే మిత్రమండలినుండి చీలిపోయి శత్రుమండలిదేశములతో సంధిచేసికొని యుద్ధము చాలించినది. అయినను ఈ ఒడంబడిక అమలుజరిగితీరవలెనని ఇటలీవారును, ఈ ఒడంబడిక చెల్లదని ఆంగ్లేయులును, ఫరాసువారును యుద్ధము ముగిసినతరువాత చెప్పుచువచ్చిరి. ఈ వివాదముయొక్క ఫలితములను గూర్చి ముందు తెలిపెదము.

## బాల్ఫరు ప్రకటనము

ఇటుల రహస్యప్రపంపిణీలు జరుగుచుండగ 1917వ సంవత్సరము నవంబరు 2 వ తేదీన పాలెస్టైను దేశమును ప్రపంచములో యూదులకందరికిని మాతృదేశముగ నిర్ణయించుట కేర్పాటుచేసెదమని ఆంగ్లేయమంత్రియగు బాల్ఫరు ప్రకటించెను.

## లాయడుజార్జి ప్రకటనము

1918వ సంవత్సరము జనవరి 5 వ తేదీని యుద్ధముయొక్కయుద్దేశ్యములను వివరించుచు, ఆస్ట్రియా హంగెరీని నాశనముచేయుటకుగాని, తురుష్కులరాజధానియగు కాన్‌స్టాంటినోపిలును తురుష్కులమాతృదేశమగు అనటోలియాను తురుష్కులనుండి తీసికొనుటకుగాని, తురుష్కులు ఎక్కువగ కాపురమున్న థ్రేసురాష్ట్రమును ఊడలాగుకొనుటకుగాని తాము యుద్ధముచేయుటలేదని ఆంగ్లేయ ప్రధానమంత్రి లాయడుజార్జి ఆంగ్లపార్లమెంటులో చెప్పెను. మరియు అరేబియా, అర్మేనియా, మెసపొటేమియా (ఇరాకు), సిరియా, పాలెస్టైను దేశములను స్వతంత్రజాతులుగ చేసెదమని కూడ చెప్పెను.

## ఆంగ్లసేనాని ప్రకటన

1917 సంవత్సరము మార్చి నెల 11 వ తేదీని ఆంగ్లేయసేనలు తురుష్కుల నోడించి అరబ్బుల ముఖ్యపట్టణములలో నొకటగు బాగ్దాదు పట్టణమున ప్రవేశించినపుడు అరబ్బుప్రజలను తురుష్కుల నిరంకుశత్వము నుండియు తురుష్కుల దుష్పరిపాలనమునుండియు తొలగించి వారికి స్వతంత్రతను, పూర్వపుటౌన్నత్యమును ఘనతను కలుగజేయుటకే యాంగ్లేయులు బాగ్దాదుకు వచ్చినారని ఆంగ్లేయసేనానియగు జనరలు మాడు ప్రకటించెను.

## విల్సను సభాపతి సూత్రములు

అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షుడగు విల్సను 1918 సంవత్సరము జనవరి 8 వ తేదీని ప్రకటించిన పదునాలుగుసూత్రములలో పంద్రెం

డవసూత్రమునందు "తురుష్కులు కాపురమున్నప్రదేశములు తురుష్కుల క్రిందనే వదలివేయబడును. తురుష్కసామ్రాజ్యములో నున్నట్టి యితరజాతులను విడదీసి స్వతంత్రజాతులుగచేసి ఇతరులు ఎవరియొక్కయు నాటంకములులేకుండ స్వతంత్రముగ నభివృద్ధిచెందుటకు సంపూర్ణముగ నవకాశములు కలుగచేసెదము" అని చెప్పబడియున్నది. మరియు "తురుష్కుల యొత్తిడిక్రింద చిరకాలమునుండి బాధపడుచున్న జాతులకన్నిటికిని పూర్తిగ స్వేచ్ఛను కలుగజేసి యా జాతులవారు బుద్ధిపూర్వకముగ కోరుకొన్న ప్రభుత్వవిధానమును నెలకొలుపుటే ఆంగ్లేయులయొక్కయు, ఫ్రెంచివారి యొక్కయు రాజనీతి" యని 1918 సంవత్సరము నవంబరు 8 వ తేదీన ఆంగ్లేయులును, పరాసులును కలిసి యొక ప్రకటనమును గావించిరి. ఈ ప్రకటనమును విల్సను సభాపతియొక్క పదునాలుగుసూత్రములను మెసపొటేమియాలోని పత్రికలలో 1918 వ సంవత్సరము నవంబరు 11 వ తేదీన ప్రచురింపబడినందున అరబ్బులు యుద్ధము ముగియగనే సంపూర్ణస్వాతంత్ర్యమును పొందెదమని గంపెడాశనుబెట్టుకొనియుండిరి.

## బహిరంగప్రకటనలు

ఈవిధముగ మిత్రమండలివారి బహిరంగప్రకటనలకును వారిలోవారు గావించుకొనుచుండిన రహస్యపుటొడంబడికలకును ఎట్టి సంబంధము లేకయుండెను. బహిరంగముగ తురుష్కమునకును తురుష్కముక్రిందనుండిన జాతులకును స్వతంత్రతను స్వయంనిర్ణయపుహక్కును ప్రకటించుచుండిరి. రహస్యముగ వానినన్నిటిని తమలోతాము పంచుకొనుచుండిరి. బహిరంగ ప్రకటనలు అరబ్బులకు స్వతంత్రతయొక్క ఆశలు కలుగచేసి తురుష్కులపై తిరుగబాటుగావించుటకు గావించియుండవచ్చును. తురుష్కముతో సానుభూతిగల ఈజిప్టుదేశీయులను హిందూదేశపుముసల్మానులను సంతోషపెట్టుటకు గావించియుండవచ్చును. అమెరికా సభాపతియొక్క పదునాలుగు సూత్రములనే తాము అవలంబించుచున్నామని చూపుటకు గావించియుండవచ్చును. మరియు 1917 సంవత్సరము ఆగష్టునెల 20 వ తేదీన హిందూదేశమునకు స్వరాజ్యమిచ్చుటయే ఆంగ్లేయప్రభుత్వమువారియుద్దేశ్యమనియు, యుద్ధముముగియగనే స్వరాజ్యములో గొప్ప భాగమును (Substantial

step) ఇచ్చెదమనియు నాంగ్లేయమంత్రి మాంటెగ్యు ఆంగ్లపార్లమెంటులో చెప్పెను. ఇందువలన హిందూదేశమునుండి విశేషముగ ధనసహాయమును మనుష్యులసహాయమును యుద్ధమునందు మిత్రులందఱికి లభించెను. గాని యుద్ధముముగిసినతరువాత ఆంగ్లప్రభుత్వమువారు మాంటెగ్యు ఛెమ్సుఫర్డు సంస్కరణములని పిలువబడెడి మిగుల సంకుచితమగు సంస్కరణములను భారతీయుల కిచ్చిరి. భారతదేశీయమహాసభ యీ సంస్కరణములు అసంతృప్తికరమైనవనియును ఆశాభంగకరమైనవనియును పనికిమాలినవనియును ఖండించెను.

## (3)

## పారిసు సంధిసమావేశము

పారిసునగరమున సంధిసమావేశమునకు విల్సను సభాపతికూడ వచ్చియుండెను. ఆయనయు ఆయనభార్యయు అమెరికానుండి యూరపుఖండమునకు రాగనే ప్రతిచోటను ఆయనను ప్రజలు విశేషముగ గౌరవించిరి. గొప్ప విందులును ఉత్సవములును ఆయనగౌరవార్థము జరిగెను. ఆయన మానవకోటి నుద్ధరించుటకై పుట్టిన ప్రవక్తయని ప్రజలు నమ్మిరి. ఘోర యుద్ధమువలన కలిగిన దుఃఖములో మునిగియున్న మానవజాతులకన్నిటికిని ఆయనరాకవలన గొప్ప ఆశలు కలిగెను. జర్మనీలోను, ఆస్ట్రియాలోను, ఆయననామము మిగుల పవిత్రమైనదిగ నెంచబడెను. తురుష్కములోను, అరబుదేశములలోను ఆయనయందు సంపూర్ణవిశ్వాసముండెను. "విల్సను సభాపతి స్వయముగ మా విషయమును విచారించి మా కేమి శిక్షవిధించినను భరించుటకు సిద్ధముగనున్నా"మని జర్మనుఛీఫుడగు హెర్ మునహరిడా చెప్పెను. త్వరలోనే పారిసులో సుప్రసిద్ధమగు సంధిసమావేశము ప్రారంభమయ్యెను. లోకములోని యన్నిజాతులవారును యుద్ధమును శాశ్వతముగ నంతరింపజేసి జాతులమధ్య న్యాయమునుకలుగజేయు నా సమావేశమును దర్శించుటకును, తమకష్టసుఖములను చెప్పుకొని న్యాయమును పొందుటకును తమ తమ ప్రతినిధులను బంపిరి.

## రహస్యసమావేశము

కాని యితరులను లోనికిరానీయక, యుద్ధములో జయమొందిన మిత్ర మండలిదేశములవారిప్రతినిధులుమాత్రమే విల్సనుసభాపతిచుట్టును చేరి తమ వ్యవహారములను గూర్చి ఆలోచనలుసేయుట త్వరితముగనే కనపడినది. సంధిసమావేశము రహస్యాలోచనగనే పరిణమించినది. మానవకోటి నుద్ధరించుటకు బయలుదేరిన విల్సను అస్పృశ్యుడై, మిత్రమండలివారిప్రతినిధులతో రహస్యాలోచనలుజరుపుచున్న విల్సనే కనపడెను. ఆ సమావేశమునందు విల్సను సభాపతి మానవులస్వాతంత్ర్యమునుగూర్చి యేమోచెప్పబోగా "ఏసు క్రీస్తువలె మాట్లాడుచున్నారు" అని పరాసుమంత్రి క్లిమేంశో అడ్డుచెప్పెను. ఏసుక్రీస్తుయొక్క బోధ లీ రాజ్యాంగవేత్తలకు పనికిరావు. రహస్యాలోచనలకు విల్సను పూర్తిగా లోబడెను. "తనయొక్క ధర్మసూత్రములలో కొన్ని సముద్రములోను, మిగిలినవానిని సంధిభవనపుగుమ్మముబైటను విడిచిపెట్టియే విల్సను సంధిభవనములో ప్రవేశించెను. ఇంత గొప్పగ మానవజాతులచే గౌరవింపబడినవాడును ఇంతత్వరలోనే యావత్తుగౌరవమును గోల్పోయినవాడును విల్సను సభాపతికన్న చరిత్రలో మరియొకడు లేడు" అని చరిత్రకారుడు కైన్సు వ్రాసియున్నాడు.

## నలుగురియాలోచనలు

ప్రథమమున సంధిసమావేశమున మిత్రమండలిలో చేరిన అన్నిదేశములవారిప్రతినిధులు సమావేశమైరి. కాని క్రమముగ విల్సనుసభాపతి, ఆంగ్లేయప్రధానమంత్రి లాయడుజార్జి, పరాసుప్రధానమంత్రియగు క్లిమెంశో, ఇటలీమంత్రి సీనరు ఆర్లెండోలు మాత్రమే సమావేశమగుచువచ్చిరి. యుద్ధములో నెక్కుడు త్యాగములను పరాసువారు చేసిరని చెప్పి క్లిమెంశోను సంధిసమావేశమున కధ్యక్షునిగచేసిరి. అంతేగాక క్లిమెంశో యొక్కడే వారందరిలోను ఇంగ్లీషు, ఫ్రెంచిభాషల రెంటిలోను ధారాళముగ మాటలాడగలిగినవాడు. 1871 సంవత్సరమునుండియు జర్మనీదేశము ఫ్రాన్సుకు భయంకరమగు శత్రువుగ నుండెను. జర్మనీనుండి మఱల ఆల్సేసు, లోరైనురాష్ట్రములను ఫ్రాన్సు లాగుకొనవలెను. తాము యుద్ధములోపొందిన

నష్టమునకంతకును పూర్తియగు పరిహారమును జర్మనీనుండి ఫ్రాన్సు పొందవలెను. జర్మనీ మరల తలయెత్తగూడదు. ఇదియే క్లిమెంషోయొక్క యుద్దేశ్యము. జర్మనీనుండి తగిననష్టపరిహారమునుపొంది ప్రపంచపటకము లోను పలుకుబడితోను తమకు జర్మనీ పోటీగా రాకుండునట్లుచేసికొనుటయే ఆంగ్ల ప్రధానమంత్రియగు లాయడుజార్జియొక్క కోరిక. మరియు యూరపువ్యవహారములలో ఫ్రాన్సును తృప్తిపరచి ఫ్రాన్సుయొక్క అనుమతితో తురుష్కసామ్రాజ్యములో ముఖ్యభాగములను తా నాక్రమించి ఆసియా ఆఫ్రికాఖండములలో తమకుగల సామ్రాజ్యమును పటకమును బలపరచుకొనుటయు కూడ లాయడుజార్జి యభిప్రాయము. తురుష్కరాజధానిని మ్రింగవలెనని కోరుచుండిన రష్యాచక్రవర్తి కూలిపోయినాడు. రష్యాలో స్థాపింపబడిన బోల్షివికు ప్రజాస్వామ్యమునకు ఇతరదేశములను లోబర్చుకొనవలెననుతలంపు లేదు. తురుష్కసామ్రాజ్యమును వశపరుచుకొనుటకు ముఖ్యముగ మిగిలినది యాంగ్లేయసామ్రాజ్యమే గాని, యుద్ధకాలమున జరిగిన రహస్యపుటొడంబడికలనుబట్టి తురుష్కసమస్యల యంత్యపరిష్కారము కొంతవరకు క్లిష్టముగనే యుండెను. కావున నొకసంవత్సరముపై కాలమువరకు నీవిషయమున కాలయాపన జరిగెను.

(4)

## గ్రీకులు స్మర్నాపై దండెత్తివచ్చుట

ఈలోపున తొందరపడి ఇటలీవారు తురుష్కములోని అదేలియా రాష్ట్రములో ప్రవేశించి దానిని స్వాధీనపర్చుకొనుట చూచియున్నాము. "ఫ్యూము" స్వాధీనవిషయమున ఇటలీకిని తక్కిన మిత్రమండలిప్రతినిధులకును అభిప్రాయభేదములు కలిగెననికూడ చూచియున్నాము. తా మొప్పుకున్నను లేకున్నను స్మర్నాను ఇటలీవారు స్వాధీనపర్చుకొనెదరనుభయము తక్కినవారికి కలిగెను. మిత్రమండలిలో చేరిన గ్రీకులకు స్మర్నాను తమ క్రిందికిచేర్చుకొనవలెననుకోరికగలదు. గ్రీకుమంత్రియగు వెనిజీలసు ఆంగ్లేయ ప్రధానమంత్రియగు లాయడుజార్జికి మిగుల ఆప్తుడు. స్మర్నారాష్ట్రములో కాపురమున్న గ్రీకులను, ఇతరక్రైస్తవులను తురుష్కసైనికులు ఉద్యోగస్థులు చాల బాధలుపెట్టుచున్నారని చెప్పి, స్మర్నారాష్ట్రమును వెంటనే గ్రీకు

ప్రభుత్వసేనలు మిత్రమండలిసహాయముతో స్వాధీనపర్చుకొనుటకు లాయడు జార్జి తక్కిన. మిత్రమండలిప్రతినిధులచే అంగీకరించునటులచేసెను. ఆంగ్ల, పరాసు, అమెరికను యుద్ధనావలలో నెక్కి కాల్ట్రోపు సేనానిక్రింద విశేషముగ గ్రీకుసైన్యములును కొద్దిగ మిత్రమండలిసైన్యములును 1919 సంవత్సరము మేనెల 15 వ తేదీన స్మర్నాపట్టణమున దిగి యా పట్టణమును చుట్టుపట్ల ప్రదేశములనుస్వాధీనపర్చుకొనెను. ఆంగ్ల గ్రీకు మంత్రులు స్మర్నాలోని గ్రీకులు తురుష్కులచే బాధింపబడుచుండిరని చెప్పినసంగతులు కేవలము కల్పితమని తరువాత నీవిషయమున విచారించి తెలిపిన మిత్రమండలివారి విచారణసంఘముయొక్క రిపోర్టు(నివేదిక)వలననే స్పష్టపడినది. ఈ సంగతులు కల్పితమనియు, విచారణచేసిన నిజము తేలుననియు, స్మర్నాలో గ్రీకు సైన్యములు దిగుటకు మిత్రమండలి యనుమతించుట ముద్రాసు తాత్కాలిక సంధియొక్కషరతులకు వ్యతిరేకమనియు తురుష్కులు తెలిపినమీదట, 1919 సంవత్సరము సెప్టెంబరునెలలో అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీప్రతినిధులు స్మర్నాకుపోయి విచారణచేసి యొక రిపోర్టును అక్టోబరు 12 వ తేదీన మిత్రమండలివారికి బంపిరి. అందులో నిటుల వ్రాయబడినది :

"ముద్రాసు తాత్కాలికసంధి జరిగినప్పటినుండియు స్మర్నాలోని క్రైస్తవుల స్థితి తృప్తికరముగ నున్నదనియు వారి క్షేమమున కెట్టిభంగము వాటిల్ల లేదనియు విచారణవలన తేలినది. మిత్రమండలివారిసంధిసమావేశములో అబద్ధపు సమాచారమును చెప్పి స్మర్నాను స్వాధీనపర్చుకొనునటుల చేసిన వ్యక్తులును ప్రభుత్వములును అందులకు బాధ్యులు. స్మర్నా ఆక్రమణ మిత్రమండలికిని తురుష్కప్రభుత్వమునకును జరిగిన తాత్కాలికసంధియొక్క షరతులకు వ్యతిరేకము. స్మర్నాప్రాంతములోని ప్రజలలో నెక్కువమంది తురుష్కులు. వారు స్మర్నాఆక్రమణను తీవ్రముగ ప్రతిఘటించుచున్నారు. కావున గ్రీకుసైన్యములు వెంటనే స్మర్నాను వదలిపోవలెను. ఏదైన సంరక్షణము గావలసినచో మిత్రమండలివారు కొద్దిసైన్యముల నచట నుంచవచ్చును" అని వ్రాయబడినది. కాని ఈ రిపోర్టును బహిరంగపర్చక దాచియుంచిరి.

## గ్రీకుల దౌర్జన్యములు

గ్రీకులు స్మర్నాను వదలిపోక చుట్టుపట్లప్రదేశమునంతను స్వాధీన పఱచుకొనుచుండిరి. మిత్రమండలివారు గ్రీకులను అడ్డుపఱచలేదు. అపటి తురుష్కులు గ్రీకుల నెదిరించుచుండిరి. తురుష్కులమీద చెప్పనలవిగాని క్రూరకృత్యములను గ్రీకుసైనికులు గావించుచు తిరుగబాటుల నణచు చుండిరి. తురుష్కులను ముదుసలులనక, పిల్లలనక, స్త్రీలనక గ్రీకులు చంపి వేసిరి. తురుష్కులయిండ్లను దోచుకొనిరి. తగులబెట్టిరి. మిడుతలదండుల వలె గ్రీకులు తురుష్కుల పైరుపంటలను నాశనముచేసి వేనవేలమంది తురుష్కులను తాము స్వాధీనమొనరించుకొనుచుండినదేశములోనుండి వెళ్ళ గొట్టిరి. స్మర్నారాష్ట్రమును స్వాధీనమొనరించుకొని ఐవలిజిల్లాలో ప్రవేశించి గ్రీకులు ముందుకు పోవుచుండిరి. ఆ ప్రదేశమందంతటను భయానకమగు పాలనమును స్థాపించిరి. దానినంతను శాశ్వతముగ తమ పాలనముక్రింద చేర్చుకొనినటుల చిహ్నముగ గ్రీకుప్రభుత్వమువారొక హైకమీషనరును స్మర్నాపట్టణమున నియమించిరి.

## జాతీయోద్యమజననము

తురుష్కరాజధానియగు కాన్‌స్టాంటినోపిలు మిత్రమండలివారియధీన ములో నుండెను. తురుష్కసుల్తాను మిత్రమండలివారి యాజ్ఞానుసారియై వర్తించుచుండెను. తురుష్కప్రజాప్రతినిధిసభను (పార్లమెంటును) రద్దు చేసెను. మిత్రమండలికి స్నేహితుడగు దామాదు ఫెరీదు పాషాను ప్రధాన మంత్రిగ నియమించెను. బాస్ఫరసుజలసంధితీరమునమన్న తన రాచనగరు నందు మిత్రమండలివారికై దీవలె నివసించుచుండెను. మరి యెచటకైనను పోవుటకుకూడ వీలులేకుండెను. ఇటలీవారు అదేలియారాష్ట్రమును స్వాధీన మొనరించుకొనిరి. గ్రీకులు స్మర్నా మొదలగు ప్రదేశముల నాక్రమించి తురుష్కులను నాశనమొనర్చుచుండిరి. ఇట్టి అవమానకరమైనట్టియు మిక్కిలి దుఃఖపూరితమైనట్టియు పరిస్థితులలోనుండి తురుష్కమాతృదేశస్వాతంత్ర్య సంస్థాపనకొరకై తురుష్కజాతీయోద్యమము బయలుదేరి విజృంభించెను.

## నాయకుడు

ఆరువందలసంవత్సరములు ఆసియా, ఆఫ్రికా, యూరపుఖండము లలో గొప్ప సామ్రాజ్యాధికారమును కలిగియుండిన తురుష్కులు తమ మాతృదేశస్వాతంత్ర్యమునుకూడ పోగొట్టుకొని పాశ్చాత్యులకు దానిసలు కావలసినదేనా ? బాలచంద్రునితో ప్రకాశించు తురుష్కపతాకము తురుష్కదేశములోకూడ లేకుండపోయి పాశ్చాత్యపతాకములకు తనదేశములోకూడ సలాముచేయవలసినదేనా ? యను ప్రశ్నలు ప్రతి తురుష్కునిచే చర్చించబడి గుండె ఝల్లుమనెను. ఈ స్వతంత్రోద్యమమునకు నాయకుడుగ ముస్తఫా కెమాల్‌పాషాయను ధీరుడు నిలిచెను. ఈ స్వాతంత్ర్యమూర్తి, మహత్తర తేజోనిధి, అద్భుతమేధావి, యోధాగ్రేసరుడు అధఃపతితమైయున్న తురుష్కదేశమునందు నూతన జీవమును నూతనోత్సాహమును ఆత్మవిశ్వాసమును కలుగచేసెను. అంధకారములోనుండి తేజస్సును, మృత్యువునుండి అమృతత్వమును జనింపజేసెను. ఎంతటి త్యాగమునైనను చేసి దేశమునాక్రమించియున్న విదేశస్థులనెల్లర వెళ్ళగొట్టి మాతృదేశమునకు స్వతంత్రతను సంపాదించితీరవలెనను దృఢమగు దీక్షను, గాఢమైన దేశాభిమానమును దేశమందంతటను వ్యాపింపజేసెను.

గ్రీకులతో తురుష్కజాతియనాయకులు యుద్ధములుచేయుటను గూర్చి చదవకముందు దేశములో జాతీయభావముల నెటుల వ్యాపింపజేసిరో ఏ సిద్ధాంతములమీద జాతీయపునర్నిర్మాణమునకు బూనుకొనిరో తెలిసికొందము.



# తురుష్క ప్రజాస్వామికము

## 5 జాతీయోద్యమ విజృంభణము

### (1)

### దురదృష్టప్రవాహము వెనుకకు మరలుట

పైనచెప్పబడినవిధమున 1918 సంవత్సరమున జరిగిన ముద్రాసు తాత్కాలిక సంధియొక్క ఫలితముగ తురుష్కదేశమునందు నిరాశ వ్యాపించెను. అట్టోమాను సామ్రాజ్యము కూలిపోయినది. అనటోలియాపర్వత ప్రాంతమున కొనయూపిరి కలిగియుండుటతప్ప యూరపుఖండపు రోగి (Sick man of Europe) మరణించుటకు సిద్ధముగనున్నాడు. తురుష్కజాతియొక్క సమగ్రచరిత్రలో సుల్తానులక్రింద నభివృద్ధిచెందినపుడు గాని తగ్గుదలనొందినపుడుగాని ఇప్పుడు కలిగినంత దురదృష్టము ఎప్పుడును కలిగియుండలేదు. కాని ఇట్టిసమయముననే దురదృష్టప్రవాహము వెనుకకు మరలినది. ఒక తురుష్కయోధుడు ముస్తఫా కెమాల్ పాషా తనదేశమును దురదృష్టమునుండియు నిరాశనుండియు రక్షించుటకు పూనుకొనెను. ఇంతటినుండియు తురుష్కదేశచరిత్ర ఈ మహనీయునిచరిత్రతో నైక్యమయినది.

### ముస్తఫా కెమాల్ పాషా

ముస్తఫా కెమాల్‌పాషా 1881 వ సంవత్సరమున సలోనికాపట్టణమున జన్మించెను. అచట కొంతవరకు విద్య నభ్యసించి కాన్‌స్టాంటినోపిలులోని సైనికకళాశాలయందు చేరి యన్నిపరీక్షలలోను మొదటివాడుగ నుత్తీర్ణుడయ్యెను. విద్యార్థిగనున్నకాలమునందే మిగుల దేశాభిమానమునుకలిగి యౌవనతురుష్కకక్షిలో చేరెను. సుల్తాను అబ్దుల్ హమీదుయొక్క దుష్పరిపాలనను, దేశములో ప్రబలియున్న మూఢవిశ్వాసములను ఖండించుచు నొక

పత్రికను నడపుచుండెను. ఆ పత్రిక విద్యార్థులలో బాగుగ వ్యాపించి వారి భావములను మార్చుచుండెను. అబ్దుల్‌హమీదుయొక్క దుష్పరిపాలనము నందు తన దేశీయులు పడుచున్న కష్టములను చూచి సహించలేక తన పిడికిటిని గట్టిగబట్టుకొని "నా దేశము దురదృష్టవంతమయినది. నేను నా దేశమును రక్షించెదను" అని పలుమారు అనుచుండెడివాడు. ఆయన ఫ్రెంచి భాషను బాగుగ నేర్చుకొని ఫ్రెంచివిప్లవము, రాజకీయశాస్త్రము, దేశచరిత్రలు చదువుటయందు మిగుల కుతూహలము కలిగియుండెను. తురుష్కము నందును ఫ్రెంచిభాషయందును గంభీరోపన్యాసమిచ్చుటకు శక్తికలిగి యుండెను. ఆయన సైనికకళాశాలను వదలిరాగానే పోలీసువా రాయనను పట్టుకొనిపోయి సుల్తానుఎదుట నిలువబెట్టిరి. సుల్తా నాయనను కొంత ప్రశ్నించి యువకుడని దయతలచి డెమాస్కసుపట్టణమునకు పంపివేసెను. అచట ముస్తఫా కెమాల్‌కు గుడిశెలలో నివసించు బీదరైతులను స్వయముగ చూచి వారిస్థితిగతుల నారయుటకు మంచి యవకాశము లభించెను. అక్కడ కొంతమంది యువకులగు స్నేహితులను ప్రోగుచేసికొని 'వతను' (అనగా పితృదేశము) అను నొక రహస్యపు రాజకీయసంఘమును స్థాపించి పనిచేయసాగెను. అచటకూడ ప్రభుత్వమునకు వ్యతిరేకముగ పనిచేయుచున్నాడని సుల్తానుకు తెలిసి సుల్తాను ఆయనను జాఫాకు లేచిపొమ్మని యుత్తరువుచేసెను. కాని డెమాస్కసులోని తురుష్కసేనాధిపతి ముస్తఫా కెమాల్‌ను ప్రేమించినవాడై ఆయనను తన జన్మస్థానమగు సలోనికాకు పారిపోనిచ్చెను. ఎనిమిదినెలలు ముస్తఫా కెమాల్ సలోనికాలో నెవరికిని కనపడకుండ దాగియుండెను. రహస్యముగ తన 'వతను' సంఘమును మిత్రులలో వ్యాపింపజేయుచుండెను. ఈయన బయటనుండుట అపాయకరమని ప్రభుత్వమువా రీయనను పట్టుకొని కొంతకాలము చెరసాలలో నుంచిరి. తరువాత వదలిపెట్టి దేశభ్రష్టుని గావించిరి. 1908 వ సంవత్సరమున నాయన తురుష్కదేశమునకు మరలివచ్చి ప్రజాప్రతినిధిసభను స్థాపించుకొరకు సుల్తాను అబ్దుల్ హమీదుపైకి దండెత్తిపోవుచున్న జాతీయసేనలో సైన్యాధిపతియగు షౌకతుపాషాక్రింద సైనికయుద్యోగస్థుడుగ చేరి పనిచేసెను.

## సైనికయోధుడు

యౌవన తురుష్కకక్షివారు రాజ్యభారమును వహించినతరువాత ముస్తఫా కెమాల్ పాషా మరల ప్రభుత్వసైన్యములోచేరి ఉద్యోగస్థుడుగను సేనాధిపతిగను బాల్కన్ యుద్ధములలోను ప్రపంచయుద్ధములోను పనిచేసెను. ప్రతిచోటను సైన్యములలో సంస్కరణములను ప్రవేశపెట్టుచు తన గొప్ప సమర్థతవలనను ఉత్కృష్టమగు ప్రశస్తివలనను సేనలయొక్కయు, తోటి సైనికోద్యోగులయొక్కయు గౌరవమును అధికముగ పొందుచుండెను. డార్డనల్సుదండయాత్రలో అసఫాల్టాపట్ట ఆంగ్లేయసైన్యములను బహు ధైర్యముగ నెదుర్కొని వెనుకకునెట్టుటతో సైనికయోధుడుగ నాయనయొక్క కీర్తి తురుష్కములోను, జర్మనీలోను బాగుగ వ్యాపించెను. తురుష్క సర్వ సేనాధిపతియగు ఎన్వరుపాషా యీయనను అసూయతతో చూచి తగిన ప్రోత్సాహమీయలేదు. కాని ఆయనయొక్క పేరు ప్రతిష్ఠలు స్థిరముగ నిలచియేయున్నవి.

## ఇనస్పెక్టరు జనరలు

1918 సంవత్సరము అక్టోబరు 30 వ తేదీన ముద్రాసు తాత్కాలిక సంధి జరుగుటతోడనే యౌవన తురుష్కకక్షియొక్క నాయకులు రాజధానిని విడిచి పారిపోయిరి. మిత్రమండలివారిసైన్యములు రాజధాని నాక్రమించెను. సుల్తాను తురుష్కప్రజాప్రతినిధిసభను విచ్ఛిన్నముచేసి రాజకీయసంస్కరణములకు వ్యతిరేకుడగు దామాదు ఫరీదు పాషాను ప్రధానమంత్రిగ చేసికొనెను. రాజధానిలో నంతయు నల్లకల్లోలముగ నుండెను. సంస్కర్తల యొక్క కోరికలన్నియు స్వప్నతుల్యము లయ్యెను. ఆసమయమున ముస్తఫా కెమాల్ పాలెస్తైన్ దేశములో సైన్యాధిపతిగ నుండెను. వెంటనే యా సైన్యాధిపత్యమును విడిచి ఎవ్విధముచేతనైనను మాతృదేశమును విదేశీయులబారినుండి సంరక్షించవలెనను దృఢమగుదీక్షతో నాయన కాన్స్టాంటినోపిలుకు వచ్చెను. తనయుద్దేశ్యము నెరవేరుట కొరకు నూతన రాజకీయకక్షి కావలసియున్నది. దిట్టమైన కార్యక్రమ మేర్పరుపబడవలెను. ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛ బాగుగ వ్యాపింపచేయవలెను. కాన్స్టాంటినోపిలులోనున్న

ముఖ్యులతో నాలోచించి యీ పనికి పూనుకొనుటకు యత్నించుచుండెను. కాన్స్టాంటినోపిలులో నీయన యుండుట అపాయకరమనియెంచి దామాదు ఫరీదు పాషా ఈయనను అనటోలియాలో దేశశాంతిని గాపాడుట కుంచు కొనవచ్చునని మిత్రమండలిచే సనుమతింపబడిన తురుష్కసైనికదళముల పైన ఇనస్పెక్టరుజనరలుగ నియమించి అనటోలియాకు పంపివేసెను. ఇందువలననే తా నెక్కువపనిచేయుటకు వీలగునని ముస్తఫా కెమాల్ సంత సించి యీ పదవి నంగీకరించి తనచెలికాడగు రూయఫ్‌బేను వెంటబెట్టుకొని అనటోలియాకు బోయెను. రూయఫ్‌బే సుప్రసిద్ధుడగు నావికసైన్యాధిపతి. చాల పలుకుబడిగలవాడు. ముద్రాసు తాత్కాలికసంధిమీద తురుష్కప్రభుత్వ పక్షమున సంతకముచేసియుండెను. ఇంతటినుండియు తురుష్కముయొక్క మధ్యభాగమున జాతీయపక్షమును స్థాపించి తనక్రిందనున్న ప్రభుత్వ సైనిక దళములనెల్ల కలిపి యొక జాతీయసైన్యముగ తయారుచేసి కాన్స్టాంటి నోపిలులోనున్న సుల్తానును మిత్రమండలిని ప్రతిఘటించుటకు ముస్తఫా కెమాల్‌పాషా సంకల్పించెను. తగిన సైన్యములు పోగుచేసుకొని తనదేశము నాక్రమించిన విదేశీయులనెల్ల వెడలగొట్టవలెనని నిశ్చయించుకొనెను.

## (2)

## జాతీయసంఘములు

ముస్తఫా కెమాల్ అనటోలియాలో జాతీయసంఘములను స్థాపింప ప్రారంభించెను. సాసూనుపట్టణమున నొక జాతీయసంఘమును స్థాపించి దాని యాజమాన్యమున నొక చిన్న జాతీయసైనికదళము నేర్పాటుచేసెను. రూయఫ్ బే స్మర్నాకు పోయి యచట నొక జాతీయసంఘమును, జాతీయ సైనికదళమును ఏర్పాటుచేసెను. ఇటుల వీరిద్దరును కొలదికాలములో పెక్కుచోట్ల జాతీయసంఘములను, జాతీయసైనికదళములను ఏర్పాటు చేయగలిగిరి.

## ఎర్జరము సభ

ఈవిధమున ప్రజ్వరిల్లుచున్న తురుష్క జాతీయశక్తులనన్నిటిని కేంద్రీకరింపజేసి జాతీయవాదుల కేకభావమును ఏకకార్యక్రమమును కలుగ

జేయుటకుగాను 1919 సంవత్సరం జులై నెల 23 వ తేదీన ఎర్జరమునందు తురుష్కజాతీయవాదులసమావేశము జరుపబడెను. ముందు జరుగవలసిన కార్యక్రమమంతయు నీ సభయందు చర్చింపబడి నిర్ణయించబడెను. చాల కాలమువరకీ సమావేశముయొక్క తీర్మానములు రహస్యముగ నుంచబడెను. కొంతకాలము తరువాత వానిని కాన్‌స్టాంటినోపిలులోని మిత్రమండలివారి హైకమీషనర్లకు పంపిరి. ఈ సమావేశమునందు "జాతీయహక్కులను సంరక్షించుటకుగాను అనటోలియా రుమేలియా సంరక్షకసమితి" అను సంఘము నేర్పాటుజేసిరి. కొంతకాలమున కీ సంఘమునకు "జాతీయసంఘము". (National Organisation) అను నామకరణము చేయబడెను. ఈ సమావేశమునందు తురుష్కములో విప్లవమును సాగించుటకు సిద్ధాంతములు కార్యక్రమము నిర్ణయింపబడి తీర్మానములు చేయబడినవి.

## శైవాసుసమావేశము

రెండునెలలతరువాత 1919 సంవత్సరము సెప్టెంబరు 4 వ తేదీన శైవాసుపట్టణమున తురుష్కజాతీయవాదుల ద్వితీయసమావేశము జరిగెను. ఈ సమావేశమునందు తురుష్కజాతీయవాదుల ఆశయములు స్పష్టీకరింపబడి, తురుష్కజాతియొక్క హక్కులనుగూర్చిన యొక సుప్రసిద్ధ ప్రకటన గావింపబడి, వీనిని అమలుజరుపుట కొక బలవత్తరమైన కార్యనిర్వాహక వర్గ మేర్పరుపబడినది. ముందు జరుగనున్నపనికంతకును గట్టిగ పునాదులు వేయబడినవి. ప్రథమసమావేశమునకంటె ద్వితీయసమావేశమున కెక్కువ ప్రాంతములనుండి ప్రతినిధులు వచ్చియుండిరి. ప్రతినిధులందరును అకుంఠితమగు దేశాభిమానమును, ఎట్టికష్టములకైన నోర్చి మాతృదేశస్వాతంత్ర్యమును కాపాడుకొనవలెనను దృఢసంకల్పమును కలిగియుండిరి.

## శైవాసుప్రకటనము

"తురుష్కజాతీయఐక్యతను స్వతంత్రతను కాపాడుకొనవలెను. తురుష్కదేశపు సరిహద్దులలోపల ప్రత్యేక స్వతంత్ర గ్రీకురాష్ట్రమును ఆర్మీనియారాష్ట్రమును నిర్మింపజేయవలెనను ప్రయత్నములను సర్వవిధముల

నెదిరించవలెను. ప్రస్తుతము విదేశీయులచేతిలో నిస్సహాయులుగనున్న సుల్తానును ఖిలాఫతును విదేశీయులబారినుండి స్వతంత్రముగ నుందునటుల సంరక్షించవలెను. తురుష్కదేశప్రభుత్వము ప్రజలచే నెన్నుకొనబడిన ఎసెంబ్లీ (శాసనసభ)కు లోబడి నడుపబడవలెను. తురుష్కసుల్తానులచే నిదివరకు విదేశస్థుల కీయబడిన ప్రత్యేకపుహక్కులన్నియు నిర్మూలనముచేయవలెను" అని శైవాసునందు చేయబడిన ప్రకటనమునందున్నది.

## కార్యనిర్వాహకవర్గము

ఈ యుద్దేశ్యములను దేశములో వ్యాపింపజేయుటకును ప్రతిచోటను జాతీయసంఘములను ఏర్పాటుచేయుటకును, జాతీయసైన్యములను పోగుచేయుటకును, ఈ యుద్దేశ్యములను నెరవేర్చుటకు వలయు సమస్త యితర కార్యములను చేయుటకును ఒక కార్యనిర్వాహకవర్గ మేర్పరుపబడెను. కార్యనిర్వాహకవర్గమునకు ముస్తఫా కెమాల్ పాషా యధ్యక్షుడుగ నేకగ్రీవముగ ఎన్నుకొనబడెను. తక్కిన కార్యనిర్వాహకసభ్యులును ఏకగ్రీవముగనే ఎన్నుకొనబడిరి. వారిలో మొదటివా డిదివరకు సుల్తానువద్ద నావికామంత్రిగ పనిచేసినవాడును, బాల్కను యుద్ధములలో గ్రీకులతో పెక్కు నావికాయుద్ధములుసలిపియుండిన ధీరుడును, ముస్తఫా కెమాల్ పాషాకు ముఖ్యస్నేహితుడు నగు రూయఫ్‌బే. ఈయన పెక్కుమంది నావికసైన్యోద్యోగస్తులను జాతీయోద్యమములోనికి తెచ్చెను. రెండవవాడు బేకరు సమీ బే. ఈయన పూర్వము అనటోలియాకు గవర్నరుజనరలుగ పనిచేసెను. మూడవవాడు అహమ్మదు రుస్తం బే. ఈయన వెనుక అమెరికాలో తురుష్కరాయబారిగ నుండెను. నాలుగవవాడు వెనుక బిట్లిసురాష్ట్రమునకు గవర్నరుపనిచేసిన మహాజరు బే. అయిదవవాడు ఖర్పూటురాష్ట్రమునకు గవర్నరుపనిచేసియుండిన హైదరు బే. మిగిలిన యిద్దరును సుప్రసిద్ధ దేశాభిమానులగు ఖ్వాజా రాయిఫ్ ఎప్పెండి, హాకి బేహోజు బే గార్లు. ఇట్టి మిగుల పలుకుబడిగలిగిన సుప్రసిద్ధమగు కార్యనిర్వాహకవర్గ మేర్పడినది.

ఇంతటినుండియు కార్యనిర్వాహకవర్గమువారు అంగోరాపట్టణమున తమ కార్యస్థానము నేర్పరచుకొని పనిచేయుటకు తీర్మానించబడెను. వీరందరును అంగోరాలో కాపురముండి పనిని నడుపవలెను. ఎర్జరము శైవాసు పట్టణ

ములకన్న జాతీయోద్యమమునకు అంగోరాపట్టణమే ముఖ్యస్థానముగ నుండుటకు మిగుల తగియున్నదని తలచిరి. అంగోరాకు కాన్‌స్టాంటినోపిలుతో తంతిసంబంధము గలదు. అక్కడ జరుగుచున్న సమచారములు ఎప్పటికప్పు డంగోరాలో తెలిసికొనుచుండవచ్చును. మరియు అంగోరాపట్టణ మన టోలియారైలుయొక్క శాఖమీద నున్నది. కావున అంగోరా తురుష్క జాతీయవాదులకు ముఖ్యపట్టణముగ చేసికొనబడినది.

## జాతీయసైన్యములు

దేశములో నక్కడక్కడ శాంతిని కాపాడుట కుంచబడిన ప్రభుత్వ సైనికదళములనెల్ల కలిపి జాతీయసైన్యముగా మూర్చిరి. మరియు విరివిగ క్రొత్తసైన్యములను చేర్చుచుండిరి. జాతీయసైన్యములపైన మిగుల సుప్రసిద్ధులగు నిరువురు తురుష్కసేనాధిపతులను నియమించిరి. తూర్పు అనటోలియాసైన్యములపైన క్వారా బేకరు కైజీం పాషాను సర్వసేనాధిపతిగా నియమించిరి. పశ్చిమ అనటోలియాసైన్యములపై బాల్కనుయుద్ధములలో పైజనీకోటయొక్క సంరక్షకుడుగ కీర్తిని గడించిన అలిఫువాదు పాషాను సర్వసేనాధిపతిగ నియమించిరి. అంగోరాలో రాజకీయసభలు జరిగి రాజ్యాంగ నిర్మాణము గావింపబడుచున్నను 1919 సంవత్సరము ఆఖరువరకును జాతీయ వాదుల ముఖ్యప్రయత్నములు జాతీయసైన్యములను వృద్ధిచేసికొని బల పర్చుకొనుటలో నిమగ్నమైయుండెను.

## (3)

## అంకారా పట్టణము

అంగోరా (అంకారా) జాతీయవాదులకు కార్యస్థానముగచేసికొనుటకు ప్రబలకారణములు గలవు. జాతీయవాదులు విప్లవమునకు యత్నించుచున్నారు. రాజధానిలోని సుల్తానుయొక్క ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించుచున్నారు. పనులన్నియు రహస్యముగచేయబడవలసియున్నవి. అందువలననే జాతీయవాదులు తమసమావేశములను దేశమధ్యమున చొరశక్యముగాని ఎర్జరము, శైవాసుపట్టణములలో జరుపుకొనిరి. అంగోరా దేశమధ్య

మున పర్వతపంక్తుల ప్రక్కన నున్నది, అచట భద్రత గలదు. రహస్యముగ వ్యవహారములను నడుపవచ్చును. ఏక్షణమందైనను జాతీయవాదుల పైకి మిత్రమండలిచే సుల్తానుయొక్క సైన్యములు పంపబడవచ్చును. వానినుండి కాపాడుకొనుటకు అంగోరాయందే ఎక్కువ సౌకర్యములు గలవు.

## శౌర్యమును గ్రక్కుచున్నది

అంగోరా పూర్వపు గ్రీకుభాషలో అంకారా యని పిలువబడుచుండెను. అంకారా యనగ పడవచుక్కాని యని యర్థము. అనాదినుండియు నిది మంచి సైనికస్థానము. దీనికివెనుకనున్న పర్వతపంక్తులు కోటగోడలవలె నభేద్యములుగ నున్నవి. ఆ పర్వతములలో నొకదానిమీద పూర్వులు నిర్మించినకోట నిలిచియుండి చారిత్రాత్మకప్రాముఖ్యమును చాటుచున్నది. ఆ కోట చాలవరకు శిథిలమైపోయినను ఒక బురుజుమాత్రము దృఢముగ నిలిచి సంరక్షణకు తోడ్పడుచున్నది. చుట్టుపట్లనూడ నాగరికప్రదేశములు లేవు. ఎడారిప్రదేశములే గలవు. గాని బహిఃప్రపంచముతో రాకపోకలు చేయుటకు రైలుమార్గమును, కాన్‌స్టాంటినోపిలుతో తంతిసంబంధమును గలవు. వీలుకొలది రైలువేను తంతిని రాకపోకలుచేయుటకును, సమాచారములు తెప్పించుకొనుటకును ఉపయోగించవచ్చును. అపాయకరముగనున్నపుడు వానిసంబంధములను తెగగొట్టివేయవచ్చును. మరియు రాజధానియగు కాన్‌స్టాంటినోపిలులో విదేశీయులు పెక్కుమంది కాపురముండియున్నారు. అది అన్నిజాతులకును సంబంధించిన నగరము. అంగోరా కేవలము తురుష్కపట్టణము. తురుష్కముయొక్క మధ్యభాగముననుండి, ఎటుచూచినను తురుష్కులే కాపురమున్న ప్రదేశములే గలిగి, తురుష్క జాతీయభావమును, దుఃఖమును, దుఃఖమునుండి యుత్పన్నమైన వీరావేశమును వెలిబుచ్చుచున్నది. దానివెనుక శిథిలమైయున్న కోటగోడలు తమ పూర్వపుటౌన్నత్యమును ప్రస్తుతదుస్థితిని సదా జ్ఞాపకముచేయుచున్నవి. అచటి పర్వతపంక్తులు శౌర్యమును స్థయిర్యమును పురిగొల్పుచున్నవి.

## దేశాభిమానులగృహము

కాని అంగోరాపట్టణ మొక చిన్న పాడుబడిన పట్టణము. వీథులు ఇరుకుగను అపరిశుభ్రముగను నుండును. తరుచుగ చలిజ్వరములు, బంక

విరేచనములు జనులను బాధించుచుండును. అయినను ఈ పట్టణముననే విప్లవమును రహస్యముగను సురక్షితముగను నడపుచు నలువైపులకు సైన్యములను పంపుటకు వీలుగనున్నదని జాతీయవాదులు తలచి దీనిని తమ ముఖ్యపట్టణముగ చేసికొనిరి. ఇంతటినుండియు అంగోరాచరిత్ర తురుష్క-విప్లవచరిత్రతో సమ్మేళనముచెందినది. తురుష్క-జాతికి అంగోరాచరిత్ర పవిత్రమైన యితిహాసమైనది. బానిసత్వమునుండి ముందుతరములవారిని తప్పించుటకు, తురుష్క-దేశాభిమానులు మిగుల అందమయిన నగరములను మంచి గృహవసతులను కుటుంబసౌఖ్యమును ధనమును ప్రపంచములోగల యావత్తు సుఖములను వదలి, తమనాయకునితో గూడ అనుకూలమగు శీతోష్ణస్థితులు గలిగి యెడారిమధ్యమునసుండి పాడుపడిన పట్టణమగు అంగోరాలో ప్రవేశించిరి. కాన్‌స్టాంటినోపిలువద్ద సముద్రములోగ్రుంకిన తురుష్క-స్వాతంత్ర్యభానుడు అంగోరాకొండలలో మరల నుదయించెను. తురుష్కుల పోరాటము జయప్రదముగ ముగిసి నూతన తురుష్క-జాతీయప్రభుత్వ మేర్పడినపిమ్మటగూడ అంగోరాయే తురుష్క-దేశమునకు ప్రధానపట్టణముగ విలసిల్లుచున్నది.

## ఆంగ్లేయగ్రంథకర్త్రివ్రాతలు

తురుష్క-దేశమును పెక్కు-సార్లు దర్శించి "ఈదినమున నున్న తురుష్కము" అను గ్రంథమును (Turkey Today) రచియించిన ఆంగ్లేయ గ్రంథకర్త్రి గ్రేసు ఎలిసన్ అనునామె తనగ్రంథమునందు అంగోరానుగూర్చి ఇట్లు వ్రాసియున్నది :

"తురుష్క-ప్రజాస్వామికము స్థాపింపబడిన ఇతిహాసము మానవచరిత్రలో మిగుల తేజోవంతమయినది. ధనమును, ఉద్యోగములను, గృహములను, సౌఖ్యమును, స్నేహితులను వదలి మాతృదేశముయొక్క- మోక్షము కొరకు తమ గొప్పనాయకునితోగూడ ఎడారిపట్టణమగు అంగోరాకు లేచిపోయిన దేశాభిమానుల చిన్నబృందమునుగూర్చి యే జాతియైన గర్వించక మానదు.... ....... ఈ కథ శరీరబాధలను సాంఘికకష్టములను నోర్చి, ఇతరులతో చెప్పుకొనకుండా త్యాగములనుచేసి, ఆదర్శములకొరకు సర్వస్వమును, ప్రాణములైనను గోల్పోవుటకు నిశ్చయముకలిగిన ధీరులయొక్క-

కథ. తమ నాయకునియొక్క కుశాగ్రబుద్ధియందును, తమదేశమును సేవిం చుట కాయనకుగల దృఢదీక్షయందును, గట్టివిశ్వాసముతప్ప వా రాధారపడ దగినదేమియు లేదు. ప్రతిసందర్భమును వారికి వ్యతిరేకముగనే యుండెను. ఏవిధమైనసౌఖ్యము లేకుండుట, ప్రజలయొక్క చెప్పనలవిగాని దారిద్ర్యము పిల్లలయుపవాసములు, అనటోలియాలోని దుస్సహమైన శీతోష్ణస్థితులు, యుద్ధసామగ్రులయొక్క అపరిమితమగుధరలు. మిగుల కొద్దిగగల యాశ తోడనే తల్లితండ్రులు తమ కుమారులను సంతోషముతో నిచ్చిరి. ఆకలిచే బాధనొందుచున్నట్టియు చినిగిపోయినగుడ్డలను ధరించినట్టియు స్త్రీలు ఆయుధ సామగ్రులను యుద్ధమునకై తయారుచేసిరి. మాతృదేశసేవయే వారికి నూతనమగు మతమైనది.

“అపజయములోనుండి జయము బలవంతముగ లాగుకొనవలసి వచ్చినది. మిత్రమండలివారిలో నేర్పడిన యభిప్రాయభేదములను మిగుల బుద్ధికుశలతతో ముస్తఫా కెమాల్‌పాషా ఉపయోగించుకొనగలిగినను, ఇంత తక్కువ సహాయముతో ప్రతిఘటనమునకు సిద్ధపడిన జాతి మరియొకటి లేదు. పోరాటము ప్రారంభమయినపుడు, మానవాతీతమగుకార్యములు చేయు దినములు పోయినవనియు, ముస్తఫా కెమాల్‌పాషా జయమునుపొందుట అసాధ్యమనియు యూరపుఖండములోని యొక రాజకీయవేత్త చెప్పెను. “ముస్తఫా కెమాల్ మిగుల ధైర్యముతో పోరాడునని మనకు తెలియును. కాని సంగ్రామమధ్యమున నాశనమగును. ఆయనవద్ద ద్రవ్యములేదు. భోజన సామగ్రి లేదు. యుద్ధపరికరములు లేవు. ఆయనకువ్యతిరేకపక్షమున నెంత యున్నదో చూడుము. గ్రీకులకు మిత్రమండలివారియండ యుండుటయే గాక, తురుష్కసుల్తాను ఉత్తరమునను, ఆర్మీనియనులు తూర్పునను, ఫ్రెంచి వారు దక్షిణమునను సహాయముచేయుచున్నారు” అని ఆయన చెప్పెను. కాని అద్భుతమగుకార్యమే జరిగినది. తురుష్కజాతీయవాదులు జయమును పొందినారు. అంగోరాకథ మానవచరిత్రలో స్మరణీయమై నిలిచినది........ ప్రపంచయుద్ధము ముగియునాటికి మిగుల దైన్యమగుస్థితిలోనికి క్రుంగి, యుద్ధములలో నోడిపోయి, ఆర్థికముగను నైతికముగను నాశనమైన తురుష్కజాతివలె గొప్ప జయమును సంపాదించిన మరియొకజాతి, మానవ నాగరికత ప్రారంభమయినప్పటినుండియు నగుపడుటలేదు. తురుష్కములో

ప్రజాస్వామికస్థాపనము విస్మయమని చెప్పబడుచున్నది. ప్రజలు మానవ జీవితమునందు మిగుల అథోగతినిపొందిన సమయమున స్వాతంత్ర్యప్రకటనము గావింపబడుటను జాతీయపునరుద్ధరణమని పిలుచుట యుక్తమైన సమంజసముగ నుండును.

"సుల్తాను హామీదు తురుష్కదేశమును నిరాశకు బాల్పడజేసెను. ప్రతి ప్రభుత్వశాఖయు లంచగొండితనముతోను దుష్ప్రవర్తనతోను నిండి యుండెను. దేశములోని యోగ్యులైన అందరు పురుషులను, స్త్రీలను ప్రభుత్వమువారు అనుమానించుచు, వారందరియెడను పోలీసునిగహమువేసిరి. మిక్కిలి కట్టుదిట్టములతో పోలీసుఉద్యోగస్థులు వీరినందరిని వెంటాడుచుండిరి. ప్రక్కయింటివారితో మాట్లాడుటకుగాని సత్యమును రహస్యముగ చెప్పుటకు గాని భయముకలిగెను. ఉత్కృష్టభావములన్నియు నాశనముచేయబడుచుండెను..............గాని 1908 సంవత్సరమున యుద్ధముతేలకుండగనే సుల్తాను హామీదు యౌవనతురుష్కులచే రాజ్యభ్రష్టుడు గావింపబడెను. తురుష్కదేశములో కొంత ధైర్యము కలిగెను. ఐక్యత అభివృద్ధిసంఘమువారు గొప్ప వాగ్దత్తములను ప్రజలకు చేసిరి. గాని ఆకాచంద్రునిమీద మేఘములు త్వరలోనే క్రమ్మెను. నూతనాదర్శములకు త్వరలోనే స్థానము పోయెను. నైతికక్షీణదశ దేశములో మరల వ్యాపించెను. ప్రపంచయుద్ధము ముగిసినతరువాత జరిగిన ముద్రాసు తాత్కాలికసంధిలో అపజయము దుఃఖము పూర్తియైనవి. దేశమునకు నాయకుడు లేడు. వారిసుల్తాను శత్రువులచేతిలో నున్నాడు. వారిఆశలు శాశ్వతముగ మంటగలిసినవి. ఉద్యోగస్థులు ప్రభుత్వముయొక్కబొక్కసములోనిద్రవ్యము నపహరించి దేశమునువిడిచి పారిపోయిరి. దేశములో మిగిలిన యుద్యోగస్థు లెట్టి అవమానకరమైనషరతులనైన మిత్రమండలినుండి యంగీకరించుటకు సిద్ధముగనుండిరి.

"అట్టిసమయమున ముస్తఫా కెమాల్ ముందునకువచ్చి నిలిచెను. వెంటనే దేశమునుకాపాడుటకు పూనుకొనెను. తన ప్రజలకు స్వాతంత్ర్యమును సంపాదించుట కొంటరిగ శైవాసుపట్టణమున దిగెను.

"మీ రెప్పుడైన ధైర్యమును కోలుపోతిరా?" అని నేను ముస్తఫా కెమాల్ పాషా నడిగితిని.

"ఎప్పుడును లేదు. భయము మిగుల అపాయకరమైనది. మనము ఏమిచేయవలయునో నిశ్చయించుకొనవలెను. దానిని చేయవలెను. నైతికముగ మిగుల క్షీణదశను పొందినను తురుష్కుల సహజస్వభావమును నే నెరుగుదును. వారి కొక నాయకుడు మాత్రము కావలసియుండెను. వారి యందు విశ్వాసముంచి వారి యుత్తమగుణములను పైకి లేవతీయగలవాడు కావలసియుండెను. నేను చేయగలిగియుండినదానిని గూర్చి యతి గొప్పగ చెప్పగూడదు. ప్రపంచములోని యే మంచిపనివాడును, ఉత్తమసేనానియు మంచి పనిముట్లులేనిది యేమియు చేయజాలడు. నా పనిముట్లు మంచివని నాకు నమ్మకమున్నది. వాటినుపయోగించుటయే నా ధర్మమైయున్నది." అని ఆయన బదులుచెప్పెను.

ఈ భయంకరమైనబాధల ననుభవించుచు కష్టపరంపరలలో గడిపిన దినములు లేకుండ చేయలేకపోతిరా ?" అని నేను మరల ప్రశ్నించితిని.

"ఇప్పు డవన్నియు పోయినవి. వానివలన మా కేమియు హానికలుగ లేదు. అవి మా జాతి కైక్యతను ఉత్తమస్థితిని ప్రసాదించెను" అని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను.

* * * *

"తురుష్కులకు అంగోరాకథ పవిత్రమైన చరిత్రయయి వెలయు చున్నది, ఆ కథ తెలిపెడి యుత్కృష్టమగు ధీరత్వమును దూరదృష్టిని వివేకమును గ్రహింపకుండుట బుద్ధిపూర్వకమగు గ్రుడ్డితనము. రమజాను పండుగలో తప్ప మిగిలిన దినములలో నిపుడు మసీదులు జనముతో క్రిక్కిరిసి యుండుటలేదు. కాని స్వతంత్రపోరాటమునుగూర్చి యెవరైన నుపన్యసించినను, సినిమాప్రదర్శనమునందు చూపినను అతివిశేషముగ జనులు వచ్చెదరు. స్వతంత్రపోరాటపుకథ వారికి కంఠతఃవచ్చును. అయినను మరలమరల నెన్నిసారులు ఆ కథ నెవరు చెప్పినను వినుటలో విసువుచెందరు. కథచెప్పువారు జయమునుపొందినభాగమును సమీపించునరికి ప్రజలు సంతోషములో నోలలాడి ఆకసము బ్రద్దలగునట్లు కరతాళధ్వనులు గావింతురు. ప్రతివారి కన్నులనుండియు దుఃఖముతోడను సంతోషముతోడను కూడిన బాష్పములు రాలును. కన్నీటి నెవరును ఆపుకొనజాలరు. "మేము ఎన్నిసారులు యీ

కథను విన్నను మాకు తనివితీరదు. అది మా వేదము. అది మా పురాణము. వెనుకటి దినములలో హత్యలుగావించిన సుల్తానులయొక్కయు బందిపోటులుచేసిన బందిపోటుగాండ్రయొక్కయు కథలను చెప్పినచో నాహ్లాదకరముగ వినుచుండెడివారము. ఇప్పుడు స్వతంత్రతయొక్కయు,శాంతియొక్కయు కీర్తనలను అల్లుచున్నాము; మా కవీశ్వరులు మే మనుభవించినబాధలను గూర్చియు వానిలోనుండి పొందిన జయమునుగూర్చియు వ్రాయుచున్నారు. మా బడిపిల్లలు వానిని వల్లించుచున్నారు. మా జాతియొక్క గొప్ప యితిహాసమును వారు జ్ఞాపకముంచుకొనుచున్నారు. మేముకూడ నా యితిహాసమును మా హృదయఫలకములపై వ్రాసుకొని పవిత్రమయినవానిని ధ్యానము చేసినటుల మననముచేయుచున్నాము." అని యొకమిత్రుడు నాతో చెప్పెను.

"ఈ యుపన్యాసములలో కొన్నిటికి నేనుకూడ హాజరైతిని. ఉపన్యాసకునిభాష నాకు తెలియకపోయినను ఆయనయొక్కభావములను, ఆయన యుపన్యాసమును వినిన ప్రజలలో కలిగిన అత్యంతమగు భావోద్రేకమును నేను బాగుగ గ్రహింపగలిగితిని. మతగురువు ప్రార్థనచేయగనే అందరు ప్రజలును కలిసి గాఢమగు దైవభక్తితో నా ప్రార్థనను మరల చెప్పినటుల వలె నుండెను. ఆ ప్రజలందరును తమ మాతృభూమికొరకు ప్రార్థించుచున్నటుల గోచరించెను. బాధలనుండి కలిగిన జాతీయజీవితములో తమ జవాబుదారీలను వారు నేర్చుకొనుచుండినటుల గోచరించెను. వారిమధ్యనుండిన విదేశీయురాలి కా యనుభవము ఆశ్చర్యకరముగ నుండెను.

"తురుష్కము మహమ్మదీయమతము నవలంబించుచున్నటులే ప్రకటించుచున్నది. కాని దేశారాధనమే యా ప్రజల మతమనియు, జాతీయ సమాఖ్యయే వారి ప్రార్థనగ్రంథమనియు, స్వాతంత్ర్యపోరాటయితిహాసమే వారి పురాణమనియు నా దేశమును దర్శించిన యెవరికైనను గోచరించుట కెంత కాలమో పట్టదు. జాతీయసమాఖ్యయొక్క నకలు ప్రతిచోటను పరుండుసెజ్జ మీద కనపడును. చాలమంది దానిని జేబులలోనిడికొని తీసుకొనిపోవుదురు.

"ఒకమిత్రు డిటుల నన్నడిగెను: "నాకు స్వాతంత్ర్యమును ప్రసాదించిన గ్రంథముకంటె నెక్కువ పవిత్రమగునది నా కేమి యుండగలదు? అందులోని యేవాక్యమునైనను తీసిచూపుడు. దానినిగూర్చి యొక గంటసేపు

మీకు బోధించగలను. మతగురువులయాజ్ఞననుసరించి మేము ఖురానును వల్లించుచున్నాము. దానిమాటల కర్థము మాకు తెలియదు. దానివలన మాకు భావోద్రేకము కలుగుటలేదు. జాతీయసమాఖ్యయొక్క ప్రతిమాటకు పూర్తి యగు అర్థము నాకు తెలియును. నా భార్యకు నా పిల్లలకుగూడ తెలియును. పాత మతముల రోజులు పోయినవి. ప్రజలను మేల్కొలిపి పునరుద్ధరణము గావించుట కొరకు క్రొత్తమతము మాకు కావలసివచ్చినది. జాతీయోద్యమము లోను మాయొక్క పునర్జన్మయొక్కకథలోను నూతనమతమును మేము కను గొంటిమి. తూర్పుదేశములలోని యన్నిజాతులలోను ఈ నూతనమతము వ్యాపించినపుడు మీరేమి కనుగొందురో—"

"కాని, జపానుదేశము" అని నేను అడ్డుచెప్పితిని. "ఎవరును చూడకముందు జపాను తన దుస్తులను తన నాగరికతను మార్చుకొన్నది. ఇతరులు మేల్కొనకముందే జపాను క్రొత్తజాతిగ మార్పుచెందినది. వారికి పోరాటములేదు. వర్తకమునందు వారు బాగుగ సంపాదించినారు. గొప్ప వారని యంగీకరింపబడినారు. కాని మేము తూర్పుదేశములవారందరికిని మార్గదర్శకులమయియున్నాము" అని ఆయన బదులుచెప్పెను.

"తరువాత కొన్నిదినములకు నేను బీరటునుండి జరూసలేముపట్ట ణమునకు (పాలస్తైన్‌దేశములోని ప్రధానపట్టణము) పోయినాను. త్రోవ పొడుగునను ప్రతిచోటను నన్ను ప్రజలడుగుచువచ్చినప్రశ్నలవలన ఆ మిత్రునిమాటల యథార్థత నాకు గోచరమయ్యెను. సిరియాదేశప్రజలలో జాతీయభావములు బాగుగ నాటియున్నవి. వారికి తురుష్కులయందు ప్రేమ లేదు. కాని ప్రాగ్దేశములయొక్క స్వతంత్రనాయకునిగ వారు ముస్తఫా కెమాల్ పాషాను గౌరవించుచున్నారు. మాకు ముస్తఫా కెమాల్ ఏడీ? మాలో ముస్తఫా కెమాల్ ఎప్పుడు పుట్టును? తప్పక యొకరోజు పుట్టగలడు" అని వారు చెప్పుచున్నారు.

"పాలస్తైనులోకూడ అటులనే కోరుచున్నారు. ఆ దేశములో నాంగ్లే యులరాజనీతి అరబ్బుల కన్యాయముగను యూదులకు క్రూరముగను పరిణ మించినది. పాలస్తైన్‌ప్రజలుకూడ ముస్తఫా కెమాల్‌వంటి రక్షకుడు కావలె నని పరితపించుచున్నారు. పాలస్తైన్‌లోను సిరియాలోను అరేబియాలోను

బజారులలో తిరుగు సామాన్యమనుష్యులుకూడ ముస్తఫా కెమాల్‌ను అవ తారపురుషునిగ భావించుచున్నారు. ముస్తఫా కెమాల్ వంటిధీరుడెవడో వారికి స్వేచ్ఛను కలుగచేయవలసియున్నది.

"నేను జరూసలేముపట్టణమును చేరినతరువాత నచటి మసీదులోనికి పోవ యత్నించితిని. అది పూర్వము క్రైస్తవులయాత్రాస్థలము. దానిని మహమ్మదీయు లాక్రమించి మసీదుగ మార్చిరి. నేను క్రైస్తవురాలను గావున నన్ను లోనికి రానీయలేదు. నేను లోనికిపోవుటకు పట్టుదలను చూపితిని. కాని నెట్టివేసిరి. తురుష్క దేశములో నెంత మతస్వేచ్ఛ గలదో ఇచట నంత యన్యాయముగ నున్నదే, అని యంటిని. అచటి మతగురువు వెంటనే "శ్రీ దొరసాని తురుష్కదేశము నెరుగునా? ముస్తఫా కెమాల్ పాషాను చూచి నదా?" అని ప్రశ్నించెను. నేను ముస్తఫా కెమాల్‌పాషాను ఎరుగుదును అని చెప్పుటతోడనే ఆయన తలుపుతీసి నా కాలిపాదరక్షలను గుడ్డలోచాచి మసీదు లోనికి మిగుల వినయముగ గొనిపోయి దానియొక్క సమాధినగ్గరకు తీసి కొనిపోయి చూపెను. నన్ను ముస్తఫా కెమాల్‌నుగురించి చెప్పుమని బతి మాలిరి. నేను చెప్పినదానినిసంతను అచటిప్రజలు మిగుల శ్రద్ధాభక్తులతో వినిరి. తాముకూడ తురుష్కులవలె త్యాగములుచేసి పురుషులకును స్త్రీల కును స్వతంత్రతను కలుగచేయు ప్రజారాజ్యమును నిర్మాణముగావించుకొన వలెనని తూర్పుదేశములవారు నేర్చుకొనినారు.

"తురుష్కుయొక్క భావిస్థితి యేమయినను అంగోరాయొక్క కథ మానవచరిత్రలో శాశ్వతముగ నుండగలదు." అని వ్రాసియున్నది.

—:o:—

# తురుష్కప్రజాస్వామికము

## 6 తురుష్కజాతీయసమాఖ్య

(Turkish National Pact)

(1)

### క్రొత్తఎన్నికలు

1919 వ సంవత్సరము అక్టోబరునెల 5 వ తేదీని కాన్‌స్టాంటినోపిలులోనున్న ప్రధానమంత్రియగు దామాదు ఫరీదు పాషా రాజీనామా నిచ్చెను. ఆయనకుబదులుగ ఆలీ రిజబే ప్రధానమంత్రియయ్యెను. సుల్తాను ప్రజాప్రతినిధిసభను సమావేశపరుప సంకల్పించి ఎన్నికల కుత్తరువిచ్చెను. దేశమందంతటను జాతీయవాదులు ఎన్నికలలోనిలిచి నూతనప్రజాప్రతినిధిసభలో (పార్లిమెంటులో) మిగుల నధికసంఖ్యాకులుగ నెన్నుకొనబడిరి. నూతన ప్రధానమంత్రికూడ జాతీయవాదులకు వ్యతిరేకుడుకాడు.

### పార్లమెంటు జాతీయసమాఖ్య నంగీకరించుట

అంగోరాలో జాతీయవాదులకార్యనిర్వాహకసభ జరిగెను. ఎర్జరమునందు అవలంబింపబడియుండిన కార్యక్రమము ననుసరించి ముస్తఫా కెమాల్‌పాషాచే తయారుచేయబడిన జాతీయసమాఖ్య యను అత్యంత ముఖ్యమయిన దస్తావేజును చర్చించి యంగీకరించిరి. ఇంకను కార్యనిర్వాహక సమావేశములు జరుగుచుండగనే నూతన తురుష్కపార్లమెంటున కెన్నుకొనబడిన సభ్యులెల్లరును అంగోరాలో సమావేశమైరి. నూతనపార్లమెంటుకు నాయకుడుగ ముస్తఫా కెమాల్ పాషాకు పరమమిత్రుడగు రాయఫ్ బే ఎన్నుకొనబడెను. అంగోరాలో సమావేశమైన తురుష్కపార్లమెంటుచే

జాతీయసమాఖ్య చర్చింపబడి అంగీకరింపబడెను. తురుష్క-జాతియొక్క-స్వాతంత్ర్యప్రకటన మీ జాతీయసమాఖ్యలో నిమిడియున్నది. "జాతీయ సమాఖ్యకొరకు మేము బ్రతుకుటయో చచ్చుటయో తేలవలసియున్న"దని ముస్తఫా కెమాల్ పాషా చెప్పెను. దీనిమీదనే రాబోవు తురుష్క-స్వాతంత్ర్యపోరాటమంతయు జరుపబడినది. కావున జాతీయసమాఖ్యయొక్క-ప్రధానసూత్రములు తెలిసికొనుట మిగుల నావశ్యకము.

## తురుష్క-జాతీయసమాఖ్య

## (National Pact)

"ఈ దిగువ చెప్పబడిన సూత్రములను పూర్తిగ గౌరవించుటవలన ప్రభుత్వముయొక్క-స్వాతంత్ర్యమును జాతియొక్క-అభివృద్ధిని నిశ్చయముగ పొందవచ్చుననియు; న్యాయమైనట్టియు శాశ్వతమైనట్టియు శాంతిని పొందుటకుగాను ఇతరజాతులమీదిరాజ్యమును త్యజించుటకు సిద్ధపడినారమనియు; ఈ సూత్రములు అమలుజరుగనిచో నిలుకడగలిగిన తురుష్క-రాజ్యముగాని సంఘముగాని నిలిచియుండుట అసాధ్యమనియు; అట్టోమాను ప్రజాప్రతినిధి సభవారు (పార్లమెంటువారు) గ్రహించి తీర్మానించుచున్నారు :-

1 వ సూత్రము : తురుష్క-సామ్రాజ్యములో సరబ్బులు అధికసంఖ్యాకులుగ కాపురమున్నట్టియు, 1918 సంవత్సరము అక్టోబరు 30 వ తేదీన జరిగిన తాత్కా-లికసంధివలన శత్రుసేనలస్వాధీనములోనున్నట్టియు ప్రదేశముల భావిస్థితి, యక్క-డ నివసించెడు ప్రజలు స్వేచ్ఛగ ఓట్లనిచ్చి నిర్ణయించుకొనినప్రకారము ఏర్పాటుకావలసియున్నది. కావున తాత్కా-లికసంధియొక్క- గీతలో చేరినను చేరకపోయినను మతముచేతను సాంఘికభావములచేతను ఆదర్శములచేతను త్యాగమువలన కలిగిన పరస్పరగౌరవముచేతను పరస్పరసాంఘికమగుహక్కు-లను గౌరవించుటచేతను ఐక్యమునుపొంది అట్టోమాను (తురుష్క-) మహమ్మదీయులచే అధికసంఖ్యాకులుగ నివసించబడుచున్న ప్రదేశములన్నియు కలసి అవిభాజ్యమైన స్వతంత్ర తురుష్క-ప్రభుత్వముక్రింద నుండితీరవలెను.

2 వ సూత్రము: ఇదివరకు ప్రజలసమ్మతులచేత మాతృదేశములో చేరిన మూడుజిల్లాలలోను అవసరమైనచో మరల ప్రజలసమ్మతులు తీసుకొనుట కభ్యంతరములేదు.

3 వ సూత్రము: పశ్చిమత్రేసుయొక్క భావిస్థితిగూడ అచటికాపురస్థులు స్వేచ్ఛగ నిచ్చెడి ఓట్లప్రకారము నిర్ణయించుట కభ్యంతరములేదు.

4 వ సూత్రము: ఖిలాఫతునకును సుల్తానుకును అట్టోమానుప్రభుత్వమునకును రాజధానియగు కాన్‌స్టాంటినోపిలుయొక్కయు మర్మరాసముద్రముయొక్కయు సంరక్షణమున కెట్టియపాయము వాటిల్లకుండ కాపాడుకొనవలెను. ఈ సూత్రమంగీకరింపబడినయెడల బాస్ఫరసుజలసంధిగుండ జరుగు ప్రపంచముయొక్క రాకపోకలనుగూర్చియు వర్తకమును గూర్చియు మేమును ఇతరప్రభుత్వములవారును కలిసి చేసికొనెడి ఏర్పాట్లు చెల్లగలవు.

5 వ సూత్రము: మిత్రమండలివారును వారిశత్రువులును చేసికొనిన సంధిషరతులప్రకారమే మాదేశములోని స్వల్పసంఖ్యాకములగు సంఘములయొక్క హక్కులన్నిటిని మేము శాశ్వతముగ కాపాడెదమని ప్రతిజ్ఞచేయుచున్నాము. అట్టిహక్కులే మా ప్రక్కదేశములలో స్వల్పసంఖ్యాకులుగనున్న మహమ్మదీయులకును ఇవ్వబడునని విశ్వసించుచున్నాము.

6 వ సూత్రము: మా జాతీయ, ఆర్థికాభివృద్ధిని పొందుటకును పరిపాలనను నవీనపద్ధతులమీద సౌష్ఠవముగ జరుపుటకును మా ఇష్టమైన విధానములను అమలుజరుపుటకును ఇతరదేశములన్నిటివలెనే మాకును సంపూర్ణమగు స్వాతంత్ర్యము, స్వేచ్ఛ యుండవలెను.

ఈకారణముచేత మా దేశములో రాజకీయ, ఆర్థిక, న్యాయవిచారణ మొదలగు విషయములలో నేర్పడియున్న ప్రత్యేకపుహక్కులకును నిర్బంధములకును మేము వ్యతిరేకులమైయున్నాము.

మేము ఇవ్వవలసినట్లు రుజువగు ఋణములను చెల్లించువిషయమున కూడ పైసిద్ధాంతమునకు వ్యతిరేకముగ జరుగకూడదు."

## సామ్రాజ్యభావము

ఈ జాతీయసమాఖ్యమూలమున తురుష్కులు సామ్రాజ్యభావమును **(Imperialism)**పూర్తిగ వదలినారు. జాతీయభావమును**(Nationalism)**

సంపూర్ణముగ స్వీకరించినారు. న్యాయముకొరకును శాశ్వతమగు శాంతికొరకును ఇతరజాతులమీద రాజ్యమును స్థాపించుట కొప్పుకొనినాముని యుపోద్ఘాతమునందే వ్రాసినారు. ప్రతిజాతియు సంపూర్ణమగుస్వాతంత్ర్యమును కలిగి ఆ జాతిలోచేరిన ప్రజలయిష్టప్రకారం నా జాతియొక్క పరిపాలనము జరగవలెననియు, ఒకజాతి మరియొకజాతిని లోబరచుకొని పాలించుట అధర్మమనియు మానవశాంతికిని కళ్యాణమునకును వ్యతిరేకమనియు నను సత్యమే జాతీయభావము.

## తురుష్కముయొక్క అవిభాజ్యత

తురుష్కజాతీయసమాఖ్యలోని మొదటిసిద్ధాంతము తురుష్కదేశమునకు విదేశీయులజోక్యములేని సంపూర్ణమగు స్వతంత్రత కలుగుట. వారేతుల పాలించుకొనవలెను; వారి యార్థికస్థితి మొదలు వృద్ధిస్పర్ధిపెందవలెను; వారేవటనుండి ఋణములు తెచ్చుకొనవలెను; వారిఋణము లెట్టుల తీర్పవలెను; అదియంతయు వారియిష్టము. దేశములోని ప్రజలందరికిని సమానమగుహక్కులు బాధ్యతలు నుండవలెను. విదేశీయులకుగాని స్వదేశీయులలోనేసంఘమువారికిగాని ప్రత్యేకహక్కులు అధికారములు నుండగూడదు. తురుష్క లధికసంఖ్యాకులుగ కాపురమున్న థ్రేసు, అడేలియా, స్మర్నా, కాన్‌స్టాంటినోపిలు, ఏడ్రియానోపిలు, ఎర్జరం, మోసలు మొదలగుప్రాంతము లన్నియు తురుష్కములోనే చేరవలెను. అర్మీనియనులు, గ్రీకులు స్వల్పసంఖ్యాకులుగను తురుష్క లధికసంఖ్యాకులుగను కాపురమున్నభాగములను తురుష్కదేశమునుండి విడదీయుటకు వీలులేదు. ఏభాగమునైనను తురుష్కములో చేర్చవచ్చునా లేదాయని సందేహముకలిగినపుడు ఆభాగములోని ప్రజలయొక్క నిర్బంధములకులోబడని సమ్మతులను (ఓట్లను) తీసికొని అధికసమ్మతులప్రకారము జరుపుట కభ్యంతరములేదు. ప్రజలకు స్వయం నిర్ణయపు హక్కుండవలెను.

## అరబుదేశములకు స్వయంనిర్ణయము

తురుష్కలకువలెనే ప్రక్కదేశములగు అరబుజాతులకును సంపూర్ణమగు స్వాతంత్ర్యముండవలెను. ఈ యరబుజాతులు ప్రపంచయుద్ధమునకు పూర్వము తురుష్కసామ్రాజ్యమునకు లోబడియుండినవి. యుద్ధకాలమున

మిత్రమండలివారు స్వాతంత్ర్యమిచ్చెదమని ఆశపెట్టి అరబుదేశీయులను తురుష్కులనుండి చీల్చి తురుష్కులపై తిరుగబాటులుచేయించిరి. యుద్ధము ముగియగనే తమకు సంపూర్ణమగుస్వాతంత్ర్యము కలుగునని అరబ్బులు ఆశపెట్టుకొనిరి. కాని యుద్ధము ముగిసినను ఫ్రెంచివారు అరబుదేశములలో సిరియాను, ఆంగ్లేయులు మెసపొటేమియా, హెజాజి, ట్రాన్సుజార్డను. పాలస్తైన్ దేశములను ఆక్రమించికొనియుండిరి. ఈ పాశ్చాత్యులు అరబుదేశములను వదలిపెట్టి అరబ్బులకు సంపూర్ణమగుస్వాతంత్ర్యము స్వయంనిర్ణయపుహక్కు కలుగవలెనని తురుష్కజాతీయసమాఖ్య కోరుచున్నది.

## స్వల్పసంఘములహక్కుల రక్షణము

తురుష్కజాతీయసమాఖ్యయొక్క మూడవసిద్ధాంతము, దేశములోని స్వల్పసంఖ్యాకములగు సంఘములయొక్క హక్కులను చక్కగ కాపాడు బాధ్యత యధికసంఖ్యాకములగు సంఘములవారిపై యున్నది. అంతేగాని స్వల్పసంఘముల కాపుదలనిమిత్త మొక విదేశప్రభుత్వముయొక్క జోక్యమవసరములేదు. తురుష్కదేశములో స్వల్పసంఖ్యాకులగు ఆర్మీనియనులయొక్కయు గ్రీకులయొక్కయు క్షేమమునకను మిషతో పాశ్చాత్య ప్రభుత్వములు తురుష్కములో జోక్యముకలుగచేసికొనుటకును అధికారము చలాయించుటకును ప్రయత్నించుచున్నవి. అటుల చేయుటకు పాశ్చాత్య ప్రభుత్వములకు హక్కులేదనియు స్వల్పసంఘములను తామే చక్కగా కాపాడు బాధ్యత పూర్తిగను శాశ్వతముగను వహించుచున్నామనియు తురుష్కజాతీయవాదులు ప్రకటించుచున్నారు.

ఈవిధముగ తురుష్కజాతీయసమాఖ్య జాతీయభావపూరితమై సామ్రాజ్యభావప్రతిఘటనమై తనరారుచు ఆసియాఖండజాతులకు మిగుల ప్రేమాస్పదమై విలసిల్లుచున్నది.

## (2)

## పార్లమెంటు రాజధానికిపోయెను

ఇటుల తురుష్కపార్లమెంటు అంగోరాపట్టణమున సమావేశమై తీర్మానములుగావించుచున్న సమయమున, ఈ పార్లమెంటు సరియైనప్రకా

రము కాన్స్టాంటినోపిలునగరమున ఆరవమహమ్మదుసుల్తానుయొక్క సమ్ముఖమున సమావేశమైనచో వారిని అంగీకరించెదమని మిత్రమండలియుద్యోగస్థులు ప్రకటించినందున, అంగోరాసమావేశము సంతటితో ముగింపుచేసి కాన్స్టాంటినోపిలులో సమావేశమగుటకు తీర్మానించిరి. ఈ పార్లమెంటు ప్రభుత్వపుచట్టముల ప్రకారమెన్నుకొనబడినది గావునను, కాన్స్టాంటినోపిలు ఇంకను తమకు రాజధానిగ నున్నదిగనుకను, మిత్రమండలియొక్క ప్రకటనను గౌరవించి, రాజధానిలో సమావేశమగుటకు రూయుఫ్‌బే నాయకత్వముక్రింద పార్లమెంటుసభ్యులలో నత్యధికసంఖ్యాకులు అంగోరాను వదలి 1920 వ సంవత్సరము జనవరినెల 11 వ తేదీని కాన్స్టాంటినోపిలుకు వెళ్ళిరి.

## జాతీయసమాఖ్యనంగీకరించెను

1920 వ సంవత్సరము జనవరి 28 వ తేదీని కాన్స్టాంటినోపిలు నగరమున తురుష్కపార్లమెంటు సమావేశమయ్యెను. తురుష్కజాతీయ సమాఖ్య మరల నా సమావేశమునందు చర్చింపబడి యేకగ్రీవముగా నంగీకరింపబడెను. న్యాయశాస్త్రప్రకారము ప్రజలచే నెన్నుకొనబడిన పార్లమెంటు సభ్యులు న్యాయశాస్త్రప్రకారము రాజధానిలోసమావేశమై మిత్రమండలియధికారులయెదుట జాతీయసమాఖ్య నేకగ్రీవముగ నంగీకరించి తీర్మానించుట జాతీయవాదుల కఖండవిజయమని చెప్పకతప్పదు. కాని కాన్స్టాంటినోపిలు నందు ప్రజాప్రతినిధిసభ సమావేశమగుట కదియే యాఖరుపర్యాయము.

## ఆంగ్లేయులు తురుష్కప్రముఖులను చెరసాలలో బంధించిరి

మిత్రమండలిలో ముఖ్యముగ నాంగ్లప్రభుత్వమువారిలో గొప్ప యలజడి కలిగెను. జాతీయసమాఖ్య యంగీరించుట యనగ మిత్రమండలిపై తిరుగబాటుచేయుటయని ఆంగ్లప్రభుత్వమువారు తలచిరి. ఇందుకు ప్రతీకారమునల్పుటకు నిశ్చయించిరి. తురుష్కదేశీయులపైన వెంటనే పశుబల ముపయోగించవలసినదని యచటి బ్రిటిషుఅధికారులు తమకు సిఫారసుచేసిరనియు, తురుష్కమును మంచి దెబ్బకొట్టి వారిమదము నణచివేయబోవుచున్నామనియు, లోబడియుండునట్లు గావింపబోవుచున్నామనియు మార్చినెల

10 వ తేదీన ఆంగ్లేయ విదేశాంగమంత్రియగు కర్జన్‌ప్రభువు ఆంగ్లేయపార్లమెంటులో చెప్పెను. మార్చి 15 వ తేదీని మిల్నిసేనానిక్రింద ఆంగ్లసేనలు కాన్‌స్టాంటినోపిలునగరముపై దండెత్తి యచటిప్రభుత్వపుకట్టడములనన్నిటి నాక్రమించి ఎదిరించిన తురుష్కులను కాల్చివేసి పట్టణమును స్వాధీనమొనరించుకొనిరి. కాన్‌స్టాంటినోపిలుకు బయటిప్రపంచముతోగల తంతిసంబంధమును ఆపివేసి యారాత్రి మిల్నిసేనాని తన సైనికులతో తురుష్కులు కాపురమున్న ప్రదేశమగు సాంబులులో అకస్మాత్తుగ నిండ్లలో జొరబడి తనకు దొరికినంతవరకు నలుబదిమంది తురుష్కనాయకులను ఖైదుచేసి తీసికొనిపోయి మరుసటియుదయమున బ్రిటిషునావమీద బ్రిటిషువారి మాల్టా ద్వీపమునకు గొనిపోయి చెఱసాలలలో పడవేయించెను. చెఱసాలలలో నిర్బంధితులైనవారిలో రూయఫ్‌బే, రహీంబే మొదలగు ప్రముఖులెల్లరును గలరు. ఈ వార్త తెలియగనే పెక్కుమంది తురుష్కదేశాభిమానులు కాన్‌స్టాంటినోపిలును వదలి అనటోలియాకు పారిపోయి ముస్తఫా కెమాల్ పాషాతో చేరిరి. కాన్‌స్టాంటినోపిలులో తురుష్కులు కాపురమున్నభాగములో తిరుగబాటులు జరుగకుండ ఆంగ్లేయసేనలు మరఫిరంగులను పెట్టియుంచిరి.

## జాతీయవాదులు రాజద్రోహులు

నూతన ప్రధానమంత్రిని తీసివేసి సుల్తాను ఆంగ్లేయులకిష్టుడగు దామాదు ఫరీదు పాషాను మరల ప్రధానమంత్రిగ చేసెను. పార్లమెంటుసభ్యులలో చాలమంది ఖైదులోనికి పోవుటయో అంగోరాకు చేరుటయో జరిగెను. దామాదు ఫరీదుపాషా కిష్టులగువారు మాత్రము కాన్‌స్టాంటినోపిలులో పార్లమెంటుగ సమావేశమగుచు మిత్రమండలియధికారుల యాజ్ఞానువర్తులై మెలగుచుండిరి. జాతీయవాదులెల్లరును తిరుగబాటుదారులని సుల్తానుయొక్క ప్రభుత్వము ప్రకటించెను. రాజద్రోహనేరముక్రింద మరణశిక్షను విధించి వారంటులను బంపెను. తురుష్కములోని ఇస్లామునకు ప్రధాన గురువగు షేకుల్ ఇస్లాముజాతీయోద్యమము మహమ్మదీయమతమునకు వ్యతిరేకమనియు, జాతీయవాదులనెల్లర రాజద్రోహులుగనుక మతమునుండి బహిష్క

రించితిననియు, ఎవరైనను వీరిని చంపినచో భగవంతునికి ప్రీతికరమైన కార్యమనియు మరియొక ప్రకటనముగావించెను.

ఇటుల ముస్తఫా కెమాల్ పాషాయును ఆయనయనుచరులును మిత్రమండలికి శత్రువులును, సుల్తానుకు తిరుగబాటుదారులును, మతమునకు ద్రోహులును, మహమ్మదీయసంఘమునుండి బహిష్కరింపబడినవారును నైరి. మతగురువులు తరచుగ తమ స్వసంరక్షణకొరకును స్వలాభముకొరకును అజ్ఞానులైన ప్రజలమీద తమకుగల పలుకుబడిని దేశాభివృద్ధికిని దేశలాభమునకును వ్యతిరేకముగ నెటుల నుపయోగించెదరో తెలియుట కిదియొక నిదర్శనము. కాన్‌స్టాంటినోపిలులో మిత్రమండలియధికారులచే సైనికశాసనము ప్రకటింపబడెను. సుల్తానుయొక్క అధికారమును బలపర్చుటకే ఆయన మీద తిరుగబాటులకై కుట్రలుచేయుచున్న కొందరిని కాపుపట్టుకొని చెరసాలలలో నిర్బంధించితిమనియు కాన్‌స్టాంటినోపిలును తమక్రిందికి తీసుకొనుతలంపు తమకులేదనియు, గాని తురుష్కులు తమమీద తిరుగబడినచో తమయుద్దేశ్యములను మార్చుకొనవలసివచ్చుననియు మిత్రమండలియధికారులొక ప్రకటనమునుగూడ మార్చి 16వ తేదీన గావించిరి. ఇప్పటికిని దేశమునకు సుల్తానే ప్రభుచిహ్నములన్నిటిని కలిగియున్నాడు. ప్రధానమంత్రి, మంత్రివర్గము, మహమ్మదీయ ప్రధానమతగురువు, ఖిలాఫతుపీఠము, పార్లమెంటు, మొదలగు ప్రభుత్వప్రతిష్ఠాపన లన్నియు సుల్తానుక్రిందనే రాజధానిలోనున్నవి. కాని సుల్తాను మిత్రమండలియొక్క సంరక్షణలో వారిక్రిందబైటీవలెనుండి వారాజ్ఞాపించినటులెల్ల ఆయనయును ఆయనక్రిందనున్న ప్రభుత్వప్రతిష్ఠాపనలును మిత్రమండలిచే సంముఖ్యముగ నాంగ్లేయులచే నడుపబడుచున్నారు. పారిసులో జరుగుచున్న సంధిసమావేశమునందు తురుష్కసామ్రాజ్యమును గూర్చియు తురుష్కదేశమునుగూర్చియు నంత్యనిర్ణయము జరుగునపుడు తమయిష్టమువచ్చిన సంధిషరతులకెల్ల సుల్తానుచేతను ఆయనక్రిందనున్న ప్రతిష్ఠాపనలచేతను అంగీకరింపజేయుటకును వానిని అమలుజరుపుటకును అంతయు మిత్రమండలివారు సిద్ధముగావించుచున్నారు.

## జాతీయోద్యమవృక్షము

కాని తురుష్కదేశముమాత్రము దినదినమునకు సుల్తానునకు వ్యతి

రేకమై ముస్తఫా కెమాల్ యొక్కనాయకత్వముక్రిందికి పూర్తిగచేరుచున్నది. గ్రీకులు స్మర్నాను ఆక్రమించుకొనుటవలన మొలకెత్తిన తురుష్కజాతీయోద్యమము ఆంగ్లేయులు తురుష్కదేశాభిమానులను వైదులోపడవేసి సుల్తానును తమక్రింద పూర్తిగ నుంచుకొనుటవలన దోహదముపొంది పెరిగి గొప్పవృక్షమై తలిరుజొంపములతోడను పుష్పగుచ్ఛములతోడను శోభిల్లుచున్నది. 1905వ సంవత్సరమున ప్రజాభిప్రాయమును ధిక్కరించి బంగాళా రాజధానిని విభజించి హిందూదేశజాతీయోద్యమమునకు పునాదులువైచిన కర్జనుప్రభువే ఇపుడు తురుష్కనాయకులను చెరసాలలకు బంపి తురుష్కజాతీయోద్యమవిజృంభణమునకు తోడ్పడినాడు. జాతీయోద్యమము తురుష్కదేశమందంతటను అతిత్వరగా వ్యాపింపజేయబడినది. ప్రతిచోటను ప్రజలు ముస్తఫా కెమాల్ యొక్కనాయకత్వము నంగీకరించిరి. ఆయనయొక్క పలుకుబడి మిక్కిలి హెచ్చెను. విదేశీయులఆక్రమణము, గ్రీకులక్రూరకృత్యములు, మిత్రమండలివారిదౌర్జన్యములు, సుల్తాను ఆంగ్లేయులచేతిలో కీలుబొమ్మవలెనుండుట ప్రజలలో మితిలేని యాగ్రహమును, దేశమును కాపాడుకొనవలెనను వజ్రసంకల్పమును పుట్టించెను. దేశసంరక్షణకై పోరాడుటకు సైనికులు కావలెనని ముస్తఫా కెమాల్ కోరినంతనే వేనవేల యువకులు ఐచ్ఛికసైనికులుగ చేరుచుండిరి. సుప్రసిద్ధ తురుష్కగ్రంథకర్త్రి యగు హాలిడే ఎడిబు హానము రచించిన కార్చిచ్చు (Shirt of Flame) అను చరిత్రాత్మకమగునవలలో తురుష్కజాతీయోద్యమాభ్యుదయము మనోహరముగ వర్ణించబడినది.

## (3)

## సుల్తానును తీసివేయుట

కాన్‌స్టాంటినోపిలునుండి పారిపోయివచ్చినసభ్యులతోడను, ప్రజలచే మరల ఎన్నుకొనబడిన మిగిలిన సభ్యులతోడను అంగోరాలో తురుష్క పార్లమెంటు (ప్రజాప్రతినిధిసభ) సమావేశమయ్యెను. ఇంతటినుండి దీనికి (Grand National Assembly of Turkey) తురుష్కదేశపుఎస్సెంబ్లీయని నామకరణముచేయబడెను. ఏప్రియల్ 23 వ తేదీన ఎస్సెంబ్లీసమా

వేశము ప్రారంభమయ్యెను. జాతీయసమాఖ్య మరల దీనిలో నేకగ్రీవముగ ఆమోదింపబడెను. దేశీయప్రభుత్వములో జరుగవలసిన రాజకీయ, ఆర్థిక సంస్కరణములు తప్పులుగ నాలోచించబడి యంగీకరించబడెను. తురుష్క దేశస్వతంత్రతకు శత్రువులగువారికుట్రలలో చేరి దేశద్రోహమునుసలుపు చున్నందున అట్టోమానుసుల్తానును, ఆయనప్రభుత్వమును తీసివేసినామనియు దేశమునుపాలించుట కొక నూతన జాతీయప్రభుత్వమును స్థాపించినామనియు ఎస్సెంబ్లీవారు తీర్మానించి ప్రకటించిరి. దేశప్రభుత్వమును నడుపుటకు ఎస్సెంబ్లీచే నొక కార్యనిర్వాహకసభ (Executive Council) ఎన్నుకొనబడెను. అధ్యక్షుడుగను సర్వసేనాధిపతిగను ముస్తఫా కెమాల్ పాషా ఎన్నుకొనబడెను. బేకరుసామిబే విదేశాంగమంత్రిగను, ఫెజ్వీపాషా యుద్ధ మంత్రిగను, హక్కి బెహీజుబే ఆర్థికమంత్రిగను, డాక్టరు అడనాణబే విద్యామంత్రిగను, ఇస్మాల్ ఫజీల్‌పాషా అభివృద్ధి మంత్రిగను, మొదలగు ఎనిమిదిమందిమంత్రులుగల మంత్రివర్గ మెన్నుకొనబడెను. సర్వసేనాధిపతి క్రిందప్రధానసైనికోద్యోగుడుగకలనలు ఇజ్మతుపాషానునియమించిరి. జాతీయ వాదనాయకులలో ముఖ్యులగు ఫతేబే, రూయఫ్‌బే మొదలగువారు మాల్టా ద్వీపములోని చెఱసాలలలో నున్నందున ప్రథమమంత్రివర్గమునందు వారికి స్థానములేకుండెను. ఈవిధముగ రాజధానిలోని సుల్తానుయొక్క ప్రభుత్వ మునకు పోటీగ అంగోరాయందు జాతీయప్రభుత్వ మేర్పరుపబడెను. నూతన ప్రభుత్వమునకు వెనుక దేశమంతయు నుండెను. సుల్తానుయొక్క ప్రభుత్వ మునకు వెనుక విదేశప్రభుత్వము లుండెను.

"దేశమునందు ఎన్నికలు జరిపితిమి. 1920 సంవత్సరము ఏప్రిలు నెల 23 వ తేదీని జాతీయపార్లమెంటుయొక్క సమావేశము జరిగినది. ఖలీఫా - సుల్తానును రాజధానియు విదేశీయులఅధికారముక్రిందను స్వాధీన మందు నున్నంతకాలము తురుష్కదేశముయొక్క ప్రస్తుత భావి వ్యవహార మంతయు నదియే (ఎస్సెంబ్లీయే) నడుపునని యా సమావేశమునందు తీర్మా నింపబడినది.

అట్టోమానుప్రజలు తమహక్కులన్నియు నాశనమైనవనియు, తమ రాజ్యాధికారము పరులహస్తగతమయినదనియు తెలిసికొని, తమప్రతినిధుల

మూలమున అంగోరాలో సమావేశమై జాతీయసభ్యులలోనుండి యొక కార్య నిర్వాహకసభ నెన్నుకొనియున్నారు. కార్యనిర్వాహకసభయే దేశముయొక్క యావత్పరిపాలనము వహించినది.

1920 వ సంవత్సరం ఏప్రిలు 29 వ తేదీన జరిగిన సమావేశము నందు అవలంబింపబడిన మా జాతీయనిర్ణయమును నేను తమ కిందుమూల మున తెలుపుకొనుచున్నాను.

మొదటిది : ఖిలాఫతుయొక్కయు సుల్తానుయొక్కయు రాజధానియగు కాన్‌స్టాంటినోపిలుపట్టణమును అందులోనున్న సుల్తానుయొక్కప్రభుత్వమును మిత్రమండలివారిక్రింద ఖైదీలుగనున్నారని అట్టోమాన్ప్రజలు భావించు చున్నారు. ఆవిధమున నున్నంతకాలము కాన్‌స్టాంటినోపిలుప్రభుత్వము నుండి వచ్చెడి యన్ని యుత్తర్వులు ఫర్మానాలు న్యాయశాస్త్రప్రకారముగాని మతరీత్యాగాని ఎట్టివిలువయులేనివనియు, కాన్‌స్టాంటినోపిలుప్రభుత్వముతో చేసికొనెడి యొడంబడికలు, ఏర్పాట్లు చెల్లవనియు, వ్యర్థములనియు మా జాతి తీర్మానించినది.

రెండవది : అట్టోమాన్ప్రజలు శాంతిని నిగ్రహమును కనపర్చు చున్నప్పటికిని తమదేశము స్వతంత్రమైన రాజ్యముగనుండుటకును, తమకు పురాతనమునుండి వచ్చుచున్న పవిత్రమగుహక్కులను కాపాడుటకును దృఢనిశ్చయమును కలిగియున్నారు. గౌరవమయినట్టియు న్యాయమైనట్టియు సంధిచేసుకొనుటకు సిద్ధముగనే మా జాతి యున్నది. కాని తన నిజమైన ప్రతినిధులు మాత్రమే తనపేర నొడంబడికలు చేయుటకు హక్కుగలిగి యున్నారని మా జాతి ప్రకటించుచున్నది.

మూడవది : అట్టోమానుదేశములో కాపురమున్నక్రైస్తవులును విదే శీయులును మా జాతియొక్కసంరక్షణలో సురక్షితముగ నుండెదరు. గాని దేశసురక్షితమునకు వ్యతిరేకమగు సేవనిని వారు చేయగూడదు" అని ముస్తఫా కెమాల్ పాషా ఫ్రెంచి ప్రధానమంత్రికి తెలియపరిచెను.

## (4)
## తురుష్కమును అమెరికాక్రింద మాండేటుగానుంచు ప్రయత్నము

ఈలోపున పారిసులో జరుగుచున్న సంధిసమావేశమునందు తురుష్క-దేశమునంతను మాండేటరీరాజ్యముగ (సంరక్షకరాజ్యముగ) అమెరికావారు స్వాధీనముచేసికొనుట యుక్తమనియు, అట్లుల గావింప వీలులేనిచో తురుష్కములోని ఆర్మీనియనులు కాపురమున్న ప్రాంతముపైనను అమెరికావారు తమక్రిందికి తీసికొని పాలించవలెననియు, నాంగ్లేయప్రధానమంత్రి యొక తీర్మానమును ప్రవేశపెట్టెను.

ఇందుమీద తురుష్క-దేశపరిస్థితులనుగూర్చి విచారించి రిపోర్టుచేయుటకై అమెరికాయధ్యక్షు డొక సైనికయుపసంఘమును బంపెను. "తురుష్కులు అమెరికాప్రభుత్వమునకు తెలివిగ లోబడరు. సర్వవిధములగు ప్రతిఘటనములను చేసెదరు. సైనికబలముచే సతి క్రూరకృత్యములు చేసి లోబర్చుకొన్నను తురుష్కమును విదేశీయులు పాలించుట అసంభవము. మరియు విదేశీయులు తురుష్కములో ప్రత్యేకహక్కులను సుల్తానుల నుండి పొందియున్నారు. తురుష్క-సుల్తానులప్రభుత్వము పాశ్చాత్యులనుండి విశేషఋణములుచేసి ప్రభుత్వమునకు వచ్చెడి పన్నులలో చాలవరకు పాశ్చాత్యప్రభుత్వప్రతినిధులసంఘమునకు (Ottoman Public Debt) స్వాధీనమగు తాకట్టుపెట్టియున్నారు. ఈ సంఘమే చాలవరకు పన్నులను వసూలుచేసికొనుచున్నది. ఇట్టి యార్థికదాస్యము, ప్రత్యేకహక్కులు నాశనముకానిది యేప్రభుత్వమయినను తురుష్కములో శాంతముగ సాగ వీలులేదు. నిజముగా అమెరికావారే సంరక్షకత్వము నంగీకరించినచో వెంటనే ఈ రెంటిని తీసివేయకతప్పదు. ఇట్టిపరిస్థితులలో అమెరికావారు సంరక్షణబాధ్యతను **(Mandate)** వహించుటకు పూనుకొనగూడదు.

ఆర్మీనియావిషయములో నాప్రాంతమున నూటికి పదునారుగురు మాత్రమే ఆర్మీనియనులు కాపురమున్నారు. నూటికి డెబ్బదిఅయిదుగురు తురుష్కులు కాపురమున్నారు. ఆ ప్రాంతము అత్యధికసంఖ్యాకులు కాపుర

మున్న తురుష్కులక్రిందనేయుండి తురుష్కములో భాగముగనేయుండుట సమంజసము" అని యా యుపసంఘమువారు తమరిపోర్టులో వ్రాసినందున అమెరికాయధ్యక్షుడు తురుష్కముయొక్కగాని ఆర్మీనియాప్రాంతముయొక్కగాని సంరక్షకత్వము (Mandate)ను వహించుటకు నిరాకరించెను.

కాని యీ ప్రయత్నములుకూడ తురుష్కులలో నాగ్రహమును హెచ్చించి జాతీయోద్యమమునకు విశేషబలమును చేకూర్చెను.

## నూనెగనుల యొడంబడిక

1920 వ సంవత్సరము ఏప్రిలు 24 వ తేదీని అనటోలియా (తురుష్కము)లోను, సిరియాలోను, మెసపొటేమియా (ఇరాకు)లోను గల నూనెగనులను పంచుకొనుట, ఒకరిగనులనుండి మరియొకరిరాజ్యములగుండ పోవుటకు త్రోపనిచ్చుట, తమరాజ్యములగుండ పోయెడి సరకులమీద తక్కువ పన్నులువేయుట మొదలగువిషయములనుగూర్చి ఆంగ్లేయులును ఫ్రెంచివారును శాన్‌రీమోఒడంబడికను చేసుకొనిరి.

## గ్రీకులతో పోరాడుటకు ప్రయత్నములు

ఈమధ్యకాలమున గ్రీకులతో పోరాడుటకు తురుష్కజాతీయవాదులు సేనలను పోగుచేసుకొనుచుండిరి. వీరివద్ద నేమియు ద్రవ్యములేదు. దేశము మిగుల దరిద్రస్థితియందున్నది. కావున విశేషద్రవ్యము పోగుచేయుటకును అవకాశములేదు. కాగితపుద్రవ్యము సృష్టింతమన్నను వీరికి అప్పులిచ్చువారు లేరు. వీరికిగలద్రవ్యము అఖండమగు దేశాభిమానము; అపారమగు త్యాగము. సర్వసేనాధిపత్యము వహించిన ముస్తఫా కెమాల్‌యొక్క నాయకత్వముక్రింద జాతీయవాదులు సైనికులను చేర్చుచుండిరి. వేనకువేలు సైనికులుచేరిరి. భర్తలను సైనికులుగచేరుటకు భార్యలుప్రోత్సహించుచుండిరి.తల్లిదండ్రులు మిగుల సంతోషముతో తమపుత్రులను దేశసేవకు సమర్పించుచుండిరి. ఈ కష్టకాలమందు స్త్రీలుచేసినసహాయము, త్యాగము అపారమైనది. చేరెడిసైనికులలో చాలమందికి దుస్తులుగాని పాదరక్షలుగాని లేవు. కాని యుత్సాహమునకు మాత్రము ఏమియు కొరతలేదు. వెనుకజరిగిన యుద్ధములలో సైనికులుగచేరి చావగ మిగిలినవారును, గాయములుపొంది బాగైనవారును కూడ వచ్చిచేరిరి.

వెనుకటియుద్ధములలో సైనికోద్యోగులుగ పనిచేసినవారు అయిదువేలమంది మరల యుద్యోగస్థులుగ దొరికిరి. సుల్తానుయొక్క సైన్యములోనుండి పది వేలమందిని చీలదీసికొని కలనల్ బేకరు సామి యను సేనాని వచ్చి ముస్తఫా కెమాల్‌తో చేరెను. 1920 వ సంవత్సరప్రారంభమున ముస్తఫాకెమాల్ క్రింద నలుబదివేలసైన్య ముండెను. కాని దీనికి రెట్టింపుసైన్యము గ్రీకులు స్మర్నాప్రాంతమున తెచ్చియుంచిరి.

## సోవియటురష్యానుండి సహాయము

అదృష్టవశమున ముస్తఫా కెమాలుకు మరియొకచోటనుండి సహాయము లభించెను. అది రష్యానుండి. తురుష్కమును మ్రింగదలచిన నిరంకుశచక్రవర్తి యిపు డచట లేడు. అచట సోవియటుప్రజాస్వామ్యము పాలనము నలుపుచున్నది. లెనినుమహాశయుడు రష్యాకు నాయకుడుగ నుండెను. ఆయన తురుష్కజాతీయోద్యమమునందు మిగుల సానుభూతిని కలిగి యుండెను. లెనినునకును ముస్తఫా కెమాలునకును 1920 సంవత్సరము ఏప్రిలునెలలో మిత్రమండలిప్రభుత్వములదాడినుండి పరస్పరసంరక్షణ గావించుకొనుటకు ఒడంబడిక (సైనిక కన్వెన్షన్) జరిగెను. ఇంతేగాక మిత్రమండలివారు రష్యా సోవియటుప్రజాస్వామ్యము నంగీకరించక రష్యాలోనా ప్రజాస్వామ్యముపై తిరుగబాటులను పురిగొల్పుచును, నల్లసముద్రము నుండి (Black Sea) రష్యాపై దండెత్తుచును పోరాడుచుండిరి. రష్యా సోవియటుప్రభుత్వము, అంగోరా జాతీయప్రభుత్వము రెండును మిత్రమండలిచే బహిష్కరింపబడినవే అయ్యున్నవి గావున తురుష్కజాతీయవాదులకు రష్యా సహాయముచేయుటకు నిశ్చయించినది.

## (౬)

## గ్రీకులదండయాత్రలు

ఇంతలో నకస్మాత్తుగ 1920 వ సంవత్సరము జూనునెల చివరభాగమున ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీప్రభుత్వముల అనుమతితో గ్రీకులు తురుష్కజాతీయవాదులపైకి మూడుపైపులనుండి దండెత్తివచ్చిరి. ఒక గ్రీకుసైన్యము 'బలికేసరి'నుండి బయలుదేరి అడ్డువచ్చిన తురుష్కజాతీయ

వాదులసైన్యముల నోడించి పాండర్మా, బ్రూసా, ముదానియా, గెమ్లిక్, ఇస్మిదు పట్టణములను పట్టుకొని మర్మరాసముద్రమువరకుగల ప్రదేశము నంతను ఆక్రమించుకొనిరి. ఇందువలన మెగ్నేషియా - అఖీసరు-పాండర్మా రైలుమార్గమంతయు గ్రీకులవశమయ్యెను.

## జాతీయవాదుల అపజయములు

మరియొక గ్రీకుసైన్యము ఆంగ్లేయులయొక్కయు గ్రీకులయొక్కయు నావలలో మర్మరాసముద్రతీరమునసున్న రేవులలో దిగి త్రేసులో ప్రవేశించి యచటనున్న తురుష్కజాతీయసైన్యముల నోడించి చెల్లాచెదరుగావించి, జూలై 25 వ తేదీన ఏడ్రియానోపిలుపట్టణమును వశపరచుకొనెను. రెండు పెద్దనావలు సైనికులతో ఆంగ్లేయప్రభుత్వముచే గ్రీకులకు సహాయముగ పంపబడెను. గ్రీకుప్రభుత్వమునకు లోబడియుండుట కిష్టములేక పండ్రెండు వేలమంది తురుష్కులు త్రేసురాష్ట్రమును వదలి బల్గేరియాకు లేచిపోయిరి.

మూడవ గ్రీకుసైన్యము స్మర్నానుండి బయలుదేరి జాతీయవాదుల నోడించుచు ముందునకు నెట్టుకొనిపోయి ఆగస్టునెల 29 వ తేదీని ఉషాకు పట్టణమును వశపరచుకొనెను.

## జాతీయవాదుల యిబ్బందులు

గ్రీకులవద్ద సైన్యములను ఒకచోటినుండి మరియొకచోటికి గొని పోవుటకు మంచి మోటారులారీ లుండెను. స్మర్నానుండి మూడువైపులకును పోవు రైలుమార్గములు వారియధీనమందుండెను. ఇదివరకు యుద్ధకాలమున ఇంగ్లాండు, ఫ్రాన్సులు ఇచ్చిన ఆయుధసామగ్రికూడ వారివద్ద నుండెను. ఇపుడుకూడ మిత్రమండలివారినుండి వారు యుద్ధపరికరములను పొందిరి. మరియు సముద్రములమీద గ్రీకుసైన్యములను రావించుకొనుటకు వీలు కలదు. తురుష్కజాతీయవాదులకు అనటోలియామధ్యభాగమునసున్న ఆయుధ సామగ్రులతో త్వరితముగ రాకపోకలుచేయుటకు వీలులేనిప్రదేశములలో సైన్యములను త్రిప్పుకొనవలసియుండెను. అనటోలియా రైలుమార్గము అంగోరాశాఖమాత్రమే రైళ్లు వీరియధీనమునసుండెను. మంచిరోడ్లు బాటలు గాని, రాకపోకలుచేయుట కితరసౌకర్యములుగాని, మోటారులారీలుగాని లేవు.

చిన్న ఆయుధములు చాలగ నున్నప్పటికిని గ్రీకులకువలె పెద్ద ఫిరంగులు వీరివద్ద లేవు. మరియు సుల్తాను వీరికి వ్యతిరేకుడై వీరిమీద దేశములో తిరుగబాటుచేయించుటకు యత్నించుచుండెను. సుల్తాను తనయధికారమునకు జాతీయవాదు లడ్డుతగిలిరని యాగ్రహమువహించెనేగాని దేశమునులోబరచు కొనుచున్న విదేశీయులను వెళ్ళగొట్టవలెనను దేశాభిమానము లేనివాడయ్యెను. సుల్తానుయొక్క ప్రేరేపణవలన ఆహమదు అంజిపూరు అను సర్కేషియా నాయకుడు బ్రూసాలో తురుష్కజాతీయప్రభుత్వముపై తిరుగబాటును సాగించి అల్లకల్లోలము గావించెను. ఈ తిరుగబాటు నణచుటకు జాతీయ సైన్యములు కొంతకాలము పోరాడవలసివచ్చినది. రష్యానుండికూడ నింత వరకు కొద్దిగనే ఆయుధములును, ద్రవ్యమును వచ్చెను. రష్యాకును తురుష్కమునకును మధ్య మిత్రమండలిపక్షపువా రడ్డుతగులుచుండిరి.

## గ్రీకుల సంతోషము

ఈ యన్నికారణములవలనను 1920 వ సంవత్సరమున యుద్ధములో గ్రీకులు గెలుచుటయు, తురుష్కజాతీయవాదులు ఓడిపోవుటయు నొకవింత గాదు. బహుసులభముగ తమకు లోబడిపోవుదురని తాము తలచిన జాతీయ వాదు లింతవరకైన ప్రతిఘటనమునలిపినందుకు గ్రీకు లాశ్చర్యమును చెందిరి.

గ్రీకు ప్రధానమంత్రియగు వెనిజిలాసు ఈ జయముల కుప్పొంగి తురుష్కదేశవిషయమున 1920 వ సంవత్సరం ఆగష్టునెలలో మిత్రమండలి వారు చేయుచుండిన అంత్యనిర్ణయమునందు తమకు (గ్రీకులకు) తురుష్క దేశములో నొక గొప్ప భాగము కావలెనని కోరెను. అయోనియాద్వీపము లను, తురుష్కదేశములో సంపాదించగలిగినంత పెద్ద భాగమును గ్రీసులో చేర్చుకొని, యొక గ్రీకుసామ్రాజ్యమును స్థాపించవలెనని ఆయనయొక్క ఆశయము.

# తురుష్క ప్రజాస్వామికము

## 7 తురుష్క దేశవిభజనము

### (1)

### వర్సేల్సుసంధి

1919 వ సంవత్సరము జనవరినెలనుండి పారిసునగరమున సంధి సమావేశము జరిగి, జూన్ నెల 28 వ తేదీన మిత్రమండలివారికిని, జర్మనీ ఆస్ట్రియా బల్గేరియా దేశములకును మధ్య వర్సేల్సు (Versailles) వద్ద సంధిజరిగి, కక్షిదారులందరిపలనను సంతకములుచేయబడెను. 1920 వ సంవత్సరము జనవరినెల 10 వ తేదీన మరల నా సంధి ఖాయపరుపబడెను.

### సంధిషరతులు

వర్సేల్సుసంధి, యుద్ధములోగెల్చిన మిత్రమండలివారు తమచే నోడింపబడిన శత్రుదేశములమీద తమచిత్తమువచ్చినషరతులతో నంటకట్టబడినది. స్వయంనిర్ణయసూత్రముననుసరించిగాని, విల్సను సభాపతియొక్క పదునాలుగుసూత్రములప్రకారముగాని, జరిగినదని ఎవరును చెప్పసాహసించరు. జర్మను, ఆస్ట్రియా చక్రవర్తులు రాజ్యభ్రష్టులైరి. జర్మనీ సంపూర్ణ ప్రజాస్వామికమైనది. జర్మనీనుండి ఆల్సేసు, లోరైన్ రాష్ట్రములు ఫ్రాన్సున కీయబడినవి. ఆస్ట్రియాసామ్రాజ్యము విచ్ఛిన్నముచేయబడి, ఆస్ట్రియా, హంగెరీ, జకోస్లోవేకియా ప్రజాస్వామికములుగను, యుగోస్లావియారాజ్యముగను విభజింపబడినది. జర్మనీ, ఆస్ట్రియా, రష్యాలక్రింద విభజింపబడియున్న పోలండు మరల నైక్యముచేయబడి స్వతంత్రమగు ప్రజాస్వామికముగ చేయబడినది. బెల్జియమునుండి జర్మనులు లేచిపోయినారు. కాని జర్మనుల యూపెన్, మాల్మడీ ప్రాంతములు బెల్జియమున కీయబడినవి. జర్మనుల

ఉత్తర సైలీషియాలో కొంతభాగము పోలండున కీయబడెను. జర్మనుల డాంజిగుపట్టణముకూడ పోలండునకు స్వాధీనపర్చబడెను. మెమెల్ జిల్లా లిథుయేనియాదేశమున కివ్వబడెను. ఏడులక్షలజర్మనులుకాపురమున్న సారు (Saar) ప్రాంతములోని మిక్కిలి విలువగలగనులన్నియు ఫ్రాన్సున కిచ్చి వేయబడినవి. సారుప్రాంతపాలనము అంతర్జాతీయసమితివలన 1935 వ సంవత్సరమువరకు ఫ్రెంచి, కనడా, డేను, బెల్జియం, సారు ప్రతినిధులు కలిగి ఫ్రెంచిప్రతినిధిచే నధ్యక్షతవహించబడెడి, అయిదుగురుగల కమిటీక్రింద నుంచబడెను. యూరపుఖండమున ఇరువదియేడువేల అయిదువందల చదరపు మైళ్ళప్రదేశమును జర్మనీ పోగొట్టుకొనినది. జర్మనీలోని రైనులాండురాష్ట్రములో కొంతకాలము మిత్రమండలివారిసేనల నుంచిరి. జర్మనుభాషను మాటలాడెడి ఆష్ట్రియాదేశము జర్మనీలో చేరకూడదు. జర్మనులకు ఆఫ్రికా ఖండములోను, పసిఫికుమహాసముద్రములోను నున్న యావత్తు వలసరాజ్యములను తీసికొని, మాండేటులుగ మిత్రమండలివారికి పంచిపెట్టబడెను. జర్మనీయొక్క కౌలులోనుండిన చైనాదేశములోని షాంటంగురాష్ట్రము చైనా కిచ్చుటకు మారుగ జపానున కిచ్చిరి.

## సైన్యములనుంచుకొనగూడదు

జర్మనీ తనయొక్క యుద్ధపుటోడలను, ఆయుధములను, యుద్ధపరికరములను, జలాంతర్గాములను, వాయువిమానములను వెంటనే మిత్రమండలికి స్వాధీనపర్చవలెను. జర్మనీ ఒకలక్ష సైన్యముకన్నను, నాలుగువేల సైనికోద్యోగుల కన్నను ఎక్కువగ నుంచుకొనగూడదు. జర్మనీలో నిర్బంధ సైనికశిక్షణముండగూడదు. ఆరు పెద్ద యుద్ధపుటోడలనుమాత్రము కలిగి యుండవచ్చును. బొత్తిగ సైనిక వాయువిమానములను కలిగియుండగూడదు. జర్మనీ విదేశములనుండి ఆయుధములను తెప్పించుకొనగూడదు. కొంచెముగనే ఆయుధసామగ్రిని తయారుచేసికొనవలెను. 1600 టన్నులకన్న ఎక్కువ బరువుగల వర్తకపుటోడలన్నియు మిత్రమండలికి స్వాధీనపర్చవలెను. వెయ్యిటన్నులకుపైగా నున్న వర్తకపుపడవలలో సగమువంతు మిత్రమండలికి ఒప్పగింతచేయవలెను. అయిదుసంవత్సరములవరకు ప్రతిసాలున రెండు లక్షలటన్నులయోడలను మిత్రమండలికి జర్మనీ తయారుచేసి ఇవ్వవలెను.

## నష్టపరిహారము

యుద్ధమునకంతకును జర్మనీయే అపరాధియని (War guilt) వ్రాయబడెను. యుద్ధమువలన మిత్రమండలిదేశములకు కలిగిన నష్టమంతయు జర్మనీ భరించవలెనని స్థిరపరచిరి. మిత్రమండలివారికి జర్మనీ చెల్లించవలసిన నష్టపరిహారము 12400 కోట్ల రూప్యములని 1921వ సంవత్సరమున నిర్ణయించబడినది.

## కైజరుకు శిక్ష

అంతర్జాతీయశాంతికిని, నీతికిని వ్యతిరేకమగునేరములను చేసినందుకు అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జపానుప్రభుత్వములచే నియమింపబడెడి అయిదుగురు న్యాయాధిపతులు కలిసి జర్మనీకైజరగు రెండవ విలియం చక్రవర్తిని విచారించి తగువిధమున శిక్షించవలెను. యుద్ధమునందు దురంతములుకావించిన యుద్యోగస్థులను జర్మనీ మిత్రమండలికి విచారణనిమిత్తము ఒప్పగించవలెను. జర్మనుకైజరును లండనుబజారులలో బహిరంగముగ నురిదీయించెదనని ఆంగ్ల ప్రధానమంత్రియగు లాయడ్ జార్జి యుద్ధకాలమున ప్రతిజ్ఞచేసెను.

## సంధిపత్రముపై బలవంతముగ సంతకముచేయించుకొనిరి

ఇట్టిషరతులతో తయారుచేయబడిన సంధిపత్రముమీద 1919వ సంవత్సరము 28 జూన్‌లోపల జర్మనుప్రతినిధులు సంతకములుపెట్టవలయునని, లేనిచో జర్మనీపైన దండెత్తెదమనియు మిత్రమండలివారు తెలియజేసిరి. జర్మనుపార్లమెంటులో తీవ్రమగుచర్చ జరిగి రెండువందల ముప్పైఏడుమంది సంధిపత్రము నంగీకరించవలయుననియు నూటముప్పైఎనిమిదిమంది సంధిని నిరాకరించవలయుననియు సమ్మతులనిచ్చిరి. అధికసంఖ్యాకులచే సమ్మతింపబడినందున జూన్ 28 వ తేదీన వర్సేల్సుసంధిపైన జర్మను ప్రతినిధులు సంతకముచేసిరి. ఇట్టి షరతులతోడనే ఆస్ట్రియా, హంగేరి, బల్గేరియా ప్రభుత్వముల ప్రతినిధులును సంధిపత్రములపై సంతకములు చేసిరి.

## జర్మనుప్రతిఘటనము

సంధిపత్రముమీద సంతకములుచేసినరోజుననే జర్మనునావికో ద్యోగులు తమక్రిందనున్న యుద్ధపుటోడలను, జలాంతర్గాములను తమ శత్రువుల కొప్పగించనొల్లక, ఒప్పగింతచేసికొనుటకు వచ్చిన బ్రిటిషుసైనికాధికారులు చూచుచుండగనే సముద్రములో ముంచివేసిరి. సంధిషరతులప్రకారము ఫ్రెంచివారి కొప్పగింతచేయవలసియున్న ఫ్రెంచిపతాకములను, గుమిగూడియున్న జర్మనుప్రజాసమూహములు ఫ్రెడెరిక్ ది గ్రేట్ శిలావిగ్రహము చెంత జాతీయగీతములు పాడుచుండగా, కిరసనాయిలులో ముంచి తగుల పెట్టిరి. కైజరుచక్రవర్తి నేటికిని హాలండులో సురక్షితముగ నున్నాడు.

## (2)

## అంతర్జాతీయసమితి

## (League of Nations)

1919 వ సంవత్సరము జూన్‌నెల 28 వ తేదిననే మిత్రమండలి వారును, అమెరికా అధ్యక్షుడును కలసి అంతర్జాతీయసమితిని (**League of Nations**) స్థాపించిరి. దీనికి జినీవా నగరము కార్యస్థానముగ చేయబడినది. ఇందులో జర్మనీ, ఆస్ట్రియా, తురుష్కము, బల్గేరియా మొదలగు శత్రుదేశములను చేర్చుకొనలేదు. రష్యా సోవియటుప్రభుత్వమునకు ప్రాతినిధ్యములేదు. వీరెవరైన చేరదలచినచో చేరినసభ్యులలో మూడింట రెండు వంతులమంది యంగీకరించవలెను. ఆంగ్లసామ్రాజ్యములో చేరిన దేశముల కన్నిటికిని తలయొకఓటు ఉండుటవలన ఆంగ్లేయుల కెక్కువ ప్రాముఖ్యత కలిగెను. ఈ సమితి సాధారణముగ సంవత్సరమున కొకసారి సెప్టెంబరునెల మొదటిసోమవారమునాడు సమావేశమగును. మిగతాకాలములలో సమావేశమై యావత్తు కార్యనిర్వహణముచేయుట కొరకు కౌన్సిలు నియమింపబడినది. కౌన్సిలులో నయిదుగురు శాశ్వతసభ్యు లుండవలెను. వారు అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జపాను ప్రభుత్వముల ప్రతినిధులు. తక్కిన యన్నిదేశములు కలసి యేటేట నలుగురు ప్రతినిధుల నెన్నుకొనెదరు.

కౌన్సిలుకు సమితికి గల యన్ని యధికారములు దాదాపుగ నీయబడెను. చాల తటస్థదేశములు సమితియందు చేరెను గాని, యవి యేమియు పలుకు బడిగలదేశములు కావు.

## అధికారము మిగుల సంకుచితము

అంతర్జాతీయసమితియొక్క అధికారము మిగుల సంకుచితముగ నున్నది. ఏ సామ్రాజ్యములో గాని అంతఃకలహములనుతీర్చుటకు అంతర్జాతీయసమితికి అధికారములేదు. ఇంగ్లాండుచే పాలింపబడెడి భరతవర్షము ఈజిప్టు, బర్మా, సింహళము, ఐర్లండు మొదలగు దేశములు తమ స్వాతంత్ర్యమువిషయమున ఇంగ్లాండుతోగల సంఘర్షణమునుగూర్చి సమితివారికి చెప్పుకొనుటకుగాని, సమితివారు విచారించుటకు గాని అధికారములేదు. అటులనే ఫ్రాన్సుకును మొరాకో, ఇండోచైనాలకును గల తగాదాలనుగూర్చి గాని, చైనాకును చైనాలోనివిదేశస్థులకునుగల ప్రత్యేకహక్కులనుగూర్చిన పోరాటములనుగూర్చి గాని, దక్షిణాఫ్రికా కెన్యా మొదలగు దేశములలో పాతకాపురస్థులు భారతీయులు కోరెడి, కలహించెడి హక్కులనుగూర్చిగాని, సమితి జోక్యముకలుగజేసికొనగూడదు. వర్సేల్సుసంధివలన జర్మనీ, ఆస్ట్రియాలు తమకు కలిగినదని తలచు అన్యాయమునుగూర్చి విచారించవలెనని సమితిని కోరుటకు వీలులేదు. ఇంతేగాక తన యధికారమునకులోబడినవిషయమునుగూర్చియైనను సమితియొక్క అభిప్రాయమును తీర్మానమును లక్ష్యపెట్టక తిరుగబాటుచేసెడి దేశములపై అమలుజరుపుటకు సాధనము లేర్పాటుగావింపబడలేదు. మంచూరియాఆక్రమణవిషయమున సమితివారు తెలిపిన అభిప్రాయమును అంగీకరించక తిరుగబాటుచేసి సభ్యత్వమును చాలించుకొని లేచిపోయిన జపానును సమితివా రేమియు చేయజాలకున్నారు. జపాను - చైనా యుద్ధమును సమితివా రాపజాలకపోయిరి. ఇట్టి పరిస్థితులలో మానవశాంతికి అంతర్జాతీయసమితివలన కలిగిన ప్రయోజనమేమియో కనపడకున్నది. విల్సను సభాపతి ప్రకటించిన యుద్దేశ్యము పూర్తిగ విఫలమైనది.

## మాండేటులు

అంతర్జాతీయసమితిపేర జరిగిన మొదటిపని, జర్మనీనుండి లాగుకొనినట్టియు, తురుష్క-సామ్రాజ్యమునుండి తీసికొనినట్టియు దేశములు అంతర్జాతీయసమితియొక్క-యాజమాన్యముక్రింద మిత్రమండలిలోచేరినదేశములవారికి పాలనముచేయుటకుగాను స్వాధీనపర్చుటమైయున్నది. ఈ దేశములలో వేటిని తటస్థదేశములవారి కెవరికిని స్వాధీనపరచలేదు. ఇట్లు స్వాధీనపర్చుటకు మాండేటులని పేరు. మాండేటులనగ నంతర్జాతీయసమితివారియాజ్ఞలని యర్థము. ఈ మాండేటుపాలనముక్రిందికితేబడిన దేశములవారు అనాగరికులనియు, వీరిని చక్క-గా పాలించి వీరికి నాగరికతను నేర్పు పవిత్రమైన జవాబుదారిని వహించుటకుగాను (Sacred trust for civilisation) వీరిని నాగరికదేశములవారిపాలనక్రింద యుంచితిమనియు నీ మాండేటుల తత్వము. వీరినిపాలించుటకును నాగరికతను నేర్పుటకును బాధ్యతవహించిన దేశములవారికి అంతర్జాతీయసమితిలోనే గాక కౌన్సిలులోకూడ సభ్యత్వముండవలెను. కౌన్సిలుయొక్క-యభిప్రాయమున నీ దేశములవారు బాగుగ నాగరికులైరనియు, స్వపరిపాలనకు అర్హులైరనియు తేలుపరకును నీ మాండేటుపాలనమున వీరుండవలెను. ఏషరతులకులోబడి తాము పరిపాలనా బాధ్యతనువహించునదియు నా షరతులను పరిపాలననువహించుప్రభుత్వములవారు తయారుచేయగ నవి యంతర్జాతీయసమితిచే నంగీకరించబడెను. మాండేటులక్రింద చేర్చబడిన దేశములలోని ప్రజలయభిప్రాయములను సమ్మతులమూలమున కనుగొనుటకు ప్రయత్నించనేలేదు. అంతేగాక అరబు దేశములన్నియు జాతీయస్వతంత్రము నపేక్షించి ఆంగ్ల పరాసుల మాండేటులపాలనమునకు తేలికగ లోబడలేదు. ఆంగ్ల పరాసుసేనలు తిరుగబాటుదార్లతో చాలకాలము పోరాడెను. కఠినముగ తిరుగబాటుల నణచి మాండేటుపాలనము స్థాపించినను ఇప్పటికిని శాంతియేర్పడినదని చెప్పుటకు వీలులేదు. యుద్ధకాలమున మారుమ్రోగిన స్వయంనిర్ణయసూత్రము యుద్ధము ముగియగనే ఇటుల అమలుజరుపక విడిచిపెట్టబడినది.

## జర్మనువలసలు

అంతర్జాతీయసమితివారు జర్మనీనుండి తీసికొనిన పసిఫికుమహాసము ద్రములోని ద్వీపములను కొన్నిటిని జపానుకును, కొన్నిటిని ఆస్ట్రేలియా కును, మరికొన్నిటిని న్యూజిలాండుకును మాండేటులుగ స్వాధీనపరచిరి. ఆఫ్రికాఖండములో జర్మనీకిచెందిన నైరుతి ఆఫ్రికాను (South West Africa) దక్షిణాఫ్రికాప్రభుత్వము (Union of South Africa)నకును, మధ్యఆఫ్రికాలోని (Central Africa) రూ అంజాను బెల్జియమునకును, మధ్యఆఫ్రికాలోని మిగత జర్మనువలసప్రదేశములలో కొన్నిటిని ఇంగ్లాండు నకును, మరికొన్నిటిని ఫ్రాన్సుకును మాండేటులుగ నిచ్చిరి.

## పాలస్తైన్, సిరియా

తురుష్కమునుండి తీసికొనిన అరబుదేశములలో పాలస్తైన్‌దేశము (ఇజ్రాయిలు) ఆంగ్లేయుల స్వంతపాలనముక్రిందను, సిరియాదేశము ఫ్రెంచి వారి స్వంతపాలనముక్రిందను మాండేటులుగ చేర్చబడినవి. పాలస్తైన్‌దేశము (ఇజ్రాయిలు) యూదులకునివాసదేశముగ ప్రకటించబడి, ప్రపంచములోని యూదులు వచ్చినివసించుటకు ప్రత్యేకసౌకర్యములు కలుగజేయబడుచున్నవి. భూములు మొదలైనవి వారికి చాలగ నివ్వబడుచున్నవి. అచట నరబులు అత్యధికసంఖ్యాకులుగ నున్నారు. వారి కీ దేశము యూదులనివాసదేశముగ ప్రోత్సాహపర్చబడి యూదులకు ప్రత్యేకసౌకర్యములు చేయబడుట ఇష్టము లేదు. యూదులకును అరబులకును తరుచుగ కలహములు కలుగుచున్నవి. సిరియాలో ఫ్రెంచిపాలనము శాంతముగ సాగుటలేదు. అచటకూడ అరబు లలో స్వతంత్రేచ్ఛ చాలగ గలదు.

## హెజాజి

హెజాజి (అరేబియా) దేశముపైన యుద్ధకాలమున మిత్రమండలికి సహాయముచేసిన మక్కాషెరీఫు హుస్సేనును రాజుగ చేసినారు. గాని యాతనిపై వాహబీల నాయకుడగు ఇబన్‌సౌదు దండయాత్రలుసలిపి, తుదకు 1926 వ సంవత్సరమున నాతనిని వెడలగొట్టి అరేబియానంతను స్వాధీన

వర్చుకొనెను. ఇపుడు ఇబిఞ-సౌదు అరేబియాయొక్క స్వతంత్రరాజుగ మున్నాడు. షెరీఫు హుస్సేను విదేశములపాలయ్యెను.

## మెసపొటేమియా (ఇరాకు)

మెసపొటేమియా (ఇరాకు) పైన అమీరు ఫైసలును, జోర్డానుపైన అమీరు అబ్దుల్లాను రాజులుగచేసి, మాండేటులక్రింద నాంగ్లేయులు వారికి సంరక్షకులుగను, సలహాదారులుగను పాలనము సాగించుచున్నారు. జోర్డాను ఇసుకఎడారులతోనిండిన దేశము. ఇరాకు నాగరికమైనదేశము. అచట జాతీయోద్యమము వ్యాపించియున్నది. ఆంగ్లేయులతో ప్రజలకు సంఘర్షణముకలుగుచువచ్చినది. అమీరుఫైసలు ఇటు ప్రజాభిప్రాయమునరును అటు ఆంగ్లేయులకును వెరచుచుండెను. 1932 వ సంవత్సరము ఏప్రిలునెలలో నొక ఆంగ్లేయకంపెనీ నూనెగనులు త్రవ్వుకొనుటకు ఆయనయుండి దీర్ఘకౌలును పొందినది. ఆగస్టునెలలో మాండేటును విడిచిపెట్టి ఇరాకు అంతర్జాతీయసమితిలో స్వతంత్రసభ్యులగుసముల ఆంగ్లేయులు దరఖాస్తుపెట్టించిరి. మాండేటు అంతరించినది. ఇరాకు స్వతంత్రదేశమైనది గాని, యొడంబడి కలమూలమున ఆంగ్లేయులు సలహాదారులుగ మున్నారు.

## అమెరికా వర్సేల్సుసంధిని నిరాకరించినది

వర్సేల్సుసంధిని గావించుకొని, అంతర్జాతీయసమితిని మాండేటులను ఏర్పాటుగావించి, విల్సను సభాపతి అమెరికాకు రాగనే, అమెరికావారు వాటి నన్నిటిని కఠినముగ విమర్శించిరి. అమెరికాసెనేటు(శిష్టసభ)వారు విల్సను సభాపతిచేసిన యేర్పాటులనన్నిటిని త్రోసివేసిరి. అమెరికాప్రభుత్వమువారు వర్సేల్సుసంధి కొప్పుకొనలేదు. అంతర్జాతీయసమితికిగాని దానికౌన్సిలుకుగాని ప్రాతినిధ్యమును బంపలేదు. తాము యూరపుఖండస్థితిగతులు తెలియక తొందరపడి వారియుద్ధములలో ప్రవేశించినామను పశ్చాత్తాపభావము అమెరికావారిలో చాలమందికి క్రమక్రమముగ కలిగినది. తరువాత జరిగిన ఎన్నికలలో విల్సనుయొక్క-కక్షి యోడిపోయి, విల్సనుకు మారుగ హార్డింజి సభాపతిగ ఎన్నుకొనబడెను.

## నష్టపరిహారసమస్య

1926 వ సంవత్సరమున జర్మనీ అంతర్జాతీయసమితిలో చేరినను, వర్సేల్సుసంధిని ప్రతిఘటించవలెననియు, నా సంధివలన కలిగిన జాతీయావమానమును తుడిచివేయవలయుననియు జర్మనీలో యువజనోద్యమము స్థాపించబడి బాగుగ వృద్ధిచెందినది. జర్మనీ మిత్రమండలిదేశములవారికి ఇవ్వవలసిన నష్టపరిహారపుమొత్తములో నూటికి 52 వంతులు ఫ్రాన్సుకును, 22 వంతులు ఇంగ్లాండునకును, 10 వంతులు ఇటలీకిని, 8 వంతులు బెల్జియమునకును, తక్కినది తక్కిన మిత్రమండలిదేశములకును చెల్లించవలెనని నిర్ధారణచేయబడెను. నష్టపరిహారము జర్మనీకి మోయరానిబరువుగ నున్నది. అరవై సంవత్సరముల వాయిదాలమీద ఈ సొమ్మును చెల్లించవలసినదని తీర్మానించిరి. మొదటినుండియు ఏ వాయిదామొత్తమును జర్మనీ పూర్తిగా చెల్లించలేదు. ఫ్రాన్సునకు కోపమువచ్చి 1923 వ సం॥ జనవరి 1 వ తేదీన మిక్కిలి విలువగల గనులుగలిగిన జర్మనీలోని "రూరు" ప్రదేశమును ఫ్రాన్సు ఆక్రమించెను. అపటి జర్మనులు గొప్ప సహాయనిరాకరణమును గావించిరి. గనులలో పనిచేయుకూలీలు, ఉద్యోగస్థులు, దుకాణదారులు మొదలగువారందరును సమ్మెకట్టి ఫ్రెంచివారిని ప్రతిఘటించిరి. ఫ్రెంచివారు అపటి జర్మనులపై జరపిన కఠినమగు నిర్బంధవిధానములు జర్మనులకు భీతిని కలుగజేయుటకుమారుగ సహాయనిరాకరణోద్యమమును మరింత గట్టిపరచినది. 1924 వ సం॥ ప్రారంభమున ఫ్రాన్సు "రూరు"ను వదలివేసి సంధిమార్గమునకువచ్చి నష్టపరిహారసమస్యను పరిష్కరించుటకు "డాస్" కమిషనును ఏర్పాటుగావించుట కొప్పుకొనెను. డాస్ కమిషన్‌వారు కొన్ని ఏర్పాటులను చేసిరి. నష్టపరిహారమును చెల్లించుటకును ఇతరఖర్చులకును 1924 మొదలు 1930 వరకు జర్మనీకి అమెరికా, ఇంగ్లాండు, హాలెండు, స్విట్జరులాండుదేశములవారు మూడువేలకోట్ల రూప్యములను అప్పునిచ్చిరి. జర్మనీయొక్క ఆర్థికస్థితి పడిపోవుచువచ్చినది. బడ్జెటు సరిపోలేదు. నష్టపరిహారమేగాక పైగా చేసినఋణమునుకూడ చెల్లించలేననెను. 1929 వ సంవత్సరమున యంగ్‌కమిషను అను మరియొక విచారణసంఘము ఏర్పడెను. సాలు 1 కి 196 కోట్ల రూప్యముల చొప్పున మొదటి 37 సం॥ లును,

సాలునకు 144 కోట్ల రూప్యముల చొ॥ తర్వాత 22 సంవత్సరములును జర్మనీ చెల్లింపవలెనని వారు తీర్పుచెప్పిరి. ఒక్క-సంవత్సరముకూడ ఆ ప్రకారము జర్మనీ చెల్లింపలేదు. 1930 వ సంవత్సరమునుండియు జర్మనీలో ఫాసిస్టుసిద్ధాంతములనవలంబించెడి నాజీ జాతీయవాదులపక్షము హెర్ హిట్లరు నాయకత్వమున ప్రబలమయినది. 1932 వ సంవత్సరము ఏప్రియల్ నెలలోనే తాము నష్టపరిహారము నేమాత్రమును చెల్లింపలేమని జర్మనుప్రభుత్వ ఛాన్సెలరును, ఆర్థికమంత్రియు ప్రకటించిరి. జర్మనీ నష్టపరిహారమును చెల్లింపకుండ కాళ్ళు పారచాపినది.

## నాజీపక్షమువారు

1933 వ సంవత్సరమున నాజీపక్షమువారు జర్మనుప్రభుత్వమును ఆక్రమించుకొనియున్నారు. జర్మనుయువకులందరును వీరివెనుకనున్నారు. నాజీ ప్రభుత్వము నష్టపరిహారమును చెల్లించుటకు నిరాకరించినది. వర్సేల్సు సంధిని ఖండించినారు. ప్రజాస్వామికపతాకమును తీసివైచి నాజీపతాకమగు "స్వస్తికను" పూర్వపు చక్రవర్తులపతాకమును ఎగురవైచుచున్నారు. వర్సేల్సుసంధిప్రకారము జర్మనుప్రభుత్వము బహుస్వల్పముగ సైన్యములను పెట్టుకొనవలసియుండగ, జర్మనీకి ప్రక్కనున్న ఫ్రాన్సు అత్యంతముగ సైన్యముల నభివృద్ధిచేసుకొనుచున్నది. ఫ్రాన్సుయొక్క-సైన్యములనుకూడ తమతోపాటు చాలగ తగ్గించనిచో తాముకూడ తమయిష్టమువచ్చినంతసైన్యమును పెట్టుకొనెదమని జర్మనుప్రభుత్వము చెప్పుచున్నది. నాజీపక్షమువారు జర్మనీని మరల లోకములో బలవత్తరమైనజాతిగ చేయ సంకల్పించినారు. పూర్వపు చక్రవర్తులపతాకమును మరల నెలకొల్పుటవలన హాలెండులో నివసించుచున్న కెయిజరు చక్రవర్తిని గాని ఆయనకుమారునిగాని మరల జర్మనీకి రాజుగా చేయుదురేమోయను అనుమానము కలుగుచున్నది. ఆస్ట్రియాను జర్మనీలో కలుపుకొని జర్మనుభాషను మాటలాడు గొప్ప జాతిని యేర్పాటుచేతుమని నాజీపక్షప్రముఖులు చెప్పుచున్నారు. జర్మనీ పోగొట్టుకొనినదేశమును వలసరాజ్యములును మరల జర్మనీకి రావలెనని కోరుచున్నారు. నాజీపక్షమువారి చర్యలవలన ఫ్రాన్సుకును జర్మనీకిని కలహము కలుగునేమోయని చాలమందికి సందేహముగనున్నది.

## (3)
## సెవర్సుసంధి

తక్కిన వ్యవహారములనన్నిటిని పూర్తిచేసికొని, మిత్రమండలివారు తురుష్కదేశమునుగూర్చిన యంత్యపరిష్కారమునకు గడంగిరి. 1920 సంవత్సరము జనవరి ఫిబ్రవరినెలలలో నీవిషయమునుగూర్చి చర్చించుటకు లండనులో సమావేశములు జరిగెను. ఏప్రియలునెలలో శాన్‌రీమొవద్ద మరి యొక సమావేశము జరిగెను. అచట తురుష్కసంధియొక్క ప్రధానాంశము లన్నియు నిశ్చయింపబడెను. అచటనే ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని పెట్రోలియంగనులహక్కులనుగూర్చిన యొడంబడికగూడ జరిగెను. 1920వ సంవత్సరము ఆగస్టునెల 10 వ తేదీన సెవర్సుసంధియొక్క మసాయిదా లన్నియు తురుష్కసుల్తానుయొక్కప్రతినిధుల కివ్వబడెను. వారిఆక్షేపణ లన్నియు త్రోసివేయబడెను. ఆగష్టునెల 20 వ తేదీన సెవర్సుసంధిపత్రముల మీద మిత్రమండలిప్రతినిధులును, తురుష్కసుల్తానుపక్షమున ప్రధానమంత్రి దామాదు ఫరీదుపాషాయును, ఇంక నిద్దరుమంత్రులును సంతకములుజేసిరి. ఈ సంధికి కాన్‌స్టాంటినోపిలులోని తురుష్కపార్లమెంటువారును అంగీక రించిరి. అంగోరాలోని తురుష్కజాతీయప్రభుత్వమును మిత్రమండలివారు పిలువలేదు. ఈ సంధిని జాతీయప్రభుత్వమువా రంగీకరించలేదు.

## తురుష్కదేశముయొక్క పంపిణీ

సెవర్సుసంధివలన తురుష్కదేశము (**Turkey**) లోని ఫలవంత మైనట్టియు, భాగ్యవంతమయినట్టియు భాగములన్నియు తురుష్కమునుండి తీసికొనబడెను. దక్షిణమునను్న అరబుదేశములన్నియు మాండేటులుగ మిత్రమండలివారు స్వాధీనపర్చుకొనుట చూచియున్నాము. ఈ సంధివలన నా మాండేటులు స్థిరపరుపబడెను. తురుష్కదేశములోని తూర్పుభాగములు స్వతంత్రమగు ఆర్మీనియాదేశముగను, స్వతంత్రమగు కుర్డిస్తాన్‌దేశముగను చేయబడి తురుష్కమునుండి విడదీయబడెను. ఆర్మీనియాదేశముగ చేయ బడినదానిలో ఆర్మీనియనులు నూటికి పదహారుమందికన్న నెక్కుడుగ లేరని వెనుక చదివియున్నాము. కుర్డిస్తాన్‌లోని ప్రజలగు కుర్డులు మహమ్మ దీయులై తురుష్కజాతిలోని యొక సంఘమైయున్నారు. ఈ రెండు

స్వతంత్రదేశములును (ఆర్మీనియా, కుర్దిస్తానులు) మిత్రమండలివారిసంరక్షకత్వము క్రిందను, పలుకుబడిక్రిందను నుంచబడెను. ఫలవంతమగు స్మర్నారాష్ట్రమును, మంచి ప్రత్తియు, ధాన్యములును ఫలించు అడేలియారాష్ట్రమును, సుప్రసిద్ధమగు ద్రాక్షతోటలు, ఆలివువనములు కలిగిన అనటోలియాలోని నైరుతిభాగమును ఇటలీకి ఇచ్చిరి. థ్రేసుయొక్క పూర్వ పశ్చిమభాగములు రెండును యుద్ధములో గ్రీసువారుచేసిన ప్రత్యేకసహాయమునకు ప్రతిఫలముగ గ్రీసున కిచ్చిరి. కాన్‌స్టాంటినోపిలును నలుప్రక్కలనున్న ప్రదేశమంతయు, మర్మరాసముద్రమునకును డార్డనెల్సుజలసంధికిని సమీపముననున్న యావత్తుప్రదేశమును మిత్రమండలిదేశముల ప్రతినిధులసంఘముయొక్క యాజమాన్యమునను పాలనమునను ఉంచబడెను. ఇచటికి తురుష్కసేనలు రాగూడదు. ఈప్రదేశమునకు మధ్యభాగమున కాన్‌స్టాంటినోపిలు నగరముమాత్రము తురుష్కులకు చెందె. అచట సుల్తాను సాలెగూడు మధ్య చిక్కిన ఈగవలె నివసింపవలెను. సుల్తానుయొక్క మిగిలినరాజ్యము ఆసియాఖండములోని అనటోలియాలో కొద్దిగ నున్నది. విల్సనుయొక్క సూత్రము లేమయ్యెనో యెవరికెరుక !

## సుల్తాను అస్వతంత్రుడుగ చేయబడెను

సుల్తానుకు మిగిలిన కొద్దిరాజ్యమైనను స్వతంత్రముగ విడువబడలేదు. ఈ రాజ్యముయొక్క సాలుసరి ఆదాయవ్యయపట్టికను నిర్ణయించుటకును, ఆర్థికవిషయములన్నిటిని నడుపుటకును ఆంగ్లేయ, ఫ్రెంచి, ఇటలీ, తురుష్కప్రభుత్వముల ప్రతినిధుల యార్థికసంఘమొకటి నియమింపబడెను. ఈ యార్థికసంఘమువారియంగీకారము లేనిది తురుష్కప్రభుత్వము ఆర్థిక సంబంధమగు నేపనిని జేయగూడదు. తురుష్కయుద్యోగస్థు లీ యార్థికసంఘమునకులోబడి పనిచేయవలెను. విదేశదిగుమతి యెగుమతులమీద వీరియనుమతి లేనిది సుల్తాను ఎట్టిపన్నులు చేయగూడదు. ఉన్నవాటిని హెచ్చించగూడదు. ఎట్టిరుణములను తేగూడదు. తురుష్కదేశములో విదేశస్థులకుగల ప్రత్యేకహక్కులన్నియు (Capitulations) యుద్ధకాలమున యౌవనతురుష్కకక్షివారిచే రద్దుపరచబడెను. ఆ ప్రత్యేకహక్కులన్నియు సెవర్సుసంధివలన పునరుద్ధరించబడెను. అట్టోమాన్ రుణసంఘము

(Council of Ottoman Public debt) లో జర్మను, ఆస్ట్రియా దచ్చిప్రతినిధులను తీసివేసి, ఆంగ్లేయ, ఫ్రెంచి, ఇటలీప్రతినిధులుమాత్ర ముండునటుల నేర్పాటుచేసిరి. తాకట్టుపెట్టబడిన పన్నుల నిదివరకువలెనే వారు వసూలుచేయుచుండవలెను. ఇట్టి యార్థికదాస్యములో తురుష్కప్రభుత్వము జరుగవలెను.

## సెవర్సుసంధియొక్క విమర్శనము

"సెవర్సుసంధివలన 'యూరపుఖండపు రోగి'యొక్క కాలుచేతులు కూడ చికిత్సపేరున తెగకొట్టబడినవి. అధర్మమును తుదముట్టించుటకును, చిన్నజాతులహక్కులను సంరక్షించుటకును జరిగినదని చెప్పబడిన మహాయుద్ధము ముగిసినది. స్వయంనిర్ణయమునకును జాతీయస్వతంత్రమునకును, ఐక్యతకును, ప్రతి మానవజాతికిని గల హక్కు మొదలగు ఆదర్శములు విల్సను సభాపతిచే ప్రకటించబడినవి. ఈ ఆదర్శములతో జాతులమధ్య సంధులుజరుగుచున్నవనియు, శాశ్వతమగు శాంతి స్థాపింపబడనున్నదనియు చెప్పబడినది. యుద్ధముల కందరును విసుగుచెంది శాంతిని కోరుచుండిరి. ప్రపంచములోని ప్రధాన రాజకీయధురంధరులందరును సంధిసమావేశములలో పాల్గొనిరి. ఇట్టి పరిస్థితులలోగూడ తమ మిత్రులకు రాజ్యములను బహుమానములనిచ్చువ్యాపారమును రాజకీయవేత్తలు మానలేదు. యుద్ధకాలమున అగౌరవకరమైన రహస్యపుటొడంబడికలు తమలోతాము చేసికొనినటులే సంధులు జరిపినప్పుడుకూడ నీ రాజకీయవేత్తలు సామ్రాజ్యభావములకును తనివితీరని రాజ్యతృష్ణకును లోబడియే వ్యవహారములను నిర్వర్తించిరి. ఈవిధమున లండనులోను, శాన్‌రిమోలోను, సెవర్సులోను, మిత్రమండలి దేశముల రాజ్యాంగవేత్తలు "రోగి"ని మంచములోనుంచి లేవకుండ పడియుండునట్టి రాజ్యపంపిణీవిధానమును అవలంబించుటయేగాక, ప్రాముఖ్యమైన రేవుపట్టణములను తాము తీసుకొనుటవలన రోగియొక్క కాలు చేతులను తెగగొట్టి పడవయిచినవారయిరి. సామ్రాజ్యతృష్ణకు అఖండవిజయము చేకూరినది. పశ్చిమ ఆసియామైనరుయొక్క భాగ్యవంతమైన ప్రదేశములన్నియు మిత్రమండలివారివలన సంతృప్తికరముగ పంచుకొనబడినవి. జయముపొందిన సమయమున వారు కోరిన బహుమతులు వారికి లభిం

చినవి. తురుష్కము బాగుగ దెబ్బతినినది. క్రిందపడిపోయినది. మిత్ర మండలివారిచర్యలను ప్రతిఘటించుటకుగాని, ఆఖరుకు అసమ్మతిని తెల్పుటకుగాని తురుష్కమునకు బలములేదు. సుల్తాను మిత్రమండలివారి సంరక్షణలో నున్నాడు. బాస్ఫరసుసముద్రముమీదనున్న రాచనగరునందు బై దీవలె నివసించుచున్నాడు. ఆయన వ్యతిరేకభావమును చూపడు. మిత్రమండలివారి కెట్టిఅడ్డు లేదు. వారికి కావలసినది కాగితముమీద సుల్తానుప్రభుత్వము యొక్క సంతకము మాత్రమే. ఇంతటితో తురుష్కములో సగముభాగమును వారు పంచుకొనుటకు హక్కుపొందిరి." అని ప్రొఫెసరు టాయిన్బీ 'తురుష్కము' అను గ్రంథములో వ్రాసియున్నాడు.

## (4)

## జాతీయవాదులదృఢనిశ్చయము

సెవర్సుసంధి తురుష్కజాతీయవాదులలో విషాదవిస్మయములను కలుగజేసెను. మిత్రమండలివారు తురుష్కమునెడల నింతక్రూరముగ ప్రవర్తింతురనియు, సుల్తాను మిత్రమండలి కింతనీచముగ లోబడుననియు వారు తలచలేదు. ఈ విషాదకరమగు జాతీయావమానము జాతీయవాదులకు నిరుత్సాహమును కలుగచేయుటకుమారుగ వారిపట్టుదలను ద్విగుణీకృతముగ నొనర్చెను. దేశమునకు స్వతంత్రమును సంపాదింతము, లేనిచో మరణింతము అని మనోనిశ్చయమును పొందిరి. సెవర్సుసంధి నెవ్విధముగను అమలుజరుపబడకుండ మిత్రమండలిని ప్రతిఘటించి మాన ధన ప్రాణముల నర్పించి మాతృదేశమునకు స్వతంత్రము కలుగచేసితీరవలెనను తీర్మానమును చేసికొనిరి. సెవర్సుసంధి జరిగినదినము జాతీయదుఃఖదినముగ తురుష్కదేశమందంతటను సలుపబడెను. కాన్స్టాంటినోపిలులోని పత్రికలన్నియు నల్ల అంచులతో ప్రకటించబడెను. దుకాణములన్నియు మూయబడెను. పనియంతయు ఆగిపోయెను. వినోదములన్నియు కట్టిపెట్టబడెను. మసీదులన్నిటిలోను దేశస్వతంత్రముకొరకు ప్రార్థనలు జరిగెను. రక్షణకొరకు ప్రజల దృష్టియంతయు అంగోరావంకకు మరలెను. "సుల్తాను నాశనమయినాడు. అల్లాయును, అల్లాచేపంపబడిన పయిగంబరగు ముస్తఫా కెమాల్ 'పాషా తప్ప మనకు రక్షకులు లేరు" అని ప్రజలందరును తలచిరి.

## ప్రజాస్వామికము

ఈ పరిస్థితులలో అంగోరాలోని జాతీయప్రభుత్వమువారు సుల్తానును తీసివేసి తురుష్కమును సంపూర్ణ ప్రజాస్వామికముగ చేసిరి. ఈ రాజ్యాంగ విధానము (Law of Fundamental organisation) అంగోరా పార్లమెంటువలన 1921 సంవత్సరం జనవరినెల 20 వ తేదీన ఏకగ్రీవముగ మంజూరుకాబడినది. ఇందువలన కాన్‌స్టాంటినోపిలుప్రభుత్వము శాశ్వతముగ రద్దుపరచబడినది. తురుష్కదేశప్రభుత్వము అంగోరాలో స్థాపింపబడినది. తురుష్కప్రభుత్వమంతయు తురుష్కప్రజలకు సంక్రమించినదనియు వంశపారంపర్యాయమగు హక్కులుగల రాజరికము తీసివేయబడినదనియు ప్రకటింపబడెను. రెండుసంవత్సరములకొకసారి ఓటర్లచే ఎన్నుకొనబడిన తురుష్కప్రజాప్రతినిధిసభ (Grand National Assembly) సమస్తమైన పాలనమునుచేయును. ప్రజాప్రతినిధిసభకే యుద్ధములనుప్రకటించుటకును సంధిచేసుకొనుటకును హక్కుగలదు. పరిపాలనా కార్యనిర్వహణమంతయు అధ్యక్షునియందును, మంత్రులయందును నుండును. ముస్తఫా కెమాల్ ఏకగ్రీవముగ అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. ఈవిధముగ తురుష్కము నవీనప్రపంచములోని పెక్కుదేశములవలె (Republic) సంపూర్ణ ప్రజాస్వామికమైనది.

## రష్యానుండి సహాయము

రష్యాలోని సోవియటుప్రభుత్వముపై మిత్రమండలివారు నల్లసముద్రమునుండి దాడిసల్పుచున్నుల చెప్పియున్నాము. అచట మిత్రమండలివారిసేనలు ఓడిపోవుచుండెను. 1920 సంవత్సరము ఏప్రిలునెలలో బాకురేవును సోవియటుప్రభుత్వమువారు స్వాధీనముపొందిరి. ఆర్మీనియాలో బోల్షివికువిప్లవము జరిగి మిత్రమండలివారినుండి చీలిపోయెను, సెప్టెంబరు నెలలో మిత్రమండలిసేనలు ఆర్మీనియాను విడిచిపోయెను. అక్టోబరు 31 వ తేదీన దక్షిణరష్యాలోనున్న తిరుగబాటుదారుడగు రాంగలుసేనానిని ఓడించి క్రిమియాను, దక్షిణరష్యాను యాపత్తును రష్యాప్రభుత్వమువారు స్వాధీనమునుపొందిరి. 1920 సంవత్సరము జులై నెలలోనే జార్జియానుండికూడ

ఆంగ్లేయసేనలు లేచిపోవుటవలన జార్జియా ప్రజాస్వామికము 1921 సంవత్సరప్రారంభమున రష్యాతో చేరెను. ఈవిధముగ తురుష్కమునకును రష్యాకును మధ్యనున్న దేశమంతయు మిత్రమండలినుండి తప్పిపోయి రష్యాతో కలిసిపోయి అంగోరాతో స్నేహభావమును కలిగియుండుటవలన 1920సంవత్సరము ఆఖరుభాగమునుండియు రష్యానుండి తురుష్క—జాతీయవాదులకు ధనము, ఆయుధసామగ్రి, యుద్ధపరికరములు నిరాఘాటముగ వచ్చుచుండెను. వీటితోను, తనదేశములో వృద్ధిపొందిన స్వతంత్రజిగీషవల్లను ముస్తఫా కెమాల్ తనసైన్యములను బాగుగ వృద్ధిచేసి మంచి సైనికయేర్పాటులు చేసికొనుచుండెను.

## ఫ్రెంచివారిఅసూయ

1920 వ సంవత్సరాంతమునుండియు తురుష్కమునెడ ఫ్రెంచివారి మనోభావములు మారెను. "తురుష్క—సామ్రాజ్య పంపకములో బాగుగ లాభమును పొందినవి ఆంగ్లేయులుగాని ఫ్రెంచివారు కాదు. తురుష్క—స్వాతంత్ర నాశనమువలన ఆంగ్లేయుల ప్రాగ్దేశములసామ్రాజ్యమునకును వర్తకమునకును ఇంకను గొప్పబలము చేకూరుటనేగాని, ఫ్రెంచివారికి కలుగనున్న లాభములేదు. గ్రీకులకు ఆంగ్లేయులు సహాయముచేసి గ్రీకులసానుభూతిని సంపాదించుటవలన యూరపునకును ఆశియాకును మధ్య నాంగ్లేయులకు బలవంతుడగు మిత్రుడొకడు దొరకును. జర్మనీ పడిపోయినందున, ఇకనుంచి ఫ్రెంచివారికిని, ఆంగ్లేయులకును మాత్రమే తూర్పుదేశములలో పోటీ యేర్పడును" అని ఫ్రెంచిపత్రికలు వ్రాయసాగెను. ఫ్రెంచిప్రభుత్వమువారును తురుష్క—జాతీయవాదులతో సానుభూతిచూపుటకే నిశ్చయించిరి.

## యుద్ధము

1920 సంవత్సరాంతమున తురుష్క—జాతీయసేనలు గ్రీకులకు వత్తిడినికలుగజేయుచుండెను. సైలీషియా నాక్రమించిన కొన్ని ఫ్రెంచిసేనల నోడించి సైలీషియాలో కొంతభాగము మరల స్వాధీనము పొందెను. తురుష్క—ప్రజలు గ్రీకులపైనను పరాసువారిపైనను తిరుగబాటులుచేయుచుండిరి. 1921 వ సంవత్సర ప్రారంభమునకు తురుష్క—జాతీయసేనలు

గ్రీకులకును, మిత్రమండలికిని భయముగలుగజేసెను. గ్రీకులు తా మాక్ర మించిన ప్రదేశమును శాంతముగ నిలుపుకొనుట అసంభవమని తెలిసికొనిరి.

## సంధి కుదురలేదు

1921 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో మిత్రమండలివా రొక సంధి సమావేశమును లండనులో నేర్పాటుజేసి, గ్రీకుప్రతినిధులను, కాన్స్టాంటి నోపిలులోని సుల్తానుయొక్క ప్రతినిధులను, అంగోరాలోని జాతీయప్రభుత్వ ప్రతినిధులను ఆహ్వానించిరి. అప్పటికి అంగోరా జాతీయప్రభుత్వమును మిత్రమండలివారు అంగీకరించవలసివచ్చెను. అందరును సమావేశమైరి. సెవర్సుసంధియొక్క షరతులను కొంతవరకు మార్చి రాజీపరుప యత్నము జరిగెను. కాని తురుష్కజాతీయప్రభుత్వప్రతినిధులుకోరిన షరతులకు ప్రతి కక్షి లంగీకరించనందున రాజీకుదరక అందరును వెళ్ళిపోయిరి. ఇంతటి నుండియు మరల యుద్ధమును తీవ్రముగ నలుపుట కుభయపక్షములవారును తయారగుచుండిరి. జాతీయసైన్యము లింకను బాగుగ తయారుగాకముందే జాతీయప్రభుత్వరాజధానియగు అంగోరాను పట్టుకొనవలెనని గ్రీకులయుద్దే శ్యము. ఈ సంగతిని గ్రహించి ముస్తఫా కెమాల్ అంగోరాను బలపర్చు చుండెను.



# తురుష్కప్రజాస్వామికము

## 8 ఆసియాసమ్మేళనము

### (1)

### అమానుల్లారాజుతో సంధి

1921 సంవత్సరము మార్చినెలనుండియు చుట్టుపట్టునున్న ఆశియా ఖండప్రజాతులలో అంగోరాప్రభుత్వమువారు పరస్పర సంరక్షణకై యొడంబడికలు చేసికొననారంభించిరి. ఆశియాఖండమునందంతటను ఆ కాలమునకు స్వతంత్రేచ్ఛ బాగుగ ప్రజ్వరిల్లియుండెను. పాశ్చాత్యుల రాజకీయ ఆర్థిక పాలనమునుండి జాతీయస్వతంత్రమును పొందవలెననుకోరిక ఆశియాఖండములోని జాతులన్నిటిలోను వ్యాపించియుండెను. ఈ స్వతంత్రదీక్షను కేంద్రీకరింపజేసి ఆశియాకు సహాయముచేయుటయేగాక, దీనినిబట్టి యూరపు సామ్రాజ్యవాదులకు గొప్ప ప్రతిఘటనము కలుగజేయవలెనని ముస్తఫా కెమాల్ పాషా సంకల్పించెను. మార్చినెల 1 వ తేదీన అంగోరాప్రభుత్వమునకును అప్ఘనిస్థానమును పాలించుచున్న అమానుల్లా రాజుకును జరిగిన సంధి వీనిలో మొదటిది. ఈ సంధిలోని ముఖ్యసూత్రము లేవనగా :

(1) భగవదనుగ్రహమువలన స్వతంత్రము ననుభవించుచున్న తురుష్కము సంపూర్ణ స్వతంత్రముగలరాజ్యముగ అప్ఘనిస్థానమును గౌరవించుచున్నది. ఉభయులకుగల ప్రేమానుబంధములను బలపర్చుకొనుచున్నారు.

(2) ప్రాగ్దేశములన్నియు (ఆశియాఖండప్రజాతులన్నియు) సంపూర్ణమగుస్వతంత్రమునుపొందుటయే ఈ ఉభయదేశములవారి పవిత్రమైన సిద్ధాంతమై యున్నది. ప్రాగ్దేశములన్నిటియొక్కయు పూర్తియగు స్వేచ్ఛను, స్వతంత్రము కలిగియుండుటకుగల జన్మహక్కును అంగీకరించుచు, వాటిలో

ప్రతిదేశమును తన కిష్టమువచ్చినరీతిని తన్నుతాను పాలించుకొనుటకు హక్కు కలిగియున్నదని ఈ ఉభయదేశములవారును ప్రకటించుచున్నారు.

(3) ఖైవా, బుఖారాదేశములస్వతంత్రము నంగీకరించుచున్నారు.

(4) ప్రాగ్దేశములను లోబర్చుకొనవలెననియు వాటినుండి ధనమును గొనిపోవలెననియు ప్రయత్నించు సామ్రాజ్యములను ప్రతిఘటించుటలో నుభయులును పరస్పరసహాయము చేసికొనవలెను.

(5) ఒకరికివిరోధియగుదేశముతో రెండవవారు సంధిచేసికొన గూడదు. విదేశములతో వేటితో సంధిచేసికొన్నను అట్టుల చేసికొనక పూర్వము ఒకరికి రెండవవారు తెలుపవలెను.

(6) ఉభయదేశములకు రాకపోకలు స్వేచ్ఛగ జరుగుటకును, సమాచారములు వెంటవెంటనే తెలియుటకును తగు ఏర్పాటులు చేసికొనవలెను.

(7) ఆఫ్ఘనిస్థానపుఅభివృద్ధికై గావలసిన ఉద్యోగస్థులను, ఉపాధ్యాయులను తురుష్కము ఐదుసంవత్సరములవరకు పంపవలెను. ఐదు సంవత్సరము లయినపిమ్మటకూడ ఆఫ్ఘనిస్థానము కోరినచో క్రొత్తవారిని తురుష్కము పంపవలెను.

(8) ఈ సంధియొక్క రెండు ప్రతులును రష్యాకు ముఖ్యపట్టణమగు మాస్కోలో నుభయరాజ్యములప్రతినిధులవల్లను సంతకములుచేయబడి యుభయులకును ఇవ్వబడినవి.

## (2)

## రష్యాసోవియటుతో సంధి

మార్చి 16 వ తేదీన ముస్తఫా కెమాల్ పాషా రష్యా సోవియటు ప్రభుత్వముతో మరియొక సంధి గావించుకొనెను. ఇందువలన తురుష్కజాతీయవాదులకు విశేషమగు ఆయుధసామగ్రియు ధనసహాయమును రష్యానుండి కలిగినది. ఇంతేకాదు; 1878 వ సంవత్సరమున రష్యాచక్రవర్తి తురుష్క సుల్తానునుండి బలవంతముగ లాగుకొని రష్యాలో కలుపుకొనిన కార్సు, ఆర్దహాన్, బాటం అను మూడుజిల్లాలు మరల తురుష్కముక్రింద చేర్చబడినవి. ఈ జిల్లాలలో విశేషముగ తురుష్కులే కాపురమున్నారు.

తమ మాతృదేశమైన తురుష్కముతో కలిసియుండవలెనని వీరు కోరు చున్నారు. స్వయంనిర్ణయపుహక్కునుసరించి ఈ జిల్లాలను మరల తురుష్కములో జేర్చుటకు రష్యాప్రజాప్రభుత్వమువారు సమ్మతించినారు. ఈ తురుష్క - రష్యా సంధియొక్క యుపోద్ఘాతమునందిట్లున్నది:

"అన్నిజాతులకు స్వయంనిర్ణయపుహక్కు గలదు. అన్నిజాతుల మధ్యను సోదరభావము వర్ధిల్లవలెను. జాతులస్వతంత్రము నపహరించు చున్న సామ్రాజ్యఅహంకారమును ధిక్కరించుచు జరుపబడుచున్న పోరాటమునందు రష్యా తురుష్కము లైక్యమునుజెంది పరస్పరసహాయము చేసికొనుటకు తీర్మానించినవి. ఈ యుభయజాతులలో నెవరికి కష్టములు కలిగినను, నవి రెండవవారికి కష్టమును కలుగజేయును గావున, తమ పరస్పర లాభముకొరకు నుభయులును శాశ్వతమగు స్నేహభావమును సోదరత్వమును కలిగియుండుటకే నీ సంధి చేసికొనుచున్నారు."

అని వ్రాయబడియున్నది. ఈ రెండుదేశములును స్వతంత్రమును పొందకముందు అనగా సంపూర్ణ ప్రజాస్వామికములు గాకముందు, రష్యా చక్రవర్తులుగాని తురుష్కసుల్తానులుగాని చేసిన సంధులు, ఒడంబడికలు చెల్లవనియు, వారివలన ఆయాదేశములలో విదేశస్థులకివ్వబడిన ప్రత్యేక హక్కులు జాతీయస్వతంత్రమునకు ప్రతిబంధకములు గనుక రద్దుపరచబడినవనియు నీ సంధిలో వ్రాయబడినది. ప్రాగ్దేశములలో (ఆసియాఖండము లోని దేశములన్నిటిలో) నడుపబడుచున్న జాతీయోద్యమములన్నియు, రష్యాలోనికార్మికులు తమ సాంఘిక ఆర్థికదాస్యవిముక్తికై జరుపుచున్న ఉద్యమ సిద్ధాంతములవంటి స్వతంత్రసూత్రములమీదనే ఆధారపడియున్నవి గావున, ప్రాగ్దేశములకన్నిటికిని స్వేచ్ఛ, స్వతంత్రము, స్వయంనిర్ణయములు పవిత్రమగు సహజహక్కులని రష్యా, తురుష్కములు తమ సందేశమును తెలుపుచున్నారని ముఖ్యసూత్రముగ నీ సంధిలో నుదహరించబడినది. తమ దేశములలోని చిన్నసంఘములు సంపూర్ణమగు మతస్వేచ్ఛనుకలిగి తమ భాషను అభివృద్ధిచేసికొనుహక్కును కలిగియుందురనియు, తక్కినవారితో సమానహక్కులు కలిగియుండుటలో ఎట్టికష్టములులేక సంరక్షింపబడుదురనియు, నీ యుభయప్రభుత్వములును కరారుచేసినవి. ఉభయదేశముల

మధ్యను రాకపోకలు స్వేచ్ఛగను తేలికగను చేయుటకు రైలుమార్గములు, రోడ్లు, టెలిగ్రాములు త్వరితముగ నిర్మాణముచేయబడును. ఇదివరకు జరిగిన యుద్ధములలో నిర్బంధింపబడినవారికంపరికిని క్షమాపణ ఇచ్చి ఉభయ ప్రభుత్వములవారును వారి స్వదేశపుసరిహద్దులలో వదలవలెను.

ఇటులనే అక్టోబరునెలలో తురుష్క జాతీయప్రభుత్వమువారు ఆర్మీనియా, ఆజరుబీజను, జార్జియాప్రజాస్వామికప్రభుత్వములతోకూడ సంధులు చేసికొనిరి.

## (3)
## పర్షియాతో స్నేహము

పారసీకదేశమునందు కూడ నిరువదవశతాబ్దప్రారంభమునుండియు ముఖ్యముగ విద్యాధికులలో జాతీయోద్యమము వ్యాపించినది. తమ చక్రవర్తియగు షా నిరంకుశుడై ఆంగ్లేయులవద్దను రష్యావారివద్దను ఋణములను తెచ్చి దుర్వ్యయముచేయుచు వారికి దేశములో హక్కులనిచ్చుచు పలుకుబడిని కలుగచేయుచుండుట పర్షియాజాతీయవాదులకు కంటకముగ నుండెను. 1906 వ సంవత్సరమునాటికి పారసీకజాతీయవాదులబల మెక్కువై, వారు షాను బెదిరించి 'మజ్లిసు' అను ప్రజాప్రతినిధిసభను స్థాపించునటుల చేసికొనిరి. మజ్లిసుకు జవాబుదారివహించినమంత్రివర్గ మేర్పడెను. ఆర్థికవ్యవహారములు, ఋణములు, విదేశీయులహక్కులు, సంధి, యుద్ధము మొదలగు శాఖలన్నియు మజ్లిసుక్రిందికి వచ్చెను. విదేశస్థులక్రిందికి తమదేశము పోకుండుటకై మజ్లిసు ఆర్థికసంస్కరణములను చేయసాగెను.

గాని ఆంగ్లేయ, రష్యన్ప్రతినిధులు షాను చీలదీసి షాయొక్క మంత్రులలో నొకరిద్దరిని లోబర్చుకొని, 'షా' మరల తన నిరంకుశత్వమును స్థాపించుకొనుటకై సహాయపడసాగిరి. 1907 వ సంవత్సరమున పారసీకమును ఉత్తరభాగము రష్యావారియొక్క పలుకుబడిప్రదేశముగ నుండునట్లును, దక్షిణభాగము ఆంగ్లేయులపలుకుబడిప్రదేశముగ నుండునట్లును, మధ్యభాగము తటస్థప్రదేశముగ నుండునట్లును ఆంగ్లేయులును రష్యావారును పంపిణీచేసికొనిరి. ఇందుకు షా అంగీకరించెను. షా యొక్క

ఆర్థికమంత్రి తెల్లవారివద్ద లంచముపుచ్చుకొని మాతృదేశమును అమ్మివేసె నని జాతీయవాదులు నిందించిరి. ఆ పంపిణీయొడంబడిక సంతకమైనదినము ననే షా యొక్క ఆర్థికమంత్రి చంపవేయబడెను. షా వెంటనే జాతీయ వాదులపై నిర్బంధప్రయోగములుగావించెను. విదేశీయులసహాయముతో షా మజ్లిసుపై యుద్ధమును ప్రకటించెను. రెండుసంవత్సరములు షాకును జాతీయవాదులకును యుద్ధముజరిగి, తుదకు షా యోడి పారిపోయి రష్యా వారిశిబిరములో శరణుపొందగ, 1909 వ సంవత్సరమున మజ్లిసు నూతన షాను సింహాసనాధీశుని గావించెను.

## మార్గను షుస్టరు

కాని పారసీకజాతీయవాదులకు ఆంగ్లేయులతోను రష్యావారితోను సంఘర్షణ మెక్కువయ్యెను. మజ్లిసు అమెరికాప్రభుత్వసహాయమును కోరి వారిసలహాపైన 1911 వ సంవత్సరమున మార్గను షుస్టరు అను నార్థికనిపు ణుని మూడుసంవత్సరములకాలము కోశాధ్యక్షునిగ నియమించిరి. ఆయన మంచి యార్థికపుటేర్పాటులను చేయసాగెను. గాని ఆంగ్లేయులను రష్యా వారిని సరకుజేయక స్వతంత్రముగ తన విధులను నెరవేర్చుచుండెను. ఇందు మీద నాయనను తీసివేయనిచో తాము యుద్ధమునుప్రకటింతుమని ఆంగ్లేయు లును రష్యావారును బెదిరించిరి. మజ్లిసు భయపడి షుస్టరును తీసివేసెను. మజ్లిసులో కొందరు దేశాభిమానులు దేశమువిడిచి పారిపోయిరి. మిగిలిన వారు నయముననుభయమునను ఆంగ్లేయులయొక్కయు రష్యాయొక్కయు పలుకుబడిక్రింద చేరిరి. ఇటుల 1919 వ సంవత్సరమువరకును వ్యవహార ములు జరిగెను. ఈ లోపున దేశములో నరాజక మెక్కువయ్యెను. రష్యా వారు వాయువ్యమూలనంతను ఆక్రమించి పాలనమును స్థాపించుచుండిరి. పర్షియాలో దక్షిణపుప్రాంతపు నూనెగనులను ఆంగ్లో పర్షియను ఆయిలు కంపెనీ యను ఆంగ్లేయకంపెనీ త్రవ్వుకొనిపోవుచుండెను.

## రెజాఖాను పెహాల్వి

ప్రపంచయుద్ధము ముగియునప్పటికి పర్షియాలో జాతీయోద్యమము మరల విజృంభించెను. రెజాఖాను పెహాల్వి జాతీయోద్యమనాయకుడయ్యెను.

పారిసుసంధిసమావేశమునకు పారసీకజాతీయవాదులుకూడ పోయి, విల్సను సభాపతిని దర్శింప యత్నించిరి గాని, దర్శనముగాక మరలివచ్చిరి. యుద్ధ కాలమున ఆంగ్లేయులమధ్యను రష్యాచక్రవర్తిమధ్యను మరల పారసీక పంపిణీ ఖాయపర్చబడి తటస్థదేశమంతను ఆంగ్లేయులపలుకుబడిక్రింద చేర్చు కొనబడిన యుదంతము పారసీకజాతీయవాదులకు విషాదమును కలిగించినది. యుద్ధము ముగిసినపిమ్మట 1919వ సంవత్సరము ఆగస్టు 9 తేదీన ఆంగ్లేయ విదేశవ్యవహారమంత్రియగు కర్జన్‌ప్రభువు షాచేతను, ఆయన మంత్రివర్గము చేతను నొక సంధిపత్రముపై సంతకముచేయించుకొనెను. దానివలన ఆంగ్లే యులు పారసీకప్రభుత్వమునకు ఇరువదిలక్షలసవరముల నప్పునివ్వవలెను. పారసీకము ఆంగ్లేయసలహాదారులను, సైనికోద్యోగులను నియమించుకొని ఆంగ్లేయులసంరక్షకత్వమున నుండవలెను. పారసీకములో ఆంగ్లేయులు రైళ్ళువేయుహక్కు పొందవలెను.

ఈ సంగతి తెలియుటతోడనే పారసీకజాతీయవాదులు కోపోద్దీపితు లైరి. పారసీకసైన్యములుకూడ జాతీయవాదులతో చేరెను. ఆంగ్లేయుల అధికారము తమదేశములో స్థాపింపబడకుండ తీవ్రమగు ప్రతిఘటనమునకు పూనుకొనిరి. మజ్లిసులోని అధికసంఖ్యాకులు జాతీయవాదులపక్షమున చేరిరి. కర్జన్‌ప్రభువు గావించిన సంధి మజ్లిసుఎదుటకువచ్చినపుడు మజ్లిసు దానిని అత్యధికసంఖ్యాకులచే త్రోసివేసెను. మంత్రివర్గము రాజీనామానిచ్చెను. జాతీయవాదులమంత్రివర్గ మేర్పడెను. రెజాఖాను పెహల్వి ప్రధానమంత్రి యయ్యెను. పారసీకదేశమంతయు నూతనమంత్రివర్గమువెనుక నుండెను. ఈ నూతన పారసీక జాతీయప్రభుత్వము దేశములో శాంతిని నెలకొల్పి, అమె రికానూనెవర్తకులవద్ద రుణము తెచ్చి ఆంగ్లేయులరుణమును తీర్చినది. డాక్టరు మిల్సుపా యను అమెరికను ఆర్థికనిపుణుని నియమించినది. పార సీకయైకమత్యమును గ్రహించి ఆంగ్లేయులు పారసీకజాతీయవాదులతో యుద్ధముచేయుట మాని షాతోచేసికొనినసంధిని వదలుకొనిరి. పారసీకము స్వతంత్రదేశమయినది. పారసీక జాతీయవాదులందరును తురుష్కజాతీయో ద్యమముతో అత్యంతమగు సానుభూతిని జూపిరి. రెజాఖాను పెహల్వీ ముస్తఫా కెమాల్ పాషాకు పరమాప్తుడుగ నుండెను.

## (4)

## భరతవర్షమునందు ఖిలాఫతుద్యమము

భరతవర్షమునందు ప్రపంచయుద్ధకాలమున తురుష్కమునందుగల సానుభూతివలన కొన్నివందలమందిని నిర్బంధవాసముననుంచిరని చెప్పయున్నాము. యుద్ధకాలమున భరతవర్షము మిత్రమండలికి చాలగ సహాయము చేసినను, యుద్ధముముగియగనే గొప్ప స్వరాజ్యభాగము రాక, మాంటేగు ఛెమ్సుఫర్డుసంస్కరణము లివ్వబడుటవలనను, రౌలటుచట్టము చేయబడుటవలనను, పంజాబులో బ్రిటిషుద్యోగస్థులు జరిపిన దురంతములవలనను, 1920 వ సంవత్సరప్రారంభమునను భరతవర్షమునందు గొప్ప స్వాతంత్ర్య పోరాటము ప్రారంభమయినది. భరతవర్ష ప్రజలను తురుష్కస్వాతంత్ర్యమునందు విశేషమగు సానుభూతి గలదు. తురుష్కమునుగూర్చిన సంధిషరతుల విషయమున మిత్రమండలివా రాలోచించుచున్నదినములలో 1920 వ సంవత్సరము మార్చినెలలో భారతీయముసల్మానుల ఖిలాఫతురాయబారము కీర్తిశేషులయిన మౌలానా మహమ్మదాలీగారినాయకత్వముక్రింద ఇంగ్లాండునకేగి బ్రిటిషు ప్రధానమంత్రి లాయిడుజార్జిని, హిందూదేశమంత్రి మాంటేగును, ఇతర మిత్రమండలిమంత్రులను దర్శించి, తురుష్కముయొక్క ఐక్యమును స్వతంత్రమును కాపాడవలెనని చెప్పిరి. గాని వారెవరును ఖిలాఫతురాయబారమును లక్ష్యముగా చూడలేదు. మహమ్మదాలీ ప్రభృతులు ఆశాభంగము నొంది స్వదేశమున కరుదెంచిరి. త్రోవలో ముస్తఫా కెమాల్‌ను దర్శించి వచ్చిరి. 1920 వ సంవత్సరము ఏప్రిలు నెల 6 వ తేదీ మొదలు 13వ తేదీ వరకును పంజాబుదురంతములను జ్ఞప్తికితెచ్చు జాతీయవారముగ భరతవర్షమునందంతటను జరుపుచు, ఏప్రిలు 9వ తేది ఖిలాఫతుదినముగ పరిగణింపబడెను. ఆ దినమున బొంబాయినగరమునందు మహాత్మాగాంధి ఖిలాఫతువిషయమున "మహమ్మదీయులయాశయములు యీడేరనిచో ముసల్మానులకు యుద్ధకాలమున చేయబడిన ప్రతిజ్ఞలు నెరవేర్పబడువరకును బ్రిటిషు ప్రభుత్వమునకు భరతవర్షమునందు ఏవిధమయిన సహాయమును చేయకుండుట ప్రతి భారతీయుని కర్తవ్యమైయున్నది" అను తీర్మానము నుపపాదించి

యామోదింపజేసెను. 1920 వ సంవత్సరమున ఏప్రిలు నెల 17 వ తేదీన మదరాసునగరమునందు ఖిలాఫతుమహాసభ జరిగి, తురుష్కమున కన్యాయముజరిగినచో అసహాయోద్యమమును ప్రారంభించుటకు నిశ్చయింపబడెను. 1920 వ సంవత్సరము ఆగస్టునెల 20 వ తేదీన జరిగిన సెవర్సు సంధి భారతీయులకు మిగుల కంటకముగ నుండెను. సెప్టెంబరునెల 4 వ తేదీన కలకత్తాయందు జరిగిన అఖిలభారత దేశీయమహాసభయొక్క ప్రత్యేక సమావేశమునందు పంజాబుదురంతములకు ప్రతీకారముగను, ఖిలాఫతు అన్యాయమును తొలగించుటకును, స్వరాజ్యముకొరకును, బ్రిటిషుప్రభుత్వమునకు దౌర్జన్యరాహిత్యమగు సహాయనిరాకరణము గావింపవలెనను తీర్మానమామోదింపబడి, భారతజాతీయవాదులెల్లరును శాసనసభలను బహిష్కరించిరి. మరల డిశంబరునెలలో నాగపురమున జరిగిన దేశీయమహాజనసభయందు సహాయనిరాకరణతీర్మాన మామోదింపబడెను. 1921 వ సంవత్సరము డిశంబరునెలలో కీర్తిశేషులైన హకీం అజ్మలుఖానుగారియధ్యక్షత క్రింద అహమ్మదాబాదునందు జరిగిన దేశీయమహాజనసభయందు పంజాబు ఖిలాఫతుఅన్యాయములు తొలగింపబడువరకును, స్వరాజ్యమువచ్చువరకును సహాయనిరాకరణమును సాగించుచుండవలెననుతీర్మానము మరల ఖాయపరచబడెను. 1921-22 వ సంవత్సరములలో మహాత్మాగాంధియొక్కయు, ఆలీ సోదరులయొక్కయు నాయకత్వమున భరతవర్షమునందంతటను జరిగిన దౌర్జన్యరాహిత్య సహాయనిరాకరణోద్యమమునుగూర్చి మా చదువరులకు తెలియును. 1921 వ సంవత్సరము మార్చినెలలో బెజవాడనగరమున జరిగిన అఖిలభారత కాంగ్రెసుసంఘతీర్మానానుసారముగ మూడునెలలలో ఒక కోటి రూప్యముల తిలకుస్వరాజ్యనిధి వసూలయ్యెను. అనేక లక్షలమందిసభ్యులు కాంగ్రెసులో చేరిరి. ఇరువదిలక్షలరాట్నములు నెలకొలుపబడెను. ఖద్దరు పునరుద్ధరింపబడెను. మద్యపాననిషేధము చెలరేగెను. అస్పృశ్యతానివారణ మవలంబించబడెను. దేశములో ననేకమంది న్యాయవాదులు కాంగ్రెసు ఆదేశానుసారముగ కోర్టులకు పోవుట మానిరి. వేలకొలది విద్యార్థులు ప్రభుత్వపాఠశాలలను మానిరి. జాతీయపాఠశాలలు పెక్కుచోట్ల నెలకొలుపబడెను. ప్రభుత్వబిరుదములనువదలి, గౌరవోద్యోగములకు,

ప్రభుత్వోద్యోగములకు రాజీనామాలనిచ్చినవారును చాలమంది గలరు. కరాచీనగరమున జరిగిన ఖిలాఫతుసభయందు పోలీసులను సైనికులను ఉద్యోగములు వదిలిపెట్టవలెనని కోరినందున అలీసోదరులును, కిచ్లూ ప్రభృతులును సెప్టెంబరునెలలో అరెస్టుచేయబడి శిక్షలువిధింపబడిరి. నవంబరునెల 17 వ తేదీన యువరాజుగారు హిందూదేశమును దర్శించునటుల నేర్పాటుకాబడెను. యువరాజుగారిని బహిష్కరించవలెనని కాంగ్రెసువారు తీర్మానముచేసిరి. దేశములో నీ సందర్భమున హరతాళములు, సభలు జరిగెను. యువరాజుగారి బహిష్కారమునకు క్రిమినలులా సవరణచట్టము వర్తింపజేయబడెను. ప్రభుత్వమువారు బలమగు నిర్బంధవిధానముల నవలంబించిరి. 1921, 1922 వ సంవత్సరములలో యావద్భారతదేశములో షుమారు ముప్పదివేలమంది భారతీయులు కారాగృహములకేగిరి. 1922 వ సంవత్సరము మార్చినెలలో చౌరీచౌరాలో జరిగిన అల్లరులలో కాంగ్రెసువాదులుకూడ దౌర్జన్యమునవలంబించిరనుకారణమున మహాత్మాగాంధి శాసనోల్లంఘనము నాపివైచి, నిర్మాణకార్యక్రమమును సాగించవలెనని బార్డోలీ తీర్మానమును చేయించెను. తరువాత కొలదిదినములకు మహాత్మాగాంధిని యరెస్టుజేసి, రాజద్రోహనేరముక్రింద విచారణజరిపి ఆరుసంవత్సరముల శిక్షను విధించిరి. గాని రెండుసంవత్సరములలోపలనే విడిచిపెట్టిరి.

## ఇండియామంత్రి రాజీనామా

హిందూదేశప్రభుత్వమువారును హిందూదేశమంత్రియగుమాంటేగుగారును తురుష్కస్వతంత్రమునెడల భరతవర్షమునందుగల గాఢాభిమానమును తెలిపి, ఆంగ్లప్రభుత్వమువారు సెవర్సుసంధిని పూర్తిగ మార్చివేసి, తురుష్కలెక్కువగ కాపురమున్న స్మర్నాను, త్రేసును తురుష్కమున కివ్వవలసినదనియు, తురుష్కజాతివిషయమున యుద్ధకాలమున చేయబడిన వాగ్దానముల నమలుజరుపవలసినదనియు లండనులోని ఆంగ్లేయప్రభుత్వమునకు వ్రాసిరి. ఈ సంగతి మాంటేగు మంత్రి ప్రకటించెను. ఈప్రకారము జరుపుటకు ప్రధానమంత్రి లాయడుజార్జి, విదేశవ్యవహారమంత్రి కర్జనుప్రభువు అంగీకరించలేదు. మిగిలిన మంత్రివర్గమువారిసమ్మతి లేనిదే హిందూదేశప్రభుత్వము

వారియభిప్రాయము నేల ప్రకటించితిరని మాంటేగుమంత్రిని యాక్షేపించిరి. అందుమీద 1922 వ సంవత్సరము మార్చినెల 9 వ తేదీన మాంటేగుమంత్రి రాజీనామానిచ్చెను.

## (5)

## అరబుదేశములలో స్వతంత్రేచ్ఛ

యుద్ధము ముగియగనే స్వతంత్రము కలుగునని నమ్మిన అరబులకు యుద్ధము ముగిసినపిమ్మటకూడ మిత్రమండలివారిసేనలు అరబుదేశములను విడిచివెళ్ళకపోవుటవలన సనసంతృప్తి కలిగెను. పారిసుసంధిసమావేశమునందు అరబుజాతీయవాదులు స్వతంత్రము కావలెనని చెప్పుకొనిరి. గాని హెజాజి (అరేబియా) దేశమును ఆంగ్లేయులకుమిత్రుడగు మక్కా షెరీఫు హుస్సేనుకు స్వతంత్రరాజ్యముగ నిచ్చి, మిగిలిన నాలుగు అరబుదేశములను ఆంగ్లేయులక్రిందను, ఫ్రెంచివారిక్రిందను మాండేటులుగ వర్సేల్సుసంధివలన చేయబడుటచే అరబుజాతీయవాదులకు గొప్ప ఆశాభంగము కలిగెను. హెజాజి (అరేబియా) దేశము స్వతంత్రముగచేయబడినను, దానికి రాజుగ చేయబడిన షెరీఫు హుస్సేను మిత్రమండలివారికి గొప్ప స్నేహితుడగుట వలన నచటి ప్రజలకు ఆయనయందు విశ్వాసములేకపోయినది. ఆయనకు బలవద్విరోధియగు వాహాబితెగలనాయకుడగు ఇబనుసౌదు ఆయనపై తిరుగబాటులుసలిపి రెండుసార్లు మక్కావరకును వచ్చెను. ఆయననోడించి 1926 వ సంవత్సరమున హెజాజిరాజ్యమును స్వాధీనపర్చుకొనెను. షెరీఫు హుస్సేను రాజ్యభ్రష్టుడై అరేబియానువదలి ఆంగ్లేయుల మాల్టాకు వెళ్ళిపోయెను. 1927 వ సంవత్సరమున ఇబనుసౌదును అరేబియాకు రాజుగ నాంగ్లేయులుకూడ నంగీకరించిరి.

మాండేటులుగ చేయబడిన నాలుగుదేశములును తేలికగ ఆంగ్లేయులకును, ఫ్రెంచివారికిని లోబడలేదు. 1920-1921 సంవత్సరములలో అరబులు తురుష్కజాతీయవాదులతో కలసి మిత్రమండలికి గొప్ప ప్రతిఘటనమును గావించిరి. "1919 వ సంవత్సరమాఖరుభాగమున అరబులు మిత్రమండలి సేనలపై గొప్ప తిరుగబాటును ప్రారంభించిరి. దీనికి కారణము మిత్రమండలివారు యుద్ధకాలమునచేసియున్న వాగ్దానములను చెల్లింపకపోవుటయే

అయియున్నది. 1919, 1920, 1921 సంవత్సరములలో జరిగిన సమాచారములను తురుష్కదేశము నాక్రమించియున్న మిత్రమండలివారి యుద్యోగస్థులు బయటకు తెలియకుండ గట్టిగ కప్పిపుచ్చిరి. అరబుదేశములప్రజలు ఆంగ్లేయ, ఫ్రెంచిపాలనములకు సమ్మతించిరని బయటికి కనపర్చుటకు ప్రయత్నముజరిగెను" అని 'నవీనతురుష్కము'నందు మీయర్సు వ్రాసియున్నాడు. '1920 సంవత్సరములో సిరియాలోని డెమాస్కసుపట్టణమున అరబు స్వాతంత్ర్యరాజ్యము స్థాపించబడెను. దానిని ఫ్రెంచిసేనలు గొప్పపోరాటము సలిపి విచ్ఛిన్నముచేసిరి. ఇరాకుపైకి హిందూదేశమునుండి వెళ్ళిన గొప్పసేనలు అరబులను జయించి శాంతిని నెలకొలుపుటకు చాల కాలము పట్టెను. అరబు జాతీయపక్షమొకటి స్థాపించబడెను. సిరియా, లెబనాన్, పాలస్తైనులపైన ఫ్రెంచివారును, ఆంగ్లేయులును మాండేటులను వదలుకొనవలెననియు, వెంటనే వాటిని వదలిపోవలెననియు, వాటిస్వతంత్రము నంగీకరించి అవి ప్రజాస్వామికముగ నుండుటకును, మిగిలిన అరబుదేశములతో కలిసి సంయుక్తప్రభుత్వముగ నేర్పడుటకును అవకాశమివ్వవలెననియు 1923వ సంవత్సరమున సిరియా, పాలస్తైన ప్రజలకాంగ్రెసువారు తీర్మానించి యంతర్జాతీయసమితికి తీర్మానమును బంపిరి. దానివలన ఫలితమేమియు కలుగలేదు.

## (6)

## ఈజిప్టు స్వతంత్రోద్యమము

ఈజిప్టును మరల స్వతంత్రదేశముగ చేసికొనవలెనని జాతీయోద్యమము వ్యాపించెను. ప్రపంచయుద్ధకాలమున ఆంగ్లేయప్రభుత్వమువారు సైనికశాసనమును అమలుజరిపిరి. ఈజిప్టు మసల్మానులు యుద్ధకాలమున ఆంగ్లేయప్రభుత్వమునకు తొందరకలుగచేయలేదు. యుద్ధము ముగియగనే స్వతంత్రసంపాదనకొరకు జాతీయవాదు లాందోళనమును ప్రారంభించిరి. పారిసుసంధిసమావేశమునకుపోయి చెప్పుకొనవలెనని యత్నించిరి. అపుడు సాదు జగ్లుల్ పాషా జాతీయోద్యమనాయకుడుగ నుండెను. 1919 సంవత్సరం మార్చినెల 8 వ తేదీన జగ్లుల్, హమీదు, సిద్కి, మహమ్మదు పాషా

లను బ్రిటిషుప్రభుత్వమువారు అరెస్టుచేసి మాల్టాద్వీపములోని చెరసాలలో నిర్బంధించిరి. ఇందువలన ఆందోళనము హెచ్చెను. సమ్మెలు, అల్లరులు జరిగెను. నిర్బంధవిధానము చెలరేగెను. ఏప్రిలు నెల 7 వ తేదీన జగ్లుల్ పాషా మొదలగు నాయకులనందరిని విడిచిపెట్టి పారిసుకుపోయి సంధిసమావేశమునందు ఈజిప్టునుగూర్చి చెప్పుకొనుట కనుజ్ఞ నిచ్చిరి. వారు పారిసుకు పోయిరి.

కాని జాతీయవాదులు జాతీయస్వతంత్రము వచ్చువరకును పోరాడదలచిరి. అల్లరులులేకుండ శాంతింపజేసిదౌర్జన్యరాహిత్యమగు సాత్త్వికనిరోధమును సాగింపదలచిరి. వీరిపక్షమగు వాఫ్డు (Wafd)నకు దేశములో చాల బలము కలిగెను. ఏప్రిలు నెల 10 వ తేదీన రెండవపోరాటము ప్రారంభమయ్యెను. విద్యార్థులు, లాయర్లు దేశమందంతటను ప్రచారముచేసిరి. దేశమందంతటను సమ్మెలు జరిగెను. ప్రభుత్వమువారు పికెటింగును నిషేధించిరి. ఉద్యోగస్థులు కూడ సమ్మెలో చేరిరి. ప్రభుత్వము నిర్బంధవిధానము నవలంబించెను. ఏప్రిలు 20 తేదీవరకు సమ్మెలు చాలవరకు అంతరించెను.

## బ్రిటిషు సంరక్షకత్వము

పారిసులో జగ్లుల్ మొదలగువారి ప్రయత్నములు విఫలమయ్యెను. 1919 వ సంవత్సరము జూన్‌నెలలో జరిగిన వర్సెల్సుసంధిలో ఈజిప్టు దేశము బ్రిటిషుప్రభుత్వమువారి సంరక్షకరాజ్యముగ (Protectorate) చేయబడినది. వీలయినంతత్వరితముగ ఈజిప్టునువదలి వెళ్ళిపోదుమని 1882 వ సంవత్సరమున గ్లాడుస్టన్ ప్రధానమంత్రి వాగ్దత్తముచేసెను. అప్పుడు ఈజిప్టు స్వతంత్రమున కర్హమైనదని యెంచబడెను. నలుబదిసంవత్సరముల కాలము బ్రిటిషుప్రభుత్వముక్రింద తరిబీయతుపొందినతరువాత ఇప్పుడు ఈజిప్టు స్వతంత్రమున కర్హురాలు గాదని యెంచబడినది. బ్రిటిషువారి సంరక్షకత్వమును అమెరికాప్రభుత్వముకూడ అంగీకరించినది. ఇంతటితో జాతీయవాదులు మూడవసారి పోరాటమును సాగించిరి. బ్రిటిషుప్రభుత్వము సైనికశాసనమును ప్రకటించి మితవాదులచే ప్రభుత్వమును నడిపించసాగెను.

1919 వ సంవత్సరము నవంబరునెలలో బ్రిటిషుసంరక్షకత్వముక్రింద ఈజిప్టుప్రజలకు క్రమక్రమముగ స్వపరిపాలనయందు శిక్షణమునిచ్చుటకై

యొక్క రాజ్యాంగవిధానము తయారుచేయవలసియున్నందున అందువిషయమై విచారణను సలిపి సిఫారసులుచేయుట కొరకు కమీషనును ఈజిప్టునకు పంపెద మని బ్రిటిషుప్రభుత్వమువారు ప్రకటించిరి. ఈ కమీషనును బహిష్కరించ వలసినదని జగ్లుల్‌పాషా పారిసునుండి సలహానిచ్చెను. బహిష్కరించుటకే వాఫ్డుపక్షమువారు తీర్మానించిరి. హరతాళములు, బహిష్కారసభలు చాల జరిగెను. విద్యార్థులు పాఠశాలలను వదలివచ్చిరి. ఉలేమాలు, జమీందార్లు, లాయర్లు, శాసనసభ్యులు బహిష్కారోద్యమమున జేరిరి. శాసనసభలు రద్దు చేయబడెను. జాతీయప్రముఖులను చెరసాలలలో నుంచిరి. జాతీయపత్రికలు ఆపివేయబడెను. కఠినమగు నిర్బంధవిధానము నవలంబించిరి. కొన్నిచోట్ల యల్లరులు జరిగెను. ప్రజలమీద సైనికులు తుపాకులు గాల్చిరి. మితవాద ప్రధానమంత్రియగు మహమ్మదు సయ్యదు రాజీనామా నిచ్చెను. మంత్రివర్గ మేర్పడుట కష్టమయ్యెను. ఎటులో యూసేపు వాహబు అను నాయనచే మంత్రివర్గ మేర్పాటుచేయించిరి.

## మిల్నరు కమీషన్ బహిష్కారము

1919 సంవత్సరము డిశంబరు నెల 10 వ తేదీన గొప్ప ఫిరంగులను వెంటపెట్టుకొని ఏడుగురుసభ్యులుగల మిల్నరు కమీషన్ ఈజిప్టులో దిగెను. ఈ కమీషనులో నందరును ఆంగ్లేయులే. ఇందొక లిబరల్‌పార్టీ సభ్యుడు. ఒక లేబరుపార్టీ సభ్యుడు నుండిరి. ఈ కమీషనును ఈజిప్టుదేశము పూర్తిగ బహిష్కరించినది. వీరిని ఆదరించినవారు ఆహ్వానించినవారు పలుకరించినవారు సంజాయిషీనిచ్చినవారు లేరు. ఏ పార్టీవారును ఈ కమీషన్‌వద్దకు పోలేదు. మూడునెలలు అటుఇటు ఈ కమీషన్‌వారు తిరిగిరి. ఈజిప్టుదేశీయులను తమవద్దకు రమ్మనిరి. ప్రభుత్వమువారు సైనికశాసనమును అమలుజరిపిరి. అన్నియు నిష్ప్రయోజనమయ్యెను. మిల్నరు కమీషనువారు 1920 వ సంవత్సరము మార్చినెలలో ఇంగ్లాండుకు వెళ్ళిరి. ఈజిప్టు అపాయకరమైనస్థితియందున్నదనియు, ఈజిప్టుజాతీయవాదులతో రాజీపడ వలసినదనియు తమ నివేదికయందు వ్రాసిరి.

## జగ్లుల్‌పాషాయొక్క రెండవప్రవాసము

ఆంగ్లేయప్రభుత్వమువారు వెంటనే జగ్లుల్‌పాషాతోను, వాఫ్దుకక్షి తోను రాయబారములను ప్రారంభించిరి. జగ్లుల్ ఇంగ్లాండుకు వెళ్ళెను. రాజీ కుదురలేదు. కర్జన్‌ప్రభువు మితవాదపక్షనాయకుడగు అడ్లిపాషాతో రాజీ పడుటకు యత్నించెను. రాజీ కుదురలేదు. 1921 వ సంవత్సరము ఏప్రిలు 5 వ తేదీన జగ్లుల్‌పాషా ఈజిప్టుకు వచ్చెను. అప్పు డాయనకు ఈజిప్టు దేశీయులు అనన్య సాధారణమగు స్వాగతమునిచ్చిరి. మరల జాతీయవాదులు సంపూర్ణ స్వతంత్రముకొరకు పూర్తియగు నాందోళనమును ప్రారంభించిరి. అక్టోబరులో కొందరు లేబరుపార్టీకిచెందిన ఆంగ్లేయపార్లమెంటుసభ్యులు ఈజిప్టును దర్శించిరి. ఈజిప్టులో గొప్ప అశాంతి ప్రబలియుండెనని కను గొనిరి. మితవాదమంత్రులు రాజీనామానిచ్చిరి. డిశంబరునెల 23 వ తేదీన దేశమందంతటను గొప్పసభలను జగ్లుల్‌పాషా యేర్పాటుచేయగ నా సభలను బ్రిటిషుప్రభుత్వమువారు నిషేధించిరి. జగ్లుల్ మొదలగు నాయకు లా నిషే ధాజ్ఞల నుల్లంఘించిరి. జగ్లుల్ మొదలగు జాతీయనాయకులను అరెస్టుచేసి ఏడెన్‌కును, అచటనుండి సింహళమునకును ప్రవాసమునకు బంపిరి. దేశ ములో నల్లరులు జరిగెను. బ్రిటిషుప్రభుత్వమువారు యుద్ధనావలను తెచ్చిరి. ఆకాశవిమానము లెగురుచుండెను. పటాలములు దిగెను. తీవ్రమగు నిర్బంధ విధానమువలన ప్రభుత్వమువారు అల్లరుల నణచిరి.

## రక్షణములకు, మినహాయింపులకు లోబడిన స్వతంత్రము

1922 వ సంవత్సరము ఫిబ్రవరినెల 22 వ తేదీన అనగ జగ్లుల్‌ను ప్రవాసమునకు బంపిన రెండునెలలకు ఈజిప్టుమీద బ్రిటిషుప్రభుత్వమువారు స్థాపించిన సంరక్షకత్వమును వదలుకొని ఈజిప్టుయొక్కస్వతంత్రమును అంగీకరించుచు కొన్నిషరతులను మాత్రము విధించి యొకప్రకటనను గావిం చిరి. ఆ ప్రకటనముయొక్క ముఖ్యసూత్రము లేమనగా : 1 ఈజిప్టుదేశము మీద సంరక్షకత్వము ఆంగ్లేయులు వదలుకొనినారు. వెంటనే సైనికశాసనము రద్దుచేయబడును. 2 ఈజిప్టుదేశముయొక్క సంపూర్ణస్వతంత్రమును ఆంగ్లేయప్రభుత్వమువారు అంగీకరించినారు. 3 (1) ఈజిప్టునందు బ్రిటిషు

సామ్రాజ్యమునకుగల రాకపోకలమార్గములసంరక్షణము. (2) ఈజిప్టును విదేశదండయాత్రలనుండియు, విదేశీయులకుట్రలనుండియు కాపాడుట. (3) ఈజిప్టులోని విదేశస్తుల మానప్రాణముల యొక్కయు, ఆస్తులయొక్కయు, వర్తక వ్యాపారములయొక్కయు సంరక్షణము. (4) ఈజిప్టులోని చిన్నసంఘములసంరక్షణము. (5) సుడానుదేశము, అను నీ అయిదు వ్యవహారములను గూర్చియు ఈజిప్టుప్రభుత్వమువారిమధ్యను ఆంగ్లేయప్రభుత్వమువారిమధ్యను స్నేహమగు రాయబారములు, చర్చలు జరిగి యొడంబడికలు జరుగవలసి యున్నవి. అట్టి యొడంబడికలు జరుగువరకును, ఈ అయిదు వ్యవహారము లును ఇదివరకువలెనే ఆంగ్లేయప్రభుత్వముయొక్క యాజమాన్యముక్రిందను పాలనముక్రిందను నుండును, అని ప్రకటనజేసి దీనిని వెంటనే సమలుతో బెట్టిరి. ఫాదు వెడిప్ ఈజిప్టుకు స్వతంత్రమగు రాజయ్యెను. రెండుశాసనసభ లేర్పడెను. మంత్రివర్గమేర్పడెను. స్వతంత్రదేశముయొక్క మర్యాదలన్నియు ఈజిప్టు కేర్పడెను. గాని పైరెండు సూత్రమునుబట్టి (1) సూయెజుకాలువ (2) విదేశవ్యవహారములు (3) సైన్యము (4) ముఖ్యమగు ఆర్థికయాజమాన్యము (5) కొంత న్యాయవిచారణాధికారము (6) ప్రతిపంటకు ప్రసిద్ధి కెక్కి, నైలునదియొక్క పైభాగమునగల సుడానుదేశము ఆంగ్లేయులపాలనమునందున్నవి. ఇంకను ఆంగ్లేయులకును ఈజిప్టుజాతీయవాదులకును రాజీ కుదరలేదు. 1923 వ సంవత్సరము మార్చినెలలో జగ్లుల్ పాషా మొదలగు నాయకులను ప్రవాసమునుండి విడుదలచేసిరి.

ఇటుల 1921-22 సంవత్సరములలో ప్రచండమైన జాతీయస్వతంత్ర కృషి ఈజిప్టులో జరుగుచు, ఈజిప్టు స్వతంత్రవాదులకు అంగోరాపట్టణము ప్రధానమైన శరణ్యముగ నుండెను. భరతవర్షమునుండియు స్వతంత్రమైన దేశములో నివసించవలెనను దీక్షతో కొందరు మునల్మానులు వచ్చి అంగోరాలో నివసించుచుండిరి. ఈవిధమున మాస్కోనుండి ఢిల్లీవరకును, ఢిల్లీ నుండి కైరోవరకును, కైరోనుండి మాస్కోవరకును మధ్యనున్న దేశము లన్నియు స్వతంత్రేచ్ఛతో తాండవమాడుచు తురుష్కజాతీయవాదులతో సంపూర్ణమగు తోడ్పాటును గావించుచుండెను.

# తురుష్క ప్రజాస్వామికము

## 9 గ్రీకులతో యుద్ధము

### (1)

### గ్రీకులజయములు

1921 సంవత్సరం మార్చినెల 23 వ తేదీన మరల గ్రీకులు తురుష్కులపై దండయాత్రలను ప్రారంభించిరి. ఆఫియం ఖరాహిసార్, ఎస్కి-షెహర్ పట్టణములను బట్టుకొని, అచటనున్న రైలుమార్గములను స్వాధీన పరచుకొనుటకు బయలుదేరిరి. ఈ రెండు రైలుకూడలిమార్గములను పట్టు కొనినచో కాన్‌స్టాంటినోపిలునుండి స్మర్నాకు పోవు అర్ధచంద్రాకారముగ నున్న రైలుమార్గమునంతను గ్రీకులు స్వాధీనమునందుంచుకొనవచ్చును. ఇంతవరకు తురుష్క-జాతీయవాదులు తమ సేనలను రహస్యముగ స్మర్నా సరిహద్దున చేర్చుచున్న అంగోరా-కోనియా రైలుమార్గము వారి స్వాధీనము నుండి తప్పిపోవును. ఈ యుద్దేశ్యములతో గ్రీకుసైన్యములు ఆఫియం ఖరాహిసార్ మీదపడెను. అచటి తురుష్కసైన్యముల నోడించి యా పట్టణ మును పట్టుకొనెను.

### తురుష్కులజయము

ఏప్రిల్ నెలప్రారంభమున గ్రీకుసైన్యము లచటనుండి సాగిపోయి, ఎస్కి-షెహర్‌ను ముట్టడించెను. ఇన్‌ఓన్‌పద్ద గ్రీకులకును తురుష్కులకును జరిగిన తీవ్రమైనపోరాటములో తురుష్కులు జయమునుపొందిరి. గ్రీకులు ఎస్కి-షెహర్‌నుండియేగాక, ఆఫియం ఖరాహిసార్‌నుండికూడ తురుష్కులచే వెడలగొట్టబడిరి.

## తురుష్కుల యపజయములు

జులై నెల 10 వ తేదీన గ్రీకులు మరల బయలుదేరి అడ్డగించిన తురుష్కసేనలను ముందునకునెట్టుకొనిపోయి ఓర్యాటూహాయను స్వాధీనముపొందిరి. అచటనుండి గ్రీకుసైన్యములు ఎస్కిషెహార్ పట్టణమును రెండవమారు ముట్టడించెను. తురుష్కసేన లా పట్టణము విడిచిపోయెను. గ్రీకులు దాని నాక్రమించిరి. ఇజ్మత్‌పాషా తురుష్కసేనలను తెచ్చి మరల నా పట్టణమును ముట్టడించెను. 10 దినములు ముట్టడి జరిగినను లోనున్న గ్రీకులను వెడలగొట్టలేక ఇజ్మత్‌పాషా మరలిపోయెను. అచటి నుంచి గ్రీకుసైన్యములు ఆఫియంఖరాహిసార్‌మీదపడి దానిని లోబర్చుకొనెను. అచటి రైలుమార్గములనన్నిటిని గ్రీకులు స్వాధీనపరచుకొనిరి. కొన్నివారములు విశ్రాంతిచెంది మంచి యేర్పాటులుచేసికొని, గ్రీకుసైన్యములు అంగోరాను పట్టుకొనవలెనను నుత్సాహముతో అంగోరావైపునకు బయలుదేరెను.

## తురుష్కుల యఖండజయము

తురుష్కసేనలు త్రోవలో గ్రీకుల నడ్డగించి యోడించుటకై మిగుల పట్టుదలతో అంగోరాకువచ్చుమార్గమున సకరయ్యానదివద్ద విడిసియుండెను. ఆగస్టునెల 24 వ తేదీన గ్రీకులు తురుష్కులపై తారసిల్లిరి. సకరయ్యానదివద్ద జరిగిన యుద్ధము ప్రపంచములోని స్వతంత్రముకొరకు జరిగిన సుప్రసిద్ధమగుయుద్ధములలో నొకటి. దీనితో తురుష్కస్వతంత్రము నిల్చుటో, తురుష్కజాతి ప్రపంచములో నూరుపేరులేక నాశనమైపోవుటో తేలవలెను. జాతీయధర్మమునకును సామ్రాజ్యతృష్ణకును జరిగిన సంగ్రామ మిది. తమది ధర్మపక్షమని నమ్మి, భారమంతయు ధర్మస్వరూపుడును, జాతులయదృష్టమును నిర్ణయించు నేతయును నగు అల్లాపైవైచి, తురుష్కజాతీయసైన్యములు తమ దేశసంరక్షణకొరకై గ్రీకుసైన్యములతో ప్రాణములనొడ్డి హోరాహోరిగ పోరాడిరి. ఉభయులమధ్యను మిగుల ఘోరమగు పోరు మూడువారములు జరిగెను. ఒకపక్షమునకు మరియొకపక్షము సంఖ్యయందును ఉత్సాహమునందును, శౌర్యమునందును తీసిపోలేదు. తురుష్క-



ముస్తఫా కెమాల్ పాషా

జాతీయసైన్యములకు ముస్తఫా కెమాల్‌పాషా స్వయముగ సేనాధిపత్యమును వహించెను. మహాయోధుడగు ఇజ్మత్‌పాషా ఆయనకు కుడిభుజమై నిల చెను. ఒకపు డొకపక్షము మరియొకప్పుడు రెండవపక్షము జయముపొందిన ట్లగపడెను. ఉభయసేనలు బహుసమీపమునకువచ్చి పోరుసల్పెను. ముస్తఫా కెమాల్‌పాషా అనేకసారులు తనసేనలమధ్యకు వచ్చి నిల్చి యుత్సాహమును పురికొల్పుచుండెను. ఒకసారి ఆయన కా యుద్ధములో బలమైన గాయము తగిలెను. మూడుదినములు తమ యుద్ధపుఆసుపత్రిలో చికిత్సనొందవలసి వచ్చెను. ఆకాలమున ఇజ్మత్‌పాషా సేనలను నడిపెను. గాయమ్ము బాగుగ మానకముందే ముస్తఫా కెమాల్ మరల వచ్చి సైన్యాధిపత్యము వహిం చెను. తుదకు తురుష్కజాతీయవాదులకే జయముగలిగెను. గ్రీకుసైన్యము లోడి సెప్టెంబరు 16 వ తేదీన వెనుకకు మరలిపోయెను. తిరిగిపోవుచు త్రోవలో కనుపడిన తురుష్కగ్రామములనెల్ల తగులబెట్టుచు పోయి, 23 వ తేదీన ఆఫియంఖరాహిసార్‌లో ప్రవేశించెను. అంగోరా సంరక్షించబడెను. తురుష్కజాతీయవాదులప్రతిష్ఠ లోకమంతటను వ్యాపించెను. ధర్మమునకు జయముకల్గెను. తురుష్కప్రజలలో ధైర్యోత్సాహములు ప్రబలెను. సకరయ్యాయుద్ధము "శః శతాబ్దములో జరిగిన ముఖ్యమైన యుద్ధములలో నొకటి" అని క్లెయరు ప్రైసు అను చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

## ఎల్‌ఘాజీ

సకరయ్యాయుద్ధము ముగియగనే ముస్తఫా కెమాల్‌పాషా అంగోరాకు వచ్చెను. అచటి పార్లమెంటువారు గొప్ప సన్మానమును చేసి ఎల్ ఘాజీ (ధీరాగ్రేసరుడు) అను బిరుదము నీయన కిచ్చిరి. యీ బహుమానమునకు వందనములర్పించుచు గ్రీకుయుద్ధములో తురుష్కజాతీయవాదు లవలంబించుచున్న రాజనీతినిగూర్చి యిట్టుల జెప్పెను: "పార్లమెంటు కధ్యక్షుడుగ నేను బహిరంగముగ జెప్పున దేమనగా, మనము యుద్ధమును కోరుటలేదు. మనకు శాంతియే కావలెను. అట్టి ఆశయమును పొందుట కభ్యంతరము నా కగుపడుటలేదు. మనచే జన్మహక్కులను బలవంతముగ వదలిపేయించగల మని గ్రీకుసైన్యములు తలచినచో వారు పొరబడుచున్నారని చెప్పుచున్నాను. మనజాతిని నిర్మూలముచేయుప్రయత్నములను ప్రతిఘటించుటకు మనము

కత్తిదూసి మనదేశమును సంరక్షించుకొనుట మనయొక్క ముఖ్యధర్మమై యున్నది. ఇంతకన్న నుత్కృష్టమైనయుద్దేశ్యము వేరొకటుండనేరదు. మనదేశములోనుండి ఆఖరు శత్రుసైనికుని వెళ్ళగొట్టువరకును మనము యుద్ధముచేయక తప్పదని నేను తమకు మనవిచేయుచున్నాను" అని ఆయన చెప్పెను.

ఒక సంవత్సరమువరకు మరల గొప్పపోరాటములు జరుగలేదు. గ్రీకులు ఆశియామైనరులోనే యుండిరి. ఉభయపక్షములును రాబోవు పోరాటములకై తమతమ సైన్యములను బాగుగ తయారుచేసికొనుచుండిరి.

## (2)
## ఫ్రెంచివారితో సంధి

తురుష్కులతో పోరాటమునుగూర్చి మిత్రమండలివారిలో నభిప్రాయ భేదము లేర్పడినవని మనము పైన చదివియున్నాము. 1921 వ సంవత్సరము మార్చినెలలో ఫ్రెంచిప్రభుత్వమువారికిని ముస్తఫా కెమాల్‌పాషాకును సంధి రాయబారములు జరిగినవి. తురుష్కమునుగూర్చి తమ యభిప్రాయమును మార్చుకొనినామనియు, స్వతంత్రమైనట్టియు, బలముగలిగినట్టియు తురుష్కదేశము నిల్చియుండుటయే నింతటినుండి పరాసువారి ప్రాగ్దేశ రాజనీతి యనియు ఫ్రెంచిమంత్రి మిల్లెటు ఫ్రెంచిపార్లమెంటులో జెప్పెను. సకరయ్యాయుద్ధము జరిగినతరువాత ఫ్రెంచివారు తురుష్కజాతీయపక్షము యొక్కబలమును బాగుగ గుర్తించిరి. అక్టోబరునెలలో ఫ్రెంచిప్రభుత్వము వారు అంగోరాప్రభుత్వముతో రాజీకుదుర్చుటకు ఫ్రాంకులిను బొయిలను అనునాయనను అంగోరాకు బంపిరి. అక్టోబరు 20 వ తేదీన ఫ్రెంచివారికిని అంగోరా జాతీయప్రభుత్వమునకును రాజీ జరిగెను. యీ రాజీవలన ఫ్రెంచివారు తమ సేనలన్నిటిని సైలీషియారాష్ట్రమునుండి తీసివేసి, యా రాష్ట్రమును నిరాటంకముగ తురుష్కమునకు వదలిరి. సిరియాకును తురుష్కమునకును మధ్య సరిహద్దు సెవర్సుసంధిలోకన్న నెక్కువ తురుష్కుల కనుకూలముగ నిర్ణయించబడెను. తురుష్కములోని నల్లసముద్రతీరమున నున్న హెర్కెటుజిల్లాలోని కొన్ని యినుప, వెండి, క్రోముగనులకు తొంబది

తొమ్మిది సంవత్సరముల కౌలును ఫ్రెంచివారు పొందిరి. మధ్యధరాసము ద్రముునుండి తూర్పునకు కొంతదూరమువరకును బాగ్దాదు రైలుశాఖలను ఫ్రెంచివర్తకులు నిర్మాణముగావించుటకు హక్కు నివ్వబడెను. ఫ్రెంచివారి క్రిందనున్న సిరియాలో తురుష్క లెక్కవమందికాపురమున్న అలెగ్జాం డ్రియాప్రాంతమునందు తురుష్కభాషకు ప్రత్యేక ప్రోత్సాహమును ఫ్రెంచి వారు కలుగచేయవలయును. సిరియాలోని అట్టోమాన్‌వంశస్థాపకునితాత గారగు సులేమాన్‌షాగారి గోరీయును, అందుకుసంబంధించిన కట్టడము లును, ఆస్తులును తురుష్కప్రభుత్వమునకుచెంది దానిమీద తురుష్కపతాక మెగురవలెను. ఇంతటితో ఫ్రెంచి తురుష్కులమధ్య యుద్ధము ముగిసి నది. ఉభయులును తమతమ స్వాధీనములోనున్న రెండవదేశపు ఖైదీలను విడిచిపేయవలెను. ఈవిధమగు రాజీని ఫ్రెంచివారును అంగోరాప్రభుత్వము వారును అంగీకరించి ఆంగ్లేయులతో సంప్రదించకుండగనే దస్కతులుచేసి కొనిరి. యీ ప్రత్యేకసంధిని చేసుకొన్నందుకు ఫ్రెంచివారిపైన ఆంగ్లేయు లకు కోపమునచ్చినది. ఉభయప్రభుత్వములమధ్యను కొన్ని యుత్తరప్రత్యు త్తరములు జరిగెను. కాని ఫ్రెంచిప్రభుత్వమువారు తమ యభిప్రాయములను మార్చుకొనలేదు.

## ఇటలీతో సంధి

ఇటలీవారికిని యాంగ్లేయులమీద అసూయ యేర్పడెను. తమమీద కంటె తమకు పోటీగనున్న గ్రీకులమీద ఆంగ్లేయు లెక్కువ మక్కువ జూపుచున్నారని తలచిరి. రాము సెవర్సుసంధివలన స్వాధీనముపొందిన తురుష్కప్రదేశములను దక్కించుకొనలేమని గ్రహించిరి. తురుష్కజాతీయ వాదులప్రతాపమును గుర్తించిరి. ఫ్రాన్సువంటివారే 'తురుష్కజాతీయవాదు లతో రాజీకి యత్నించుచుండగ, తమ కెందు కీ పోరాటములని ముందుగనే 1921 సంవత్సరం మార్చినెల 12 వ తేదీన ఇటలీప్రభుత్వమువారు అంగోరా ప్రభుత్వముతో సంధిచేసుకొనిరి. ఈ సంధివలన తురుష్కములోనున్న ఇటలీవారి సైన్యములన్నియు తీసివేయబడినవి. స్మర్నా, థ్రేసురాష్ట్రములు మరల తురుష్కమునకు చెందునటుల ఇటలీవారు ప్రయత్నించెదరు. తురు ష్కము సంపూర్ణ స్వతంత్రము ననుభవించుటకు ఇటలీవారు సమ్మతించిరి.

అడేలియా, ఆఫియం ఖరాహిసార్, కుటయా మొదలగు కొన్ని ప్రాంతములలో గనులు త్రవ్వుకొనుట మొదలగు వర్తకసంబంధమగు హక్కులు ఇటలీవారి కివ్వబడెను.

## మిత్రమండలియొక్క తటస్థము

ఇక నాంగ్లేయులుమాత్రమే ప్రాగ్దేశములలో తమకు గల్గిన రాజకీయ, సైనిక, వర్తకలాభమును బలపరుచుకొనుటకును, గ్రీకులమూలమున బాల్కనురాష్ట్రములలోను ఆశియామైనరులోను తమరాజనీతిని సాగించుటకును ప్రయత్నించుచు తురుష్కజాతీయవాదులకు శత్రువులుగ నిల్చినారు. మిత్రమండలివారిలో నొకవైపున ఆంగ్లేయులకును, రెండవవైపున ఫ్రాన్సు ఇటలీలకును భేదాభిప్రాయములు కల్గినందున గ్రీకులకును తురుష్కులకును జరుగుచున్నపోరాటములో ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జపాను ప్రభుత్వములవారు తటస్థులుగనుందురని 1921 వ సంవత్సరం ఆగస్టు 10 వ తేదీన మిత్రమండలివారు ప్రకటించవలసివచ్చినది.

ఫ్రెంచిసేనలు సైలీషియాను ఖాళీచేసిపోవుటవలన, అచట ఫ్రెంచిసేనల నెదిరించుటకై యుంచబడిన యెనుబదివేల తురుష్కసేనలు గ్రీకుల మీదికి వెళ్ళుటకు విడుదలఅయ్యెను. ఇటులే, ఇటలీసైన్యములు అడేలియాను వదలి లేచిపోవుటవలనకూడ వారినెదుర్కొనుచున్న తురుష్కసైన్యములు కూడ విడుదలయ్యెను. ఇంతేకాక ఫ్రెంచిసేనలు వెళ్ళిపోవుచు నలుబదివేల సైనికులకు సరిపోయిన యుద్ధపరికరములను, ఆహారసామగ్రులనుతురుష్కజాతీయవాదులకు వదలిపోయిరి. అడేలియారేవుప్రాంతమంతయు నిటలీవారు తురుష్కులకు వదలిపోవుటవలన, ఆ రేవులగుండ విదేశములనుండి ఆయుధసామగ్రులను తురుష్కులు తెప్పించుకొనుటకును వీలుకలిగినది.

## సంధిప్రయత్నములు విఫలమగుట

మిత్రమండలివారిసహాయము తమకు పూర్తిగ కలుగునని యాశించిన గ్రీకులకు ఇందువలన ఆశాభంగము కలిగెను. తా మొంటరిగ తురుష్కులతో పోరాడవలసివచ్చినది. సకరయ్యాయుద్ధమునందు తురుష్కజాతీయశౌర్యాగ్ని రుచిచూచియున్నారు. 1922 వ సంవత్సరం మార్చినెలలో మిత్రమండలివారి

విదేశాంగమంత్రులు పారిసునగరమందు సమావేశమై సెవర్సుసంధిని ఇంక నెక్కువగ తురుష్కులపక్షముగ మార్చుచు అంగోరాకు తెలియపరచిరి. మార్చి 22వ తేదీన ఆశియామైనరునందు తురుష్కులమధ్యను గ్రీకులమధ్యను తాత్కాలికసంధి నేర్పాటుజేసినామని మిత్రమండలివారు అంగోరాకును గ్రీకు రాజధానియగు ఎథెన్సుకును తెలిపిరి. నాలుగుదినములు తరువాత తాత్కాలిక సంధి యంగీకరింపబడిన నాలుగునెలలో గ్రీకులు శాంతముగ ఆశియామైన రును వదలిపోవునట్లును, ఆశియామైనరునందు తురుష్కపాలనము శాంత ముగ సాగునట్లును నేర్పాటుచేసినామనికూడ మరల నుభయపక్షములకును తెలియపరచిరి. ఇందుకు గ్రీకులును, కాన్‌స్టాంటినోపిలులోని సుల్తాన్ ప్రభుత్వమువారును అంగీకరించిరి గాని, అంగోరాప్రభుత్వమువారు సమ్మతింప లేదు. గ్రీకులు ఆశియామైనరును పూర్తిగ ఖాళీచేసిపోయినప్పుడుగాని తాత్కాలికసంధినంగీకరింపమని అంగోరా విదేశాంగమంత్రి బదులువ్రాసెను. సంధిరాయబారములు జులై నెలవరకుజరిగి కుదరనందున. సంధివిషయమును వదలిపెట్టిరి. ఇంతటితో గ్రీకులు గట్టిగ పోరుసల్పి, దీర్ఘకాలమునుండి జరుగు చున్నయుద్ధమును త్వరగ పరిసమాప్తినొందించుటకు నిశ్చయించిరి.

## (3)
## గ్రీకులతో యుద్ధము

1922 వ సంవత్సరము జులై నెల 17 వ తేదీన స్మర్నాలోని గ్రీకు హైకమీషనరుకు గ్రీకు లాక్రమించినప్రదేశమునంతను గ్రీసుక్రింద 'అయో నియా సంరక్షకరాష్ట్రముగ' చేయబడెనని ప్రకటించుటకు గ్రీకుప్రభుత్వము నుండి యుత్తరువులు వచ్చినవి. ఆ ప్రకార మాయన ప్రకటించెను. దీనికి అంగోరాప్రభుత్వము ఖండితముగ నసమ్మతినిచెప్పి సర్వవిధముల ప్రతిఘ టించుటకు పూనుకొనెను. ఈనెలలోనే గ్రీకులు కాన్‌స్టాంటినోపిలును కూడ ముట్టడించెదమని ప్రకటించిరి. కాని కాన్‌స్టాంటినోపిలు చేరుటకు మిత్రమం డలివారియధీనమందున్న ప్రదేశములలోనుండి గ్రీకుసేనలు పోవలసి యున్నందునను, కాన్‌స్టాంటినోపిలు మిత్రమండలివారిసేనలసంరక్షణక్రింద

నున్నంతనను అపటికి గ్రీకులు రాకూడదని మిత్రమండలియధికార్లు తెలియ పరచిరి. గ్రీకు లంతటితో తమ సైన్యములను విశేషముగ త్రేసునందు చేర్చుచుండిరి.

## తురుష్క విజయములు

ఆగష్టునెల 22 వ తేదీన యుద్ధముయొక్క ఆఖరురంగము మరల ప్రారంభమయ్యెను. ఆ వారమునందు బ్రూసాలోను, మయెండరులోను చిన్న పోరాటములు జరిగెను. ఆగష్టునెల 26 వ తేదీన ఇజ్మత్‌పాషా సేనాని క్రింద తురుష్క సైన్యములు అఫియంఖారాహిసార్‌లోనున్న గ్రీకుసేనలను ముట్టడించెను. యుద్ధము తీవ్రముగజరిగి గ్రీకులు గొప్ప యపజయమునొంది ఆ పట్టణమువదలి పారిపోయిరి. తురుష్కులు గ్రీకులవెంటనంటి ముందుకు నెట్టుకొనిపోయిరి.

## ఉషకుయుద్ధము

ఆగష్టునెల 29, 30 తేదీలను టుమ్లు-పూనర్‌వద్ద గ్రీకులకును తురుష్కులకును మరియొకయుద్ధము జరిగి తురుష్కులకే మరల జయము కలిగెను. గ్రీకులు పారిపోయి తమ సైన్యములను ఉషకులో చేర్చిరి. తురుష్కులచటికివెళ్ళి ముట్టడించిరి. సెప్టెంబరు 2 వ తేదీన గ్రీకులు పూర్తిగ నోడింపబడిరి. తురుష్కులగుర్రపుదళము ఉషకులో జొరబడి గ్రీకుల సైనికశిబిరమును స్వాధీనపరచుకొనెను. తురుష్కులు గ్రీకుసేనానిని, ఆతనిక్రిందిసైనికోద్యోగులను ఖైదీలుగ పట్టుకొనిరి. దీనితో గ్రీకులకు నిరుత్సాహము కలిగెను. అంగోరాయొక్క యుత్సాహము విస్తరించెను.

## ముస్తఫా కెమాలును హత్యగావించు ప్రయత్నములు

ఈ స్వతంత్రపోరాటము జరుగుచున్నకాలములో నప్పుడప్పుడు ముస్తఫా కెమాలును హత్యగావించుటకు కొన్ని కుట్రలు జరిగెను. అవి దైవానుగ్రహమువలన సకాలములో కనుగొనబడెను. 1920వ సంవత్సరమున గ్రీకులు ఆయనను చంపుటకు కొందరిని నియమించిరి. వారాయనను చంపలేక ఆయన మరణించెనని వార్తలు ప్రకటించిరి. ఆయన అంగ్లేయులవలన

లంచముపొందెననికూడ వాడుకలువేసిరి. ఇందువలన వారిపక్షమువారికి నిరుత్సాహముకలుగునని తలంచిరి కాబోలు!

"ఈ కుట్రలయొక్క పట్టుదల క్రౌర్యము ఎంతవరకుండెనో, హిందూదేశమునుండి వెళ్ళిన ముస్తఫా సఘీర్ అనుపేరు పెట్టుకొనిన హంతకుని విచారణవలన 1921 వ సంవత్సరము మే నెలలో బయలుపడెను.

## ముస్తఫా సఘీర్

ఈ హంతకుని అంగోరావు ముస్తఫా కెమాల్‌ను చంపుటకై పంపక మునుపు ఆంగ్లేయులు అగోఫిరుసుఖాను అను భయంకరమైన జైలులో కొద్దికాలము పడవేసిరి. ఇంతలో అయన తప్పించుకొని పారిపోయినటుల కనపరచిరి. అయన తాను హిందూదేశములోని ఖిలాఫతుసంఘప్రతినిధిననియు, తాను తురుష్కజాతీయపోరాటములో పోరాడుటకు రాగా, దుష్టులగు ఆంగ్లేయులు తనను పట్టుకొని జైలులోవేసిరనియు, తాను జైవానుగ్రహమున తప్పించుకొని పారిపోయి బ్రతికి వచ్చితిననియు, మహమ్మదీయ మతముకొరకును తురుష్కస్వాతంత్ర్యముకొరకును తన ప్రాణములను అర్పించుటకు సిద్ధముగనుంటిననియు చెప్పి అంగోరాలో ముస్తఫా కెమాల్ పాషాయొక్క సేవలో చేరెను. అంగోరానుండి సమాచారములు ఎప్పటికప్పుడు కాన్‌స్టాంటినోపిలులోని జాతీయవాదులకు తీసికొనివెళ్లుపనిలో వేయించుకొనెను. ఆయనను జాతీయవాదులు నమ్మి అట్టి ముఖ్యమైనపనిలో నియమించిరి. కొంతకాలము అంగోరాలోని సమాచారములు కాన్‌స్టాంటినోపిలులోని ఆంగ్లేయప్రతినిధులకు రహస్యముగ తెలుపుచుండెను. ఆయనయొక్క బండితోలువాండ్లవల్లను నౌకరులవల్లను అయన ఆంగ్లేయగూఢచారియనియు ముస్తఫా కెమాల్‌ను చంపుటకు ప్రయత్నించుచున్నాడనియు అంగోరాలోని జాతీయప్రభుత్వోద్యోగులకు తెలిసినది. ఆయనను కనిపెట్టి ఆయనచర్యలను దపిసీలుగ ఎప్పటికప్పుడు అంగోరాయుద్యోగస్థులకు తెలుపుటకు ఆయనపైన నొక గూఢచారిని నియమించిరి. ఆయనక్రింద నొక నౌకరుగ నొక తురుష్కగూఢచారి ప్రవేశించి పనిచేయుచుండెను. ముస్తఫా కెమాల్ ఆయనయెడల ఎక్కువ జాగ్రత్తగ సంచరించుచుండెను. పాపము! ముస్తఫా సఘీర్‌కీ సంగతి తెలియక తాను నియమింపబడినప్రకారమే సంచరించుచుండెను.

ఒకరోజున ఆయనవద్ద తగిన కాగితపునిదర్శనములుండగ ఆయనను తురుష్క-జాతీయప్రభుత్వపు పోలీసువారు పట్టుకొని అంగోరాలో విచారణకు పెట్టిరి. ఆయనకు ముప్పదిసంవత్సరముల వయసు. ఆయన మంచి కుటుంబమునకు చెందినవాడు, విద్యావంతుడు. విచారణలో ఆయన తన నిజవృత్తాంతమునంతను బయలుపరచుచుండగ అంగోరాప్రజలెల్లరును విస్మయచిత్తులై నిశ్శబ్దముగ వినుచుండిరి.' ఆయన హిందూదేశములోని కాశీపట్టణవాస్తవ్యుడగు మహమ్మదీయుడు. చిన్నతనమందే హిందూదేశప్రభుత్వమువా రాయనకు విద్యార్థివేతనమునిచ్చి ఇంగ్లాండుకు పంపి ఉత్తమవిద్యను చెప్పించిరట. ఆక్సుఫర్డులో బి. ఏ. పరీక్షయందు తీర్ణుడు కాగానే ఈజిప్టుజాతీయవాదులపై రహస్యముగ నిగహాయుంచుటకై కైరోపట్టణమున ఆయనకు ఉద్యోగ మీయబడెనట. తరువాత పారసీకములోను, ఆఫ్ఘనిస్థానములోను, హిందూదేశములోను, జాతీయవాదులను ముఖ్యముగ మహమ్మదీయ జాతీయవాదులను రహస్యముగ వెంటాడుచు కనిపెట్టి వారిచర్యలు ఆంగ్లేయప్రభుత్వమునకు తెలుపుచుండుటకై అనేకస్థలములలో పనిచేసెను.

## ఆంగ్లేయులసొమ్ము

"ప్రతినెలకు తురుష్క-సుల్తాను ఆంగ్లేయులవలన ఎంతసొమ్ము పుచ్చుకొనుచుండెనో ఆయన విచారణలో తెలియపరచెను. ముస్తఫా కెమాల్ పాషా ఆంగ్లేయులకు లోబడినట్లయిన ఆంగ్లేయులు రెండుకోట్లరూప్యముల నిచ్చుటకు నిశ్చయించిరని తెలిపెను. తన కెంత విలువగలదో అదివరకు తనకు తెలియలేదని ముస్తఫా కెమాల్ చెప్పి, పకపక నవ్వెను. ముస్తఫా కెమాల్ను హత్యగావించుటకు సుల్తాను దామాద్ ఫరీదుపాషాపక్షపుమంత్రులు, కాన్స్టాంటినోపిలులోని ఆంగ్లేయ సైనికాధికారులు కుట్రపన్నిరనియు, అనటోలియాలో ముస్తఫా కెమాల్ను హత్యచేయుటకు తనను నియమించిరనియు నాయన చెప్పెను.

"ఈపనికి నిన్నెందుకు నియమించిరి?" అని ఆయన నడిగిరి.

"ఇంతకన్న ఎక్కువ అపాయకరమైనపనిలో నేను నియమింపబడి జయప్రదముగ ఆ పనిని ముగించియుంటిని. అందువలన నా సామర్థ్యమునందు నమ్మకముగలిగి, నన్నీపనికి నియమించిరి" అని ఆయన బదులుచెప్పెను.

## ఉరిశిక్ష

ఈవిధముగ యావత్తు వృత్తాంతమును బయలుపరచినందుకు తన నిజమైనపేరును తన గౌరవమైన కుటుంబముయొక్క పేరును బయలుపెట్ట నవసరములేకుండ తనకు మరణశిక్ష నివ్వవలసినదని ఆయన వేడెను. ఆయనను ఉరితీసిరి."

(Pp 227-278 Eminent Asians by Joseph Hall)

## గ్రీకులు స్మర్నాను వదలుట

ఉషకుయుద్ధముతో గ్రీకుయుద్ధము సమాప్తిచెందినదని చెప్పనొప్పును. అత్యుత్సాహముతో తురుష్క సేనలు గ్రీకులను వెంటనంటిరి. గ్రీకులు ప్రతిచోటను ఓడి పారిపోయిరి. ఫెజ్వి పాషాయొక్కయాధిపత్యమున తురుష్క సేనలు గ్రీకులను ఎనిమిదిదినములలో ఉషకునుండి నూట అరవై మైళ్ళదూరము తరుముకొనిపోయెను. గ్రీకులు తమఆయుధములను పారవేసి పోవుచుండిరి. త్రోవలో కనబడిన తురుష్కగ్రామములనెల్ల తగులబెట్టుచుండిరి. ఇటుల గ్రీకులు పారిపోవుచుండుటయు, తురుష్కజాతీయ సైన్యములు వారిని వెంటనంటి తరుముచుండుటయు జరిగెను. తుదకు సెప్టెంబరు నెల 9వ తేదీన విజయవంతులగు తురుష్కజాతీయవాదులు స్మర్నాపట్టణమును పట్టుకొనిరి. అచటి గ్రీకుసేనలన్నియు చెల్లాచెదరై పారిపోయెను. తురుష్కులు స్మర్నాపట్టణమును స్వాధీనమును పొందిరి. అన్నివైపులనుండియు తురుష్కసేనలు స్మర్నాలో ప్రవేశించెను. ఆ చుట్టుపట్టు ప్రాంతమంతయు తురుష్కులకు మరల లోబడెను. ఒక్క గ్రీకుసైనికుడైన లేకుండ గ్రీకుసేనలన్నియు పూర్తిగ ఆశియాఖండమునుండి తరుమగొట్టబడినవి.

## స్మర్నా తగులబడుట

గ్రీకులు స్మర్నాను వదలిపెట్టిపోవుచున్నరోజులలో స్మర్నాలోని ఆర్మీనియనులు కాపురమున్న భాగమంతయు తగులబెట్టబడి వారముదినములు కాలెను. గ్రీకులో గ్రీకులతో చేరియున్న ఆర్మీనియనులో ప్రపంచము

యొక్క సానుభూతిని పొందుటకై తగులబెట్టిపోయిరని నమ్ముచున్న ఆంగ్ల ఫ్రెంచియధికారులు కొందరు గలరు. తురుష్కులే తగులబెట్టి కసితీర్చికొని రని మరికొందరు తలచుచున్నారు. తురుష్క-జాతీయసేనానులు తగులబెట్టుట, స్త్రీలను అవమానపరచుట మొదలగు హేయకృత్యములను చేయకూడదని తురుష్కసైనికులకు కఠినమగు ముత్తరువులనుచేసిరని మాత్రము అందరు నొప్పుకొనుచున్నారు. గ్రీకులు తురుష్కులనుండి తప్పించుకొనిపారిపోవు టలో మిత్రమండలియధికారులసహాయము పొందిరి.

## ముస్తఫా కెమాల్ స్మర్నాలో ప్రవేశించుట

తరువాత కొలదిదినములలో ఘాజీ ముస్తఫా కెమాల్‌పాషా స్వయముగ స్మర్నాకు వెళ్ళెను. స్మర్నాలో విజయోత్సవములు జరిగెను.

(4)

## చానకువద్ద నాంగ్లేయు లడ్డుతగులుట

గ్రీకుసేనలు ఆశియాఖండమును వదలిపోయి త్రేసులో విడసెను. గ్రీకులను త్రేసునుండి లేచిపొమ్మని ముస్తఫా కెమాల్ కోరెను. వారు పోవుటకు నిరాకరించిరి. త్రేసు తురుష్క-దేశములోనిభాగము. జాతీయ సమాఖ్యప్రకారము తురుష్కములో భాగముగనుండి తురుష్క-ప్రభుత్వము క్రింద నుండవలెను. సెవర్సుసంధిప్రకారము త్రేసు గ్రీకుల కివ్వబడెను. సెవర్సుసంధిని తా నంగీకరించననియు, తమదైన త్రేసులోనుండి గ్రీకులను వెడలగొట్టదలచినాననియు ముస్తఫా కెమాల్ ప్రకటించి, జలసంధినిదాటించి త్రేసులో ప్రవేశించుటకు తన సైన్యములను జలసంధివద్ద చేర్చెను. అచట చానకువద్ద బ్రిటిషువారు జలసంధిని దాటకుండ తురుష్క-జాతీయసైన్యముల కడ్డును కలుగజేసిరి. గ్రీకు తురుష్క-యుద్ధములో తటస్థులుగ నుందుమని మిత్రమండలివారు ప్రకటించినపుడు డార్డనల్సు, బాస్ఫరసు జలసంధులతీర మంతయు తటస్థప్రదేశముగ నిర్ణయించి, అపటికి గ్రీకుసేనలనుగాని తురుష్క-సేనలనుగాని రానివ్వకుండుటకు తీర్మానించిరి. కావున నాప్రదేశ మును దాటి త్రేసులోకి పోనివ్వమని ఆంగ్లేయులు ముస్తఫా కెమాల్‌సైన్యముల నటకాయించిరి. ఈ ప్రదేశముకూడ తమదేననియు దీనినిదాటి తమ

త్రేసులోనున్న శత్రువులను వెడలగొట్టుటకు తమకు హక్కుకలదనియు ముస్తఫా కెమాల్ చెప్పెను. ఆంగ్లేయులను లక్ష్యముచేయక ఇస్మిదులో విశేషముగ తురుష్కులు సైన్యములను తెచ్చియుంచిరి. చానకువద్ద హారింగ్టన్ సేనానిక్రింద మిత్రమండలిసేనలు చేర్చబడెను. సెప్టెంబరు 10 మొదలు 13వ తేదీవరకు మిత్రమండలికిని తురుష్క జాతీయవాదులకును మరల యుద్ధము ప్రారంభమగుసూచనలు కనబడెను.

## ఫ్రెంచివారు చానకునుండి వెడలిపోవుట

కాని సెప్టెంబరు 13వ తేదీన ఫ్రెంచిమంత్రివర్గమువారు పారిసులో సమావేశమై తురుష్కులతో యుద్ధముచేయకుండుటకును, పరాసుసేనలను చానకునుండి తీసివేయుటకును తీర్మానించిరి. ఆంగ్లప్రధానమంత్రి సెప్టెంబరు 16వ తేదీన తురుష్కులతో యుద్ధముచేయుటకు సహాయముచేయవలసినదని బ్రిటిషువలసరాజ్యములప్రభుత్వములను, బాల్కన్‌రాష్ట్రములను కోరెను. ఫ్రాన్సు, ఇటలీప్రభుత్వములకును వ్రాసెను. గాని సెప్టెంబరు 19వ తేదీన ఫ్రెంచి ప్రధానమంత్రియగు పాయింకేరు తురుష్కమునకు వ్యతిరేకముగ నాంగ్లేయులతో చేరుటకు ఫ్రెంచివారికి యిష్టములేదనియు, ఆంగ్లేయులు కూడ తురుష్కుల కడ్డముగ చానకులోనుంచిన సైన్యములను తీసివేయవలసినదనియు నాంగ్లప్రభుత్వమునకు బదులువ్రాసెను. వెంటనే ఫ్రెంచి, ఇటలీ సైన్యములు చానకునుండి తీసివేయబడెను.

## ఆంగ్లేయులొక్కరే మిగిలిరి

ఆంగ్లేయులొక్కరే తురుష్కులనడగించుటకు చానకులో మిగిలిరి. ఆంగ్లేయప్రధానమంత్రి లాయడుజార్జియు, విదేశాంగమంత్రి కర్జనుప్రభువును ఇంకను ఎక్కుడుగ నాంగ్లేయసేనలను, ఆంగ్లేయనావికాదళమును చానకు వద్ద చేర్పించిరి. తురుష్కసేనలు తమ కతిసమీపముననున్నవనియు, ఏదైన ఘోరాటము జరిగినచో తురుష్కులే బాధ్యతవహించవలెననియు, తురుష్క సేనల్లను దూరముగతీసికొనిపోవలసినదనియు ముస్తఫా కెమాల్‌కు తెలిపిరి. గాని ముస్తఫా కెమాల్ బెదరలేదు.

## మాంటేగుమంత్రి రాజీనామాయిచ్చెను

అదివరకే హిందూదేశములోనియాందోళనాఫలితముగ హిందూదేశ ప్రభుత్వమువారును హిందూదేశమంత్రియగు మాంటేగుగారును ఆంగ్ల ప్రభుత్వమువారు సెవర్సుసంధిని పూర్తిగ మార్చి స్మర్నాను, త్రేసును తురుష్కమున కివ్వవలెనని ఆంగ్లేయప్రభుత్వమునకు వ్రాసిరనియు, ఇందుకు ప్రధానమంత్రియగు లాయడుజార్జియు, విదేశాంగమంత్రి కర్జనుప్రభువును ఒప్పుకొననందున హిందూదేశమంత్రి మాంటేగు మార్చినెల 9 వ తేదీననే రాజీనామానిచ్చియుండెననియు పైన తెల్పియున్నాము.

## అంగోరాప్రభుత్వపు బలమైనస్థితి

"ఆత్రతపడుచున్న తురుష్కసైనికులు గ్రీకులు వదలిపెట్టిపోయిన విశేషమగు ఆయుధసామగ్రియొక్కసహాయమున సమీపప్రాగ్దేశములలో గొప్ప యుద్ధము సంభవించునటుల చేతురేమోననుభయము కలిగెను. కాకసుమీదగాని, సిరియా, పాలస్తైనులమీదగాని పడుటకును, లేక ఇరాకు, ఆఫ్ఘనిస్థానములగుండ హిందూదేశముమీదికి పోవుటకును బెదరించగల స్థితిలో ముస్తఫా కెమాల్‌పాషా అపుడుండెను. ఈ సైనికదండయాత్రలలో నాయనకు సోవియటుప్రజాస్వామ్యములనుండియు, తూర్పున మహమ్మదీయ దేశములనుండియు సహాయము రావచ్చును. చరిత్రలో మరియేకాలమందును యావత్తు మహమ్మదీయప్రపంచముయొక్కదృష్టిలో తురుష్క మెక్కువ గౌరవము పొందియుండలేదు." అని 'నవీనతురుష్కము'లో మీయర్సు వ్రాసియున్నాడు.

## ముడేనియా తాత్కాలపుసంధి

ఈపరిస్థితులలో నాంగ్లేయులొక్కరే తురుష్కముతో యుద్ధము చేయుట కిష్టములేక ముస్తఫా కెమాల్‌తో సంధిరాయబారములు జరుపుటకు ఆంగ్లేయసేనాని హారింగ్టనుకు అధికారమిచ్చిరి. ముస్తఫా కెమాల్‌కును ఫ్రెంచివారికిని వెనుక సంధిని కుదిర్చిన ఫ్రాంక్లిను బొయిలనును మరల ముస్తఫా కెమాల్ కడకు మిత్రమండలిపక్షమున పంపిరి. తురుష్కులపక్ష

మున ఇజ్మతు పాషా సంధిరాయబారములలో పాల్గొనెను. 1922 వ సంవత్సరము అక్టోబరునెల 3 వ తేదీన ముడేనియాలో తాత్కాలికపుసంధిసమావేశము ప్రారంభమయ్యెను. తురుష్కజాతీయసమాఖ్యప్రకారమే మరిట్సానదివరకుగల యావత్తు థ్రేసును గ్రీకులు వదలిపోవుటకును, అది తురుష్కులరాజ్యములో చేరుటకును సమ్మతించిరి.

తురుష్కులకును గ్రీకులకును అక్టోబరు 14 వ తేదీన తాత్కాలికపు సంధి జరిగి, యుభయపక్షములవారును సంతకములుచేసిరి. వెంటనే గ్రీకులు థ్రేసును వదలిపోయిరి. అంగోరాప్రభుత్వమువారు థ్రేసును స్వాధీనము పొంది యచట తమపాలనమును స్థాపించుకొనిరి. రేఫెతుపాషాను గవర్నరుగ నియమించిరి. గ్రీకులతో యుద్ధము ముగిసెను. రాజకీయఖైదీలందరును విడుదలచేయబడిరి. తురుష్కజాతీయప్రభుత్వముయొక్క యభీష్టము నెరవేరినది.

## లాయడుజార్జి రాజీనామానిచ్చెను

తన ప్రాగ్దేశములరాజనీతి విఫలమైనదని ఆంగ్లేయప్రధానమంత్రి లాయడుజార్జి అక్టోబరు 19 వ తేదీన మంత్రిత్వమునకు రాజీనామానిచ్చెను. ఈయనరాజనీతి తురుష్కమును నాశనముచేయలేకపోగా, నొక బలమైన తురుష్కజాతిని జనింపజేసినది. వెంటనే ఆంగ్లదేశమందు పార్లమెంటు కెన్నికలు జరిగెను. సమ్మేళనమంత్రివర్గము ( Coalition Ministry ) విచ్ఛిన్నమయ్యెను. కన్సర్వేటివ్ మంత్రివర్గ మేర్పడెను. బోనరులా ప్రధానమంత్రి యయ్యెను. కర్జనుప్రభువు విదేశాంగమంత్రిగ నుండెను.



# తురుష్క ప్రజాస్వామికము

## 10 స్వతంత్రస్థాపనము

### (1)

### సంధియేర్పాటులు

ముడేనియాసంధివలన తాత్కాలికముగనే శాంతి కుదిరినది. తురుష్క వ్యవహారములు శాశ్వతముగ పరిష్కరింపవలసియున్నవి. సుల్తానుయొక్క ప్రభుత్వము కూలిపోయినది. తురుష్కదేశవ్యవహారములను నడుపుచున్న అంగోరాప్రభుత్వము మిత్రమండలివారు సుల్తానుతో చేసికొన్న సెవర్సు సంధిని తీవ్రముగ నెదిరించుచున్నది. సుల్తానువలన మిత్రమండలి కిక ప్రయోజనము లేదు. అంగోరాప్రభుత్వముతో రాజీచేసికొనినగాని తురుష్కములోనే గాక మాండేటరీ దేశములలోకూడ శాంతి స్థాపింపబడనేరదు.

### సుల్తాను దేశభ్రష్టుఁడగుట

మిత్రమండలివారు 1922 వ సంవత్సరము నవంబరునెలలో లాసేను పట్టణమం దొక సంధిసమావేశమును ఏర్పాటుచేసిరి. అక్టోబరు 27వ తేదీన కాన్‌స్టాంటినోపిలులోని సుల్తానునకును, అంగోరాలోని జాతీయప్రభుత్వము నకును లాసేనునకు ప్రతినిధులను పంపవలసినదిగా ఆహ్వానముల నంపిరి. అందులకు అంగోరాప్రభుత్వమువారు వెంటనే తమ అసమ్మతిని తెలిపిరి. సుల్తానుయొక్క ప్రభుత్వము 1920 మార్చినెల 16వ తేదీనుండియే అంతరించి నదనియు, తురుష్కదేశముపై రాజరికముపోయి అంగోరాలో ప్రజాస్వామికము స్థాపింపబడినదనియు, సుల్తానుయొక్క ప్రభుత్వము నింకను అంగీకరించినచో తాము లాసేను సంధిసమావేశమునకు ప్రతినిధులను పంపజాల

మరియు అంగోరాప్రభుత్వమువారు ఖండితముగా బదులువ్రాసిరి. ఇంతేగాక, కాన్‌స్టాంటినోపిలులో సుల్తానుండుటయు, మిత్రమండలివా రాతని అధికారము సంగీకరించుచుండుటయు, ప్రజాస్వామికమున కపాయకరమని యెంచి, అంగోరాపార్లమెంటువారు నవంబరు 1వ తేదీన సుల్తానుమీదను, ఆయనమంత్రులమీదను దేశద్రోహనేరము మోపి విచారణ ప్రారంభించిరి. సుల్తాను విచారణకు వచ్చుటకును, సింహాసనమును త్యజించుటకును కూడ నిరాకరించెను. ఆయనయొద్దనున్న మంత్రులందఱును నవంబరు 4 వ తేదీన రాజీనామాలనిచ్చిరి. సుల్తాను తన ప్రాణమున కపాయమువాటిల్లునని బ్రిటిషువారిసంరక్షణము కోరెను. బ్రిటిషు సేనాని అందులకు వ్రాసె, ఆయనను మాల్టాకు సురక్షితముగా పంపుట కేర్పాటుచేసెను. అటుపిమ్మట మాల్టానుండి యతఁ డెచటికైన పోయి, నివాసమేర్పరచుకొనవచ్చును. నవంబరునెల 17 వ తేదీ ఉదయమున ఆరవ మహమ్మదుచక్రవర్తి వహీదెద్దీన్ సుల్తాను ఖలీఫా పదిసంవత్సరములవయసు గల తన కుమారుని, ఇరుగురు జనానాస్త్రీలను వెంటబెట్టుకొని, రహస్యముగ దొడ్డిత్రోవను తన రాచనగరును వదలి, మోటారుకారులోపోయి బ్రిటిషువారి నౌకయగు మలయాను ఎక్కెను. బ్రిటిషువారియోడలో నెక్కగనే ఆతనిని బ్రిటిషుచక్రవర్తిపక్షమున నాహ్వానించిరి. తాను బ్రిటిషువారిసంరక్షణలో సురక్షితముగ నున్నాననియు, అపాయమునుండి తప్పించుకొనుచున్నానే గాని, సింహాసనమును త్యజింపలేదనియు నాతఁడు చెప్పెను. ఆతఁడెక్కిన పొగయోడ తురుష్కమును వదలిపోయెను. ఆ సందర్భమునుగూర్చి రెనిన్ అను తురుష్కపత్రిక "ఉస్మాన్‌చే స్థాపింపబడిన అట్టోమాన్ రాజవంశము ముప్పదిఆరుగురు సుల్తానుల నిచ్చినది. వారిలో గొప్పవారు, పేరు ప్రతిష్టలు లేనివారు, మంచివారు, చెడ్డవారు కూడ గలరు. కాని తనపూర్వులగోరీలను వదలి స్వదేశమునుండి విదేశములకు పారిపోయిన వహీదెద్దీన్‌వంటివారు వారిలో లేరు" అని వ్రాసెను.

## నూతనఖలీఫాఎన్నిక

సుల్తానుఖలీఫా కాన్‌స్టాంటినోపిలును వదలి పారిపోయినాడనువార్త నవంబరు 17 వ తేదీననే అంగోరాపట్టణమున తెలిసెను. మరునాడు

అంగోరాలో తురుష్క-ప్రజాప్రతినిధిసభ రహస్యసమావేశములను జరిపెను. 19 వ తేదీని బహిరంగసమావేశము జరిగెను. అందులో సుల్తానును తీసి వేసినట్టుల ప్రకటనమును గావించిరి. ఖలీఫా మహమ్మదీయులకు నాయకుడై యుండియు మహమ్మదీయులకు నాశనకరమైనసహరయులను శత్రువులనుండి అంగీకరించినందువలనను, మహమ్మదీయహక్కులను సంరక్షించుటకు బొత్తిగా అసమర్థుడగుటవలనను, ముసల్మానులు స్వతంత్రముకొరకును జన్మహక్కులకొరకు పవిత్రమైనపోరును సలుపుచుండ నాతడు ముసల్మానుల శత్రువులతో చేరినందువలనను, విదేశీయులసంరక్షణలోచేరి ఖిలాఫతుయొక్క స్థానమును విడిచి పారిపోయినందునను, ఖురానుప్రకార మతడు స్థానభ్రష్టత కష్టుడైయున్నాడని అతనిని తీసివేసినట్టుల ఆ ప్రకటనమున గలదు. మహమ్మదీయులహక్కులను లాభములను సంరక్షించుటకుగాను తగినవారిని ఖిలాఫతుస్థానమున నెన్నుకొనవలయుననియు తీర్మానించిరి. సుల్తాను పదవిని, ఖిలాఫతుపదవిని ఇదివరకే 1921 సంవత్సరము జనవరిలోనే వేరు చేసి, రాజకీయపదవియగు సుల్తానుపదవిని రద్దుపరచియుండిరి. తురుష్కమునకు రాజరికము పోయి, ప్రజాస్వామిక మేర్పడియుండెను. ఇపుడు వహిదెద్దీనును ఖిలాఫతు పదవినుండికూడ మతగ్రంథములప్రకారము తొల గించి, యా పదవికిమాత్రము ఒకప్పుడు సుల్తానుగనున్న అజీజుయొక్క రెండవకుమారుడగు అబ్దుల్ మెజీదు ఎఫెండీ యనునాతనిని ఖలీఫాగ నెన్ను కొనిరి. ఈ నూతన ఖలీఫా యోగ్యుడు; జాతీయోద్యమముతో సానుభూతి గలవాడు. ఈతడు ఖిలాపతునధిష్టించినతరుణమున వెనుకటివలె అరబ్బీలో గాక తురుష్కులమాతృభాషయగు తురుష్కముననే ప్రార్థనలు జరిపిరి. హిందూదేశములోకూడ ఢిల్లీనగరముననున్న జుమ్మామసీదునందును, ఇతర మసీదులందును క్రొత్తఖలీఫాపేరునను, ముస్తఫా కెమాల్ పాషాయొక్క జయములకొరకును భారతీయముసల్మానులు ప్రత్యేకప్రార్థనలు సలిపిరి. ఇంతటినుండి అంగోరాజాతీయప్రభుత్వమొక్కటియే జాతికంతకును ప్రభుత్వమయ్యెను.

## (2)

## లాసేన్‌సంధిసమావేశము

1922 వ సంవత్సరము నవంబరు 20 వ తేదీన లాసేనులో సంధి సమావేశము ప్రారంభమయ్యెను. మిత్రమండలిప్రతినిధులును, తురుష్క దేశపక్షమున అంగోరాప్రభుత్వప్రతినిధులును, గ్రీకుప్రతినిధులును సమావేశమయిరి. లాయిడుజార్జియొక్క సమ్మేళన (Coalition)మంత్రివర్గములోను, బోనరులాయొక్క కన్సర్వేటివ్‌మంత్రివర్గములోను ఆంగ్లేయవిదేశవ్యవహార మంత్రిగనున్న కర్జన్‌ప్రభువు మిత్రమండలిపక్షమున మాటలాడెను. అంగోరాలో విదేశాంగమంత్రిగనున్న ఇజ్మతుపాషా తురుష్కపక్షమున వాదించెను. గ్రీకు తురుష్కులమధ్య తగాదాలేగాక, మిత్రమండలికిని, తురుష్కులకునుగల తగాదాలన్నియు నీ సమావేశమునందు పరిష్కరించుటకు బూనుకొనిరి. సమావేశప్రారంభమునందే తురుష్కప్రతినిధు లచట సమావేశమయిన యితర దేశములప్రతినిధులతో సమానగౌరవప్రతిపత్తి కలిగియే యందు పాల్గొనుచున్నారని ఇజ్మతుపాషా చెప్పెను. తురుష్కజాతి మిత్రమండలిదేశములతో సమానస్థితి కలిగియున్నదనియే ముందుగా నిరూపించెను. జరగవలసిన రాజీలు సమానజాతులమధ్య జరగవలసియున్నది. అంతేగాని, బలవంతమైనజాతి యింకొక నిస్సహాయజాతికి వరములను, రాజకీయహక్కులను ప్రసాదించుట కాదు. ఆశియాఖండవాసులును మహమ్మదీయులును నగు తురుష్కులు యూరపుఖండవాసులును క్రైస్తవులును నగు మిత్రమండలి వారితో సమానగౌరవముగలవారని అంగీకరించినగాని ఇజ్మతుపాషా సంధి రాయబారమునకు గడంగుటకు పూనుకొనలేదు. ఇజ్మతుపాషాప్రతిపాదనము అందరుప్రతినిధులవల్లను అంగీకరింపబడెను. తురుష్కము ప్రపంచములోని ప్రధాన స్వతంత్రజాతులన్నిటితోబాటు సమానగౌరవార్హమని యంగీకరింపబడెను. 1905 వ సంవత్సరమున ప్రధాన యూరపుప్రభుత్వములలో నొకటగు రష్యాసామ్రాజ్యమును పూర్తిగ నోడించి, తన స్వతంత్రమును నిల్పుకొని, ఆసియాఖండములో తూర్పుననున్న బౌద్ధదేశమగు జపాను పాశ్చాత్యజాతులతో సమానగౌరవముగల స్థానమును పొందినది. ఇపుడు 1922 వ సంవత్సరమున ఆశియాఖండములో పశ్చిమమునయనున్న మహమ్మదీయ

దేశమగు తురుష్కము యూరపుప్రభుత్వములబాడినుండి తనస్వతంత్రమును నిలువబెట్టుకొని పాశ్చాత్యజాతులతో సమానమగుగౌరవమును, స్థానమును పొందెను. సుప్రసిద్ధ చరిత్రకారుడగు హెచ్. జి. వెల్సు వ్రాసినటుల "ఈ రెండు జాతులును (జపాను, తురుష్కములు) తెల్లవానిబరువు (White man's burden)లోనుండి తొలగిపోయినవి."

## ఇజ్మత్‌పాషా

సంధిసమావేశము మూడునెలలు వరుసగ జరిగినది. తురుష్కప్రతినిధులు తమ జాతీయసమాఖ్యలోని సూత్రములను నిలుపబెట్టుకొనుటకు మిగుల పట్టుదలనుచూపిరి. మిత్రమండలికి మరియొకయుద్ధములో ప్రవేశించుట కిష్టములేకపోయినప్పటికిని యుద్ధమువలన తాము సంపాదించినహక్కులను వీలయినంతవరకు నిలువబెట్టుకొనుటకై పెనుగులాడిరి. సమావేశకాలములో "సామ్రాజ్యతత్త్వము వ్యాపారతత్త్వము లొకప్రక్కను, జాతీయతత్త్వము మరియొకప్రక్కను గుంజులాడినవి. ప్రారంభమున కర్జనుప్రభువు తన దర్పమును కనపరచుచు, బడిపిల్లలను ఉపాధ్యాయుడదలించినటుల అదలించుచుండెను. ప్రాగ్దేశముల నాతడు బాగుగ నెరిగినవాడు కాని, ప్రాతదినములలో నాత డా దేశములను చూచెనే గాని, యచట జాతీయభావములు బాగుగ వ్యాపించినతరువాత చూచియుండలేదు. నవీన మహమ్మదీయజాతీయవాది యెటుల ప్రవర్తించునో ఆతనికి తెలియదు. ముస్తఫా కెమాల్‌పాషాకు కుడిభుజము, గొప్ప సైనికయోధుడు, మాటలలో మిగుల చతురతగలవాడు, దిట్టమయిన ఆలోచనగల పొట్టివాడునగు ఇజ్మత్‌పాషాయే సమావేశమునం దెక్కువగ ప్రకాశించెను. యుద్ధమునందువలె చతురంగపుటెత్తును శాంతియందుకూడ వేయగల నిపుణుడు. ఆయనకు కొంచెముగ గల చెవుడు ఎప్పుడును ఆయనకే సహాయకారిగనుండెను. ఆయన మిత్రమండలివారిలో ననేకపర్యాయములు భేదాభిప్రాయములను కలిగించుచుండెను. మిత్రమండలివారికి ధర్మ మేదో అధర్మ మేదో, ఏది కాంక్షింపవలెనో ఏది వదలవలెనో భావములలోను కోరికలలోను కల్లోలము కలుగుచుండెను. ఇజ్మతుపాషాకు గమ్యస్థానము సూటిగను విస్పష్టముగను చూపట్టుచుండెను. జాతీయసమాఖ్యలోనియొక్క అక్షరమైనను వదలకుండ నాయన వాదించుచుండెను.



ఎన్వర్ పాషా

## రాజీ కుదరలేదు

1923 ఫిబ్రవరి 4 వ తేదీన యెట్టి రాజీ కుదరకుండగనే లాసేను సమావేశము ముగిసెను. "మిత్రమండలిప్రతినిధులు వేరువేరుగ తురుష్కముతో చర్చించుట కొప్పుకొనరు. ఆఖరుషరతులు తయారుచేసినాము. వీటిని గూర్చి పెనగులాడిగాని, అలస్యముచేసిగాని ప్రయోజనములేదు. ఇందులో యెట్టిమార్పులు చేయజాలము." అని కర్జన్‌ప్రభువు తురుష్కప్రతినిధులకు అంత్యసందేశము నిచ్చెను. వానికి ఇజ్మత్‌పాషా యొప్పుకొనలేదు. తురుష్కముయొక్క న్యాయమైన జన్మహక్కులలో వేటిని వదలుకొనుట కాతఁ డంగీకరింపలేదు. సంధిసమావేశము చెడిపోయినది. కర్జన్‌ప్రభువు ఇంగ్లాండునకును, ఇజ్మత్‌పాషా తురుష్కమునకును పయనమైరి.

(3)

## ఛెష్టరు సౌకర్యములు

ముదేనియా తాత్కాలికసంధిషరతులప్రకారమే అందరు కక్షిదారులును నడచుచుండిరి. మిత్రమండలివారు తయారుచేసిన సంధిషరతులకు అంగోరాప్రభుత్వమువా రొప్పుకొనలేదు. కాని మరల రాజీప్రయత్నములు జరుపవలెనని మాత్రము తీర్మానించిరి. ఫ్రెంచి, ఇటలీ ప్రభుత్వములవారు తురుష్కమునందు సానుభూతిని కలిగియేయుండిరి. వర్సైల్సుసంధివలన జర్మనులమీదవేయబడిన నష్టపరిహారమును వారు చెల్లింపనందున రూరు రాష్ట్రమును ఫ్రెంచివారు ఆక్రమించుటయు, జర్మనులు ఫ్రెంచివారిపై సాత్వికనిరోధము జరుపుటయు జరిగెనని చెప్పియున్నాము. ఆవిషయమున ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని అభిప్రాయభేదములు కలిగినవి. అమెరికా సంయుక్తరాష్ట్రములను తమప్రక్కన చేర్చుకొనవలెనని అంగోరాప్రభుత్వము వారు ఏప్రిల్ 9 వ తేదీన ఛెష్టరు సౌకర్యములని పిలువబడు కొన్ని వర్తక సౌకర్యములను అమెరికావర్తకులకు తురుష్కమునందు కలుగజేసిరి. ఫ్రెంచివారిని బెదరించుటకై సిరియాకు సరిహద్దున విశేషముగ సైన్యములను గొనివచ్చిరి. ఇటుల నయమున, అటుల భయమున తురుష్కజాతీయనాగులు ప్రయత్నములుసేయగ, మరల లాసేనులో ఏప్రిలు 23 వ తేదీన

సంధిసమావేశము సమకూర్చబడెను. "మేము తొందరపడి ఘెష్టరుసౌకర్యము లను కలుగజేసినాము. దీనివలన అమెరికా మా పక్షమునకు వచ్చునని మేము తలచితిమిగాని, అమెరికా మా కాశాభంగముకలుగజేసినది. ఘెష్టరుసౌకర్యము లను మేము కలుగజేయగనే ఇంగ్లాండు ఫ్రాన్సులు సంధి కనేక యడ్డంకు లను గలుగజేసినవి. సంధిజరుగకమున్నే ఘెష్టరుసౌకర్యముల నీయకపోయి నచో లాసేనులో మాకు కలిగిన కష్టములలో నూటికి తొంబదిపాళ్ళు కలుగ కుండెడివి." అని కాన్‌స్టాంటినోపిలులోని తెవిహీద్ యఫ్. కార్ పత్రిక వ్రాసెను.

## లాసేను ద్వితీయసంధిసమావేశము

ద్వితీయసంధిసమావేశము లాసేనునందు ఏప్రిలు 23 మొదలు జూలై 24 వ వరకును జరిగినది. ఆంగ్లపక్షమున కర్జనుప్రభువును పంపలేదు. సర్ హోరేసు.రంబల్డు వచ్చెను. తురుష్కపక్షమున యథాప్రకారము ఇజ్మత్‌పాషా వచ్చెను. మిత్రమండలిపక్షమున నీ పర్యాయము ఇటలీప్రతినిధియగు యమ్. మాంటేగ్ రాయబారములు నడిపెను. మిత్రమండలివారు అంత్యసందేశములో నిచ్చిన నూటఅరవై షరతులలో తొంబదిరెండుషరతులు మరల చర్చించ బడెను. ఇజ్మత్‌పాషా జాతీయసమాఖ్యలోనిహక్కులనెల్ల నిలుపబెట్టుకొను టకు గట్టిగ ప్రయత్నించెను. ఆయనకు వెనుక బలముగ ముస్తఫా కెమాల్ పాషా, అంగోరాపార్లమెంటు, తురుష్కజాతి యేకముగ నిలచియుండిరి. మిత్రమండలివారు వీలయినంతవరకు ఎవరిలాభములను వారు చూచుకొనిరి. రాజ్యపుసరిహద్దులు, విదేశీయులప్రత్యేకహక్కులు, జాతీయరుణములు, ఇతర జాతీయవిషయములు అన్నియు దాదాపుగ తురుష్కజాతీయసమాఖ్య ప్రకారమే పరిష్కరించబడెను. జులై 24 వ తేదీన లాసేనుసంధి యందరు కక్షిదారులవల్లను అంగీకరించబడి సంతకములుచేయబడెను. దానితోపాటు అనేకవిషయములనుగూర్చి పదునెనిమిదియొడంబడికలు, ఆరు ఉత్తరములు సంతకములుచేయబడెను. వాటిలో ముఖ్యమయినవి, జలసంధులగుండ స్వేచ్ఛావ్యాపారము, త్రేసుయొక్కసరిహద్దులనిర్ణయము, తురుష్కములో విదేశస్తులు కాపురముండుటకు, వర్తకముచేసికొనుటకు షరతులు, గ్రీకు తురుష్కప్రజలు తమ తమ దేశములలోనికి లేచిపోవుటనుగూర్చినవై

యున్నవి. లాసేనుసంధిలో ముఖ్యమైనవిషయములు:తురుష్కదేశసరిహద్దుల నిర్ణయము; తురుష్కజాతీయఋణవిభాజ్యము; విదేశస్థులప్రత్యేకహక్కులు, మతసంఘముల న్యాయవిచారణహక్కులు రద్దుపడుట; చిన్నసంఘముల సంరక్షణ; గ్రీకులు తురుష్కులు ఎవరిదేశములలోనికి వారు లేచిపోవుట అయియున్నవి.

## సంధి ఖాయపడెను

ఈ సంధి ఆగష్టు 23 వ తేదీన అంగోరాపార్లమెంటుచేతను, 1924 సంవత్సరము ఏప్రిల్ 15 వ తేదీన ఆంగ్లేయపార్లమెంటుచేతను, ఈలోపున తక్కిన అన్ని యితర ప్రభుత్వములచేతను ఖాయపటుపబడినది. ఈ సంధి వలన తురుష్కజాతీయమైక్యత, స్వతంత్రము శాశ్వతముగ నిలచినవి. ముస్తఫా కెమాల్‌పాషా మొదలగు తురుష్కజాతీయవాదులఆశయములు నెరవేరినవి.

## సంధిషరతులు

లాసేనుసంధివలన తురుష్కము సామ్రాజ్యమును శాశ్వతముగను పూర్తిగను వదలుకొనెను. తురుష్కముక్రింద నుండినట్టియు, మాండేటు లుగ మిత్రమండలివారిచే తీసికొనబడినట్టియు అరబుదేశములన్నిటిమీదను రాజ్యహక్కులను తురుష్కము వదలుకొనెను. తురుష్కదేశము స్వతంత్ర ముగ తురుష్కులకు దక్కెను. వారిమాతృదేశమగు అనటోలియాదేశ మంతయును యూరపుఖండమునందు కాన్‌స్టాంటినోపిలు, ఏడ్రియానోపిలు, తూర్పుత్రేసుప్రాంతములును తురుష్కులక్రింద స్వతంత్రజాతియయ్యెను. తురుష్కమునకును, పశ్చిమముననున్న గ్రీసునకును మధ్య మరిట్సానది సరిహద్దుగ నిర్ణయింపబడెను. తురుష్కమునకు గ్రీసు కలుగజేసిన నష్టము క్రింద మరిట్సానదిమీదనున్న వంతెనకూడా తురుష్కముక్రింద చేర్చబడెను. సెవర్సుసంధిలోవలె ప్రత్యేకకుర్దిస్థాను, ఆర్మినీయారాజ్యము లుండవు. కుర్దులు, ఆర్మీనియనులు కాపురమున్నప్రాంతములుగూడ తురుష్కములో చేర్చబడినవి. తురుష్కమునకును సిరియాకును మధ్య సరిహద్దు ఇదివరకు తురుష్కజాతీయవాదులకును ఫ్రెంచివారికిని 1921 వ సంవత్సరమున జరిగి

యున్న యొడంబడికప్రకారమే ఖాయపరుపబడెను. ఇందువలన సైలీషియా రాష్ట్రము తురుష్కములోనే చేరెను. మిత్రమండలిసేనలు వెంటనే తురుష్కమునువదలిపోవలెను. తురుష్కప్రభుత్వమును సడుప్పటమై సెవర్సుసంధిప్రకారము నియమింపబడవలసిన విదేశీయఆర్థికసంఘము రద్దుపర్చబడెను. తురుష్కమునకు అందువలన నేర్పడవలసినయార్థికదాస్యము నుండి విముక్తికలిగెను. తురుష్కప్రభుత్వము ప్రపంచములోని అన్ని స్వతంత్రదేశములప్రభుత్వములవలెనే సంపూర్ణమగుహక్కులను, అధికారములను చలాయించవలెను. కాన్‌స్టాంటినోపిలునగరమునకున్న దార్దనల్సు జలసంధి, మర్మరాసముద్రము, బాస్ఫరసుజలసంధులమీద రాజ్యాధికారము తురుష్కులకే ఖాయపరుపబడెను. యూరపుఖండమునుండి తురుష్కులను వెడలగొట్టవలెనని చిరకాలమునుండి యత్నించుచున్న రాజ్యాంగవేత్తల కోర్కెలు వ్యర్థములయ్యెను.

## సముద్రముల స్వేచ్ఛ

దార్దనల్సు, బాస్ఫరసుజలసంధులగుండను, మర్మరాసముద్రము గుండను యుద్ధకాలములోను, శాంతిసమయములోను అన్నిజాతులును మధ్యధరాసముద్రమునుండి నల్లసముద్రమునకు రాకపోకలుచేయుటకు అభ్యంతరపెట్టనని తురుష్కము అంగీకరించెను. గ్రీసుదేశము తా నక్రమముగ తురుష్కముమీద దండెత్తి తురుష్కమునకు నష్టముకలుగజేసితి ననియు, నష్టమంతయు తాను తురుష్కమున కీయవలసినబాధ్యతకలదనియు నొప్పుకొనెను. గ్రీసుదేశ మా నష్టపరిహారమీయతగిన యార్థికస్థితిలో లేనందున యౌదార్యముతో తురుష్కము నష్టపరిహారమును వదలుకొనెను.

## మోసలురాష్ట్రము

మోసలురాష్ట్రము తురుష్కములో చేరవలెనని తురుష్కులును, తమక్రింద మాండేటుగానున్న మెసపొటేమియాలో చేరవలెనని ఆంగ్లేయులును లాసేనుసంధిసమావేశమునందు పట్టుపట్టిరి. ఈ విషయమున అంగీకారము కుదరలేదు. మోసలులో మంచినూనెగనులు కలవు. ఒక్క

మోసలుకొరకు తక్కినరాజీయంతయు భగ్నమగుట సమంజసముకాదని యన్నిపక్షములవారును తలచి, మోసలువిషయము అంతర్జాతీయసమితివారి పంచాయతీప్రకారము తర్వాత నెమ్మదిమీఁద ఆంగ్లేయులును, తురుష్కులును నిర్ధారణచేసికొనునటుల వదలిపెట్టిరి. 1925 సంవత్సరమున అంతర్జాతీయ సమితివారొక యుపసంఘమును నియమించి, మోసలురాష్ట్రమునుగూర్చి విచారణచేయించిరి. మోసలురాష్ట్రములోని అత్యధికసంఖ్యాకులగుప్రజలు తురుష్కముతోనే చేరుటకు అభిలాషను కనపరచిరి. ఆ రాష్ట్రమునందు తురుష్కమునకు హక్కుకలదని యొప్పుకొనబడెను. గాని యుపసంఘము వారు ఆ రాష్ట్రప్రజలు ఆంగ్లేయులమాండేటరీపాలనముక్రింద కొంతకాల మున్నచో నెక్కువ యభివృద్ధిగాంతురని వ్రాసినందునను, ఆంగ్లేయులు మరి యొక ఇరువదియైదు సంవత్సరములవరకును మెసపొటేమియామీఁద మాండేటరీ పాలనముచేయుట కొప్పుకొనినందునను, అంతర్జాతీయసమితివారు మోసలురాష్ట్రమును మెసపొటేమియాదేశమునందు చేర్చుచు తీర్పునిచ్చిరి. ఇందుకు తురుష్కప్రభుత్వము ఖండితమగు అసమ్మతిని తెలియపరచెను. మోసలులోని నూనెగనులు ఆంగ్లేయవర్తకులచే మెసపొటేమియాప్రభుత్వము నుండి దీర్ఘకాలపు కౌళ్లు పొందబడి పనిచేయబడుచున్నవి.

## తురుష్క గ్రీకుదేశములు ప్రజలను మార్చుకొనుట

తురుష్కములోని గ్రీకులందరును గ్రీసుకు లేచిపోవలెననియు, గ్రీసులోనున్న తురుష్కులందరును తురుష్కమునకు రావలెననియు, మిత్ర మండలివారిప్రతినిధి లాసేనుసంధికాలమున ప్రతిపాదించగ, దానిని తురుష్క ప్రతినిధు లొప్పుకొనిరి. కాన్‌స్టాంటినోపిలులోనున్న గ్రీకులకుమాత్ర మీ షరతులు వర్తించవు. 1922 వ సంవత్సరమున గ్రీకులు యుద్ధములలో నోడిపోయి నపుడు నాల్గులక్షలమంది గ్రీకులు, ఆర్మీనియనులు కాన్‌స్టాంటినోపిలు నుండియు చుట్టుపట్లనుండియు గ్రీసునకును, ఆర్మీనియాప్రజాస్వామ్యమున కును లేచిపోయియుండిరి. ఇపుడు లాసేనుసంధివలన పదిలక్షలమంది గ్రీకులు అనటోలియానుండియు, త్రేసునుండియు లేచిపోయిరి. వారిస్థాన మున కొన్ని లక్షలమందితురుష్కులు తురుష్కమునకు లేచివచ్చిరి. ఎన్ని తరములనుండియో కాపురమున్నయిండ్లనువదలి, తీసికొనిపోగలిగినఆస్తిని

తీసికొని, మరియొకదేశమునకు బోవుటయు, నచట మరల నాస్తులను, గృహములను నేర్పాటుచేసికొనుటయు గ్రీకులకును తురుష్కులకును కూడ చాల కష్టమగువిషయమే. అయినను ఇకముందు కుట్రలు, యుద్ధములు జరుగకుండుటకై యిట్టి యేర్పాటులు చేసికొనిరి. గ్రీకులు నెమ్మదిగ లేచి పోవుటకును, వచ్చిన తురుష్కులకు వీలయినంత సహాయములు చేయుటకును తురుష్కప్రభుత్వమువారు చాల ధనసహాయమునుచేసిరి. ఇటులనే గ్రీకుప్రభుత్వమువారును చేసిరి. మరియు వదలిపెట్టిన ఆస్తులకు కిమ్మతులు కట్టి రెండవదేశములో నంత కిమ్మతుగల నాస్తులను వారి కిచ్చిరి.

## స్వతంత్రోత్సవములు

లాసేనుసంధివలన చిరకాలమునుండియు తురుష్కదేశములోనున్న మతసంఘములకుగల న్యాయవిచారణ మొదలగు హక్కులును, విదేశీయులు సుల్తానులవలన పొందియుండిన ప్రత్యేక వర్తక, రాజ్యాంగహక్కులును పూర్తిగ రద్దుపరచబడుటవలన జాతీయవాదులఆదర్శములు సఫలీకృతమయినవి. మిత్రమండలివారి యధికారము అంతరించినది. కొన్ని శతాబ్దముల నుండియు తురుష్కప్రజలను తురుష్కప్రభుత్వమును ఆవరించియున్న విదేశీయులయాధిక్యతయు, పలుకుబడియు రూపుమాసినవి. ఈ విషయములనుగూర్చి సవిస్తరముగ రాబోవుఅధ్యాయమునందు తెలిపెదము. లాసేను సంధిలో దాదాపుగ తురుష్కజాతీయవాదులు కోరినవాటికెల్లను మిత్రమండలివా రంగీకరించక తప్పినదికాదు. అపజయములనుపొంది భూపతనమైపోయిన యొకజాతి మరల పైకిలేచి ప్రపంచములోని మిగుల బలవంతులగు జాతులను ధిక్కరించి నిలచి, వారితో సమానమగుగౌరవమును, స్థితిని పొంది, ప్రపంచయుద్ధమునందు గెలిచిన గొప్పజాతులనుండి తన జాతీయ కోర్కెలనన్నిటిని బలవంతముగ లాగుకొనుట మానవచరిత్రలో నపూర్వమగు దృశ్యమైయున్నది. ధీరాగ్రేసరుడగు ముస్తఫా కెమాల్‌పాషా తన జాతిని గమ్యస్థానమునకు చేర్చెను. అక్టోబరునెల రెండవతేదీన మిత్రమండలివారిసేనలన్నియు శాంతముగ తురుష్కమును వదలిపోయెను. అక్టోబరునెల ఆరవతేదీన తురుష్కజాతీయసేన కాన్‌స్టాంటినోపిలులో ప్రవేశించెను. ఆ దినమున తురుష్కదేశమునం దంతటను స్వతంత్రోత్సవములును,

వేడుకలును జరిగినవి. స్వతంత్రమును ప్రసాదించినందుకు భగవంతునికి వందనములర్పించుచును, తమ నాయకుడైన ముస్తఫా కెమాలును దీవించుచును, మసీదులన్నిటిలోను ప్రార్థనలు జరిగెను.

## (4)

## సంపూర్ణ ప్రజాస్వామ్యము

1923 వ సంవత్సరము అక్టోబరు 22వ తేదీన నూతన తురుష్కపార్లమెంటువారు తురుష్కదేశప్రభుత్వ మింతటినుండియు ప్రజాస్వామికమయినదని మరల తీర్మానించి ప్రకటించిరి. 1921 వ సంవత్సరము జనవరి 20వ తేదీనఅంగోరాపార్లమెంటువారు తురుష్కముసంపూర్ణప్రజాస్వామికమైనదని ప్రకటించుట చదివియున్నాము. గాని యపుడు అంగోరాపార్లమెంటు సుల్తానుకు ప్రతికక్షిగ నున్నదేగాని, అప్రతిహతముగను న్యాయశాస్త్రప్రకారముగను దేశమునకంతకును పార్లమెంటు అయియుండలేదు. మరియు యుద్ధము జరుగుచుండెను. తురుష్కదేశములోని కొన్నిభాగములు విదేశీయులక్రింద నుండెను. ఇపుడు తురుష్కము ఐక్యతను స్వతంత్రమును పొంది, యా స్వతంత్రము ప్రపంచములోని యన్నిజాతులచేతను అంగీకరించబడినది. న్యాయశాస్త్రప్రకారము తురుష్కదేశములోని యన్నిభాగములనుండియు నెన్నికలుజరిగి ప్రజలచే నెన్నుకొనబడిన పార్లమెంటు తురుష్కచరిత్రలో ప్రథమపర్యాయము అంగోరాలో సమావేశమయినది. అందువలన నీ సరి అయినపార్లమెంటు తురుష్కముయొక్క రాజ్యాంగపద్ధతి సంపూర్ణప్రజాస్వామికమని తీర్మానించి ప్రకటించినది. ఇంతటితో శాశ్వతముగ తురుష్కము రాజరికములేని సంపూర్ణ ప్రజాస్వామికమయినది. ముస్తఫా కెమాల్ ఏకగ్రీవముగ నీ ప్రజాస్వామ్యమున కధ్యక్షుడుగ నెన్నుకొనబడెను.

## ముస్తఫా కెమాల్‌కు కాన్‌స్టాంటినోపిలులో స్వాగతము

తరువాత కొద్దికాలమునకు ముస్తఫా కెమాల్ పాషా కాన్‌స్టాంటినోపిలును దర్శించినపుడు సుల్తానులకు చిరకాలము రాజధానిగనున్న యా పట్టణము తురుష్కప్రజాప్రభుత్వాధ్యక్షునికి అపూర్వమగు స్వాగతమొసంగి

నది. రాజ్యభ్రష్టుడైన సుల్తానుయొక్క రాచనగరగుడో ల్మాబగ్చెయందే అధ్యక్షుడును విడిది నేర్పాటుచేసికొనెను. కాని కాన్‌స్టాంటినోపిలులోని అన్నితరగతులప్రజలతోను కలసిమెలసి సంచరించెను.

## రాజ్యాంగవిధానము

1924 వ సంవత్సరము ఏప్రియలు 20 వ తేదీన తురుష్క ప్రజాస్వామికముయొక్క రాజ్యాంగవిధానము తురుష్క ఎస్సెంబ్లీ చే మంజూరుచేయబడి తదాది యమలులోనున్నది. అందులో మొదటిసూత్రము "తురుష్క దేశ ప్రభుత్వము సంపూర్ణ ప్రజాస్వామికముగ నుండవలెను. ప్రభుత్వాధికారమంతయు దేశములో కాపురమున్న ప్రజలందరికిని చెందియున్నది" అని చెప్పబడినది. ఈ సూత్రము ఏకారణముచేతను ఎప్పుడును మార్చుటకెవరికిని అధికారములేదని వ్రాయబడినది. ఎన్నటికిని తురుష్కములో రాజరికము రాగూడదనియు, సంపూర్ణ ప్రజాస్వామికమే (Republic) నిలసిల్లవలెననియు తురుష్క జాతీయవాదుల నిశ్చితాభిప్రాయము. "తురుష్క దేశపు ప్రజాప్రతినిధిసభ అనగ ఎస్సెంబ్లీమాత్రమే (Grand National Assembly) తురుష్క జాతియొక్క శాస్త్రీయమైనప్రతినిధియై తురుష్కముయొక్క పాలనాధికారమంతయు జాతికిగాను వహించుచున్నది. తురుష్క ప్రభుత్వముయొక్క భాష తురుష్కము, కార్యస్థానము అంగోరాపట్టణము, మతము మహమ్మదీయమతము" అనిగూడ రాజ్యాంగవిధానములో చేర్చబడినది. దేశములో గొప్ప వ్యతిరేకపక్షము బయలుదేరునేమోనని జంకి, మతము మహమ్మదీయమతము అనుమాటలు మొదట చేర్చబడినను, కొంతకాలమైనపిమ్మట మతము మహమ్మదీయమతము అను సూత్రమును రాజ్యాంగవిధానమునుండి నేషనల్ ఎస్సెంబ్లీవారు తీసివేసి, ఏమతమునకును ప్రభుత్వమునకును సంబంధములేకుండ నుండవలెనను నవీనరాజ్యాంగసిద్ధాంతమును తురుష్క జాతీయవాదు లమలుజరిపినారు. ఏమతము నవలంబించినను సరే రాజ్యాంగవిధానమువలన తురుష్క దేశమునకుజెందిన పదునెనిమిది సంవత్సరములు నిండిన ప్రతిపురుషునికిని, స్త్రీకిని ఓటుచేయుహక్కు కలిగినది. ముప్పదిసంవత్సరములుదాటిన ప్రతిపురుషునికిని, స్త్రీకిని ఎస్సెంబ్లీ సభ్యులగుటకు అర్హతగలదు, ఓటర్లకుగాని, సభ్యులకుగాని ఆస్తియుండవలె

నని గాని, కొంత పన్ను చెల్లించవలెనని గాని నిబంధనలేదు. ఎస్సెంబ్లీకి నాలుగుసంవత్సరముల కొకసారి ఎన్నికలు జరుగవలెను. ఎస్సెంబ్లీ సభ్యులకు ఎస్సెంబ్లీ నిర్ణయించిన సాలీనాజీతములు ఇవ్వబడును. ఆర్థికసంబంధమగు సమస్తహక్కులు, విదేశవ్యవహారములు, సమస్త శాసనాధికారము, యుద్ధములు సంధులుచేయు హక్కు, నేరస్తులకు క్షమాపణనిచ్చుహక్కు మొదలగు సమస్త హక్కులు ఎస్సెంబ్లీకి గలవు. తురుష్కప్రజాస్వామ్యమునకు రెండుశాసనసభలు లేవు. ఒకటే గలదు.

## కార్యనిర్వాహకము

తురుష్కప్రభుత్వముయొక్క కార్యనిర్వాహకమంతయు నాలుగు సంవత్సరముల కొకసారి ఎస్సెంబ్లీచే నెన్నుకొనబడెడి అధ్యక్షుని (**President of the Republic**) యందు గలదు. ఎస్సెంబ్లీలో పలుకుబడిగల వారిని ప్రధానమంత్రిగ అధ్యక్షుడు నియమించును. ప్రధానమంత్రిసలహాపైన తక్కినమంత్రులనుగూడ నధ్యక్షుడు నియమించును. మంత్రులందరును ఎస్సెంబ్లీసభ్యులలోనుండియే నియమింపబడవలెను. ఎస్సెంబ్లీకి బాధ్యత వహించియుండవలెను. ఆర్థికచట్టములును, ఆదాయవ్యయపట్టికలును ఎస్సెంబ్లీ మంజూరుచేసిన పదిదినములలో నధ్యక్షుడు సంతకముచేసి అమలుజరిపితీరవలెను. ఎస్సెంబ్లీ ప్యాసుచేసిన యితరశాసనములన్నిటికిని అధ్యక్షుడు పదిదినములలో నంగీకారమునైన తెలుపవలెను, లేదా ఆక్షేపణలతో పునర్విమర్శనకొరకు ఎస్సెంబ్లీకిపంపవలెను. రెండవమారు ఎస్సెంబ్లీలో మంజూరు కాగానే అధ్యక్షుడు అమలుజరిపితీరవలెను. తిరస్కరించుటకుగాని, మరల పంపుటకుగాని అధికారములేదు. మంత్రివర్గమునకు సలహాలనిచ్చుటకును, చిత్తుచట్టములను తయారుచేయుటకును పరిపాలనానుభవముగలవారినుండియు శాస్త్రజ్ఞులనుండియు కౌన్సిలు ఆఫ్ స్టేటు అను నొకసంఘమును ఎస్సెంబ్లీ నియమించుచున్నది. న్యాయవిచారణకు హైకోర్టు ఉత్తమన్యాయస్థానముగ నున్నది.

## స్థానికస్వపరిపాలనము

పరిపాలనాసౌకర్యములకొరకు తురుష్కదేశము జిల్లాలుగ విభజింపబడినది. జిల్లాలకు విలాయతులని పేరు. విలాయతులు కాజాలుగను (తాలూ

కాలుగను) తాలూకాలు నవాయేలుగను (ఫిర్కాలు) నవాయేలు గ్రామములుగను విభజింపబడినవి. గ్రామములకు కస్బాలని పేరు. ప్రతిజిల్లాకును ప్రజలచే నెన్నుకొనబడినసభ, ప్రభుత్వముచే నియమింపబడెడి అధికారులు మున్నారు. జిల్లాలకు స్వపరిపాలనము బాగుగ పంచిపెట్టబడినది. బస్తీలకెల్ల మునిసిపల్‌పాలనము గలదు. గ్రామములన్నిటిలోను పంచాయితీలు అనాదినుండియు గలవు. ఆ పంచాయితీలు బలపర్చబడినవి.

## (5)

## ముస్తఫా కెమాల్‌పాషా అధ్యక్షుడు

నూతనరాజ్యాంగవిధానమునను సరించి ఓటర్ల జాబితాలు ప్రకటింపబడి నేషనల్‌ఎస్సెంబ్లీకి ఎన్నికలు జరిగినవి. ఎస్సెంబ్లీ వలన ముస్తఫా కెమాల్‌పాషా మరల ఏకగ్రీవముగ ప్రజాస్వామికమున కధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. లాసేనుధీరుడగు ఇజ్మతుపాషా ప్రధానమంత్రి యయ్యెను. రెండవసారి జరిగిన ఎన్నికలలోగూడ ముస్తఫా కెమాల్‌పాషా యధ్యక్షుడుగను, ఇజ్మతుపాషా ప్రధానమంత్రియునై తురుష్క-ప్రభుత్వపుటోడను సురక్షితముగ నడుపుచున్నారు.

## ప్రజాకక్షి (People's Party)

దేశమునం దింకను రాజరికము గోరువా రుండవచ్చును. మతగురువులు మరల సుల్తాను ఖలీఫా అధికారమునకురావలెనని కోరుచుండుట సహజము. 1925 వ సంవత్సరమునందు జరిగిన కర్డుల తిరుగబాటు మతగురువుల కుట్రవలన జరిగినదని తలచబడుచున్నది. రాబోవుతరములవారిభావములు నవీనపద్ధతులమీద దిట్టపడుటకు దేశభక్తి ప్రజాస్వామికసిద్ధాంతములును పౌరస్వత్వములును ప్రతిబాలునికిని, బాలికకును పాఠశాలలన్నిటిలోను నేర్పబడుచున్నవి. ఇంతేగాక ప్రజాస్వామికస్థిరత్వమునకును, మతావేశము నణచుటకును, సమస్తవిధములగు అభివృద్ధికి తోడ్పడుటకును ప్రజాకక్షి **(People's Party)** యని యొక రాజకీయకక్షిని ముస్తఫా కెమాల్‌పాషాయును, ఆయన యనుచరులును స్థాపించిరి. ఇది దేశములోని ప్రధానరాజ

కీయకక్షి యయ్యెను. దీనికిని ముస్తఫా కెమాల్‌పాషా యధ్యక్షుడుగ నెన్ను కొనబడెను. ప్రజాస్వామికమును సాంఘికాభివృద్ధిని గోరు ప్రతివారు నీ కక్షిలో సభ్యులుగావచ్చును.

## ప్రజలను తనతో నడుపుచున్నాడు

"ముస్తఫా కెమాల్ పాషా ప్రజాకక్షియొక్క నాయకుడననియే ఎంచుకొనెను. ఇతరులును తనను ప్రజాకక్షియొక్క నాయకుడని పిలిచిననే సంతోషించును. తాను గావించుచున్న సంస్కరణముల కార్యక్రమమంతయు నా కక్షిపక్షముననే చేయబడుచున్నదని చెప్పును.........ముస్తఫా కెమాల్ నూతన తురుష్కమును స్థాపించియున్నాడు. ఎట్టి తగాదాలుగాని భిన్నాభిప్రాయములుగాని లేకుండచేయుచు, ప్రజలను తనతోకూడ తీసుకొనిపోవుచున్నాడు. ప్రజలను తనతో తీసుకొనిపోకుండ తన సంస్కరణములు స్థిరముగనుండవని ఆయనకు తెలియును. ఒకజాతియొక్క భావములనన్నిటిని ఆయన మార్చివేసినాడు. అయినను జరిగిన సంస్కరణములన్నియు ప్రజలే గావించుకొనినారనియు, తాను గావించినవికావనియు, తాను తన ధర్మమును మాత్రము నెరవేర్చుచు వారికి సేవకుడుగ ప్రవర్తించుచున్నాననియు, వారి యాజ్ఞలనుమాత్రమే అమలుజరుపుచున్నాననియు చెప్పును. ఎప్పుడును నేను అను పదమును ఆయన యుపయోగింపడు. మా జాతి అనియే చెప్పును. 'మాప్రభుత్వపద్ధతి సాంఘికతత్వముగలది కాదు. నిరంకుశత్వముగలదికాదు. ఇతర యేప్రభుత్వపద్ధతులను బోలియుండదు. మాజాతియొక్కయుద్దేశ్యముల ప్రకారమే అది నిర్మాణముగావింపబడినది. మా ప్రజల సంపూర్ణ స్వయం నిర్ణయమును మాత్రమే అది తెలుపును. మాకు వెలుగు కనబడినది. మేము పోవలసినత్రోవను స్థిరపర్చుకొనినాము. మమ్ము వెనుకకు మరలించుటకు ప్రపంచములోని ఎట్టి శక్తివంతులకును సాధ్యముకాదు' అని ఆయన చెప్పును. ఈ మాటలు ప్రజలకు కంఠతఃవచ్చును." అని ఈ దినముననున్న తురుష్కగ్రంథకర్త్రి వ్రాసినది.

## పదవులు ముఖ్యముకావు

ముస్తఫా కెమాల్ దేశమును పారతంత్రమునుండియు అధోగతి నుండియు రక్షించినవాడు; మిగుల యోధుడు; అత్యంతమైన పలుకుబడి

గలవాడు. దేశముద్ధరించినందులకు కృతజ్ఞతగ ఆయనను జీవితకాలమువరకొకసారియే అధ్యక్షునిగచేయవలెనను ప్రయత్నము బయలుదేరెను. ఆసంగతి ఆయనకు తెలియుటతోడనే దాని నాయన తీవ్రముగ ఖండించెను. "నెపోలియను బోనపార్టు యావజ్జీవకాన్సలుగను, పిమ్మట చక్రవర్తిగను చేయించుకొని ఫ్రాన్సుదేశముయొక్క అభివృద్ధిని రెండుతరములవరకు వెనుకకు నెట్టినాడు. ఆయనయొక్క కుశాగ్రబుద్ధిని శౌర్యమును సామర్థ్యమును ప్రజలసేవకుడుగను ప్రథమపౌరుడుగను వినియోగించియుండినచో పందొమ్మిదవ శతాబ్దప్రారంభమునందే ఫ్రాన్సుకు సుస్థిరమైన ప్రజాస్వామికమేర్పడి, ప్రపంచములో ఘనతను పొందియుండెడిది. చరిత్ర మన కార్యములను ఎప్పటికైనను విమర్శింపకమానదు. చరిత్ర యిచ్చెడితీర్పులలో మనము నిర్దోషులము గావలెను. తుచ్ఛమైన అధికారపదవి నా కక్కరలేదు. నా మాతృదేశము సర్వతోముఖమైన అభివృద్ధిచెందుటయు, ప్రపంచములోని నాగరిక జాతులలో గౌరవమగుస్థానమును పొందుటయు మాత్రమే నా యాత్మకు సంతృప్తికలుగచేయును" అని ముస్తఫా కెమాల్‌పాషా చెప్పి లోకములోని జాతీయవాదులందరియొక్క కృతజ్ఞతకు పాత్రుడయ్యెను.

## వివాహము

ముస్తఫా కెమాల్‌పాషా 1921 వ సంవత్సరమున స్మిర్నాలోని ధనవంతుడగు నొకవర్తకునికూతురగు లతీఫుహానం అను మిగుల సౌందర్యవతి యగు యువతిని పెండ్లియాడెను. ఆమె ఫ్రాన్సులో విద్యనభ్యసించియుండెను. ఆమె తురుష్కస్త్రీలస్వతంత్రముకొరకు బాగుగ పనిచేసినది. గాని మూడుసంవత్సరములకాలములో భార్యాభర్తలకు అభిప్రాయభేదములు కలిగెను. వివాహవిచ్ఛేదమును గావించుకొనిరి. మరల నీయనగాని ఆమెగాని వివాహమాడలేదు. వారికి పిల్లలు కలుగలేదు. ముస్తఫా కెమాల్‌కు సంసారజీవితము లేనందున యావత్కాలము దేశముకొరకే వినియోగించుచున్నాడు.

# తురుష్క ప్రజాస్వామికము

## 11 విదేశీయులయొక్కయు మతసంఘములయొక్కయు ప్రత్యేకహక్కులను రద్దుపరచుట

### (1)

### తురుష్కులకు మాతృదేశములో విదేశీయులతోపాటు సమానహక్కు

లాసేనుసంధివలన తురుష్కములోనున్న పాశ్చాత్యదేశీయులు ప్రధమ పర్యాయము తురుష్కప్రభుత్వము చేసెడి చట్టములక్రిందికి తేబడిరి. వారి కదివరకు రాజకీయ, న్యాయవిచారణ, ఆర్థిక, సాంఘికవిషయములలో సుల్తానులచే నివ్వబడిన ప్రత్యేకహక్కులన్నియు (Capitulations) లాసేనుసంధివలన రద్దుపర్చబడినవి. వారితోపాటు మొదటిసారి తురుష్కులును తమమాతృదేశములో సమానహక్కుగలవారైరి. ఇది తురుష్కజాతి కిని తురుష్కప్రజాస్వామికమునకును అత్యంత ముఖ్యమయినవిషయము. 1914 సంవత్సరమున నొకసారి యౌవన తురుష్కకక్షివారు విదేశస్థుల ప్రత్యేకహక్కులను రద్దుపరచిరి. కాని పాశ్చాత్యప్రభుత్వములును అమెరికా వారునుకూడ తమ సమ్మతిలేనిది తమతమదేశీయులకు తురుష్కదేశములో గల ప్రత్యేకహక్కులను రద్దుపరచుటకు వీలులేదని ఖండితముగ తెలిపిరి. మరియు ప్రపంచయుద్ధమునందు తురుష్కమోడిపోగనే తురుష్కప్రభుత్వ మును లక్ష్యపెట్టక నీ హక్కులనన్నిటిని విదేశీయులు మరల చలాయించిరి. 1920 ఆగస్టునెలలో జరిగిన సెవర్సుసంధివలన నీ విదేశీయుల ప్రత్యేక హక్కులన్నియు పునరుద్ధరించుటకు సుల్తాను అంగీకరించెను.

## మిత్రమండలివారంగీకరించుట

విదేశస్థుల ప్రత్యేకహక్కులు నశించుట తురుష్కజాతీయసమాఖ్య యొక్క ప్రధానసూత్రములలో నొకటి. లాసేనుసంధి మొదటిపర్యాయము చెడిపోవుటకు కారణము ముఖ్యముగ నీ విషయమే. ఈ ప్రత్యేకహక్కుల నాశనమునకై ఇజ్మత్‌పాషా పట్టుపట్టెను. కర్జన్ ప్రభువు వినలేదు. రాజీ చెడిపోయినది. ప్రత్యేకహక్కులను కొంత మార్పుదలతో నిలిపియుంచవలెనని మిత్రమండలివారు మరల ప్రయత్నించిరి. తురుష్కజాతీయప్రభుత్వము వినలేదు. రెండవ లాసేనుసమావేశమునం దీ విషయమున పూర్తిగ మిత్రమండలివా రొప్పుకొనినతర్వాతనే సంధి కుదిరినది. ఇది తురుష్కజాతీయవాదులకు ప్రధానమయినజయము.

(2)

## పాశ్చాత్యులు సుల్తానువద్ద ఫర్మానాలుపొందుట

తురుష్కసుల్తానులప్రాభవము బాగుగనున్నపుడు తురుష్కసామ్రాజ్యములో నివసించి వర్తకముచేసికొనుటకు పాశ్చాత్యదేశీయులు సుల్తానుల నాశ్రయించి యనుమతినిపొందుచువచ్చిరి. పాశ్చాత్యప్రభుత్వములు నజరానాల నిచ్చి సుల్తానులసముఖమునకు రాయబారులను బంపి తమ దేశీయులకు వర్తకసౌకర్యములను కలుగచేయు ఫర్మానాలను పొందుచుండిరి. గాని 1839వ సంవత్సరమువరకును తురుష్కముయొక్క ఆర్థికస్వతంత్రమున కెట్టిలోటు కలుగలేదు.

## సుల్తానులు పాశ్చాత్యషాహుకార్లవద్ద ఋణములుచేయుట

1839 వ సంవత్సరమున అబ్దుల్‌మజీదు సుల్తాను సింహాసనము నధిష్ఠించెను. ఆయనకాలములో (1839—61) పాశ్చాత్యషాహుకార్లనుండి విశేషముగ ఋణములను తెచ్చెను. కొంతసొమ్ము రష్యాతో కలిగిన యుద్ధమునందు వెచ్చించెను. మిగతసొమ్ము దుర్వ్యయముచేసెను. తన కుమార్తెలలో నొకరిని తన ప్రధానమంత్రి కుమారునికిచ్చి చేసిన వివాహమునకు నాల్గు కోట్ల ఫ్రాంకులను ఖర్చుచేసెను. తర్వాత రాజ్యమునకువచ్చినసుల్తాను అబ్దుల్

అజీజుకూడ (1861—76) లండనులోను పారిసులోను షాహుకార్లనుండి యెక్కువగనే ఋణములను తెచ్చెను. కొంతకాలమునకు పాశ్చాత్యషాహుకార్లనుండి తెచ్చిన ఋణము రెండువందల డెబ్బైఅయిదుకోట్లరూప్యములకు పెరిగెను. అసలు చెల్లించుటకు డబ్బులేకపోగా, వడ్డీని చెల్లించుటకుకూడ ఋణము తేవలసివచ్చినది. క్రొత్తఋణములు తెచ్చుట మానలేదు. ఋణములను సంపాదించినవారికి కమీషనులుకూడ నిచ్చిరి. సుల్తానుయొక్కదుర్వ్యయము తగ్గలేదు. వచ్చెడు ఆదాకన్న ఖర్చెక్కువగుచుండెను. 1875 వ సంవత్సరమున సుల్తానుప్రభుత్వము దివాళాఅయ్యెను.

1881 వ సంవత్సరము డిశంబరునెలలో పాశ్చాత్యఋణదాతలపక్షమున పాశ్చాత్యప్రభుత్వములు అప్పుడు సుల్తానుగనున్న సుల్తాన్అబ్దుల్‌హామీదును బలవంతపెట్టి విదేశీయులఋణములతీర్మానమునిమిత్త మొక 'అట్టోమాను పబ్లికుఋణసంఘము' (Council of Ottoman Public Debt) అను పాశ్చాత్యప్రభుత్వప్రతినిధులసంఘము నేర్పాటుచేయించిరి.

## అట్టోమాను పబ్లికు ఋణసంఘము

ఆ సంఘమునందు ఫ్రెంచి, ఇంగ్లీషు, డచ్చి, జర్మను, ఆస్ట్రియను, ఇటలీ ప్రతినిధు లారుగురును, ఇంపీరియలు అట్టోమాన్‌బ్యాంకియొక్కప్రతినిధి యొకడు నుండును. ఇంపీరియలు అట్టోమాన్‌బ్యాంకియొక్క ప్రధాన పెట్టుబడియంతయు ఫ్రెంచి ఆంగ్లేయులదై యుండెను. అట్టోమాన్ పబ్లికు ఋణసంఘమున కొక సంవత్సరము ఆంగ్లేయప్రతినిధియు, మరియొకసంవత్సరము ఫ్రెంచిప్రతినిధియు వంతులవెంట నధ్యక్షతవహించెదరు. ఋణదాతలలో నెక్కుడుమంది ఆంగ్లేయులును ఫ్రెంచివారును గనుక, ఫ్రెంచి ఆంగ్లేయప్రతినిధులే యెల్లపుడును నధ్యక్షతవహించునటుల నిర్ణయించిరి. ఆ సంఘనిబంధనలను మార్చుటకు తురుష్కప్రభుత్వమునకు అధికారములేదు. తురుష్కప్రభుత్వము పొగాకు, ఉప్పు, స్టాంపులు, కల్లు, సారాయి మొదలగు మత్తుపదార్థములు, చేపలు, పట్టు మొదలగువాటిమీద వేయు పన్నులన్నియు నీ సంఘమునకు స్వాధీనతాకట్టుపెట్టబడినవి. ఈ సంఘమువారియనుమతి లేనిది యీ పన్నులను మార్చుటకుగాని, క్రొత్తఋణములను తెచ్చుటకుగాని తురుష్కప్రభుత్వమునకు అధికారములేదు. ఈ పన్నులనే గాక క్రమముగ

మిగతపన్నులలో చాలభాగముకూడ నా సంఘమువారే వసూలుచేయుచు వచ్చిరి. ఈవిషయమునుగూర్చి డ్యూవిలేయను గ్రంథకర్త యిట్లుల వ్రాసి యున్నాడు.

"ఇతరదేశములలోవలెగాక తురుష్కములో ప్రభుత్వము పనిచేయుటకుగాని, క్రొత్తమార్గములుత్రొక్కుటకుగాని, సంస్కరించుటకుగాని స్వతంత్రములేనిస్థితిపై యున్నది, ఒక యుదాహరణము తీసికొందము. విదేశీయుల కివ్వబడిన ప్రత్యేకహక్కులవలన, పన్నులవిషయమున తురుష్క ఆర్థిక విధానమునందు దేమార్పులు ప్రవేశపెట్టుటకును వీలులేదు. వ్యాపారమునకు లైసెన్సులు పుచ్చుకొనవలెనని తురుష్కప్రభుత్వము చట్టము ప్రవేశపెట్టగనే, నా చట్టముక్రిందికి విదేశీయులు వచ్చినచో అన్నిపైపులనుండియు విదేశప్రభుత్వములు తమఅసమ్మతిని తెలిపెదరు. మత్తుపదార్థములమీద పన్ను హెచ్చించి సాలుకు రెండుకోట్లఫ్రాంకు లాదాయ మెక్కువచేయ యత్నింపగనే అందువలన నష్టమువచ్చు కొన్ని విదేశీప్రభుత్వములు ప్రతిఘటించెను. వెంటనే ఆ ప్రయత్న మాపుచేయబడెను. నిప్పుపెట్టెలమీదగాని, సిగరెట్లమీదగాని పన్నువేయ నాలోచించగనే విదేశప్రభుత్వము లందుకును అడ్డు తగిలిరి. పర్యవసానమేమనగా తురుష్కప్రభుత్వము డబ్బులేనిదనియు, తన యుద్యోగస్థులకు జీతము లివ్వలేనిదనియు, విశేషముగ ఋణములుచేసినదనియు వెక్కిరించబడుచున్నది. కాని యా ప్రభుత్వము తన బొక్కసమును సంస్కరించుకొని దుస్థితినుండి తొలగింపయత్నించగనే యా వెక్కిరించువారే అభ్యంతరపరచువారిలో ప్రథములుగనుండిరి." ప్రపంచయుద్ధకాలమున యౌవనతురుష్కకక్షివారు ఋణముచేయలేదు. యుద్ధవ్యయమంతయు జర్మనీయే భరించెను.

## జాతీయఋణము

లాసేనుసంధిలో తురుష్కమునుండి చీలిపోయిన బాల్కన్‌రాష్ట్రములును మాండేటరీరాజ్యములుగచేయబడిన అరబుదేశములును అప్పటికి నిలచియున్న తురుష్కఋణములో నూటికి అరవైపాళ్లు భరించవలెనని వ్రాయబడినందున, మిగిలిన నలుబదిపాళ్ళఋణమునే తురుష్కము చెల్లించవలసియున్నది. 1919 మొదలు 1922 వరకు జరుగుచుండిన స్వతంత్రపోరాటకాల

మున అంగోరా జాతీయప్రభుత్వము సుల్తానునుగాని మిత్రమండలినిగాని లక్ష్యపెట్టక తురుష్క ప్రజలనుండి యావత్తుపన్నులు వసూలుచేసికొనెను. ప్రజలు తమ జాతీయప్రభుత్వమునకే పన్నులను చెల్లించిరి. అట్టోమాను పబ్లికురుణసంఘమువారు నిస్సహాయులై పన్నులనేమియు వసూలుచేయజాలకపోయిరి. ఆ కాలమునుండియు అట్టోమాను పబ్లికురుణసంఘము దానంతట అది రద్దయినదని చెప్పవచ్చును. లాసేనుసంధివలన తురుష్క జాతీయప్రభుత్వము తన ఆదాయమునుండి తా నివ్వవలసినరుణములను వాయిదాలప్రకారము చెల్లించుటకు కరారుచేసెను. అట్టోమాను పబ్లికురుణ సంఘము, పన్నులతాకట్టు రద్దుపర్చబడెను. తురుష్కదేశము ఆర్థికస్వతంత్రమును పొందెను.

## (3)

## రుణములిచ్చినపద్ధతులు

"అట్టోమానుసుల్తానులకు పాశ్చాత్యులు రుణములిచ్చినపద్ధతులుకూడ రుణదాతలకు గౌరవమయినవి కావు. దురదృష్టమైన తురుష్కసామ్రాజ్యములో చాలకాలము ప్రబలిన ఆర్థికదుస్థితికిని, నిస్సహాయతకును రుణములు తెచ్చినవారితోబాటు రుణములిచ్చినవారును కూడ సమానబాధ్యులై యున్నారు. తురుష్కమున కప్పులిచ్చినపుడు సహజముగ భాగ్యవంతమైన ఆ దేశములోని ధనమును కొన్నిహక్కులమూలమున కొనిపోవలెనన్నతలంపుతోడనే రుణములనిచ్చిరి. ఈ రుణములు తురుష్కదేశసంపదయొక్క అభివృద్ధి కొరకు చేయబడుటలేదనియు, సుల్తానులదుర్వ్యయముకొరకు చేయబడుచున్నవనియు, వారికి తెలియును. ఈ రుణములు సాధారణముగ మూడు పనులనిమిత్త మివ్వబడినవి. అవి ఏవనగ :

(1) రుణములిచ్చెడిదేశమునుండి తురుష్కప్రభుత్వము యుద్ధసామగ్రులను కొనుక్కొనిపోవుటకు. ఇందువలన రుణములమీద అసలు ఫాయిదాలు వచ్చుటయేగాక, తాము నిర్ణయించినధరలకు తురుష్కులు సామగ్రులు కొనుక్కొనుటలో తాము విశేషలాభము గడించెదరు.

(2) తురుష్కదేశములో కొన్నిహక్కులు సంపాదించుటకు.

(3) తమదేశమునకును తురుష్కమునకునుగల తగాదాలు తమ కనుకూలముగ పరిష్కారముజరిగేలాగు తురుష్క మంగీకరించుటకు. మరియు పాశ్చాత్యప్రభుత్వములలోగల స్పర్థలవలన ఒకరు ఋణముపెట్టి నపుడు రెండవప్రభుత్వమువారును ఋణముపెట్టి తమపలుకుబడిని స్థాపించు కొనుటకు సదా యత్నించెదరు. చాలవరకు తురుష్కఋణములు విదేశస్థులు కోరిన రైల్వేలువేయుట, గనులుత్రవ్వుకొనుట, వ్యవసాయమునకును తోటలుపెంచుటకును గొప్ప భూవసతులు పొందుట మొదలగు హక్కులను కలుగజేసినవి. వడ్డీరేటుగాని మరల ఋణము ఎప్పుడు తీర్చబడుననిగాని ఆలోచన ముఖ్యమైనదికాదు. ఋణమునిచ్చుటవలన తురుష్కములో ధన సంపాదన కవకాశములు పొందుటయే ముఖ్యమగు కోరిక. కొన్నివేళల తురుష్కమంత్రులకు లంచములనిచ్చికూడ ఋణములను సుల్తానులమీద అంటగట్టిరి. కొందరు విదేశయుద్యోగస్థులు కాన్‌స్టాంటినోపిలులోనే యుండి తమదేశీయులచే ఋణములనిప్పించి తమదేశీయులకు ప్రత్యేకహక్కులను సంపాదించుటయందును, వాటిని కాపాడుటయందును తమకాలములో చాల భాగము వినియోగించుచుండిరి." అని నవీనతురుష్కమునందు మీయర్సు వ్రాసియున్నాడు.

## ఋణములిచ్చినజాతులు

తురుష్కప్రభుత్వమునకు ఋణముల నిచ్చినట్టియు, వ్యాపారహక్కులను సంపాదించినట్టియు జాతులలో ప్రథములు ఫ్రెంచివారు. తురుష్కమునకును ఫ్రెంచివారికిని గల సంబంధము తక్కినవారికన్న పాతది. తురుష్క విద్వాంసులలో చాలమంది ఫ్రెంచిగ్రంథములను చదివెదరు. ఫ్రెంచివాఙ్మయము, రాజ్యాంగవిధానము తురుష్కవిద్యాధికులను కొంతవర కాకర్షించినవి. 1914 వ సంవత్సరయుద్ధమునకుపూర్వము తురుష్క మివ్వవలసిన ఋణములో నూటికి ఏబదివంతున ఫ్రెంచివారికిని, పదిహేనువంతులు ఆంగ్లేయులకును, ఇరవైవంతులు జర్మనీకిని. తక్కినది బెల్జియము, హాలెండు, ఇటలీ, ఆస్ట్రియాదేశములకును నివ్వవలసియుండెను. యుద్ధమునకు పూర్వము తురుష్కదేశమునందు వ్యాపారముకొరకు పెట్టుబడి పెట్టబడినదానిలోకూడ ప్రథమస్థానము ఫ్రెంచివారికిని, రెండవస్థానము

జర్మనీవారికిని, మూడవస్థానము ఆంగ్లేయులకును చెందియుండెను. ప్రపంచ యుద్ధమునకు పూర్వము తురుష్కప్రజలపెట్టుబడివలన ఏర్పడినవి రెండు మూడు స్టీమరుకంపెనీలు మాత్రమే అయ్యుండెను. తురుష్కప్రభుత్వరుణములో బహు స్వల్పభాగమే తురుష్కప్రజల కివ్వవలసియుండెను.

## ఫ్రెంచివారి ఆర్థికహక్కులు

ఫ్రెంచివారు తురుష్కముయొక్క వివిధభాగములలో ఆర్థికహక్కులను సంపాదించిరి. నల్లసముద్రమునకును, ఈజియనుసముద్రమునకును సంబంధముకలుగజేయు రైలువేలు, రోడ్లు, కుర్దిస్థానులోని నూనెగనులు, రాగిగనులు, కొన్నిరేవులలో స్టీమర్లునిలచు హార్బర్లు మొదలైనవి వారిచేతులలో నున్నవి. సైలీషియాలో కొంతవరకును, సిరియాలో దాదాపుగ యావత్తును రైలువేలు, పట్టుకార్ఖానాలు, బ్యాంకీలు, యితరవ్యాపారములు ఫ్రెంచివారిక్రింద నున్నవి. అందుకొరకే ఫ్రెంచివారు సిరియాను మాండేటరీరాజ్యముగ స్వాధీనముచేసికొనిరి. నల్లసముద్రముదగ్గరనున్న హెరాక్లి యను బొగ్గుగనులు, పశ్చిమ అనటోలియాలోని బాలియా కరియాదీ వద్దనున్న తగరము, వెండిగనులు, అంగోరాసమీపమున ఆల్డాగువద్దనున్న తగరము, వెండి, తుత్తినాగము గనులు, అర్ఘునా మేడనువద్దనున్న సుప్రసిద్ధమగు రాగిగనులు, అనటోలియాలో నైరుతిమూలనున్న వెండి, తగరముగనులు ఫ్రెంచివారిక్రింద నున్నవి.

## ఆంగ్లేయుల వర్తకహక్కులు

ఆంగ్లేయులు గనులస్వాధీనమునందు రెండవవారుగ వచ్చెదరు. గనులవిషయమున మూడవవారు జర్మనులు. కాన్స్టాంటినోపిలులోను, స్మర్నాలోను బ్యాంకీలు, స్టీమరుకంపెనీలు ప్రధానముగ ఆంగ్లేయులక్రింద నున్నవి. పశ్చిమ అనటోలియాలోని బోరాక్సుకంపెనీ లిమిటెడ్ అను ఆంగ్లేయవర్తకసంఘము అరవైలక్షలసవరనులపెట్టుబడితో పనిచేయుచున్నది. కొన్ని రైలువేలును ఆంగ్లేయులక్రింద గలవు. గాని ప్రపంచయుద్ధకాలమున తురుష్కసామ్రాజ్యములో జొరబడి, మెసపొటేమియా, పాలస్తైన్, సిరియాలలో అపరిమితముగ పెట్టుబడిపెట్టి ఆంగ్లేయులు రైలువేలను వేయిం

చినారు. నీటిపారుదలకట్టడముల నిర్మాణమును గావించినారు. పెట్రోలు గనులు త్రవ్వించినారు. యుద్ధమునకుపూర్వము అన్నిజాతులు కలిసి పెట్టుబడి పెట్టినమొత్తముకన్న యుద్ధకాలమున ఆంగ్లేయులు పెట్టుబడిపెట్టిన ద్రవ్యము చాల హెచ్చుగనున్నది. ఆల్‌కంటారానుండి పాలస్తైనువరకును వేయబడిన గొప్పరైలువేగాక, మెసపొటేమియాలో మాత్రమే యుద్ధకాలమున ఆంగ్లేయులు పదికోట్లడాలర్లు ఖర్చుపెట్టినారు. పాలస్తైనులోను, పశ్చిమఆశియా మైనరులోను రేవులు వృద్ధిచేసినారు. పాలస్తైనులోను, మెసపొటేమియాలోను ఆంగ్లేయులయొక్క పలుకుబడిని బాగుగ సంపాదించుటకు ఏమాత్రము ఖర్చులోను లోపము జరుగలేదు. ఈ వ్యయము తురుష్కప్రభుత్వము యొక్కఅనుమతితో చేసినది కాదు. రాజ్యసంపాదనకొరకు చేసినది. గావుననే మెసపొటేమియాను, పాలస్తైనును ఆంగ్లేయులు యుద్ధము ముగిసిన తరువాత వదలక, తుదకు మాండేటులుగ తమక్రింద చేర్చుకొనినారు. పెట్టుబడి, వర్తకము రాజ్యసంపాదనకు గొప్ప పునాదులు. రాజ్యసంపాదనవలన మరల వర్తకము, పెట్టుబడి బాగుగ విజృంభించును. ఇటుల వర్తకమునకును రాజ్యమునకును ఎడతెగనిసంబంధము కలదు.

## జర్మనీ పొందిన వర్తకహక్కులు

జర్మనీ కొంచెము ఆలస్యముగ బయలుదేరినది. 1871 వ సంవత్సరమున జరిగిన ఫ్రెంచి జర్మనీ యుద్ధమువరకును జర్మనీ కైక్యత లేకుండెను. ప్రపంచమున తా నెట్టి ప్రఖ్యాతికలిగినస్థానమును పొందగలుగునో జర్మనీకి తెలియదు. జర్మనీ కైక్యతను, అభివృద్ధిని, లోకములో కీర్తి ప్రతిష్ఠలను కలుగచేసిన వారు ప్రస్తుత కైజరుయొక్క తాతయగు మొదటికైజరు చక్రవర్తియు, ఆయనమంత్రి బిస్మార్కును. 1898 వ సంవత్సరమున యిప్పటి కైజరు రెండవవిలియం చక్రవర్తి తురుష్కమునకు వచ్చెను. సుల్తానును దర్శించెను. మహమ్మదీయులకు తాను ముఖ్యస్నేహితుడనని చెప్పెను. తురుష్కములో తన దేశీయులు (జర్మనులు) వ్యాపారముచేసికొనుట కనేక హక్కులను పొంది వెళ్ళెను. తురుష సామ్రాజ్యములో జర్మనులుకూడ తురుష్కసుల్తానుకు పెట్టుబడిపెట్టి వర్తకసౌకర్యములను పొందుచువచ్చిరి. అనేక పెట్రోలియం, బొగ్గు, రాగి, క్రోము, గనులు ధాన్యములను ప్రత్తిని

పండించు గొప్పప్రదేశములు. రైలువేలువేయుహక్కులు, ఇతర వ్యాపార హక్కులు జర్మనులకు లభించెను. బాస్ఫరసుజలసంధినుండి బాగ్దాదువరకును 2400 మైళ్ళపొడుగున బాగ్దాదురైలుమార్గమును వేయుటకు జర్మనులు హక్కుసుపొందుట రష్యాయొక్కయు, ఇంగ్లాండుయొక్కయు అసూయను, భీతిని కలుగచేసెనని పైన తెలిపియున్నాము. షటల్ అరాబు, టైగ్రీసు, యూఫ్రటీసు నదులమీద పడవలునడిపించుటకును, అలెగ్జాండ్రియా, బాగ్దాదు రేవులలోను, పారసీకసముద్రముమీద కొన్నిచోట్లను ఓడలునిలచురేవులను కట్టుటకును జర్మనులు అనుమతినిపొందిరి.

## రష్యా

ఇట్టి హక్కులు జర్మనులు పొందుట సహింపలేక రష్యాచక్రవర్తి తన సరిహద్దులవరకును రైలుశాఖలు రాకూడదని జర్మనీకి తెలుపుటవలన జర్మనులు బాగ్దాదురైలువేలోని యుత్తరశాఖలను వదలుకొనిరి. 1900 వ సంవత్సరమున రష్యాచక్రవర్తి తురుష్కప్రభుత్వమును బెదిరించి, జర్మనుల కిచ్చినరైళ్లగాక, నల్లసముద్రముపైపుననున్న రాష్ట్రములన్నిటిలోను తాము రైలుమార్గములనువేయుటకు హక్కులను పొందెను. రష్యాప్రభుత్వము తన దేశములోనే రైళ్లవేసికొనుటలో సరిపోయి, తురుష్కములో సంపాదించిన రైలుహక్కులను ఫ్రాన్సున కిచ్చివేసెను. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, రష్యాలు తమలోతాము పోటీపడకుండ హక్కులు పొందుటకై రాయబార ములు జరుపసాగిరి.

## తురుష్కమును పలుకుబడిప్రదేశముగ పంచుకొనుట

1914 వ సంవత్సరమున ఈ నాలుగు ప్రభుత్వములమధ్యను రహస్యపుటొడంబడిక కుదిరినదని అందరును తలంచిరి. చైనాసామ్రాజ్యమును చేసినటులే తురుష్కసామ్రాజ్యమునుకూడ నీ నాలుగుప్రభుత్వములపలుకు బడిప్రదేశములుగ పంచుకొనుటకు నిర్ణయించినటుల తెలియవచ్చినది. ఎవరి భాగములో వారే అన్నిహక్కులు పొందవలెను. రెండవవారు పోటీకి

రాగూడదు. ఇట్టి యొడంబడికలుచేసికొనుచున్నసమయముననే ప్రపంచ యుద్ధము ప్రారంభమైనందున నివియన్నియు నిష్ఫలమైనవి. ప్రపంచచరిత్ర వేరుగ మారినది.

## అమెరికా

అమెరికా సంయుక్తరాష్ట్రములకు కొంతకాలముక్రిందట స్మిర్నాతో వర్తకముండెను. అది ఆగిపోయినది. 1910 వ సంవత్సరమునుండియు మరల అమెరికాయొక్క వ్యాపారము తురుష్కములో వృద్ధిచెందెను. కొన్ని పెద్ద వర్తకసంఘములు అమెరికావారివి. గాని అమెరికా క్రైస్తవమతబోధకులు తురుష్కములో విద్యాలయములను, వైద్యశాలలను ఇతరజాతులకన్న నెక్కుడుగ స్థాపించియున్నారు.

ఇతర యూరపుజాతులకును తురుష్కములో పెట్టుబడి, వ్యాపారము, హక్కులు గలవు.

తురుష్కములో విదేశీయు లెన్నియో బ్యాంకులు స్థాపించియున్నారు. అవన్నియు విదేశీయుల వర్తక వ్యాపారాభివృద్ధికే వినియోగపడుచున్నవి. తురుష్కులక్రింద చెప్పదగిన బ్యాంకులు రెండే గలవు. ఒకటి వ్యవసాయ బ్యాంకి. రెండవది నేషనల్ అట్టోమాను బ్యాంకి.

## (4)

## ప్రత్యేకహక్కులు

ఇంతకన్న తురుష్కము నధోగతికితెచ్చినవి తురుష్కములో కాపుర ముండునట్టియు, లేక వ్యాపారముచేయునట్టియు, విదేశస్థులకు న్యాయవిచారణ, కోర్టులు, పన్నులు, వర్తకము మొదలగువాని సంబంధమగు ప్రత్యేక హక్కులను (Capitulations) కలుగచేయుచు చేసిన యొడంబడికలు. ఈ హక్కులు ప్రథమమున ఫ్రెంచివారి కివ్వబడెను. తరువాత మిగత దేశీయు లొకరితరువాత నొకరు పొందిరి. మొదట నివి సుల్తానుల కర్జీలిచ్చి సంపాదించిరి. తరువాత భయపెట్టి పొందిరి. ఈ యొడంబడికలేమియు, అందుకుసంబంధించిన విదేశప్రభుత్వమువారియనుమతి లేనిదే సుల్తానులు మార్పుదలచేయగూడదనియు, రద్దుచేయగూడదనియు 1878 సంవత్సరమున

యూరపుప్రభుత్వములకును సుల్తానులకును జరిగిన బర్లిక్సాసంధిలో వ్రాసి కొనినారు. విదేశీయులుపొందిన హక్కులు ముఖ్యముగ మూడువిధములుగ నుండెను.

(1) న్యాయవిచారణ. (2) వర్తకము. (3) పన్నులు.

## న్యాయవిచారణహక్కులు

న్యాయవిచారణసందర్భమున విదేశీయులు తురుష్కదేశములో తమ స్వతంత్రకోర్టులను న్యాయవిచారణాధికారులను న్యాయవిచారణాపద్ధతులను స్థాపించుకొనిరి. తమదేశచట్టములకు మాత్రమే లోబడిరి. తురుష్కదేశ చట్టములకు కోర్టులకు న్యాయవిచారణాధికారులకు వీరిమీద అధికారము లేదు. ఇద్దరు వివిధదేశములకుచెందినవారిమధ్య తగాదాలుకలిగినపుడు ప్రతి వాదియొక్క కోర్టులో విచారణజరిగి తీర్పుచెప్పబడును. తురుష్కులమధ్యను విదేశీయులమధ్యను తగాదాలు కలిగినపుడు ముగ్గురు తురుష్కన్యాయాధికారులును, ఇద్దరు విదేశన్యాయాధికారులును, విదేశరాయబారియొక్క ప్రతినిధియు కలిసి యొకకోర్టుగా నేర్పడి విచారించి తీర్పుచెప్పెదరు. గాని యీ తీర్పు విదేశప్రభుత్వపు రాయబారికి పోవలెను. ఆయన అంగీకరించినటుల సంతకముచేయవలెను. అటుల సంతకముచేయుటకు ఆయన నిరాకరించినయెడల ఆ తీర్పు చెల్లనేరదు. విదేశీయుడెవడైన నొక తురుష్కదేశీయుని హత్య గావించినను ఘాతకలుగచేసినను ఆతనిపై విదేశరాయబారివద్ద ఫిర్యాదు చేయవలసినదేగాని, తురుష్కపోలీసుకుగాని, కోర్టుకుగాని ఎట్టిఅధికారము లేదు. ఇందువలన పాశ్చాత్యులఆధిక్యత, అహంభావము బాగుగ స్థాపిత మయ్యెను.

## వర్తకహక్కులు

వర్తకవిషయమున విదేశీయుల కేర్పడిన హక్కు లింతకన్న ఎక్కువవి. ఏ విదేశ వర్తకసంఘమైనను, తురుష్కప్రభుత్వముయొక్క అనుమతి లేకనే తురుష్కప్రభుత్వమునకు తెలుపకుండగనే తురుష్కములో నెచటనైనను స్థాపించుకొనవచ్చును. ఇటులనే విదేశబ్యాంకీలు, వ్యాపారగృహములు, వర్తకప్రతిష్ఠాపనలు, స్వేచ్ఛగ తమంతట నవి స్థాపించుకొన

వచ్చును. ఈ విదేశవ్యాపారప్రతిష్ఠాపనలు తమతమ దేశములయొక్క చట్టములకే లోబడియున్నవిగాని, తురుష్కచట్టములకు లోబడిలేవు. ఈ వ్యాపారనిర్వహణమునకై తురుష్కప్రభుత్వముయొక్క సమ్మతిలేకుండగనే విదేశీయులు తమపోస్టాఫీసులను తురుష్కసామ్రాజ్యమంతటను స్థాపించుకొనిరి.

## పన్నులు చెల్లించనక్కరలేదు

పన్నులవిషయమునగూడ విదేశస్థులు తురుష్కులకన్న చాల నెక్కుడు సౌకర్యముల ననుభవించిరి. మొదట యొడంబడిక జరిగినపుడే తురుష్కదేశమునకు విదేశీయులు ఎగుమతి దిగుమతిచేయు సరకులపై నూటికింతయని పన్నులుచెల్లించునముల నిర్ధారణకాబడెను. అవి సాధారణముగ నూటికి అయిదువంతున నున్నవి. అంతకన్న ఎక్కువ పన్నువేయుటకు తురుష్కప్రభుత్వమునకు హక్కులేదు. మరి యే యితరపన్నులును ఈ విదేశీయులు తురుష్కప్రభుత్వమునకు చెల్లింపనక్కరలేదు. వారు నివసించుగృహములమీద పన్నులివ్వనక్కరలేదు. మ్యునిసిపలుపన్నులు చెల్లింపనక్కరలేదు. మోటారుకారులమీదను బస్సులమీదను పన్నులను చెల్లింపనక్కరలేదు. వారిసరకులు దేశములోని వివిధభాగములలోనికి రవానాయగునపుడు శాయరుపన్నులు, గేట్లపన్నులు చెల్లింపనక్కరలేదు. రోడ్లపన్ను, యిణాకంటాకప్పు చెల్లింపనక్కరలేదు. పన్నులబాధయంతయు తురుష్కులమీద పడెను. ఇతర పన్నులేవియు నివ్వక తురుష్కప్రభుత్వోద్యోగస్థులు నిస్సహాయులై చూచుచుండగ, వారినిలక్ష్యపెట్టక, తమ దేశరాయబారులయొక్క ప్రత్యేకసంరక్షణను పొందుచు, ఎప్పుడో తాతలనాడు ఏర్పడిన స్వల్ప ఎగుమతి దిగుమతి పన్నులనుమాత్రము చెల్లించుచు, విదేశవర్తకులు తమ చిత్తమువచ్చినచోట్ల నెల్ల గిడ్డంగులేర్పరుచుకొని, తమ సరుకులతో తురుష్కసామ్రాజ్యమునంతను నింపివేసిరి. ఈ విదేశసరకులవ్యాపకముతో దేశములోని స్వదేశీ చేతిపనులు, గృహపరిశ్రమలు నశించినవి. దీని కెట్టి ప్రతీకారము నల్పుటకును, ప్రతిబంధకములు కలిగించుటకును సుల్తాను యొడంబడికలచే బంధించుకొని నిస్సహాయుడై యుండెను.

## లాసేనుసంధివలన ప్రత్యేకహక్కులన్నియు రద్దుపడినవి

1923 సంవత్సరమున జరిగిన లాసేనుసంధిలో విదేశీయుల ప్రత్యేక హక్కులన్నియు (Capitulations) రద్దుపరచబడినవి. అప్పటినుండియు విదేశీయుల పోస్టాఫీసులు న్యాయస్థానములు నంతరించినవి, తురుష్కులతో తురుష్కములో నుండెడి విదేశీయులును తురుష్కచట్టముల క్రిందికిని, తురుష్క న్యాయస్థానములయధికారము క్రిందికిని పూర్తిగ వచ్చిరి. తురుష్క దేశములోనున్న ప్రజలందరిమీదను స్వదేశస్థులైనను, విదేశస్థులయినను అన్నివిధములగు పన్నులను తురుష్కప్రభుత్వము తన యిచ్చవచ్చినటుల వేయును. విదేశములకు రాకపోకలనుచేయు సరకులపైన ఎగుమతి దిగుమతి పన్నులు యిచ్చవచ్చినవిధమున తురుష్కదేశములోని పరిశ్రమాభివృద్ధి కనుకూలముగ తురుష్కపార్లమెంటు వేయగలదు, హెచ్చించగలదు. తగ్గించగలదు. విదేశవర్తకులు తురుష్కచట్టములప్రకారమే వర్తకసంఘములు బ్యాంకులు స్థాపించుకొనవలెను.

తురుష్కులపెట్టుబడి, తురుష్కులయాజమాన్యము నూటికి ఏబది యొక్కవంతులకు తక్కువగనున్నచో, వర్తకసంఘములు స్థాపించుటకు వీలులేదని తురుష్కప్రభుత్వము శాసించినది. గ్రీకుల ఏథెన్సుబ్యాంకి మూసి వేయబడినది. ఆంగ్లేయుల పరాసులదగు అట్టోమాన్‌బ్యాంకిపేరు మార్చు కొనవలసివచ్చినది. దానియొక్క డైరెక్టరు జనరల్ తురుష్కుడై యుండితీర వలెనని తురుష్కప్రభుత్వమువారు శాసించిరి. సైలీషియాలోనున్న ఫ్రెంచి బ్యాంకులు తీసివేయబడినవి. తురుష్కులబ్యాంకులకు ప్రభుత్వమువారును మంచి ప్రోత్సాహమిచ్చుచున్నారు. తురుష్కులదగు నేషనల్ అట్టోమాన్ బ్యాంకికి బ్యాంకీనోట్లనువేయు నధికారమునిచ్చిరి. వ్యవసాయబ్యాంకిని ప్రభుత్వమువారు తమక్రిందికి తీసికొనినారు.

## విదేశకంపెనీలకు నిరుత్సాహము

వీలయినపుడెల్ల వీలయినవిధములనెల్ల విదేశీయులపెట్టుబడిని, విదేశ వర్తకకంపెనీలను జాతీయప్రభుత్వమువారు నిరుత్సాహపరచుచున్నారు. ఇదివరకు పనిచేసికొనుటకు హక్కులనుపొందిన విదేశకంపెనీలకు గడువుతీర

గనే మరల హక్కు లిచ్చుటలేదు. వాటికి హక్కులుమాత్రముండి పని ప్రారంభింపకయుండినచో వాటిని రద్దుపరచియున్నారు.

(5)

## మతసంఘముల ప్రత్యేకహక్కులు

తురుష్క సామ్రాజ్యములో ప్రథమమునుండియు మహమ్మదీయులును, క్రైస్తవులును, యూదులును కాపురముండిరి. ఈ మతసంఘములలోని వివిధయంతర్భాగములకును మతస్వేచ్ఛయుండి వారివారిదేవాలయములను కట్టుకొని, వారివారి మతగురువులను కలిగి వారియిచ్ఛవచ్చినవిధమున యారాధనసల్పుటకు హక్కు కలిగియుండుటేగాక, తమతమ పీఠములయాధిపత్యమున కొన్ని స్వపరిపాలనాహక్కులుకూడ కలిగియుండిరి. 1453 సంవత్సరమున రెండవమహమ్మదు సుల్తాను చక్రవర్తి కాన్‌స్టాంటినోపిలును జయించినతరువాత తనరాజ్యములోని మహమ్మదీయులుకాని ప్రజలను వారివారి మతపీఠములక్రింద మతసంఘములుగ విభజించి, యా మతపీఠాధిపతుల కా సంఘములమీద మతసంబంధమైనట్టియు, రాజకీయమైనట్టియు నధికారములను కలుగజేసెను. విదేశీయులకు తమరాయబారులమూలమున మాత్రమే తురుష్క సుల్తానులతో సంబంధమున్నటుల, తురుష్క సామ్రాజ్య ప్రజలైన మతసంఘములకును తమ పీఠాధిపతులమూలముననే సుల్తానులతో సంబంధముండెడిది. తురుష్క ప్రభుత్వము మహమ్మదీయమతసిద్ధాంతములమీద నిర్మింపబడినదై యుండెను. ఖురానులోని శాసనములను మహమ్మదీయప్రజలపై అమలు జరిపెను. మహమ్మదీయులుకానివారి కా శాసనములెటుల వర్తించును? అందువలన మహమ్మదీయులుకానిప్రజలు తమ తమ పీఠాధిపతులక్రింద తమ మతశాసనములప్రకారము విద్య, వివాహము, వివాహవిచ్ఛేదము, వారసత్వము, దాయభాగము మొదలగు విషయములలో నడచునట్లు న్యాయవిచారణ పొందునట్లు తురుష్క ప్రభుత్వ మేర్పాటుచేసెను. ఇందువలన నీ మతసంఘములమీద వారి పీఠాధిపతులు మత సాంఘిక న్యాయవిచారణ అధికారములు కలిగి, చాల పలుకుబడిగలిగియుండిరి. ప్రతి మతసంఘమువారును వారి పాఠశాలలను పెట్టుకొనుచు వారిచట్టములననుస

రించుచు, వారి మతగురువులచే న్యాయవిచారణపొందుచువచ్చిరి. కొన్ని పన్ను లనుకూడ మతగురువులు వేసెదరు. వాటి నా ప్రజ లివ్వవలెను, ప్రభుత్వము వారు అందరిప్రజలమీద పన్నువేయుట, మతసంబంధములేనివ్యవహారము లన్నిటిలోను నధికారము చలాయించుట. దేశసంరక్షణచేయుట, శాంతిని కాపాడుట మొదలగుపనులు చేయుదురు. మత సాంఘికసంబంధములేని విషయములు మాత్రమే ప్రభుత్వన్యాయస్థానములలో విచారణకువచ్చును. ఈవిషయము మహమ్మదీయులకును వర్తించెను. ఏ చట్టమైనను ప్రభుత్వము చేసినపుడు తురుష్కమహమ్మదీయుల ప్రధానగురువగు షేకుల్ ఇస్లాము దానిని అంగీకరించవలెను. అనగ నది మహమ్మదీయమతమునకు వ్యతిరేకముగా లేదని ఒప్పుకోవలెను.

## ప్రత్యేకహక్కులవలన జాతీయభావము నశించుచున్నది

మతసంఘములకు ప్రత్యేకహక్కులనిచ్చుటవలన ప్రభుత్వమునందు కంటె ఎక్కువ భక్తి నీ సంఘములవారు తమగురువులకు చూపుచుండిరి. సుల్తానులదర్బారులు జరిగినపుడు వివిధమతసంఘముల ప్రధానమతగురువులు, తమ మతసంబంధమగుదుస్తులను ధరించి తమక్రిందనుండెడిసంఘములకు ప్రతినిధులుగ నా దర్బారులకు హాజరగుచుండిరి. ఈ పద్ధతివలన తురుష్కజాతీయభావము ప్రజలలో లేకుండబోయి ప్రత్యేక మతశాఖాభావమే గట్టిగ నిలచెను. నేను షయ్యాను; నేను సున్నీని; నేను రోమనుకాథలిక్కును; నేను ప్రొటెస్టాంటును; నేను ఆర్మీనియనును, నేను గ్రెగేరియనును, అని మాత్రమే ప్రతివాడును చెప్పునుగాని, మేము తురుష్కులమని వీరు చెప్పుట లేదు. ఈ మతగురువులు తమపలుకుబడిని దుర్వినియోగముచేసి తమ క్రింద నున్న మతస్థులను నితరమతస్థులపై పోట్లాటలకు పురిగొల్పుట తటస్థించినది. క్రైస్తవులలోని వివిధశాఖలలో పరస్పరపోరాటములు, క్రైస్తవులకును మహమ్మదీయులకును కలహములు, మహమ్మదీయులలో సున్నీలకును షయ్యాలకును కలహములు కలుగుట కీ మతగురువులప్రోత్సాహమే కారణము.

## ప్రత్యేకహక్కులు లానేనుసంధివలన రద్దుచేయబడినవి

తురుష్క-జాతీయవాదులు వివిధ మతసంఘములకుగల ప్రత్యేక హక్కు-లన్నియు జాతీయఐక్యతకును జాతీయప్రభుత్వాధికారమునకును వ్యతిరేకమని తలచి, యా ప్రత్యేకహక్కు-లన్నిటిని లానేనుసంధివలన రద్దుపరచిరి. తురుష్క-మహమ్మదీయ ప్రధానమతగురువగు 'షేకల్ ఇస్లాము' ఉద్యోగమును తీసివేసిరి. తురుష్క-ప్రజాస్వామ్యమునకు మతముతో గల సంబంధమును త్రెంచివైచిరి. అన్నిమతములకును సమాన గౌరవము గలదనియు ఎవరియిచ్ఛవచ్చినమతమును వా రవలంబింపవచ్చుననియు శాసించిరి. ఏ మత మవలంబించినను పౌరులకందరకును పౌరస్వత్వములు సమానముగ నుండును. అన్నియుద్యోగములకును అందరును అర్హులు. చట్టములయెదుట అందరును సమానులు. వివాహము, వారసత్వము, దాయభాగము మొదలగు ప్రత్యేక సాంఘికవిషయములలో గూడ తురుష్క-ప్రభుత్వన్యాయస్థానములకే విచారణాధికారము గలదు. ఈవిషయములన్నిటిలోను, మార్పులుచేయుటకు తురుష్క-ప్రజాప్రతినిధిసభ (గ్రాండ్ నేషనల్ ఎసెంబ్లీ)కి సంపూర్ణాధికారము గలదు. ప్రతిపౌరుడును తా నే మతము నవలంబించినను తురుష్క-ప్రజాస్వామ్యపౌరుడనని గర్వపడుచు, తురుష్కు-డనని పిలచుకొనుచు తా నెచట సంచరించినను తురుష్క-జాతీయపతాకము తన్ను సంరక్షించుననువిశ్వాసమును కలిగియున్నాడు.



# తురుష్క ప్రజాస్వాతంత్ర్యము

## 12 ఖిలాఫతును రద్దుపరచుట

### (1)

### ఖిలాఫతును రద్దుపరచుట

1922 వ సంవత్సరము నవంబరు 19 వ తేదీన సుల్తానుపదవినుండి ఖిలాఫతును వేరుచేసి, సుల్తానుపదవిని అసలే రద్దుపరచి, ఖిలాఫతుపదవికి అట్టోమానురాజవంశమునకుచెందిన అబ్దుల్ మజీదు ఎఫ్ఫెండి యనునాయనను తురుష్కపార్లమెంటు నియమించెనని పైన చెప్పియున్నాము. అందువలన ఖిలాఫతుకుగల రాజ్యచిహ్నములన్నియు పోయి, న్యాయవిచారణాధికారము తీసివేయబడి, కేవలము శృంగేరి శంకరాచార్యులు, పోపు, ఆర్చిబిషప్ ఆఫ్ కేంటరుబరీలవలె ఖిలాఫతుకూడ కేవలము మతపీఠముగ చేయబడెను. గాని చరిత్రలో ఖిలాఫతెప్పుడును రాజ్యాధికారముతో సంబంధించియుండెను. ఖిలాఫతు మహమ్మదీయమతమును రాజ్యాధికారముతోడను అవసరమైనచో యుద్ధములమూలముగను సంరక్షించుటకు ఏర్పడిన ప్రతిష్ఠాపన యని మహమ్మదీయులనమ్మకమైయుండెను. అంతేగాని, ధర్మశాస్త్రముల యర్థమును విశదీకరించి మతబోధను వ్యాపింపజేయుపీఠము కాదు. మరల నికముందు ఖిలాఫతుపీఠాధిపతి సమయముదొరకినపుడు రాజ్యాధికారమును పొందుట కెప్పటికైన ప్రయత్నించి రాజరికమును పునరుద్ధరించుట కవకాశము గలదు. ఆయన పూర్వపు రాజవంశమునకు జెందినవాడు. రాజవంశప్రతిష్ఠ ఆయనయందు మూర్తీభవించియున్నది. ఆయనక్రిందనున్న మతగురువు లాయనపక్షమున ప్రజలను చేర్పవచ్చును. మతగురువులు ఖిలాఫతుయొక్క అండను చేరి, ప్రజలమీద తమ పలుకుబడిని దృఢపరచుకొనుటకు

ప్రయత్నించుచుందురు. మరియు ప్రభుత్వ బొక్కసములోనుండి ఖిలాఫతు పదవి నధిష్ఠించువారికి సాలుకు యిరువదినాలుగు వేల సవరనులును, ఆయన కుమాళ్ళకును, కూతుళ్ళకును సాలుకు కొంతసొమ్మును, చనిపోయినతరువాత వితంతువులకు కొంతసొమ్మును ఉపకారవేతనములక్రింద ఖర్చుపెట్టుట ప్రజలకు లాభములేనిపనియనియు, అనవసర వ్యయమనియు చాలమంది తురుష్కపార్లమెంటుసభ్యులు తలచసాగిరి. ఈ అన్నికారణములచేతను 1924వ సంవత్సరము మార్చి 3వ తేదీన తురుష్కపార్లమెంటువారు ఖిలాఫతుపదవిని రద్దుపరచిరి. ఖిలాఫతుపదవిలోనున్న అబ్దుల్‌మజీదు ఎఫ్ఫెండీ తన కుటుంబముతోకూడ తురుష్కమును వదలి యూరపుఖండమునకు లేచిపోయెను. అబ్దుల్ మజీదు ఎఫ్ఫెండీ మిగుల యోగ్యుడే; జాతీయభావములుగలవాడే; గాని ఖిలాఫతుపీఠము నిలిచియుండుట తురుష్కసంపూర్ణ ప్రజాస్వామికమునకు అపాయకరమని యెంచి జాతీయవాదులు ఖిలాఫతును రద్దుపరచి, ఎఫ్ఫెండీ ఖలీఫాను వెళ్ళగొట్టిరి. దేశప్రభుత్వమంతయు కేవలము జాతీయప్రభుత్వమయినపుడు, మతపీఠాధిపతిని ప్రభుత్వమువారు పోషించుచుండుటవలన, నాయన మతముపేర ప్రభుత్వముపై కుట్రలుచేయుటకును, ప్రభుత్వమువారుచేయు సంస్కరణల కడ్డుతగులుటకును అవకాశముకలుగునేకాని, యంతకన్న నాయనవలన ప్రయోజనమేమియు నుండదు. తురుష్కసున్నీల మతగురువగు షేకుల్ యిస్లాముపదవినిగూడ తురుష్కపార్లమెంటువారు రద్దుపరచిరని పైన చెప్పియున్నాము. అమెరికా సంయుక్త రాష్ట్రములు ఆంగ్లేయసామ్రాజ్యమునుండి విడిపోయి స్వతంత్రమైన ప్రజాస్వామికమైనపుడు, మతమునకును ప్రభుత్వమునకును ఎట్టి సంబంధము లేదని రాజ్యాంగవిధానములో నిర్ణయించుకొనిరి. అచట ప్రభుత్వమే మతమును పోషింపదు. ఏ మతమును నిషేధింపదు. అటులనే తురుష్కజాతీయవాదులును గావింప నిశ్చయించుకొనిరి.

## (2)

## ఖిలాఫతుచరిత్ర

మహమ్మదీయమతస్థాపకులగు మహమ్మదు ప్రవక్త క్రీ॥ శ॥ 570 వ సంవత్సరమున మక్కాలోని యొక మిగుల పలుకుబడిగలిగిన తెగకు

నాయకులైన కుటుంబములో జన్మించెను. ఏకేశ్వరోపాసనమతమును బోధించెను. కాని శత్రువులెక్కువై ఆయనయనుచరులను హింసించ సాగిరి. ఆయనను చంపుటకు పెక్కుసార్లు యత్నించిరి. కావున తన యను చరులను యుద్ధభటులుగ తయారుచేసెను. అరేబియాదేశమంతయు క్రమ ముగ నీయనమతమును స్వీకరించెను. అరబ్బులు యుద్ధభటులుగ తయా రైరి. వీరి సహాయమున మహమ్మదు ప్రవక్త గొప్ప రాజ్యమును స్థాపించి చనిపోయెను. ఆ రాజ్యమున కాయన రాజు; న్యాయవిచారణకర్త; మత గురువునై యుండెను. ఆయన క్రీ. శ. 632వ సంవత్సరమున పరమపదిం చెను. ఆయనతరువాత వచ్చిన ఖలీఫాలగు (వారసులగు) 'అబూబకరు' 'ఉమరు' 'ఉస్మాను'లకాలమున మహమ్మదీయసామ్రాజ్యము విశేషముగ విస్తరించి రోమకసామ్రాజ్యమును విచ్ఛిన్నముచేసెను. ఈ ఖలీఫా లా సామ్రా జ్యమునకు చక్రవర్తులు, మతసంరక్షకులు, సర్వసేనాధిపతులు, న్యాయవిచా రణకర్తలునై, నిరంకుశాధికారము కలిగియుండిరి. గాని ఈ ఖలీఫాలు దైవభక్తిపరాయణులై రాజ్యాధికారముమధ్య పేదలవలె యాడంబరరహిత మైనజీవితమునే కలిగియుండిరి. వీరితరువాత ఆలీని, ఆలీయొక్కకుమాళ్ళను చంపి, ఒమ్మయదుకుటుంబమువారు ఖలీఫాలైరి. అరేబియాసామ్రాజ్యము రెండువందలసంవత్సరము లుచ్ఛస్థితియం దుండెను. అటుతరువాత యీ సామ్రాజ్యప్రతిభ తగ్గిపోయి, అబ్బాసీదు రాజకుటుంబమువారిచే బాగ్దాదుపట్ట ణము రాజధానిగ స్థాపించబడిన మరియొక సామ్రాజ్యము విస్తరిల్లెను. బాగ్దాదునగరరాజము మెసపొటేమియాదేశమునందున్నది.

## బాగ్దాదువైభవము

బాగ్దాదు సామ్రాజ్యాధీశులే ఖిలాఫతునుకూడ కలిగి మహమ్మదీయ మతసంరక్షకులై, సర్వసేనాపతులై, న్యాయాధిపతులై నిరంకుశచక్రవర్తులై యుండిరి. బాగ్దాదుఖలీఫాలు గొప్ప విద్యాపోషకులై నాగరికతను, కళలను, ప్రకృతిశాస్త్రములను అభివృద్ధిచేసిరి. సంగీతము, సాహిత్యము, కవిత్వము వారి ప్రత్యేక యాదరణమునుపొందెను. కట్టడములనిర్మాణమునందును, శిల్ప చాతుర్యమునందును నూతన విధానములను నెలకొల్పిరి. ఫలపుష్పభరితమైన యుద్యానవనములు, అందమైన కట్టడములు, సుగంధ పరిమళద్రవ్యములు

హృదయాకర్షకమైన చిత్తరువులు, రంగురంగుల తివాసీలు మొదలగు భోగ పరాయణత్వము వారియాజమాన్యమున వెలసెను. ఇతరమతస్థులకు పూర్తిగ మతస్వేచ్ఛ యుండెను. బాగ్దాదునుండి నాగరికతను, ప్రకృతిశాస్త్రములను, కళలను, శిల్పవిధానములను యూరపుజాతులు నేర్చుకొనిరి. 1258 వ సంవత్సరమున మంగోలియాజాతికిచెందిన హూలగుచే బాగ్దాదు జయించబడి, దోచుకొనబడి ఖలీఫా చంపివేయబడెను.

## ఈజిప్టులోని ఖిలాఫతు

ఇందువలన ఖిలాఫతుపదవి రాజ్యాధికారమునకును, మహమ్మదీయ మతసంరక్షణకును, న్యాయవిచారణకును సంబంధములేకుండ నెన్నడును కేవలము మతపీఠముగ నుండలేదని స్పష్టమగుచున్నది. బాగ్దాదు పడిపోయిన తరువాత ఈజిప్టులోనిరాజులను వెళ్ళగొట్టి రాజ్యాధికారమునువహించిన మామ్లుకుబానిసవంశమువారుతమరాజ్యాధికారమునకు శాస్త్రీయమగుహక్కును కలుగజేసికొనుటకై అబ్బాసీదురాజుకుటుంబీకు నొకనిని (బాగ్దాదు ఖిలాఫతు వంశీకునొకనిని) ఈజిప్టుకు కొనిపోయి, ఆయనను రాజ్యమునకు ఖిలాఫతుకును పట్టాభిషిక్తునిజేసి రాజ్యాధికారమంతయు తామే చలాయించిరి. ఇందువలన బాగ్దాదునుండి ఖిలాఫతుపదవి ఈజిప్టునకు వచ్చినది. హిందూదేశములోని పీష్వాలవలె మామ్లుకు బానిసలు అబ్బాసీదురాజవంశముపేర పరిపాలించిరి.

## తురుష్కచక్రవర్తి ఖలీఫా

ఇంతలో 13 వ శతాబ్దము యొక్క ఆఖరుభాగమునుండియు అట్టోమాన్ రాజవంశమువారిక్రింద తురుష్కసామ్రాజ్యము ఆసియా, యూరపు, ఆఫ్రికా ఖండములలో అప్రతిహతముగ వ్యాపించెను. 1453 వ సంవత్సరమున కాన్‌స్టాంటినోపిలును తురుష్కసామ్రాజ్యాధీశుడగు మహమ్మదు సుల్తాను జయించెను. తురుష్కసామ్రాజ్యాధీశులు ఈజిప్టురాజులకంటె చాల బలాఢ్యులు. అప్పటికి ప్రపంచములోని మహమ్మదీయరాజ్యములన్నిటిలో తురుష్కసామ్రాజ్యము ప్రధానమైనదై యున్నది. గావున తురుష్కచక్రవర్తులుకూడ ఖిలాఫతుబిరుదమును తమంతటతామే వహించుచుండిరి. 1517వ

సంవత్సరమున తురుష్కచక్రవర్తి ఈజిప్టును జయించి అక్కడనున్న అబ్బాసీదువంశీకుడగు ఖలీఫాను కాన్‌స్టాంటినోపిలుకు గొనిపోయి అచట యుపకారవేతనమిచ్చి యుంచుకొనెను. అబ్బాసీదువంశీకునివలన ఖిలాఫతు పదవీసంక్రమణదస్తావేజును తురుష్కచక్రవర్తి వ్రాయించి పుచ్చుకొనలేదు. గాని అప్పటినుండియు తురుష్కసామ్రాజ్యచక్రవర్తులే ఎట్టి పోటీగాని, అడ్డు గాని లేకుండ ఖిలాఫతుబిరుదును వహించిరి. మహమ్మదీయప్రపంచమంతయు తురుష్కచక్రవర్తినే తమ ఖిలాఫతుగా చూచుకొనిరి. ఆయనక్రిందనే అరబు దేశములన్నియు, నందులోని మహమ్మదీయయాత్రాస్థలములన్నియు నుండుట వలన మహమ్మదీయమతమున కాయనే సంరక్షకుడని తలచబడెను. హిందూ దేశములో గొప్ప సామ్రాజ్యమును మొగలాయిచక్రవర్తులు స్థాపించినతరు వాత మొగలాయిచక్రవర్తులుకూడ ఖిలాఫతుబిరుదమును వహించినటులను, అందుకు తురుష్కచక్రవర్తులు ఆక్షేపించినటులను కనుపడుచున్నది. గాని హిందూదేశములోని మొగలాయిసామ్రాజ్యము 1707 నుండి విచ్ఛిన్నమై కొంతకాలమునకు మొగలాయిచక్రవర్తులవంశీకులు ఆంగ్లేయ ఈస్టిండియా కంపెనీవద్ద పింఛను పొంది 1858 వ సంవత్సరమున మొగలాయిసామ్రా జ్యము సొంతముగ క్రైస్తవమతస్థురాలగు ఆంగ్లేయరాణికి సంక్రమించినది. చైనాకు సమీపముననున్న యూనాన్, కన్సు, టారా, స్వతంత్రమహమ్మ దీయరాజ్యములు బౌద్ధమతస్థుడగు చైనాచక్రవర్తివలన జయించబడి, చైనా సామ్రాజ్యములో చేరిపోయెను. కాస్పియను సముద్రప్రాంతముననున్న మహమ్మదీయరాజ్యములు క్రైస్తవుడగు రష్యాచక్రవర్తిచే జయించబడెను. ఇటుల తక్కినవన్నియు పోగ, మిగిలిన మహమ్మదీయరాజ్యములు ఆఫ్ఘని స్థానము, పర్షియా, తురుష్కసామ్రాజ్యములు మాత్రమే అయ్యుండెను. వీటిలో మిగుల గొప్పదియు, పలుకుబడిగలదియు నగు తురుష్కసామ్రా జ్యమే ఖిలాఫతుకూడ నై యుండెను.

(3)

## జాతీయతత్వమునకును, ఖిలాఫతుకును పోరాటములు

ఖిలాఫతు ఎల్లప్పుడును రాజ్యాధికారముతో కలసివచ్చుచున్నప్పటికిని తన రాజ్యములోచేరని ప్రపంచములోని మహమ్మదీయులందరిమీదను ఖిలా

ఫతుమూలమున తనపలుకుబడిని విస్తరింపచేసికొనుటకు తురుష్క-చక్రవర్తి సుల్తాను అబ్దుల్ హమీదు బాగుగ ప్రయత్నించెను. ఆయన తురుష్క-పార్లమెంటుకు లోబడి నడచెదనని ప్రమాణముచేసిసంచున సింహాసనముమీద తురుష్క- యౌవనకక్షిచే 1876 వ సంవత్సరమున కూర్చుండబెట్టబడినవాడు. అపుడు యౌవన తురుష్క-కక్షికినాయకుడుగ నున్న మిద్ధతుపాషాచే తయారు చేయబడిన రాజ్యాంగవిధానమునందు సుల్తానునకు అధికారములేమియు లేకుండజేసి, యావత్తు రాజ్యాధికారము ప్రజలచే నెన్నుకొనబడిన పార్లమెంటుకు సంక్రమింపజేయబడినది.

## మతావేశమును పురిగొల్పుట

మతావేశమును పురిగొల్పెను. అట్టి రాజ్యాంగవిధానమున కొప్పుకొని ఆయన సింహాసనమెక్కెను. మిద్ధతుపాషా ప్రజలపక్షమున ప్రధానమంత్రి యయ్యెను. మరుసటిసంవత్సరమే సుల్తాను అబ్దుల్‌హమీదు తన ప్రధాన మంత్రిని యుద్యోగమునుండి తీసివేసి పార్లమెంటును రద్దుపరచి తురుష్క-యౌవనకక్షివారందరిని చెరసాలలకు పంపియు, దేశభ్రష్టులనుగావించియు అణచివైచి మరల తననిరంకుశత్వమును స్థాపించుకొనెను. మిద్ధతుపాషాను చెరసాలలోవేసెననియు, నచ్చటనే చంపించెననియు ముప్పదిసంవత్సరముల వరకు మరల పార్లమెంటును పిలువనేలేదనియు పైన చెప్పియున్నాము. ఈమధ్యకాలమందంతటను సుల్తాను అబ్దుల్‌హమీదు ఖిలాఫతుమూలమున తనపలుకుబడిని తన సామ్రాజ్యములోని మహమ్మదీయులలోనేగాక ప్రపంచములోని మహమ్మదీయులందరిలోను బాగుగ గట్టిపరచుకొనవలెనని ప్రయత్నించెను. తురుష్క-సామ్రాజ్యములో జాతీయభావములు మరల మరల తలయెత్తి ఆయనకు మిద్ధతుపాషాయొక్క-భూతము కనబడుచుండెను. తన నిరంకుశపురాజరికమునకు అపాయము ఎప్పటికప్పుడు కలుగవచ్చునని ఆయన భయపడుచుండెను. తమప్రక్క-నున్న పాశ్చాత్యదేశములన్నిటిలోను జాతీయ భావము తాండవమాడుచు రాజులను వెళ్ళగొట్టుట గాని లేక అధికారము లన్నియు తీసివేసి నామమాత్రావశిష్టులుగచేయుటగాని జరుగుచున్నది. ఇంగ్లాండులో మొదటి చార్లెసునకును, ఫ్రాన్సులో పదునారవలూయికిని పట్టినగతియే తనకును పట్టవచ్చును. గావున తన ముసల్మానుప్రజలలో జాతీయభావమును

అరిగట్టగలిగిన మరియొక విరుద్ధభావమును వ్యాపింపజేసినగాని, తన నిరంకు శపుఅధికారము నిలువదని ఆయన నిశ్చయించి ఖిలాఫతుభావమును బాగుగ బలపరచెను. అట్టోమాన్‌రాజవంశీకుడుగ తనకుగలుగు గౌరవముకంటె, అబుబకరు, 'ఉమర్, ఉస్మాన్, ఆలీల' సంతతివాడననియు, భగవంతునిచే నివ్వబడిన ఖురానుమతమునకు అధిపతిననియు సంరక్షకుడననియు చెప్పు కొనుటవలన తనకుగలుగు విధేయత నిరంకుశపుపలుకుబడి ఎక్కువగనుండు నని ఆయన నమ్మెను. 1877 మొదలు 1908 వ సంవత్సరమువరకును అబ్దులుహమీదు సుల్తాను ఖిలాఫతుమూలమున తన నిరంకుశత్వమును నిలుపు కొనగల్గెను. లోకములోని మహమ్మదీయులెందరును తన రాజ్యములోని యాత్రాస్థలములగు మక్కా, మదీనా, జరూసలేము మొదలగు పట్టణములకు యాత్రలుజేయుచుండిరి. మతమున కధిపతిగనున్న తన రాజధానియగు కాన్ స్టాంటినోపిలుకూడ యాత్రాస్థలములలో నొకటియయ్యెను. ప్రవక్త మహ మ్మదుయొక్క వారసగు ఖిలాఫతు సుల్తానుయొక్క దర్శనమైనచో ప్రవక్త మహమ్మదుదర్శనమయినటులే పుణ్యముగల్గునని యెంచిరి. "అబ్దులు హమీదు సుల్తాను చక్రవర్తి దైవాంశసంభూతుడు. ఆయనయొక్కరాజ్యాధికారము, వైభవము, దంభము శాశ్వతముగ నుండవలెను. ఇంతేగాదు, ఆయనఎక్కువ పరాక్రమవంతుడై ఖలీఫాలుచేసినటుల భగవంతునియనుగ్రహమువలన కాఫ రుల (ముసల్మాను కానివారి) దేశములను మరల జయించి, ప్రపంచములో మరల నొకగొప్ప మహమ్మదీయసామ్రాజ్యమును పునరుద్ధరించి, బాలచం ద్రునితో ప్రకాశించు జండాను లోకములో నెక్కడుచోట్ల ఎగురుచుండు నట్లు చేయవచ్చును. పాత మతగ్రంథములను వెదకి చూడుడు. మరల మహ మ్మదీయసామ్రాజ్యము లోకమునందంతటను స్థాపింపబడుదినము లెప్పుడు వచ్చునని వ్రాసియున్నదో; ప్రపంచమునందంతటను మన మహమ్మదీయ మతము వ్యాపించితీరవలెనని వ్రాసియున్నదో లేదో చూడుడు; లోకములో మహమ్మదీయమతమును సర్వత్ర వ్యాపింపజేయుటకు తురుష్కసామ్రాజ్యా ధీశుడుగాక మరెవరు?" ఇట్టిభావములను ఖిలాఫతుయందనుచేరిన మతగురు వులు తురుష్కముసల్మానులలోను, యితరముసల్మానులలోను వ్యాపింపజేసి **(Pan Islamic)** 'లోకములోని ముసల్మానులందరిలోను ఏకత్వము'

అను తత్వమును దృఢపరచుచున్నకొలదియు అబ్దులు హామీదు సుల్తాను యొక్క నిరంకుశత్వము అప్రతిహతముగ సాగుచుండెను. తురుష్క-యౌవన కక్షివారు జాతీయవాదులు. మతతత్వమగు ఖిలాఫతుతత్వముసరసను, వారి జాతీయతత్వమునకును విరుద్ధము. జాతీయతత్వము ప్రకారము రాజు దైవాంశ సంభూతుడు కాడు. ప్రజ లేర్పరచుకొనగ వచ్చినవాడు. ఏదేశమున నా దేశము స్వతంత్రముగ నుండవలెను. దేశములోనున్న అన్నిమతములును సమానగౌరవములు పొందవలెను. దేశములోని అందరును సమానులు, సోదరులు. అన్నిహక్కులకును అర్హులు. దేశములోని అన్నిమతములవారును ఐక్యతను సోదరభావమును కలిగి, తమదేశాభివృద్ధికొరకు సర్వశక్తులను వినియోగించవలెను.

## జాతీయవాదులత్యాగములు

ఇవి ప్రపంచములోని అన్నిదేశములలోని జాతీయవాదులయొక్క సిద్ధాంతము లయినట్టులనే తురుష్క-జాతీయవాదులయొక్కయు సిద్ధాంతములై యున్నవి. జాతీయవాదులైన యౌవనకక్షివారు లోకములోని యితరదేశముల మహమ్మదీయులతో నైక్యతనొందవలెనని యత్నించక, తురుష్కములో నున్న ముసల్మానులుగాని యితరమతస్థులగు కాపురస్థులతో నైక్యతను సోదరభావమును పొంది ప్రజాహితపాలనమును నెలకొల్పి, తమ రాజు యొక్క నిరంకుశత్వమంతయు పీకివేయవలెనని దృఢప్రయత్నములు జేయుచుండిరి. ఇటుల జాతీయవాదులకును, ఖిలాఫతు ఆయుధముగ గల సుల్తానునకును హోరాహోరి పోరాటము ముప్పదిరెండుసంవత్సరములు జరిగి, పెక్కుమంది దేశాభిమానులు మాతృదేశ స్వతంత్రపీఠముమీద తమ మాన ధన ప్రాణములను బలియిచ్చిరి.

## జాతీయవాదులజయములు

తుదకు 1908వ సంవత్సరమున జాతీయవాదులు ఖిలాఫతుకన్న బలవంతులై జాతీయసైన్యములు అబ్దులు హామీదు సుల్తానుయొక్క కోటను ముట్టడించి, అబ్దులు హామీదుచేత మరల 1876 వ సంవత్సర రాజ్యాంగ విధానమును ప్రతిష్ఠింపజేయించి నిరంకుశత్వమును నిర్మూలింపజేసిరి.

1909వసంవత్సరమున సమ్మగూడని అబ్దులు హమీదును రాజ్యభ్రష్టునిగావించి వెళ్ళగొట్టి పంచమ మహమ్మదు సుల్తానును సింహాసనముమీద గూర్చుండ బెట్టిరి. 1909 మొదలు 1922వ సంవత్సరమువరకు సుల్తానులు బలహీనులు గనే యుండిరి. 1922 సంవత్సరము నవంబరునెలలో ఆరవమహమ్మదు సుల్తాను దేశమువిడిచి పారిపోవుటయు, అంతటితో సుల్తానుపదవి అంతరిం చుటయు పైన చదివియున్నాము. జాతీయభావమున కషాయమైన ఖిలాఫతు పదవినుండి వేరుచేయుటకుగాని, రద్దుపరచుటకుగాని యావన తురుష్కకక్షి వారికి చిక్కులమధ్యను యుద్ధములమధ్యను ధైర్యములేకపోయినది. బాల్కాను యుద్ధము, ప్రపంచయుద్ధము వెంటవెంటనే వచ్చెను. ప్రపంచయుద్ధములో ఖిలాఫతుపలుకుబడిని వినియోగించి మహమ్మదీయప్రపంచమంతటిచే మిత్ర మండలివారిపై "జహాద్" మతయుద్ధము ప్రకటింపజేయ యత్నించి విఫల మనోరథులైరి. తమజయమునకు మహమ్మదీయులయొక్కగాని ఆసియా ఖండవాసులయొక్కగాని సానుభూతియుండిన యుండవచ్చునేగాని, యొక మతముపేర మతపీఠముక్రింద వివిధదేశములలోని యా మతస్థులందరును కలిసి పోరాడుదినములు చరిత్రలో కొన్ని శతాబ్దములక్రిందనే పోయినవి. ప్రొటెస్టెంటు క్రైస్తవులగు ఆంగ్లేయులు రోమనుకేథలిక్కులగు ఫ్రెంచి వారితోకలసి తమతోటి ప్రొటెస్టెంటులగు జర్మనులతో పోరాటము సలుపు చున్నప్పుడు, తురుష్కమహమ్మదీయులును హిందూదేశమహమ్మదీయులును మొరాకో మహమ్మదీయులును కలసి రోమనుకేథలిక్కులతోనో, ప్రొటె స్టెంటులతోనో ఎటుల పోరాడెదరు? ఇది అసంభవము. ప్రపంచము చాల ముందుకు పోయినది. ఇది జాతీయతాయుగము(**Age of Nationalism**) మతయుగము పోయి చాలకాలమయినది.

## (4)

## అభివృద్ధికి మతగురువు లడ్డము

కావున సంపూర్ణప్రజాస్వామికమును స్థిరముగ నిలుచునటుల చేయు టకేగాక, దేశములోని సమస్త మతసంఘములకును స్త్రీలకును పురుషుల కును స్వతంత్రముకలుగచేయుటకును, అభివృద్ధికవసరమైనకార్యములు చేయు టలో మతమనుపేర మతగురువు లడ్డురాకుండుటకును, ఖిలాఫతును షేకుల్

ఇస్లాముపదవిని రద్దుపరచి మతగురువుల ప్రతిభను పలుకుబడిని నాశనము చేయుట అత్యవసరమని తురుష్కజాతీయవాదులు తలచిరి. అన్నిపోరాటములు జయప్రదముగ ముగిసి, దేశము స్వతంత్రమునుపొంది, దేశములో తమపలుకుబడి దృఢముగ స్థాపింపబడినపిమ్మట నీ గొప్ప మతసంస్కరణములకు బూనుకొనిరి.

## అట్టోమాన్ రాజకుటుంబమువారు తురుష్కమును వదలిపోయిరి

1924 వ సంవత్సరము మార్చినెల ఒకటవతేదీన తురుష్కపార్లమెంటు సమావేశముకాగానే ఖిలాఫతుకు అధికారమేమియు లేకుండ చేయబడినది గావున, ఖిలాఫతుపదవిని రద్దుపరచుట యుక్తమని అధ్యక్షుడగు ముస్తఫా కెమాలు పాషా చెప్పెను. అందుమీద పార్లమెంటువారు ఖిలాఫతుపదవిని రద్దుపరచినామనియు, ఖలీఫాగానున్న అబ్దుల్‌మజీదు ఎఫ్ఫెండికిగల హోదాను తీసివేసినామనియు తీర్మానించిరి. మార్చి నాల్గవతేదీన ఖిలాఫతుపదవినుండి తొలగింపబడిన అబ్దుల్ మజీదు ఎఫ్ఫెండీ తనకుటుంబముతోను, నౌకర్లతోను తురుష్కమును వదలిపోయెను. తరువాత రెండుదినములకు అట్టోమాన్ రాజకుటుంబమునకుజెందిన తక్కిన రాజకుమారులును రాజకుమార్తెలును, రాజబంధువులును, సింప్లను ఓరియంటు ఎక్స్ప్రెస్ స్టీమరులో బయలుదేరి యూరపుఖండమునకు వెళ్ళిరి. తమ రాజ్యములను పోగొట్టుకొని యూరపుఖండములో నివసించుచున్న చక్రవర్తుల, రాజుల, రాజకుమారుల, రాజకుమార్తెలసంఖ్యను వీరును వృద్ధిచేసిరి. ఇంతటితో అట్టోమాన్ రాజకుటుంబము పేరునకైనలేకుండ తురుష్కమును విడిచిపోయినది.

## అట్టోమాన్ పేరు తీసివేయబడినది

తురుష్కప్రజాస్వామికనాయకులు 'అట్టోమాన్' అనుపేరును తీసివేసిరి. "అట్టోమాన్‌సామ్రాజ్యము మరణించినది. తురుష్కదేశము శాశ్వతముగ వర్ధిల్లుగాక" అని వారు చెప్పుచున్నారు. అట్టోమాన్‌సామ్రాజ్య శవము

యొక్క బూడిదలోనుండి నవయవ్వనోత్సాహశోభితమగు తురుష్కప్రజా స్వామికము జనించినది.

## హిందూదేశ ముసల్మానులు

హిందూదేశ ముసల్మానులగు హిజ్‌హైనెస్ అగాఖాన్, రైటు ఆనర బుల్ అమీరుఅలీగార్లు ఖిలాఫతుయొక్క పలుకుబడిని తగ్గించకూడదనియు, హిందూదేశమహమ్మదీయులు ఖిలాఫతుయొక్క క్షేమమును కోరుచున్నారనియు, తురుష్కప్రధానమంత్రి ఇజ్మత్‌పాషాకు వ్రాయుటయేగాక, కాన్‌స్టాంటినోపిలులోని ప్రధానపత్రికల కా లేఖయొక్క ప్రతులను బంపిరి. ముగ్గురు పత్రికాధిపతు లా లేఖను ప్రచురించి ఖిలాఫతుపక్షమున వ్యాసములను వ్రాసిరి. ఖిలాఫతుపక్షము నవలంబించుట ప్రజాస్వామికమునకు ద్రోహముగావించుటయని యా పత్రికలను తురుష్కప్రభుత్వము వెంటనే యణచివైచెను.

## మదరసాలను మూసివేయుట

ఖిలాఫతును రద్దుపరచినతరువాత చిరకాలమునుండియు ప్రభుత్వము వారిచే పోషింపబడుచుండిన మహమ్మదీయ మదరసాలను (మతగురువుల స్థానములను) జాతీయప్రభుత్వమువారు మూసివైచి వాటియొక్క మిగుల విలువగలయాస్తులన్నిటిని తీసికొనిరి. ఫకీరుప్రతిష్ఠాపనలన్నియు రద్దుపరచి వాటిఆస్తులనుగూడ ప్రభుత్వమువారు తీసికొనిరి. ఆ భవనములన్నిటిలోను ప్రభుత్వపాఠశాలలను తెరచిరి. మతగురువులకు హోజాలని పేరు. హోజాల క్రిందను ఫకీరులక్రిందను ప్రభుత్వముయొక్క మూడవవంతుఆస్తి యుండెను. రంగుగుడ్డ తగిలించుకున్న ప్రతివాడును హోజా యగుచుండెను. చదువుసంధ్యలు యోగ్యప్రవర్తన యక్కరలేదు. వారు మదరసాలలో విద్యార్థులకు మతముపేర మౌఢ్యమును నేర్పుచుండిరి. అర్థముతెలియకుండ ప్రార్థనలను వల్లించుచు విద్యార్థులచే వల్లింపజేయుచుండిరి. చాలమంది ఫకీరులు మహత్యములు కనపరచుచు, కత్తులను అగ్నిని మ్రింగుచు, తాయత్తులను విభూతిని రక్షరేకులను కట్టుచు ప్రజలనుమోసగించి ద్రవ్యార్జనముచేయుచుండిరి. ఆ ద్రవ్యమును చాలవరకు త్రాగుడుకును చాలమందిభార్యలను పోషిం

చూటకును ఖర్చుపెట్టుచుండిరి. మఠప్రతిష్ఠాపనలన్నియు నీ హోజాలతోను ఫకీరులతోను నిండియుండెను. గావున జాతీయప్రభుత్వ మీ ప్రతిష్ఠాపన లన్నిటిని తీసికొని ప్రజలవిద్యాభివృద్ధికి వినియోగించసాగిరి.

## మతకళాశాల

మదరసాలను మూసివైచినతరువాత సర్వకళాశాలలోభాగముగ నొక మతకళాశాలను జాతీయప్రభుత్వమువారు స్థాపించియున్నారు. అచట చదివి పరీక్షలలో నుత్తీర్ణులైనవారుగాని మతమును బోధించగూడదనియు, మత గురువుయొక్క రంగుగుడ్డలను ధరించగూడదనియు శాసించియున్నారు.

## ప్రభుత్వపాఠశాలలలో మతమునునేర్పరు

చిరకాలమునుండియు దేశములో ముస్లిముపిల్లలకందరికిని ప్రభుత్వ పోషణక్రింద మతపాఠశాలలుండి యచట ఖురానును అరబ్బీభాషను నేర్పు చుండిరి. వాటినన్నిటిని 1924వ సంవత్సరము మార్చి 3 వ తేదీన ప్రభుత్వ విద్యామంత్రి మూసివేయించి వాటిఆస్తులను ప్రభుత్వములో కలుపుకొనెను. వాటిస్థానమున ప్రభుత్వమువా రెక్కువ ప్రాథమికపాఠశాలలను నెలకొలిపి, దేశములోని ప్రతిబాలుడును. బాలికయును ఏడు సంవత్సరములవయసు మొదలు పదునారుసంవత్సరముల ఈడువరకును నుచితముగ ప్రాథమికవిద్య నభ్యసించితీరవలెనని శాసనముచేసిరి. ప్రభుత్వపాఠశాలలలో మతవిద్య గరపరు. మతసంఘములు తమస్వంతఖర్చుమీద పెట్టుకొనుపాఠశాలలలో మతవిద్య నేర్పుకొనవచ్చును. ప్రభుత్వపాఠశాలలలో విద్యార్థులకు నీతి, దేశ భక్తి, ప్రజాప్రభుత్వముయొక్క యుత్కృష్టత,ప్రజలహక్కులు, అన్నిసంఘ ములమధ్య సోదరత్వము మతమునకు బదులు చెప్పబడుచున్నవి. అరబ్బీ పారసీభాషలను నేర్పుట మాని, విద్య తురుష్కభాషలో నివ్వబడుచున్నది.

## ఆదివారమునాడు శెలవు

ఖిలాఫతుకుసంబంధించిన రాజనగరునందున్న మహమ్మదుప్రవక్త యొక్కదుస్తులను చిత్రప్రదర్శనశాలయందు ప్రదర్శనమునకై యుంచిరి. సుల్తానుల రాజనగరులన్నియు నూతనప్రభుత్వముచే తీసికొనబడి జాతీయ పనులనిమిత్త ముపయోగపర్చబడుచున్నవి. శుక్రవారమునాడు కచ్చేరీలకు

తెలవిచ్చుట మాని ప్రపంచములోని మిగతదేశములవలెనే ఆదివారమునాడు ప్రభుత్వపుఆఫీసులన్నియు మూసివేయబడుచున్నవి.

## ఖురాను తురుష్క భాషలోనికి మార్చబడినది

ఖురాను అనేక భాషలలోకి తర్జుమా యయినది. తురుష్క భాషలోకి తర్జుమాగాకుండ చిరకాలమునుండియు మతగురువులగు హోజాలు అడ్డు తగిలినారు. వారు అరబ్బీలోని ఖురానును అర్థముతెలియకుండ వల్లించి వప్పగింతురు. ముస్తఫా కెమాల్‌పాషా కొందరు ప్రధాన మతగురువులను పిలిచి ఖురానును తురుష్క భాషలోనికి మార్చవలసినదని కోరగ, ఖురానులోని చాల వాక్యములు తురుష్క భాషలోనికి మార్చుటకు వీలులేదని చెప్పిరి. అటు లయినచో ప్రజల కర్థముగానివాక్యములు అసలే వదలివేసి మిగతాదానినే తర్జుమాచేయవలసియుండునని ఆయన చెప్పెను. తరువాత కలనల్ జమీలుబే యను పండితుడు ఖురానును పూర్తిగా తర్జుమాచేసి ముస్తఫా కెమాల్ పాషాకు బంపెను. 1932 వ సంవత్సరమునుండియు తురుష్క దేశములోని అన్ని మసీదులలోను తురుష్క భాషలోనే ఖురానును చదువుచున్నారు.



# తురుష్క ప్రజాస్వామికము

## 13 స్త్రీస్వాతంత్ర్యము

( )

### ప్రధానసంస్కరణము

ముస్తఫా కెమాల్‌పాషా గావించిన గొప్ప సంస్కరణములలో స్త్రీలకు జనానాజీవితమునుండియు, బురఖాలనుండియు సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగ చేసి స్త్రీలకు సర్వతోముఖమైనఅభివృద్ధిని కలుగచేయుట ప్రధానమైయున్నది.

"తురుష్క ప్రజాస్వామికపు అధ్యక్షుడగు ముస్తఫా కెమాల్‌పాషా యొక్క భావ్యదృష్టి మేమిగానున్నదోగాని, ఆయననామము చరిత్రలో స్థిరముగ నిలచినది. రాబోవుతరములవా రాయనకు ఘాజీ (శూరుడు) అను బిరుదమును కలుగచేసిన జయములకును ఆయనసృష్టించిన నూతన తురుష్కమునకును; శోభాయమానమైన పరిపాలనమునకును గౌరవమును చూపెదరు. గాని ప్రాగ్దేశపాలకులందరిలోను ఆయన కుత్తమస్థానమును కలుగచేయుచున్నది ఆయన స్త్రీలకు స్వాతంత్ర్యమును ప్రసాదించుటే. ఈ యద్భుత సంస్కరణము ప్రాగ్దేశములన్నిటిలోను ప్రతిధ్వనించుచున్నది. ఇప్పటికే సిరియా, పాలస్తైన్, భరతవర్షము, చైనాదేశములలో ముఖ్యముగ స్త్రీలచే నాయననామము గౌరవాశ్చర్యములతో వాడబడుచున్నది.

* * * *

తురుష్కచరిత్రయొక్క మిగుల అంధకారమైన కాలములోగూడ ఈ జాతిలో నాకుగల విశ్వాసము నశించలేదు. తురుష్కములో జనానాలకు బదులు గృహముల నిచ్చుటకు మనోదార్ఢ్యముగల పురుషు డుద్భవించినచో నా దేశము ప్రపంచములోని గొప్పదేశములలో నర్హస్థానమును పొందగలుగునని నాకు బాగుగ తెలియును.

అట్టిపురుషు డుద్భవించినాడు.

* * * *

1922 వ సంవత్సరపు శరదృతువునందు అంగోరాను మిగిలిన తురుష్కముమండి ఈ తెలు, కత్తులు వేసుకచిన దినములలో వాటిమధ్యగుండ అంగోరాకు పోగలిగిన ఆంగ్లస్త్రీ నే నొక్కతెనే.

యుద్ధజయముయొక్కయు లాసేనుసంధియొక్కయు ఫలిత మేమగునోయని యాతురతతో నిరీక్షించుచున్న ఆ క్లిష్టమైనదినములలో అంగోరా లోనివారు సోదరులవలె నివసించియుండిరి. అప్పుడు జాతీయఎస్సెంబ్లీకి అధ్యక్షుడుగమాత్ర ముండిన ఘాజీ ముస్తఫా కెమాల్‌పాషాకు కాఫీత్రాగు సమయమున తనతో చాలసేపు మాటలాడుట కవకాశమును కలుగచేయుటకు వీలుగనుండెడిది. అట్టి యొకసమయమున తురుష్కదేశపు స్త్రీలను గూర్చియు, ఘోషాజీవితమువలన వారిమనోవికాసమునకు కలిగిన నష్టమును గూర్చియు నాయన నాతో మాటలాడుచు "ఈ యున్మాదము యావత్తు పోవలెను. తురుష్క ముత్తమమైన ప్రజారాజ్యమును నిర్మాణముగావింపబోవుచున్నది. దేశముయొక్కసగభాగము దాస్యములో నుండగ నుత్తమమైన ప్రజారాజ్యమును స్థాపించుటెట్లు? ఇప్పటినుండి రెండుసంవత్సరములలో నీ వ్యర్థమగు నిరంకుశత్వమునుండి ప్రతిస్త్రీయు స్వతంత్రమును పొందితీరవలయును. ప్రతి స్త్రీయు బురఖాను తీసివేయవలెను. స్త్రీయొక్కసహాయము అత్యవసరమై యున్నది. దేశముయొక్కభారములో తనవంతును నిర్వర్తించుట కొరకామెకు సంపూర్ణమగుస్వేచ్ఛ యుండవలెను" అని నాతో చెప్పెను.

ఈ ధైర్యమైన భావిసూచనను నేను పత్రికలలో వ్యాసరూపముననను 'అంగోరాలోని యొక ఆంగ్లేయ స్త్రీ' అను నా గ్రంథమందును ప్రకటించితిని. నా గ్రంథమును విమర్శించినవారెవరును ముస్తఫా కెమాల్‌పాషా చేసిన యీ ప్రకటనమును గుర్తించియుండలేదు. ఎందుకనగ, నెవరును ఇట్టి సాంఘికవిప్లవము జరుపబడగలదని నమ్మియుండలేదు.

జనానాలనుగూర్చియు తురుష్కగృహములలోని జీవితమును గూర్చియు, స్త్రీలవిషయమున మహమ్మదీయమతమునందుగల మౌఢ్యమును గూర్చియు తెలిసినవారందరకును ఆయనయభిప్రాయము పసిపిల్లవాని సందర్భములేని యూహలవలె కనపడెను. ఈ సంభాషణ జరిగిన రెండుసంవత్స

రములకు అధ్యక్షుడు చెప్పినదంతయు జరిగినది. స్త్రీలు స్వతంత్రమును పొందినారు!

వారు చాలకాలమునుండి పోవుచున్న నిద్దురనుండి మేల్కాంచినారు" అని గ్రేసు ఎలిసన్ 'ఈదినమునన్నున్న తురుష్కము'నందు వ్రాసినది.

## (2)

## కఠినమగు ఘోషా

తురుష్కములోని మహమ్మదీయస్త్రీలు మిగుల కఠినమగు ఘోషాపద్ధతిని అవలంబించియుండిరి. ఘోషాపద్ధతి మహమ్మదీయదేశములన్నిటిలోను వ్యాపించియున్నది. హిందూదేశములో ప్రాచీనకాలమున ఘోషాపద్ధతి లేదు. హిందూవాఙ్మయమున పరమేశ్వరుడు అర్ధనారీశ్వరుడుగ వర్ణింపబడియున్నాడు. స్త్రీ పురుషునితో సర్వవిధముల సమానమగుస్థానమును పొందియుండెను. వేదమంత్రములను రచించినవారిలో స్త్రీలుగూడ గలరు. వేదకాలమున స్త్రీలకు వివాహ మైచ్ఛికముగ నుండెను. యుక్తవయసువచ్చిన స్త్రీలు తగినభర్తలను వరించుచుండిరి. వితంతువులకు వివాహమాడు హక్కుండెను. కూతుళ్ళకు కుమాళ్ళతోబాటు ఆస్తిలో భాగముండెను. స్త్రీలు ఘోషాయనునది యెరుగరు. స్త్రీలు మిగుల గౌరవముగ చూడబడుచుండిరి. "నీవు నాకు స్నేహితురాలవుగ నుండుము. నీవు నాకు స్నేహితురాల వయినావు. మనస్నేహము శాశ్వతముగ నుండుగాక" అనియు "నా గృహమునకు వచ్చి, నా గృహమునకు రాణివిగమ్ము. నా గృహముపై యాజమాన్యమునువహించి యజ్ఞకర్మలను చేయించుము" అని భర్త భార్యనుద్దేశించి చెప్పినటులనున్న ఋగ్వేదమంత్రములు గృహమునందు స్త్రీకిగల యుత్తమస్థానమును తెలుపుచున్నవి. స్త్రీలలో విద్య బాగుగ వ్యాపించియుండెను. యావజ్జీవము బ్రహ్మచారిణులుగనుండి యుత్కృష్టమగు జీవితములను గడిపిన స్త్రీలు పెక్కుమంది యుండిరి. జనకుని మహాసభయందు యాజ్ఞవల్క్యమహాఋషితో వేదాంతశాస్త్రముమీద వాదోపవాదములు సలిపిన గార్గి యను జ్ఞానసంపన్న అన్నికాలములవారికిని పూజ్యురాలు. వేదయుగము భరతవర్ష ఇతిహాసమునకు సువర్ణయుగము. తరువాతకాలములో స్త్రీలహక్కులు, స్త్రీలవిద్య, స్త్రీలస్థితి

కొంతవరకు క్షీణించినను, స్త్రీలను భగవంతునిసృష్టిలో స్వేచ్ఛగ నివసించ కుండ ఘోషాలోపెట్టి దాచియుంచుపద్ధతి,మహమ్మదీయరాజ్యమువచ్చువరకును భరతవర్ష మునందు లేదు. మహమ్మదీయరాజ్యము వ్యాపించినతరువాత హిందూ దేశములోని చాలప్రాంతములలో ఘోషాపద్ధతి యవలంబించబడుచువచ్చినది. ఉత్తరహిందూస్థానములోను దక్షిణహిందూదేశములోని కొన్ని స్వల్ప సంఖ్యాకులగు తెగలవారిలోను ఈ దురాచారము వ్యాపించియున్నది. ఘోషా పద్ధతియొక్క కీడులనుగూర్చి ఘోషాపద్ధతి సామాన్యముగలేని ఆంధ్రులకు తెలుపనవసరములేదు. ఘోషాపద్ధతి స్త్రీలకు శరీరదౌర్బల్యమును కలుగ చేయుననియు, మనోవికాసమును నరికట్టుననియు, విద్యాభివృద్ధి కవకాశము లేకుండచేయుననియు, కుటుంబజీవితమును మిగుల వ్యయకరముగ చేయు ననియు, స్త్రీలను మౌఢ్యములోముంచి సర్వవిధములను నిస్సహాయులుగ గావించుననియు మాత్రము చెప్పిన చాలును.

## ప్రవక్తకాలము

మహమ్మదుప్రవక్తకాలమున ఘోషాపద్ధతి లేదు. వివాహితలైనస్త్రీలు తమకొప్పులమీద మేలిముసుగువేసుకొనవలెనని మాత్రమే ఆయన విధిం. చెను. అటులవేసికొనుపద్ధతి పారసీకస్త్రీలలో నేటికిని గలదు. ఆయన మత బోధలుచేయుచున్నదినములలో అరేబియాదేశమున పురుషులతోబాటుస్త్రీలును కూర్చుండి ఆయనబోధలను వినుచుండిరి. ఆయనకుమార్తెయగు 'ఫాతిమా' గొప్ప వక్తయై పురుషులకును స్త్రీలకును ఏకేశ్వరోపాసనయొక్క యుత్కృ ష్టతనుగూర్చి గంభీరోపన్యాసములు చేయుచుండెను. అటుపిమ్మట రెండు వందలసంవత్సరముల తరువాత బాగ్దాదు విశ్వవిద్యాలయమునందు విద్యార్థు లగు వందలకొలది యువకులకును యువతులకును 'జైనబు' అను విదుషీ మణి ఆచార్యత్వమునువహించి ఉపన్యాసములనిచ్చెను. ఇస్లాముమతవ్యాప కముయొక్క ప్రథమశతాబ్దములలో పురుషులతోబాటు స్త్రీలును సంచారములు చేసి మతబోధలను సలిపిరి. అప్పటికి ఘోషాపద్ధతి యేర్పడలేదు.

## ఘోషాయొక్క కీడులు

అటుతరువాత ఈ దురాచారము ప్రారంభమై క్రమక్రమముగ మహమ్మ దీయదేశములన్నిటిలోను వ్యాపించి దినక్రమాభివృద్ధిని మిగుల కఠినమగువిధ

మున అవలంబించబడుచు వచ్చినది. పన్నెండుసంవత్సరములవయసువచ్చునప్పటికి స్వేచ్ఛగ నాడుకొనుచున్నబాలికలను నేత్రములవద్దమాత్రము రెండు చిన్నబొక్కలుగల నల్లనిమొద్దుదుప్పటి బురఖాను ఆపాదమస్తకము తగిలించి పురుషులకంటబడకుండ జనానాలలో పడవైతురు. అంతటితో విశాలవిశ్వము వారికి మరుగైపోవును. గాలి శుభ్రముగా రానట్టియు, వెలుతురు తక్కువగ నుండునట్టియు గృహములోని స్త్రీలునివసించు ప్రత్యేకభాగమే వారియొక్క యావత్ప్రపంచము. ఎక్కడికైన పనిమీద పోవలసివచ్చినప్పుడు దట్టముగ నన్నివైపులను మూసివేయబడిన బండ్లలోగాని, సవారీలలోగాని, మోటారు కార్లలోగాని భాగ్యవంతులగువారు వెళ్ళెదరు. బీదలగువారు రెండు నేత్రములవద్ద చిన్నగవాక్షములుగల నల్లబురఖాలను శరీరములో నేభాగము కనపడకుండ దిగవైచికొని పురుషులు సంచరింపనివేళలలో పోయెదరు. వీధులలో స్త్రీలు కనపడనే కనపడరు. పురుషులుమాత్రమే సంచరించుచుందురు. తురుష్కములో బురఖావేసుకొనకుండ ఎవరైన స్త్రీ వీధిలో కనపడినచో పోలీసువారు పట్టుకొనెదరు. అటులనే ఘోషాస్త్రీ బురఖాతో వెళ్ళుచుండగ నెవరైనపురుషుడామెతోమాట్లాడినచో నతనిని పట్టుకొనెదరు. సుల్తాను అబ్దుల్ హామీదు తురుష్కమునుపాలించిన దీర్ఘకాలమున సంపూర్ణమగు నిరంకుశత్వమునందు నమ్మకము గలిగియుండెను. ప్రజాప్రతినిధిసభను పిలువక ప్రజలమీద నిరంకుశపాలనము స్థాపించెను. దేశాభిమానులనందరిని పోలీసునిగహాలోనుంచి తరుచుగ నిర్బంధవిధానము నవలంబించుచుండెను. అబలలగు స్త్రీలకుగూడ నెక్కుడు నిర్బంధములను కలుగచేసెను. ఆయన డెబ్బదవయేట ముగ్గురుభార్యలు బ్రదికియుండగ పన్నెండుసంవత్సరముల యీడుగల బాలికను నాలుగవవివాహమాడెను. యూరపుఖండములో చదువుకొనుచుండిన తురుష్కయువకులు తమభార్యలను తురుష్కదేశమునుండి తమతోగూడ తీసికొనిపోగూడదని శాసించెను. స్త్రీలు ప్రాథమికవిద్యకుపైన చదువగూడదని నిషేధించెను. బురఖా అదివరకున్నదానికంటె మిగుల మందముగ నుండవలెనని యాజ్ఞాపించెను. ఇవన్నియు మతముపేరను దేవుని పేరను ఆయన చేసెను. మంత్రులును, గొప్పవారును తమ పుత్రికలకు ఫ్రెంచి యుపాధ్యాయినులను పెట్టి ఫ్రెంచిభాషను జనానాలలో నేర్పించు

చుండిరి. అటుల విద్యావంతులైన తురుష్క యువతులు జనానాలలో ఫ్రెంచి స్త్రీలుధరించు దుస్తులను ధరించుచు, వారి స్వాతంత్ర్య భావములను పొందు చుండిరేగాని, ఫ్రెంచి స్త్రీలతోబాటు తమకు సాంఘికస్వతంత్రము లేనందుకు మిగుల యసంతృప్తిని కలిగి తమ్ము తురుష్క స్త్రీలుగ పుట్టించినందుకు విధిని నిందించుచుండిరి.

## నిర్బంధములు

స్త్రీస్వతంత్రమునుగూర్చి పనిచేయవలెనని కొందరు యువతులు స్త్రీల సభలను సమకూర్చసాగిరి. కొన్ని కరపత్రములను ప్రచురించిరి. కొందరు గ్రంథకర్తలు ఘోషాపద్ధతియొక్క చెడుగులనుగూర్చి వ్రాసిరి. వెంటనే అట్టి ప్రయత్నములన్నిటిని సుల్తాను అబ్దుల్ హామీదు ఆపించెను. స్త్రీలసభలు జరుగగూడదనియు, స్త్రీలకు స్వతంత్రముకావలెనని వ్రాయగూడదనియు నిషేధించెను. కొందరు గ్రంథకర్తలయిండ్లను పోలీసువారు సోదాచూచి గ్రంథములను పట్టుకొనిపోయి తగులబెట్టిరి. ఆకాలమున తురుష్కదేశము నకు రాజకీయస్వతంత్రము కావలెనని ప్రయత్నించుచున్న తురుష్కయౌవన కక్షియొక్కపత్రికలలో స్త్రీలకుగూడ స్వతంత్రము కావలెనని వ్రాయబడు చుండెను. గాని ఆ పత్రికలు కొన్ని విదేశములలోను కొన్ని తురుష్కములో రహస్యముగను ప్రచురింపబడుచుండెను.

## (3)
## యౌవనతురుష్కకక్షివారి ప్రయత్నములు

1908 వ సంవత్సరమున యౌవన తురుష్కకక్షివారు సుల్తాను అబ్దుల్ హామీదుయొక్క నిరంకుశత్వమును కూలద్రోసి స్వపరిపాలనను స్థాపించినతరువాత యౌవనతురుష్కకక్షియొక్కనాయకులు తాము స్త్రీల స్వతంత్రములకనుకూలురమని ప్రకటించిరి. స్త్రీవిద్యను బాగుగ ప్రోత్స హించిరి. 1913 వ సంవత్సరమున బాలికలందరును ఆరుసంవత్సరముల వయసుమొదలు పదిసంవత్సరములు వెళ్ళువరకును నిర్బంధముగ విద్య నభ్యసించితీరవలెనని శాసనము గావించిరి. బాలికాపాఠశాలలను వృద్ధిచేసిరి. కాన్స్టాంటినోపిలుపట్టణమున స్త్రీలయుత్తమవిద్యకొరకు అయిదు హైస్కూళ్ళను (ఉన్నతపాఠశాలలు) స్థాపించిరి. ఇతర ప్రధానపట్టణములలోను స్త్రీల

కొరకు హైస్కూళ్లు పెట్టబడెను. విదేశక్రైస్తవమిషనరీలుకూడ హైస్కూళ్లను స్థాపించిరి. కాన్‌స్టాంటినోపిలులో అమెరికనుమిషనరీలు స్త్రీలకొరకొక కళాశాలను స్థాపించుట చూచియున్నాము. గొప్పవారు తమ యాడుపిల్లల కున్నతవిద్య నిప్పించుచుండెరి. కాన్‌స్టాంటినోపిలులోని విశ్వవిద్యాపీఠములోకూడ ఆడుపిల్లలు చదువవచ్చునని తురుష్కయౌవనకక్షివా రుత్తరువులను పంపిరి. తురుష్కయౌవనకక్షినాయకులలో నొకరగు అహమ్మదు రిజాబే గొప్ప స్త్రీవిద్యాభిమాని. ఆయనసోదరియగు సెల్మాహానం స్త్రీ విద్యావిషయమున మిగుల శ్రద్ధవహించెను. ఆయన స్త్రీయుపాధ్యాయినులను తరిబీయతుచేయుట కొక పాఠశాలను పెట్టించ యత్నించెను. దాని భవననిర్మాణము కొంతవరకు జరిగి ప్రభుత్వమువద్ద సొమ్ములేక ఆపివేయబడెను. నాకీహానం, హాలిడే ఎడబుహానం అను యువతులు స్త్రీలు చదువుకొనినగాని దేశము బాగుపడదని ఆందోళనముచేయుచుండిరి. యౌవన తురుష్కకక్షినాయకులలో మరియొకరగు రిజాట్యూఫిటుబే అను నాయన స్త్రీలవిద్యయొక్క ఆవశ్యకతనుగూర్చియు స్త్రీల స్వతంత్రమునుగూర్చియు మంచి కవిత్వమును వ్రాయుచుండెను. పత్రికలలో స్త్రీస్వతంత్రపక్షమున యువకులును యువతులును వ్రాయుచుండిరి. స్త్రీలసభలు విశేషముగ జరుగుచుండెను. యువతులును యువకులును తీవ్రమగు నుపన్యాసముల నిచ్చుచుండిరి.

## కొంత స్వేచ్ఛకలిగెను

తురుష్కయువకులు తమభార్యలను యూరపుదేశములకు తీసికొని పోగూడదను సుల్తానుయొక్క పాత నిషేధాజ్ఞ యౌవనతురుష్కకక్షివారిచే రద్దుపరచబడెను. తురుష్కయువతులు తమభర్తలతోడను, సోదరులతోడను విదేశములకు పోయి చూచి వచ్చుచుండిరి. కాన్‌స్టాంటినోపిలులోని బహిరంగయుద్యానవనములోనికి (పార్కులోనికి) స్త్రీలు తమ బంధువులగు పురుషులతోకూడ వెళ్ళవచ్చునని ప్రభుత్వమువారు శలవిచ్చిరి. నూతనప్రభుత్వమంత్రులభార్యలు విద్యావతులు. తమభర్తలతోగూడ వెళ్ళి యూరపుఖండమును చూచివచ్చినవారు. తురుష్కదేశము తురుష్కులదేనను సిద్ధాంతమును నమ్మినవారు. తురుష్కదేశములో తయారైనవస్త్రములను మాత్రమే ధరించుచు, విదేశవస్త్రములను సంపూర్ణముగ త్యజించినవారు. వారును స్త్రీల

యుద్యమమునందు పాల్గొనుచుండిరి. స్త్రీలసభలకు వచ్చుచుండిరి. స్త్రీలు బజారులలో ముసుగువేసికొనిగాని లేక మొగమునుకప్పుకొనకుండగనేగాని సంచరించుటకు స్వేచ్ఛ కలిగెను. స్త్రీలను అవమానపరచినవారికి కఠినమగు శిక్షలు విధించెదమని ప్రభుత్వమువా రుత్తరువులనుచేసిరి.

గాని యౌవనతురుష్కకక్షియొక్కపాలనము ప్రారంభమయినప్పటి నుండియు, ఎల్లప్పుడు యుద్ధములే జరుగుచుండెను. మొదట ఇటలీతో యుద్ధము, తరువాత బాల్కనురాష్ట్రములతో యుద్ధములు, పిమ్మట ప్రపంచ యుద్ధము జరిగెను. వీటిలో మితిలేనివ్యయమై దేశములోని అభివృద్ధికివలయు ధనము తురుష్కప్రభుత్వమునకు మిగులదయ్యెను. అందువలన స్త్రీలయుద్యమమునకు ప్రభుత్వపుసాహాయ్యము ఇంక నెక్కువగ లభించలేదు. మరియు యౌవనతురుష్కకక్షినాయకులు మతగురువులకును వృద్ధస్త్రీలకును భయపడి స్త్రీసంస్కరణమునకై తొందరగ సాగిపోలేదు. ఎప్పటికప్పుడు ప్రభుత్వములో తమస్థితియే నిలచునో లేదో యను అనుమానమునే కలిగియుండిరి. అట్టిస్థితిలో స్త్రీలకు సహాయ మెట్లులచేయగలరు? స్త్రీలయొక్కఅభివృద్ధికొరకు స్త్రీలు కృషిసల్పినచో ఎట్టిఅభ్యంతరములను ప్రభుత్వమువలనలేకుండ చేయగలిగిరి. అట్టికృషితో ప్రభుత్వము సానుభూతినే చూపెను.

## మతగురువులవలని భయము

కావున ఆకాలములో ఘోషాపద్ధతి నశించలేదు. మతగురువుల భయమువలనను గృహములలోని వయసుముదిరిన స్త్రీలభయమువలనను విద్యావంతులగు యువతులు సయితము ఘోషానుతీసివేయుటకు జంకిరి. మొద్దుదుప్పట్లను మానివైచినను సన్నటిబట్టలనైన వంటినిండ కప్పుకొనియే విద్యావతులగుయువతులుగూడ సంచరించుచుండిరి.

## స్త్రీలసేవాసంఘములు

పైనచెప్పబడిన యుద్ధములలో స్త్రీలుగూడ ముందుకువచ్చి దేశమునకు సహాయముచేయవలెనని ప్రభుత్వమంత్రులు కోరిరి. "మాతృదేశమపాయకరమగు స్థితిలో నున్నది. మాతృదేశముయొక్క స్వతంత్రపోరాటమునందు పురుషులు వేలకొలది మరణించుచున్నారు. స్త్రీలు తమ సహజమగు భయమును సిగ్గును కొంతవరకు విడిచి, ధైర్యమువహించి దేశమునకు

సేవచేయవలసిన తరుణమువచ్చినది. సోదరీమణులు దేశరక్షణకు పూనుకొన వలెనని ప్రార్థించుచున్నా"మని స్త్రీలకు విన్నపములను పంపిరి. ఇటలీతోజరి గిన యుద్ధములోను, బాల్కనుయుద్ధములలోను, ప్రపంచయుద్ధములోను తురుష్క-స్త్రీలు (Red crescent societies) సేవాసంఘములను స్థాపించి యుద్ధములో గాయములొందినపురుషులకు వైద్యచికిత్స, మందు లిచ్చుట, ఉపచారములుచేయుట మొదలగు సేవకు బాగుగ పూనుకొనిరి. వీరందరకును ప్రధానమంత్రికూతురగు మెకబోలుహానం అను యువతి నాయకత్వమును వహించెను. శతాబ్దములనుండి పర్దాచాటున నివసించుచు, సూర్యరశ్మిసైన సోకని తురుష్క-స్త్రీలు (వందలకొలది గాదు) వేలకొలది మాతృదేశస్వతంత్రముకొరకు పురుషులతోబాటు యుద్ధభూమికివచ్చి క్షత గాత్రులయినసోదరులకు సేవచేయుచుండుట అపూర్వమగు దృశ్యము.

## స్వతంత్రపోరాటమునందు స్త్రీలు భారమువహించుట

ప్రపంచయుద్ధము ముగియుటతోడనే యౌవన తురుష్క-కక్షి పడి పోయినదనియు, తురుష్క-జాతీయవాదులు ముస్తఫా కెమాల్ నాయకత్వము క్రింద తురుష్క-దేశస్వతంత్రమునకై మిత్రమండలివారితో గొప్పపోరాట ములు సలిపిరనియు చెప్పియున్నాము. ఆ స్వతంత్రపోరాటములందు స్త్రీలు పురుషులతోబాటు బాగుగ భారమునువహించిరి. అధఃపతితమయిన మాతృ దేశపునరుద్ధరణమునకై స్త్రీలుకూడ దృఢదీక్షను బూనిరి. హాలిడేఎడబు హానం రచించిన 'కార్చిచ్చు' అను నవలలో తమ మాతృదేశము విదేశ పాలనాదాస్యమునొందునను ఆవేదన, దాస్యవిముక్తికై పరితాపము, ఎట్టికష్ట ములకైన నోర్చి దాస్యమునుండి కాపాడవలెనను నిశ్చయము తురుష్క-స్త్రీల నెటుల ఆవహించెనో వర్ణింపబడియున్నది.

## హాలిడే ఎడబుహానం

హాలిడే ఎడబుహానం విద్యావతులగు తురుష్క-స్త్రీలలో న్యగ్రస్థాన మును వహించినది. ఈయువతీమణి అమెరికనులు స్థాపించిన స్త్రీకళాశాలలో పట్టపరీక్షయందు (బి. ఏ.) కృతార్థతచెందినది. పట్టపరీక్షయందు కృతార్థత నందిన ప్రథమతురుష్క-యువతి ఈమెయే. విద్యార్థిదశ వదలినప్పటినుండియు స్త్రీలస్వతంత్రముకొరకును, స్త్రీలహక్కులకొరకును జరిగినకృషిలో తీవ్ర

ముగ పాల్గొని స్త్రీ స్వతంత్రోద్యమమునకు నాయకత్వము వహించినది. దేశస్వతంత్రముకొరకు పోరాటము ప్రారంభముకాగానే స్వతంత్రోద్యమ నాయకుడగు ముస్తఫా కెమాల్‌పాషాకు కుడిభుజమైనిలచి పనిచేసినది. ఈమె గొప్పవక్త. గొప్ప గ్రంథకర్త్రి. ఈమె మిగుల యపాయకరమైన రాజకీయ ఆందోళనాపరురాలని మిత్రమండలివారు తలచిరి. సుల్తాను ఈమెకు రాజద్రోహము, మతద్రోహము చేసినదను నేరములక్రింద ముస్తఫా కెమాల్ పాషాతోపాటు మరణదండన విధించెను. గాని ఈ జాతీయవాదనాయకులను సుల్తానుయొక్క శిక్షలు ఏమియు చేయజాలకుండెను. ఈమెను డాక్టరు అడ్నాన్‌బేయను జాతీయనాయకుడు వివాహమాడెను. ఆయన తురుష్క జాతీయప్రభుత్వములో కొంతకాలము విద్యామంత్రిగ నుండెను. ఈమెసహాయమున స్త్రీలవిద్యాభివృద్ధికొరకు చాలగ కృషిసలిపి గొప్పకార్యములను చేసెను.

## స్త్రీలకృషివలన స్వతంత్రపోరాటము జయమొందినది

ఈమెనాయకత్వముక్రింద తురుష్క స్త్రీలు మాతృదాస్యశృంఖలములను త్రెంచుటకై జరిగిన యా మహాపోరాటమునందు తీవ్రముగ పాల్గొని యపారమగు త్యాగములను సలిపిరి. దేశాభిమానమును దేశమందంతటను పురిగొలుపుటలో స్త్రీలు ముందంజవైచిరి. తమభర్తలను సోదరులను పుత్రులను ప్రోత్సహించి యుద్ధమునకు బంపిరి. తాము డేరాలను ఆయుధసామగ్రులను చేసిరి. యుద్ధభూములకు ఆయుధసామగ్రులను ఇతరవస్తువులను గొనిపోయిరి. భాగ్యవంతులగు స్త్రీలు పేదలగువారి కెంతయైన ధనసహాయముచేసిరి. పేదరికము, చలి, ఆకలి, శ్రమ మొదలగు కష్టములకు వేటికిని లెక్కసేయక యుద్ధభూములలో సేవాశిబిరముల నేర్పరచి వ్యాధిగ్రస్తులకును గాయములనొందినవారికిని చికిత్సలిపిరి. చిరిగినదుస్తులతో వంటినిండ ముసుగులతో నెంతమందిమానవతులో దేశసేవానిమగ్నులై పనిచేయుచుండిరి. తురుష్కస్వాతంత్ర్యపోరాటము తురుష్కస్త్రీల యద్భుతకృషివలన జయముగాంచినదనుటలో అతిశయోక్తి లేదు. స్వతంత్రసంపాదకయజ్ఞమునందు ఆత్మార్పణముగావించి అగ్నిపరీక్షనుండి నూతనతేజస్సుతో నూతన శక్తితో తురుష్కస్త్రీజాతి బయల్పడినది. అటుపిమ్మట నూతనజాతీయ

నిర్మాణము గావించవలెనను ఉత్సాహము, అటుల గావించగలమను ఆత్మ విశ్వాసము వారికి పూర్తిగ కలిగెను.

## (4)
## మూఢమతవిశ్వాసములను పారద్రోలుట

స్వతంత్రపోరాటము జయప్రదముగ ముగిసి, తురుష్క దేశము నిర్వివాదముగ స్వతంత్రతను స్థాపించుకొనినతరువాత ముస్తఫా కెమాల్‌పాషా ప్రభుత్వమును మతమును వేరుచేయుటయు, ఖిలాఫతును షేకుల్ ఇస్లాము పదవిని రద్దుపరచుటయు, మతగురువుల యధికారమును ప్రాబల్యమును పలుకుబడిని నాశనముచేయుటయు పైన చూచియున్నాము. ఒకసారి విదేశ పాలనము నాశనముచేయబడి, సుల్తాను ఖిలాఫతుప్రతిష్ఠాపనములు తీసివేయబడి, సంపూర్ణమగు ప్రజాస్వామ్యము స్థాపింపబడినతోడనే, స్వేచ్ఛనుపొందిన పురుషులు స్త్రీలు కలిగిన నూతనప్రజారాజ్యమును నిర్మించుటకు ముస్తఫా కెమాల్ బద్ధకంకణుడయ్యెను. అతిత్వరితముగ మార్పువెంట మార్పు జరిగెను. దేశముయొక్క కుళ్ళిపోవుచున్నవ్రణములను శస్త్రచికిత్స చేయుటకు ముస్తఫా కెమాల్ అను భిషగ్వరుడు పూనుకొనెను. ఖిలాఫతు లేచిపోగనే మూఢ మతవిశ్వాసములప్రాబల్యమున చేయబడిన చట్టముల నన్నిటిని మార్చివేసిరి. "మత మపాయకరమగుస్థితిలో నున్నది" అని యూరపుఖండములోనిపత్రికలు ఆందోళనముచేసెను. పాశ్చాత్యులకు తురుష్కములోని పూర్వాచారపరాయణులయం దెంతయో కారుణ్యము ! మూఢ విశ్వాసములు పోకుండ నిలచియున్నచో మిస్ మేయోవంటి గ్రంథకర్త్రికి గోరంతలు కొండంతలు చేసి వెక్కిరించి నైచ్యముగచూపి స్వపరిపాలన కర్హమైనజాతి కాదని నిరూపించుట కవకాశము కలుగునుగదా! పాశ్చాత్య పత్రికలఖండనమునకు తురుష్కజాతీయవాదులు ప్రత్యుత్తరమీయలేదు.

## స్త్రీలకు స్వాతంత్ర్యము

పురుషులకుసంబంధించినచట్టములు మార్చగనే సంస్కరణములలో కెల్ల మిగుల గొప్పదగు సంస్కరణమునకు ముస్తఫా కెమాల్ పాషా బూనుకొనెను. అది స్త్రీలకు స్వతంత్రము. "స్త్రీలు దాస్యములోనుండగ యావత్తు సాంఘికవిధానమును దృష్టియు జనానాజీవితముచే బంధింపబడి

యుండగ, ప్రజారాజ్యమును స్థాపించుటెటుల? జాతీయపునర్నిర్మాణము నందు సహాయకులాండ్రగుటకు మారుగ స్త్రీలు సోమరికనమునందు పడి యున్నారు. ఈ పద్ధతియంతయు మిగుల హాస్యాస్పదముగనున్నది. ఇది పోవలెను" అని ముస్తఫా కెమాలు తర్కించెను. తురుష్కజాతి ప్రపంచ ములో నుత్తమస్థానము పొందవలెనని ముస్తఫా కెమాలు నిశ్చితాభిప్రాయుడై యుండెను. స్త్రీలు పురుషులతో సమానభాగస్వాములు కానిది ఇటుల జరు గుట అసాధ్యమని ఆయన గట్టిగ నమ్మెను. బురఖాను పూర్తిగ విసర్జించి స్త్రీలు స్వతంత్రులై దేశాభివృద్ధికివలయు సమస్తకార్యములను నిర్వర్తించ వలెనని స్త్రీలకు విన్నపము బంపెను. ఆయన వివాహమాడినవిద్యావతియు సౌందర్యవతియు నగు లతీఫుహానం మార్గదర్శిని అయ్యెను. డాక్టరు అద్నాణబే యను విద్యామంత్రియొక్క భార్య హాలిడే ఎడబుహానం, ఇతర మంత్రులందరిభార్యలు, పెద్దయుద్యోగస్థులభార్యలు, విద్యాధికుల పత్రికాధి పతులభార్యలు మొదలగువారందరును బురఖానులను తీసివైచిరి. హిందూదేశ ములోని పారసీక స్త్రీలవలె నెత్తిమీదమాత్రము అందమైన మేలిముసుగును వేసి కొననారంభించిరి. జనానాజీవితమును త్యజించిరి. భర్తలతోగూడ బహిరంగ స్థలములకును బహిరంగసభలకును వెళ్ళుచుండిరి. ముస్తఫా కెమాలు తన భార్యను తానువెళ్ళినచోటికెల్ల బురఖాలేకుండ తీసుకొనిపోయెను. తనతో గూడ గుర్రపుసవారిచేయించెను. తానుచేయు సాంఘికపునరుద్ధరణమునందు ఆమె పూర్తిగ భాగస్వామియయ్యెను. లతీఫుహానం, హాలిడే ఎడబుహానంలు స్త్రీస్వతంత్రోద్యమమునకు నాయకత్వమునువహించిరి. స్త్రీలసభలు, స్త్రీల సంఘములు, స్త్రీల పత్రికలు వెల్లివిరిసెను. కొన్నినెలలోనే తురుష్కదేశ ములోని జనానాజీవితమంతయు మాయమైపోయి, స్త్రీలు స్వతంత్రతనొందిరి. నూతనరాజ్యాంగవిధానములో పురుషులతోబాటు స్త్రీలకును ఎస్సెంబ్లీ (పార్ల మెంటు) ఎన్నికలలో ఓటుచేయుటకును ఎస్సెంబ్లీలో సభ్యులగుటకును హక్కు ఏర్పర్చబడెను. పాఠశాలలలోను కళాశాలలలోను విశ్వవిద్యాలయము లోను యువకులతోబాటు యువతులును కలసి విద్యనభ్యసించిరి.

## ఇంగ్లాండులో హక్కులకొరకు స్త్రీలపోరాటము

ఇంగ్లాండులోని పార్లమెంటుఎన్నికలలో ఓటుచేయుటకును పార్లమెంటునందు సభ్యులగుటకును హక్కు ఆంగ్లేయస్త్రీలకు పార్లమెంటుపుట్టిన తరువాత అయిదువందలసంవత్సరములవరకును లేకుండెను. ఇరువదవశతాబ్దములో అట్టిహక్కు తమకు కావలెనని ఆంగ్లేయస్త్రీలు సంఘముల నేర్పరచుకొని గొప్ప ఆందోళనముచేయవలసివచ్చెను. వీరియాందోళనమును కొంతకాలమువరకు ఆంగ్లమంత్రులు, పార్లమెంటుసభ్యులు లక్ష్యముచేయలేదు. ఆంగ్లేయదేశములో ప్రభుత్వసంబంధమగు సంస్కరణములుజరుగుటకు చాల ఆలస్యమగుటకు గొప్పకారణము ప్రభువులసభయుండుటయే. ప్రభువులు గొప్ప భూఖామందులు. ప్రతిదేశములోను సాధారణముగ పూర్వాచారపరాయణులు, నిరంకుశప్రియులు. అందువలన ఆంగ్ల స్త్రీస్వతంత్రవాదినులు పురుషులసభలలో అల్లరిచేయసాగిరి. మంత్రు లేసభలలోనైన మాట్లాడినచో ఆ మంత్రులమీదకలియబడి వారిచొక్కాలను చింపిరి. పార్లమెంటుయొక్కయు ప్రభుత్వపు భవనములయొక్కయు అద్దపుతలుపులను కిటికీలను బ్రద్దలుకొట్టిరి. ప్రధానమంత్రిగనున్న ఆస్క్వితును రైలుస్టేషనులో కొరడాదెబ్బలు కొట్టిరి. కొందరు పార్లమెంటుసభ్యులయొక్కయు మంత్రులయొక్కయు సతులు భర్తలమీద అలిగి కుటుంబమునందు వారికసౌఖ్యము కలిగించుచుండిరి. సభలలో అల్లరిచేసినపుడును తలుపులు బ్రద్దలుకొట్టినపుడును పోలీసువారు పట్టుకొని యీ స్త్రీలలో కొందరిని చెరసాలలోపడవేయుచుండిరి. అక్కడ యీ స్త్రీలు అన్నముతినుట మానివేసిరి. అపుడు వీరిని వదలివేయుచుండిరి. తుదకు స్త్రీల యాందోళనమునకు పురుషులు లొంగకతప్పినదికాదు. 1918 వ సంవత్సరమున ఆంగ్లస్త్రీలకు ఓట్లనిచ్చుచు, పార్లమెంటుసభ్యులగుటకు హక్కును కలుగజేయుచు ఆంగ్లపార్లమెంటువారు చట్టమునుచేసియున్నారు. 1928 వ సంవత్సరమున స్త్రీల కీ విషయమున పురుషులతో సమానమగుహక్కులు ఇంగ్లాండునందు కలిగినవి. గాని ఫ్రాన్సుదేశములో నిప్పటికిని స్త్రీలకు ఓట్లులేవు. స్త్రీలు పార్లమెంటుసభ్యులగుటకు వీలులేదు. 1932 వ సంవత్సరమున స్త్రీలకు రాజకీయహక్కులిచ్చుచు ప్రజాప్రతినిధిసభ

వారు (Chamber of Deputies) చట్టమునుచేయగ దానిని మంజూరు చేయక శిష్టసభవారు (Senate) కొట్టివేసిరి. స్త్రీల కింకను రాజకీయ హక్కులు ఫ్రాన్సులో కలుగలేదు.

## స్వరాజ్యప్రారంభమునందే స్త్రీలహక్కులు

అట్టి పోరాటమేమియు లేకుండగనే తురుష్కజాతీయవాదులు తమ స్త్రీలకు స్వరాజ్యముయొక్క ప్రారంభదశయందే హక్కుల నిచ్చియున్నారు. ఇందుకుముఖ్యకారణము స్వరాజ్యసంపాదనలో స్త్రీలుగూడ పాల్గొని త్యాగములుసల్పుటే. బురఖాలనుతీసివైచి ప్రకృతియొక్క సహజస్వతంత్రమును అనుభవించగనే తురుష్క స్త్రీలకు సహజమగు శక్తి, తేజము, ఆత్మవిశ్వాసములు కలిగినవి. దేశోన్నతికి స్త్రీలు పూనినారు. తురుష్కమునకు వసంత ఋతుసమాగమమయినది. కోమలమగు తలిరుజొంపములతోడను, మనోహరమగు ప్రసూనగుచ్ఛములతోడను విలసిల్లు ఉద్యానవనములయందు కోకిలల మధురగానము వినబడుచున్నది. స్త్రీకవయిత్రులు, స్త్రీగ్రంథరచయితలు, స్త్రీవక్తలు, స్త్రీపత్రికాధిపతులు, స్త్రీసంఘసేవాధురీణలు మాతృదేశౌన్నత్యమునకై పాటుపడుచున్నారు. విద్య పురుషులలోను స్త్రీలలోను ఎంతవేగముగ వ్యాపించుచున్నదో పైన తెలిపియున్నాము. జ్ఞానసంపాదనమునందును దేశాభిమానమునందును దేశసేవయందును తాము పురుషులకంటె వెనుకపడ గూడదని స్త్రీలు పట్టుదలనుకలిగియున్నారు.

స్త్రీలజీవనోపాధికివలయు గృహపరిశ్రమలను ప్రభుత్వమువారు ప్రత్యేకశ్రద్ధతో నెలకొలుపుచున్నారు. స్త్రీలకు వైద్యవిద్యయు, గృహనిర్వాహకవిద్యయు, పారిశ్రామికవిద్యయు బాగుగ నివ్వబడుచున్నవి. స్వరాజ్యమున గుమాస్తాలుగ దాస్యవృత్తిచేయుట కుపకరించువిద్య ఇవ్వబడదు. స్వతంత్రజీవనోపాధిని కలుగచేయు విద్యయే ఇవ్వబడును. అన్నివృత్తులలోను తురుష్క స్త్రీలు ప్రవేశించవచ్చును.

## సంఘసేవ

ఇంతేగాక స్త్రీలు సంఘసేవాప్రతిష్ఠాపనలను విరివిగ స్థాపించి సంఘసేవ బాగుగ చేయుచున్నారు. దేశముయొక్క ఆరోగ్యము, పారిశుద్ధ్యము, శిశుపోష

ణము, మాతృసంరక్షణము మొదలగు విషయముల కన్నిటికిని కావలసిన ద్రవ్యము తురుష్కజాతీయప్రభుత్వమువారు స్త్రీసంఘములకిచ్చి స్త్రీల మూలముననే దాదాపుగ కార్యనిర్వహణమంతయు జరిపించుచున్నారు. ఇందువలన దేశమున కెంతయో నిజమైన మేలు అభివృద్ధి కలుగుచున్నవి. చాలమంది స్త్రీలు ఉపాధ్యాయవృత్తిని స్వీకరించియున్నారు. పురుషులకన్న ఉపాధ్యాయినిలుగనుండి బాలబాలికలకోమలహృదయములలో మంచిభావములను నాటుటకు స్త్రీ లెక్కువ అర్హులని జాతీయప్రభుత్వముయొక్క యుద్దేశ్యము. వైద్యవృత్తిలోను, రోగులకుసేవచేయు (నర్సు) వృత్తిలోను చాలమంది స్త్రీలు ప్రవేశించియున్నారు. కొందరుస్త్రీలు యూరపుఖండమునకు పోయి పెద్దపరీక్షలు ప్యాసయి వచ్చియున్నారు. డాక్టరు అక్రైలాహానం అనునామె లండనులో ఎం. డి. పరీక్ష ప్యాసయి వచ్చినది. డాక్టరు సఫీరు అలీహానం అనునామె జర్మనీలో గొప్ప వైద్యపరీక్షలో ముత్తీర్ణురాలై వచ్చినది. న్యాయవాదివృత్తిని స్వీకరించినవారును కొద్దిమంది గలరు. జనరల్ పోస్టాఫీసులో గుమాస్తాలుగను, ప్రభుత్వముయొక్క వివిధశాఖలలో యుద్యోగస్థులుగను కొన్ని వందలమంది స్త్రీలు గలరు. కొందరు వర్తకములో లెఖ్ఖలువ్రాయువారుగ నున్నారు. వర్తకవ్యాపారములు చేయుచును, నవీనపద్ధతులమీద తమ భూములను వ్యవసాయముచేయించుకొనుచును కొందరు స్త్రీలు గలరు,

## నైతికకృషి

"తురుష్కగృహములలో పేదరికము నిండియున్నను చాలవరకు నీతివంతముగను త్రాగుబోతుతనము నెరుగకుండ పరిశుభ్రముగను నున్నవనియు, పాశ్చాత్యనాగరికత తురుష్కములో వ్యాపించిన కొలదియు త్రాగుబోతుతనము, వ్యభిచారము, జూదము అను మూడు దురభ్యాసములును తురుష్కములోకొంతవరకు వ్యాపించినవనియు,వాటిని రూపుమాపుటకై తురుష్కస్త్రీలు సంఘములుపెట్టి కృషిసల్పుచున్నా"రనియు గ్రేసుఎలిసన్ వ్రాయుచున్నది.

## క్లబ్బులు

పాఠశాలలలో బాలికలకు దేహపరిశ్రమనిచ్చువిషయమున బాగుగ శ్రద్ధవహింపబడుచున్నది. స్త్రీలు క్లబ్బులనుస్థాపించుకొని వివిధములగు ఆటలాడుచు దేహపరిశ్రమను పొందుచున్నారు. చాలక్లబ్బులలో స్త్రీలును

పురుషులునుకూడ సభ్యులుగనున్నారు. స్త్రీలహక్కులసంరక్షణకై కాన్‌స్టాంటినోపిలులో నొక గొప్ప సంఘము స్థాపింపబడియున్నది. దానికి పెక్కుచోట్ల శాఖలు గలవు.

## స్త్రీయుద్యమము

తురుష్కదేశములోని స్త్రీయుద్యమము ప్రపంచములోని మిగత దేశములన్నిటికంటెనుఎక్కువత్వరితముగ నభివృద్ధిచెందుచున్నదని పాశ్చాత్య గ్రంథకర్తలు అంగీకరించియున్నారు. తమయుద్యమమునకు వెనుక తమ దేశనాయకుడును తమ స్వరాజ్యప్రభుత్వాధ్యక్షుడునునగు ముస్తఫా కెమాల్ యొక్క బలమంతయు కలదను విశ్వాసము, తాముచేయు ప్రతి మంచి పనియు ఆయనయొక్కఆశీర్వచనమును పొందుటయేగాక, తమ పిలుపు విని నంతనే ఆయన స్వయముగ వచ్చి తగు సహాయముచేయునను నిశ్చయమైన నమ్మకము, తురుష్కస్త్రీలకు మిగుల యుత్సాహము కలిగించుచున్నవి. స్త్రీలకు స్వతంత్రముకలుగచేయుటవలన ముస్తఫా కెమాల్ పాషా ఒక గొప్పశక్తిని దేశములోనికి విడుదలచేసియున్నాడు. ఆ శక్తివలన దేశ మనేకవిధముల నుద్ధరింపబడుచున్నదని ఫలితములు తెలుపుచున్నవి. "మనకు తోడునీడగనున్న స్త్రీలు మనవలెనే మిగుల తెలివితేటలతో ఆలోచనచేయ గలరు. మన దేశపరిస్థితు లెంత క్లిష్టముగనున్నవో వారికి తెలిపి, మన జాతి యాదర్శములతో వారి నైక్యపరచి, వారికి జ్ఞానము విద్య నిచ్చుటవలన, మనకే సహాయముచేసికొనినవారమగుదుము." అని ముస్తఫా చెప్పిన వాక్య ములు యథార్థములయినవి.

## మహమ్మదీయస్త్రీల ఆస్తిహక్కులు

బురఖాలుపోయి స్వతంత్రతకలుగుటేగాక తురుష్కస్త్రీలకు వివాహ విషయములోను వివాహవిచ్ఛేదవిషయములోను మహమ్మదీయశాస్త్రప్రకార ముండియున్న కష్టములను జాతీయప్రభుత్వమువారు చట్టములమూలమున నివారించిరి. సమిష్టికుటుంబ మనునది మహమ్మదీయులలో లేదు. స్త్రీ కెటుల సంక్రమించినను ఆమెకును ఆస్తియందు దానదమనవిక్రయాది సమస్త హక్కులును గలవు. జీవితకాలపుహక్కుఅనునదికూడ వారిలో లేదు. పురుషునిఆస్తియందు ఆయన కెట్టి సంపూర్ణమగు స్వతంత్రము గలదో స్త్రీ

యొక్క ఆ స్తియందు స్థిరాస్తియైనను చరాస్తియైనను సరే ఆమెకును సంపూర్ణమగుస్వాతంత్రమే గలదు. ఆమెకిష్టమైనవిధమున వినియోగించవచ్చును. ఒక మహమ్మదీయపురుషుడు మరణించగనే ఆయనఆస్తిలో కొంతభాగము భార్యకుచెందును. మిగతదానిలో కుమారునితోబాటు కొంతభాగము కుమార్తెకును సోదరునితోబాటు కొంతభాగము సోదరికిని చెందుచున్నది. ఇటుల భార్యకును కుమార్తెకును సోదరికిని చెందుభాగములయందు వారికి సంపూర్ణమగుహక్కు కలదు. మరియు మహమ్మదీయస్త్రీకి వివాహకాలమందు భర్త కొంత సొమ్మునిచ్చునటుల నిర్ణయించబడును. అటుల నివ్వబడుదానికి మహరు అని పేరు. మహరులో సగముభాగము వెంటనే ఆమెకివ్వవలెను. మిగతసగము భర్త చనిపోయినవెంటనే ఆమెకుచెందును; లేదా ఈలోపున వివాహమువిచ్ఛేదమైనను ఆమెకు చెందును. మహరు రొక్కరూపకముగ గాక స్థిరాస్తిరూపకముగ ఇవ్వబడవచ్చును. మహరుక్రింద నిర్ణయమైన ఆస్తిని భర్తయొక్క రుణదాతలు జప్తుచేయించుటకును విక్రయింపజేయుటకును హక్కులేదు.

## బహుభార్యాత్వము

తురుష్కములో హిందువులవలెనే భార్యబ్రతికియుండగ పురుషుడు మరల వివాహమాడ హక్కుండెను. హిందూసాంప్రదాయమునందు ఎంతమంది భార్యలనైన చేసికొనవచ్చును. అయిదుగురు ఆరుగురు భార్యలను తక్కినభార్యలు బ్రతికియుండగ వివాహమాడిన భాగ్యవంతులుకూడ హిందువులలో లేకపోలేదు. మహమ్మదీయసాంప్రదాయమునందు భార్యలు బ్రతికియుండగ నలుగురికన్న నెక్కువమందిని వివాహమాడుటకు వీలులేదు. బహుభార్యాత్వము రెండుసాంప్రదాయములందును అంగీకరింపబడినది. ఈ దుష్టమైన ఆచారమును తురుష్కజాతీయప్రభుత్వము నిషేధించియున్నది. హిందూదేశములోను స్వరాజ్యమురాగనే ఈ ఆచారమును నిషేధించు శాసనము చేయవలసియున్నది.

## వివాహవిచ్ఛేదము

ఇంతేగాక తురుష్కపురుషుడు ఎట్టికారణములేకయే తనభార్యను ఇష్టమువచ్చినపుడు వెడలగొట్టి వివాహవిచ్ఛేదము గావించుకొనవచ్చును.

"నిన్ను నేను విడిచిపెట్టుచున్నాను" అని వ్రాతమూలకముగ భార్య కొకసారి వ్రాసినను లేక సాక్షులయెదుట మూడుసార్లు చెప్పినను వివాహవిచ్ఛేద మగును. లేదా నెలకొకసారి చొప్పున మూడునెలలు వరుసగ చెప్పినను వివాహవిచ్ఛేదమగును. లేదా నెలకొకసారిచొప్పున మూడునెలలు వరుసగ చెప్పినను వివాహము విచ్ఛేదమగును, వివాహవిచ్ఛేదము కాగానే భార్య. తనకురావలసిన మహారును తీసికొని లేచిపోవలసినదే. ఎంత కాలము తనతో కాపురముచేసినను, ఎంత సుగుణవతియైనను భార్యను భర్త అకారణముగ వెడలగొట్టి వివాహవిచ్ఛేదము చేసికొనుహక్కు మిగుల ప్రమాదమగునట్టియు, నిరంకుశమగునట్టి యుహక్కు. వివాహవిచ్ఛేదమైనతరువాత స్త్రీ మరియొకనిని వివాహ మాడవచ్చును. గాని భర్తవిడిచిపెట్టినభార్యను మంచివా రెవరు వివాహమాడె దరు? వివాహవిచ్ఛేదముగావించుటకు భర్త కోర్టుకుపోనక్కరలేదు. ఈ హక్కుండుటవలన భార్య తన భర్తకు ఎప్పుడు కోపమువచ్చునోయని బానిస కన్న హీనముగ ప్రవర్తించవలసియున్నది. పురుషుడు తననిరంకుశత్వమును స్త్రీపైన స్థాపించుకొనుటకు చేసినచట్టముల నిదర్శన మిది. ఈ అక్రమ మయినహక్కును తురుష్కజాతీయప్రభుత్వమువారు రద్దుపరచుశాసనము చేసియున్నారు. తనభార్య చెడుప్రవర్తన కలిగియున్నదనిగాని, తనతోకాపు రముచేయుటకు యిష్టములేక లేచిపోయినదనిగాని పురుషుడు కోర్టులో దావా చేసి, రుజువుచేసినపుడుమాత్రమే కోర్టువారు వివాహవిచ్ఛేదమునుచేసెదరు. లేనిచో వివాహవిచ్ఛేదముకానేరదు. ఈవిధముల స్త్రీలహక్కులు జాతీయ ప్రభుత్వమువారు కాపాడు శాసనములను గావించియున్నారు. మాండేటుల క్రిందనున్న పాలస్తైన్ మొదలగు అరబుదేశములలో నేటికిని మహమ్మ దీయస్త్రీలకు బురఖాలు, జనానాలు పోలేదు. స్త్రీలలో విద్య వ్యాపించలేదు. హక్కులు చక్కబడలేదు. స్త్రీలు అంధకారములోను మౌఢ్యములోను పడి యున్నారు. తురుష్కములో స్వతంత్రోద్యమనాయకుడగు ముస్తఫా కెమాల్ పాషా స్త్రీలకు ఉత్తమస్థితిని సంపూర్ణమగుస్వతంత్రమును నూతనగౌరవ మును ప్రసాదించియున్నాడు.

## అఖిలఆసియాస్త్రీల మహాసభ

1930 వ సంవత్సరము డిశంబరునెలలో అఖిల ఆసియా స్త్రీలమహాసభ భరతవర్షములోని లాహోరునగరమునందు ప్రథమపర్యాయము సమావేశమైనది. ఆశియాఖండములోని వివిధదేశములనుండి ప్రతినిధులు విచ్చేసిరి. ఆశియాఖండములోని ప్రతిదేశమునకును స్వపరిపాలన కావలెననియు, స్త్రీలు ఘోషాపద్ధతినిమాని విద్యాభివృద్ధినిపొందవలెననియు, అన్ని విషయములలోను స్త్రీలకు పురుషులతో సమానముగ హక్కు బాధ్యతలు కలుగచేయు చట్టములు ప్రతిదేశములోను గావింపబడవలెననియు తీర్మానములు గావించిరి.

## ఇండియాలో స్త్రీల హక్కులు

1920 మొదలు 1945 వరకు గొప్ప స్వతంత్రపోరాటము ఇండియాలో మహాత్మాగాంధియొక్క నాయకత్వముక్రింద జరిగినది. పురుషులతోపాటు స్త్రీలుకూడ స్వరాజ్యసంపాదనకొరకు కఖండత్యాగములు చేసినారు. 1947 సంవత్సరము ఆగస్టు 15 న స్వరాజ్యము వచ్చినది. బ్రిటిషు వారు లేచిపోయినారు. 1950 లో నూతన సంపూర్ణ ప్రజాస్వామ్యరాజ్యాంగ విధానములోకి వచ్చినది. పురుషులతోపాటు స్త్రీలకు సంపూర్ణముగ సమాన రాజకీయ సాంఘిక ఆర్థిక హక్కులు ఏర్పడినవి. ప్రతి పురుషునికిని స్త్రీకిని ఓటుహక్కు కలిగినది. ప్రభుత్వమునకు మతమునకు సంబంధము లేదు. సంపూర్ణమగు మతస్వేచ్ఛ వాక్స్వాతంత్ర్యము పత్రికాస్వాతంత్రము కలిగినది. పార్లమెంటులోను శాసనసభలలోను స్త్రీలుకూడ సభ్యురాండ్రుగ నున్నారు. స్త్రీలు మంత్రులుగ కూడ నున్నారు. హిందూబహుభార్యనిషేధచట్టము, వివాహవిచ్ఛేదచట్టము చేయబడినవి. హిందూస్త్రీల ఆస్తిచట్టములు బాగుగ సవరించబడి వారసత్వములో పురుషునితో పాటు స్త్రీకిని కూడ సమానభాగము వచ్చునట్లును స్త్రీకి ఏవిధమున సంక్రమించినను ఆస్తిలో ఆమెకు దాన విక్రయాది సంపూర్ణహక్కు లుండునట్లును చట్టములు చేయబడినవి. స్త్రీలయుద్యమము తురుష్కములోవలెనే బాగుగ వ్యాపించియున్నది. విశ్వవిద్యాలయములలో స్త్రీలు విశేషముగ చదువుకొనుచున్నారు. అన్ని యుద్యోగములను నిర్వహించుచున్నారు.

# తురుష్క ప్రజాస్వామికము

## 14 స్వరాజ్యమునందభివృద్ధి

### (1)

తురుష్కజాతియొక్క గొప్ప అదృష్టమేమనగా అఖండ త్యాగములను చేసి స్వతంత్రమును సంపాదించిన మహానాయకుడగు ముస్తఫా కెమాల్ పాషా, స్వతంత్రమేర్పడిన పిమ్మట 16 సంవత్సరములు (1922-38) సంపూర్ణముగ పరిపాలనాబాధ్యతను వహించి దేశమును గొప్ప ఆదర్శములతో నడిపి సర్వవిధముల సత్వరాభివృద్ధిని గావించుటయై యున్నది. "మేము తురుష్కులముగను నవీనపద్ధతులను స్వీకరించువారముగను నుండుటకు నిశ్చయించుకొనినారము." అని ముస్తఫా కెమాల్ పాషా చేసిన ప్రకటన ప్రకారమే కార్యక్రమము నిర్వర్తించబడినది. తురుష్కదేశముయొక్క వైశాల్యము 2,96,503 చదరపుమైళ్ళు. శాంతియుతమైన, అభివృద్ధికరమైన పాలనముక్రింద జనసంఖ్య అతి త్వరితముగ పెరిగినది. 1955 వ సంవత్సర జనాభాలెక్కల ప్రకారము జనసంఖ్య 2,41,11,778 అయి యున్నది. తురుష్కచరిత్రములో నార్థికముగ మిగుల దుస్థితియందున్నప్పుడే తురుష్కవిప్లవము జరిగి ప్రజాస్వామికప్రభుత్వ మేర్పడినది. ప్రభుత్వబొక్కసములో ద్రవ్యమేమియు లేకపోగా గొప్ప ఋణముయొక్క బరువు కూడ మీద పడినది. దేశము విశేషమైన దరిద్రములో కృంగియున్నది. కాని నూతన జాతీయప్రభుత్వము మిగుల ధైర్యముతోను, జాగ్రతతోను దేశసంపదను పెంపొందచేయుటకు కృషి సలిపినది.

### మితవ్యయము

రాజరికము, ఖిలాఫతు లేకపోవుటవలన రాజవైభవమునకును, దంభమునకును, రాజకుటుంబపోషణకును అయ్యేడి ఖర్చులన్నియు లేకుండ పోయినవి. కాన్స్టాంటినోపిలులోని యెక్కువ జీతములు ఎక్కువ సిబ్బంది

గల కచ్చేరీలన్నియు మూసివేయబడినవి. అంగోరాలోని చిన్నచిన్న గృహాములలో ప్రభుత్వకచ్చేరీలన్నియు పెట్టబడినవి. అంగోరాలో ఎస్సెంబ్లీకై నిర్మింపబడినగృహము ఇంగ్లాండులో నొక చిన్న పాఠశాలభవనమంతది. అంగోరాపట్టణమును జాతీయప్రభుత్వమువారు కొంతవరకు మధ్యకాలమున నభివృద్ధిచేసియున్నారు. గాని ప్రభుత్వము కొరకు గొప్ప నగరులను నిర్మించక, సామాన్యమైనట్టియు విశాలముగను, శుభ్రముగను నుండునట్టియు భవనములనే కట్టించుకున్నారు. "భవనముల నిర్మాణమునందును అధికారుల గొప్పజీతములకొరకును ఎక్కువ ఖర్చుపెట్టకూడదు" అని వారు నిశ్చయించినారు. కాని వారందరును ముస్తఫా కెమాల్ పాషా క్రింద నతి త్వరితముగ యావత్తు పనులను చక్కపెట్టవలెనని ఉదయము మొదలు రాత్రివరకును విరామములేకుండ పనిచేసినారు. దీనినిగూర్చి గ్రేసు ఎలిసన్ ఇట్లు వ్రాసినది :

"ఏమి యీ యెడతెగని తొందర ?" అని నేను అడిగితిని. "మేము శతాబ్దములు వెనుకపడియున్నాము. గతించినకాలము నంతను మేము త్వరలో కూడగట్టుకొనిరావలసియున్నది." అని ఇజ్మతు పాషా జవాబు చెప్పెను.

## దేశరక్షణము

యుద్ధకాలములో నేర్పడిన అరాజకపరిస్థితులనుండి కాపాడుటకును, బందిపోటుగాండ్రనుండియు, దొంగలనుండియు, దేశదిమ్మరులనుండియు రయితులకు సురక్షితము కలుగజేయుటకును, జాతీయప్రభుత్వము మంచి పోలీసుసిబ్బంది నేర్పాటుచేసినది. దేశములో బాగుగ సురక్షితము, శాంతి ఏర్పడినవి. ఇదివరకే తురుష్కదేశమునందు ప్రతి యారోగ్యవంతుడగు పురుషుడును కొన్ని సంవత్సరములు నిర్బంధముగ సైనికకొలువు చేయవలెనను శాసనము గలదు. అది బాగుగ నమలుజరుపబడుచున్నది. సైనిక కళాశాలలను అభివృద్ధిపరచి, క్రొత్తరకముల ఆయుధముల యుపయోగమును నేర్పుచున్నారు. దేశసంరక్షణ కవసరమైన మంచి తరిబీయతుపొందిన సేనలుంచబడినవి. 1957 వ సంవత్సరములో అయిదులక్షలసేన లున్నవి. ఇదిగాక సైనికతరిబీయతును పొంది పిలుపు రాగానే సైన్యములలో చేర

వలసినవారు ఇరవై లక్షలమంది గలరు. 1958-59 ప్రభుత్వబడ్జెటులో మొత్తపుఖర్చులో నూటికి 17 పాళ్ళు దేశరక్షణక్రింద ఖర్చుపెట్టబడుచున్నది.

## (2)

## పరిపాలనాసూత్రములు

తురుష్కదేశములోని పట్టణములకు తమభాషలో ననాదిగ నున్న పేరులను మరల నామకరణముచేసియున్నారు. కాన్‌స్టాంటినోపిలు నగరము దేశములోకెల్ల పెద్ద నగరము. దానిని ఇస్తాంబులు(Istanbul) అని పిలచుచున్నారు. దాని జనసంఖ్య 12,14,616. తురుష్కరాజధానియగు అంగోరాపట్టణమును అంకారా (Ankara) అని పిలచుచున్నారు. దాని జనసంఖ్య 4,53,151. మూడవపట్టణము స్మర్నారేవు. దానిని ఇజ్మీరు అని పిలచుచున్నారు. దాని జనసంఖ్య 2,86,300. 1935 వ సంవత్సరమున తురుష్కదేశ (శాసనసభకు) గ్రాండు నేషనల్ ఎసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో పదిహేడుమంది స్త్రీలు సభ్యులుగ నెన్నుకొనబడిరి. వారిలో 16 మంది లాయర్లు, డాక్టర్లు, కళాశాలలలో ఆచార్యులుగ పనిచేయుచున్న విద్యావంతురాండ్రు సభ్యులుగ వచ్చిరి. దేశజనసంఖ్యలో అత్యధికసంఖ్యాకులు మునల్మానులైనను, తురుష్కప్రభుత్వము ఏ మతమునకు సంబంధములేని (Secular State) సెక్యులరు స్టేటు అని రాజ్యాంగవిధానమునందు వ్రాసుకున్నది. 1935వ సంవత్సరమున ఎసెంబ్లీవారు పాషా మొదలగు బిరుదులనన్నిటిని రద్దుపరచిరి. అప్పటినుంచి తురుష్కప్రజాస్వామ్యమున కధ్యక్షుడుగ నున్న ముస్తఫా కెమాల్ పాషాను కెమాల్ ఆటా టర్కు (Kemal Ata Turk) అనియు, ప్రధాన మంత్రిగనున్న ఇజ్మత్ పాషాను ఇజ్మత్ యునోను (Ismath Inonu) అనియు పిలుచుచున్నారు. 1927వ సంవత్సరపు ఎన్నికలలోను, 1931వ సంవత్సరపు ఎన్నికలలోను, 1935వ సం॥ పు ఎన్నికలలోను, కెమాల్ ఆటాటర్కుయొక్క రిపబ్లికను ప్రజా పార్టీయే అత్యధికసంఖ్యాకులుగ వచ్చిరి. ఆకాలములో మరియొక పార్టీ ఏర్పడనేలేదు. తురుష్కప్రజాస్వామికమునకు కెమాల్ ఆటా టర్కు అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఈ కాలమందంతటను తనకు కుడిభుజముగా నుండిన ఇజ్మత్ యునోనును ప్రధానమంత్రిగా చేసెను. 1937 వ సంవ

త్సరము ఫిబ్రవరి నెల 5 వ తేదీన ఈ దిగువ పేర్కొనబడిన ఆరు సూత్రములను తురుష్క గ్రాండు నేషనల్ ఎసెంబ్లీ చేత అంగీకరింపచేసెను. అవి ఏమనగా :

1. **Republicanism** రిపబ్లికు (రాజరికములేని సంపూర్ణ ప్రజా స్వామికము.)

2. **Nationalism** జాతీయతత్వము. ప్రతిదేశము స్వతంత్రముగ నుండి తన వ్యవహారములను తానే నిర్వహించుకొనుట.

3. **Democracy** ప్రజారాజ్యము. (ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు స్వేచ్ఛాయుత ఓటుహక్కు చలాయించు రాజ్యము).

4. **Evolutionism** విప్లవకరముగ గాక క్రమగతానుసారముగ ప్రజలఇష్టము ననుసరించి అభివృద్ధికరమైన మార్పులు గావించుట.

5. **Separation of State and Religion.** ప్రభుత్వమునకు మతమునకు సంబంధములేకుండుట.

6. ప్రధాన పరిశ్రమలు, రాకపోకలసాధనములు, ప్రజలకు ఎక్కువ యుపయోగకరమైన సంస్థలు ప్రభుత్వముయొక్క తనిఖీక్రింద నుండుట.

ఈ సూత్రములప్రకారము కెమాల్ ఆటా టర్క్ మిగుల అభివృద్ధి కరమైన పాలనమును సాగించెను.

## పరిశ్రమలు జాతీయముచేయుట

ఇదివరకు ముఖ్యముగ సముద్రవర్తకమంతయు చేయుచుండిన గ్రీకులు, ఆర్మీనియనులు చాలవరకు లేచిపోయినారు. వారే తురుష్కములో ధనవంతులైనవర్తకులుగ నుండిరి. వారు లేచిపోవుటతో ఫ్యాక్టరీలు చాలవరకు మూసివేయబడినవి. కార్మికనైపుణ్యము కూడ కొంత తగ్గినది. స్వంతముగ పెట్టుబడి పెట్టి పెద్దఎత్తున పారిశ్రామికాలయములను విరివిగా నెలకొల్పుటకు దేశములో తగినంత ధనము లేదు. వ్యవసాయము బాగుగ నుండుటవలన పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థములకు కొదువ లేదు. విదేశస్థులు విరివిగా పెట్టుబడి పెట్టి గొప్పగా పరిశ్రమలు స్థాపించుటకు సిద్ధముగా నున్నారు. కాని అందువల్ల విదేశస్థులక్రింద దాస్యమే మరల కలుగునని ముస్తఫా కెమాల్ పాషాకు భయము. ఆయనకు దేశములో విదేశస్థులు

పెట్టుబడి పెట్టి పరిశ్రమలు సాగించుట ఇష్టములేదు. ఇంతేగాక దేశములో పరిశ్రమాభివృద్ధి కావించుకొనుటకు విదేశస్థులనుండి ఋణములు తెచ్చు కొనుటకు కూడ ఇష్టములేదు. విదేశస్థులనుండి ఋణములు తెచ్చుకొనుట వల్ల తమ దేశము చిరకాలము అనుభవించిన ఆర్థిక రాజకీయ దాస్యమును ఆయన మరచిపోలేదు. జాతీయసంపద వృద్ధినొందుటకు ఎక్కువకాలము పట్టినను సరే, స్వయంసహాయమువలననే పారిశ్రామికాభివృద్ధి నొందవలె నని ఆయన తలచి, పరిశ్రమలన్నియు ప్రభుత్వముక్రిందనే నడపసాగెను. ముఖ్యముగా సామ్రాజ్యతత్వమును అవలంబించియున్న బలవంతమైన జాతులనుండి ఎట్టి ఋణమును తెచ్చుటకును ఆయన చాలగ భయపడెను. 1932 వ సంవత్సరము ఏప్రిలు నెలలో విదేశవ్యవహారమంత్రియగు ట్యూఫికు రష్డి బే సోవియటురష్యాను దర్శించుటకు పోగా వారు గొప్ప స్వాగతమిచ్చిరి. అప్పుడు రష్యానుండి తురుష్కము కొంత ఋణమును తెచ్చుకొన్నది.

## పరిశ్రమలకు ప్రభుత్వసహాయము

తురుష్కజాతీయప్రభుత్వము పారిశ్రామికసామానులమీద పన్ను తీసివేసినారు. పరిశ్రమలమీద వృత్తిపన్ను, వాటి ఇండ్లమీదను స్థలముల మీదను పన్నులేకుండచేసియున్నారు. నూలువడకుట, నేతనేయుట మొదలు కొని దేశములో సులభముగ వృద్ధిచెందగల పరిశ్రమలన్నిటికిని ప్రత్యేక సహాయము చేయుటకును ప్రత్యేక సంరక్షణ నిచ్చుటకును, అభివృద్ధిశాఖా మంత్రి యొక కార్యక్రమమును తయారుచేసి ఆ ప్రకారము నడపినాడు. దేశములోని ఉప్పు, పంచదార, పొగాకు, నిప్పుపెట్టెలు, సిగరెట్ కాగిత ములు తయారుచేయు పరిశ్రమలనన్నిటిని ప్రభుత్వమువారే పూర్తిగ స్వాధీనమును పొంది సాగించినారు. బట్టలు, పింగాణీ, ఆలివునూనె, గోగు నార మొదలగునవి తయారుచేయు కొన్ని యంత్రశాలలకు ప్రభుత్వమువారు ధనసహాయము చేసినారు. కాన్‌స్టాంటినోపిలులో పారిశ్రామిక బ్యాంకిని, కొన్ని పట్టణములలో దానిశాఖలను స్థాపించి స్వల్పవడ్డీకి పరిశ్రమలను నెలకొలుపదలచినవారికి ఋణములనిచ్చినారు.

## పరిశ్రమాభివృద్ధి

పరిశ్రమలు సత్వరాభివృద్ధిని గాంచినవి. రాతిసిబొగ్గును త్రవ్వు పరిశ్రమ చాలగ వృద్ధిచెందినది. 1928 సంవత్సరమున తురుష్కమునందు ఎనిమిదికోట్ల రూప్యముల విలువగల పారిశ్రామికసరుకులు తయారైనవనియు, 1931 వ సంవత్సరమున ఇరువదికోట్ల విలువగల సరుకులు తయారైనవనియు అంచనావేయబడినది.

## రేవువర్తకము

లాసేనుసంధి తరువాత తురుష్కప్రభుత్వముయొక్క అనుమతి లేనిది విదేశస్థులు తురుష్కములోని యొక రేవునుండి మరియొక రేవునకు సముద్రముమీద వర్తకమునకై స్టీమరులనాడించుటకు వీలులేదు. గావున తురుష్కతీరముననున్న పట్టణములమధ్య సముద్రవర్తకము (కోస్తావర్తకము) చేయుటకు తురుష్కస్టీమరులు దినదినాభివృద్ధిగ బయలుదేరినవి. ఇందుకొరకేర్పడు తురుష్కవర్తకసంఘములకు ప్రభుత్వమువారు ప్రత్యేక ప్రోత్సాహమిచ్చినారు. తురుష్క పొగయోడలలో కొన్నిటికి ముస్తఫా కెమాల్, స్మర్నా, నవీన తురుష్కము మొదలగు పేర్లు పెట్టబడినవి.

## పాశ్చాత్యస్త్రీలను పెండ్లిచేసుకొనగూడదు

తురుష్కములోని చాల ప్రభుత్వశాఖలలో పెద్ద యుద్యోగములు చేయువారెవరును పాశ్చాత్య స్త్రీలను పెండ్లిచేసికొనగూడదని జాతీయప్రభుత్వమువారు శాసించియున్నారు. విదేశరాయబారులుగను సైనికోద్యోగులుగను పనిచేయుచున్న కొందరు తురుష్కప్రముఖులు పాశ్చాత్యభార్యలను కలిగియున్నహేతువుచేత నుద్యోగములు చాలించుకొనవలసివచ్చినది. గాని వుద్యోగములను చేయువారందరును తురుష్క కుచ్చుటోపీలను మాని పాశ్చాత్యులు ధరించు టోపీలు ధరించవలెనని ముస్తఫా కెమాల్ పాషా ఆజ్ఞాపించియున్నాడు.

## విద్యావ్యాపకము

తురుష్క జాతీయప్రభుత్వమువారు ప్రజలను విద్యావంతులుగ చేయుట తమ ప్రధానధర్మమని గుర్తెరిగి విద్యావ్యాపకమునకై అత్యంత మగు శ్రద్ధను తీసుకొనుచున్నారు. విద్యకొరకు శక్తివంచనలేకుండ ద్రవ్యమును ఖర్చుపెట్టుచున్నారు. బాలురకును, బాలికలకును నిర్బంధవిద్యావిధానమును బాగుగ నమలుజరుపుచున్నారు. పల్లెటూళ్ళన్నిటిలోను పాఠశాలల నేర్పాటుచేయుచున్నారు. కెమాల్ ఆటా టర్కు చెప్పిన "దేశీయులారా! మీరు విద్యావంతులగుట మీ దేశమునకు సేవచేయుట" అను వాక్యము దేశమునం దంతటను ప్రతి ప్రభుత్వోద్యోగస్థునిచేతను ప్రతిధ్వనింపజేయబడుచున్నది. పిల్లలను పాఠశాలలకు పంపుట ధర్మమైనది. "నలుబది సంవత్సరముల లోపున నున్న నౌకరులందరును కూడ రాత్రిపాఠశాలలలో చదువుకొనవలెను. ఒకరాత్రి మే మొక గృహస్థుని చూడబోతిమి. ఆయనభార్యయే మాకు కాఫీని, ఫలహారములను తయారుచేసిపెట్టినది. 'నౌకరులందరును రాత్రిపాఠశాలకు పోయిరి. చట్టములప్రకారము మేము నౌకరుల కందరకును విద్య చెప్పించితీరవలెను' అని ఆమె మాతో చెప్పెను. నే ననేక రాత్రి పాఠశాలలను దర్శించితిని. ముసలిస్త్రీలు కూడ విద్యనేర్చుకొనుట నాకు వింతగ కనుపడినది." అని గ్రేసు ఎలిసన్ వ్రాసినది. 1922 వ సంవత్సరమున నూటికి పదిమంది చదువుకున్నవారుండగా, 1927 సంవత్సరమున నూటికి డెబ్బదిమంది చదువుకున్నవా రుండిరి. ఇంత శీఘ్రముగ విద్యావ్యాపకము గావించిన జాతులు అరుదుగ నున్నవి.

## తురుష్కభాష

తురుష్కభాషకే జాతీయప్రభుత్వమువారు విద్యావిధానమునందు ప్రధానస్థానము నిచ్చియున్నారు. యావత్తు విద్యను తురుష్కభాషలో నేర్పుచున్నారు. పూర్వమువలె అరబి, పర్షియను భాషలను నేర్పుటలేదు. ప్రభుత్వభాష తురుష్కభాష. ఖురాను తురుష్కములోనికి మార్చబడినది. రైలు స్టేషనులపేర్లు, రోడ్లమీదమైలురాళ్ళ మీదపేర్లు తురుష్కభాషలోనే వ్రాయబడినవి. ఎచట చూచినను తురుష్కభాష తప్ప మరియొక భాష

కనుపడదు. గాని మనదేశములోని ఉరుదుభాషను వ్రాయుచున్నటుల తురుష్కభాషను ఇదివరకు అరబ్బిలిపిలో వ్రాయుచుండెడివారు. ఇపుడు జాతీయప్రభుత్వ మా లిపిని తీసివేసి యూరపుజాతులన్నియు వాడుచున్న రోమకలిపిలోనికి మార్చియున్నారు. రెండవభాషగ మధ్యమతరగతి పాఠశాలలలోను, కళాశాలలలోను ఫ్రెంచిభాషను నేర్పుచున్నారు. విద్యావిధానమంతయు నవీనపద్ధతులమీద పునర్నిర్మాణము గావింపబడినది. నవీనదేశములన్నిటిలోవలె ప్రకృతిశాస్త్రములు దేశచరిత్రలు మొదలగునవి బాగుగ నేర్పబడుచున్నవి. ప్రభుత్వపాఠశాలలలో మతవిద్యను నేర్పుట మానివేసినారు. మహమ్మదీయమతమును గూర్చి కళాశాలలలో తత్వశాస్త్రము యొక్క భాగముగ నేర్పుచున్నారు. మతగురువుల తరబీయతుకై మతకళాశాలకూడ గలదు. పాఠశాలలన్నిటిలోను తురుష్కజాతీయోద్యమచరిత్ర, దేశాభిమానము, పౌరస్వత్వములు, నీతి, ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసములు ప్రత్యేకశ్రద్ధతో నేర్పబడుచున్నవి.

## స్త్రీవిద్య

ఆడపిల్లలకును మగపిల్లలకును కలిపియే అన్నితరగతి పాఠశాలలలోను విద్యను నేర్పుచున్నారు. ముఖ్యముగ క్రిందితరగతి పాఠశాలలలో విద్యను నేర్పుటకు వీలయినంతవరకు స్త్రీలను నియమించుచున్నారు. స్త్రీలు స్వతంత్రజీవనోపాధిని కలిగియుండుటకై గృహపరిశ్రమలు నేర్పు పాఠశాలలను, స్త్రీ ఉపాధ్యాయినులను తరబీయతుచేయుటకు పాఠశాలలను కళాశాలలను స్థాపించియున్నారు.

## విదేశపాఠశాలలమీద నిబంధనలు

లాసేనుసంధిలో, 1918 వ సంవత్సరము అక్టోబరు 30 వ తేదీకి పూర్వము స్థాపింపబడిన విదేశపాఠశాలలను కళాశాలలను జాతీయప్రభుత్వమువా రంగీకరించునటుల యొప్పుకొనిరి. కాని యవి జాతీయప్రభుత్వమువారు చేయుచుండు నిబంధనలకును, ప్రభుత్వ విద్యాశాఖాధికారులతనిఖీకిని లోబడియుండవలయును. విద్యాశాఖ మంత్రియొక్క అనుమతి లేనిది విదేశీయులెవ్వరును తురుష్కములో నూతనముగ విద్యాశాలలను స్థాపించుటకు వీలులేదు. మరియు పదిహేనుసంవత్సరములలోపు వయసుగల తురుష్క

బాలబాలికలెవరును విదేశీయుల విద్యాలయములలో చేర్చుకొనబడగూడ దనియు, ప్రతి విదేశ విద్యాలయములోను తురుష్క యుపాధ్యాయులచే తురుష్క దేశపు భూగోళమును, తురుష్క దేశచరిత్రను విద్యార్థులకు నేర్పించితీరవలెననియు జాతీయప్రభుత్వమువారు నిబంధనలను చేసి యున్నారు. ఈ నూతన నిబంధనలప్రకారము మార్పులుచేసికొనని చాల ఫ్రెంచి, ఇటలీ, ఆంగ్లేయపాఠశాలలు మూసివేయబడినవి. అమెరికనులు క్రొత్తనిబంధనలప్రకారము నడచుచున్నారు. "ఏ దేశము కూడ బుద్ధి పూర్వకముగ తన పిల్లలను విద్యనేర్పుటకై విదేశములకు వప్పగింప చేయదు" అని మీయర్సు వ్రాసియున్నాడు. ఈ సత్యమును తురుష్క జాతీయప్రభుత్వము గ్రహించి వీలయినంతవరకు అమలుజరుపుచున్నది. విదేశీయ పాఠశాలలన్నిటిలోను క్రైస్తవమతమును బోధించుటయేగాక, చెల్ల యుపాధ్యాయులు సామ్రాజ్యతత్వముయొక్క ప్రచ్ఛన్నప్రతినిధులై తమ దేశముల యుత్కృష్టతను ప్రాగ్దేశములహీనతను విద్యార్థుల కెక్కించుచున్నా రని మొదటినుండియు తురుష్కులు మనసునందు బాధనొందుచునేయుండిరి. కాని విదేశీయులకుగల ప్రత్యేక హక్కులవలనను, తురుష్కప్రభుత్వ ము త్తమవిద్యను ఇవ్వలేకుండుటవలనను తురుష్కులు నిస్సహాయులై యుండిరి. ఇపు డట్లుగాదు, స్వతంత్రతురుష్కమునందు విదేశీయులయాధిక్యత ప్రత్యేక హక్కులు నశించినవి. విదేశపాఠశాలలలో తురుష్కులకన్న పాశ్చాత్యు లధికులనిగాని తురుష్కస్వతంత్రమునకు వ్యతిరేకముగగాని యుపాధ్యాయులు బోధించినను, విద్యార్థులను క్రైస్తవమతములోనికి కలుపుచున్నను, జాతీయ ప్రభుత్వమువారు వెంటనే చర్యపుచ్చుకొని యా పాఠశాలను మూసివేయించు చున్నారు. బ్రూసాపట్టణములోని అమెరికను బాలికా మధ్యమతరగతి పాఠ శాలలోని యిద్దరు తురుష్కబాలికలను క్రైస్తవమతములోనికి చేర్చుకొని నందుకు ఆ పాఠశాలను జాతీయప్రభుత్వమువారు వెంటనే మూసివేయించి యున్నారు. విదేశపాఠశాలలను జాతీయప్రభుత్వము మిగుల అనుమానముతో చూచుచున్నది.

## చిత్తరువులు, కళలు

చిత్తరువులను, కళలను, శిల్పమును, సంగీతమును, నాటకములను,

జాతీయప్రభుత్వమువారు బాగుగ ప్రోత్సహించుచున్నారు. మహమ్మదీయ మతము ప్రతిమారాధనకు వ్యతిరేకముగాపున, చిరకాలమునుండియు మానవా కారములను చిత్రించగూడదనియు మానవప్రతిమల శిల్పము చేయగూడ దనియు తురుష్కములో మతనిషేధ ముండెను. ఆ నిషేధము మూఢవిశ్వాస మని జాతీయప్రభుత్వముచే త్రోసివేయబడినది. కెమాల్ అటాటర్కుయొక్క ప్రతిమలు చాలచోట్ల వెలసినవి. 1926 వ సంవత్సరములో సంగీతము, కళలు, శిల్పము, చిత్తరువులు, చిత్రలేఖనము నేర్పు గొప్ప అకాడమీని ఇస్టాంబులులో స్థాపించియున్నారు.

## గొప్ప కవీశ్వరులు

నవీన తురుష్కకవీశ్వరులలో షినాసి మిగుల గొప్పవాడు. తరువాత తరములవారిలో కలిగిన భావవిప్లవమునకు విత్తులు వెదజల్లెను. ఆయనశిష్యు డగు నమకు కెమాల్ గొప్పగ్రంథకర్త. ఆయన పాతకాలపు మహమ్మదీయ ఆచారములు పనికిరావని ఖండించి విశాలమగు సంస్కరణములను కోరెను. యౌవనతురుష్కకక్షిలో చేరినవాడై సుల్తానుహమీదుచే దేశభ్రష్టుడుగావింప బడి విదేశములలో మరణించెను. గొప్పపండితుడును కవీశ్వరుడును భక్తుడు నగు జియాగుయల్ అల్పు బ్రిటిషువారు మాల్టాద్వీపమున చెరసాలయందుంచిన నలుబదిమంది తురుష్క దేశాభిమానులలో నొకడు. మాల్టానుండి విడుదల అయినపిమ్మట తురుష్కవిశ్వవిద్యాలయమున సాంఘికశాస్త్రమునుబోధించు ఆచార్యుడుగ నియమింపబడెను. తురుష్కభాషను వృద్ధిచేయుచున్న గ్రంథ కర్తలలో ముఖ్యుడుగ నున్నాడు. మహమ్మదు ఎమీను, యాహియాకెమాల్ గార్లు తురుష్కభాషలో సుప్రసిద్ధ కవీశ్వరులు. వెనుకటికాలమున తురుష్క దేశములోని విద్వాంసులు అరబ్బీ పారశీభాషలలో వ్రాయుట గొప్పయని భావించుచుండిరి. యౌవనతురుష్కకక్షి ప్రాబల్యమునొందినప్పటినుండియు తురుష్కవాఙ్మయము బాగుగ వృద్ధిచెందినది. సుప్రసిద్ధులగు విద్వాంసులంద రును తురుష్కములోనే వ్రాయుచున్నారు.

## స్త్రీ గ్రంథకర్త్రిలు

ఇప్పటి స్త్రీ గ్రంథకర్త్రిలలో నిగ్యుయర్ హానం, ఎమినేసేమేహానం, హాల్ డెఎడబుహానంలు సుప్రసిద్ధులు. ఇంకను యౌవనవిద్వాంసురాండ్రలో ముఫీదెహానంగొప్ప కవయిత్రి.ఈమె మంత్రి ఫరీదుబేయొక్క భార్య. సుయేటు దర్వీషేహానం గొప్ప గ్రంథరచయిత్రి. ఈమెయొక్క ఖ్యాతి జర్మనీలో మిగుల వ్యాపించినది. ఈమె వ్రాసినది జర్మనుభాషలోనికి భాషాంతరీకరణము చేయ బడుచున్నది. వీరిద్దరును నలుబదియేండ్ల వయసుగలవారు. చరిత్రాత్మక పరి శోధనలలో అఫ్లెల్ హానం అనుయువతి చాల ప్రఖ్యాతినిబడసినది. ఈమెయు నింకకొందరును కలసి తురుష్కభాషలో నాలుగుసంపుటముల ప్రపంచచరిత్ర మును రచించియున్నారు.

## విదేశాంగరాజనీతి

కెమాల్ ఆటా టర్కు ప్రక్కనమున్న ఆశియాఖండదేశములైన ఇరాను (పర్షియా), ఇరాకు (మెసపొటేమియా), ఆఫ్ఘనిస్తాను దేశములతో పరస్పరరక్షణసహాయయొడంబడికలు చేసికొనెను. అటులనే మరియొక ప్రక్కనున్న గ్రీసు, యుగోస్లావియా, రుమేనియా దేశములతోను ఒడంబడి కలు చేసికొనెను. అన్నిజాతులతోను స్నేహముగనుండుటయు ఏ కలహ ములలోను ప్రవేశించకుండ తటస్థముగనుండుటయు ఆయనయొక్క విదే శాంగరాజనీతి. ప్రథమమునుండియు సోవియటురష్యాతో స్నేహముగ నుండెను. లాసేనుసంధికి పిమ్మట ఇంగ్లాండుతోను, ఫ్రాన్సుతోను స్నేహ సంబంధముల నేర్పరచుకొనెను.

## కెమాల్ ఆటా టర్కుయొక్క అకాలమరణము

1938 వ సంవత్సరము నవంబరునెల 10 వ తేదీన కెమాల్ ఆటా టర్కు తురుష్కదేశమునేగాక ఆసియాఖండమునంతను దుఃఖసముద్రము లోను, అంధకారములోను ముంచి 58 వ ఏటనే అకాలమృత్యువువాతపడి స్వర్గస్థుడయ్యెను. ఆయనకు భార్య, పిల్లలు లేరు. ఆయనకుగల సర్వస్వమును మాతృదేశమునకు వదలిపెట్టిపోయెను. ఈ గ్రంథకర్త మద్రాసు కాంగ్రెసు

ప్రభుత్వపు ఛీప్ పార్లమెంటరీకార్యదర్శిగ మలబారుజిల్లాలో సంచారము చేయుచుండగ కెమాల్ అటాటర్క్ మరణవార్త తెలిసినది. ఆయన మరణిం చిన పదవతేదీన కళ్ళికోటలోని సముద్రతీరమున ఈ గ్రంథకర్త అధ్యక్షతను ఒక గొప్ప బహిరంగసభ జరిగి ఆయన అకాలమృత్యువువలన కలిగిన అపారనష్టమునకు సంతాపమును వెలిబుచ్చిరి. ఆశియాఖండపునర్జీవనమును, స్వాతంత్రమును కలుగచేసిన అత్యుత్తమదేశాభిమానులలో ముగ్గురు మహా పురుషులు హిమాలయపర్వతశిఖరములవలె ప్రకాశించుచున్నారు. వీరు ముమ్మరు హిందూదేశనాయకుడగు మహాత్మాగాంధి. చైనాజాతీయనాయకు డగు డాక్టర్ సన్యట్‌సేను, తురుష్క-జాతీయనాయకుడగు ముస్తఫా కెమాల్ పాషా అయియున్నారు. వీరిలో మహాత్మాగాంధి హిందువు, డాక్టర్ సన్యట్ సేను క్రైస్తవుడు, ముస్తఫా కెమాల్‌పాషా మహమ్మదీయుడు. జాతీయ పోరాటములకు మతములకు సంబంధములేదు. అన్నిమతములవారును ఆశియాఖండ జాతీయస్వాతంత్రపోరాటములలో పాల్గొని అఖండత్యాగములను చేసియున్నారు. మహాత్మాగాంధి, డాక్టర్ సన్యట్‌సేను ఇద్దరూకూడ గొప్ప దైవభక్తిపరాయణులు, ఆధ్యాత్మిక సంపన్నులు. ముస్తఫా కెమాల్ పాషా ఆధ్యాత్మికతత్వమునకు పేరెన్నికగన్నవాడుకాడు. సైనికయోధుడు. అత్యు త్తమ దేశాభిమాని. అఖండత్యాగమూర్తి. డాక్టర్ సన్యట్‌సేను తనవిప్లవము జయముకాకమునుపే మరణించినాడు. క్యుమింగ్‌టాంగ్‌నుస్థాపించి స్వాతంత్ర పోరాటమును సాగించుచు మరణించినాడు. మహాత్మాగాంధి స్వాతంత్రము సంపాదించినపిమ్మట 6 నెలల లోపలనే పరమపదించినాడు. ముస్తఫా కెమాల్ పాషా అటులకాక స్వాతంత్రసంపాదనకు పిమ్మట 16 సంవత్సర ములు జీవించి తనయొక్క- అభిప్రాయములప్రకారమే ఆదర్శముల ననుస రించియే తురుష్క-దేశమునకు సుపరిపాలనము స్థాపించి సుస్థిరమైన అభివృ ద్ధిని నిర్మాణముగావించి స్వర్గస్థుడైనాడు. స్త్రీలఅభివృద్ధివిషయములోను,మానవ సమానత్వమును, ఆర్థికసమానత్వమును స్థాపించుటలోను ఈ ముగ్గురును కృషిసలిపి తమసందేశములను తమజాతులకిచ్చిపోయినారు. ఆశియా ఖండములోని దేశములన్నియు, ఆఫ్రికాఖండములోని ఈజిప్టు, సూడాన్ దేశములును స్వాతంత్రమును పొందినవి. తమ జాతీయ పునర్నిర్మాణమును గావించుకొనుచున్నవి. బాండుంగుసమావేశమువల్ల ఆశియా ఆఫ్రికా ఖండ

ములలో ఐకమత్యము కల్పింపబడినది. ఆశియాఖండముయొక్క సంపూర్ణ వికాసమును, సర్వతోముఖమైన అభివృద్ధిని కలుగచేయుటకు కృషిసల్పుటలో భావితరములవారందరును పైనచెప్పబడిన ముగ్గురు మహాపురుషులయొక్క అడుగుజాడలలో నడవవలసియున్నారు.

## (3)

## రెండవ ప్రపంచయుద్ధములో తాటస్థ్యము

కెమాల్ ఆటా టర్కు మరణానంతరము గ్రాండు నేషనలు ఎస్సెంబ్లీ వారు ఇస్మత్ యునోనును అధ్యక్షునిగ ఎన్నుకొనిరి. అధ్యక్షులైన యిస్మత్ యునోను కెమాల్ ఆటా టర్కుయొక్క నిర్మాణాత్మకమైన, శాంతియుతమైన రాజనీతినే సాగించెను. క్రొత్తగా నేర్పరచబడిన మంత్రివర్గములో డాక్టర్ రఫీక్ శైదాము ప్రధానమంత్రిగను, షుక్రుసారాకోగ్లు విదేశాంగ మంత్రిగను నియమింపబడిరి. యూరపులో యుద్ధమేఘములు ఆవరించెను. ఫాసిస్టు రాజనీతి అవలంబించిన జర్మనుల దురాక్రమణభయమువలన తురుష్కదేశము 1939 వ సంవత్సరము జూన్ నెల 23 వ తేదీన ఫ్రాన్సుతో సంధిచేసుకొనెను. ఆ సంధివలన పశ్చిమరాజ్యములతో నొకవంకను, సోవియటుప్రభుత్వముతో మరియొకవంకను తురుష్కదేశమునకు స్నేహము లభించి సురక్షితము దృఢపడునట్లు కనబడెను. ఈజిప్టుదేశపు విదేశాంగ మంత్రి తురుష్కరాజధానియగు అంకారాను దర్శించి తురుష్కదేశముతో స్నేహసంబంధములను బలపరచుకొనెను. 1939 వ సంవత్సరము ఆగస్టు నెలలో నాజీజర్మనీ, సోవియటుప్రభుత్వము లొకపక్షమునను, ఇంగ్లండు ఫ్రాన్సులు మరియొకపక్షమునను చేరి ద్వితీయ ప్రపంచసంగ్రామమును ప్రారంభించిరి. తురుష్కము ఎటువైపునను చేరకుండ యుద్ధములో జోక్యము కలుగజేసుకొనకుండ తటస్థముగా నుండినది. తురుష్కములోని జర్మనురాయబారి తురుష్కమును జర్మనులవైపుకు త్రిప్పవలెనని ప్రయత్నము చేసెను. గాని తురుష్కము దృఢమనస్సుతో తాటస్థ్యమును నిలబెట్టుకొనెను. కొంచెము బ్రిటిషుపక్షమునకే తురుష్కము మొగ్గియుండినను యుద్ధములోకి దిగలేదు. 1941 వ సంవత్సరము జనవరినెలలో ఆంగ్లేయ విదేశాంగమంత్రి

యగు ఆంథొని ఈడెన్ తురుష్కదేశమును సందర్శించినపుడు తురుష్క ప్రభుత్వము ఆయనకు గొప్ప స్వాగతమిచ్చి ఆదరించినది. ఆ సంవత్సరము జూన్ నెలలో జర్మనీ నాయకుడగు హెర్ హిట్లరు సోవియట్ రష్యాపై దండెత్తుటవలన సోవియట్ రష్యా, ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలతో చేరెను. అందువలన తురుష్కమునకు మరింత తీరికకలిగెను. తురుష్కము ఒకవైపున జర్మనీతోను, మరొకవైపున అమెరికాతోను, ఇంగ్లండుతోను కూడ వర్తకఒడంబడికలు చేసుకొన్నది. 1943, 1947 సంవత్సరములలో జరిగిన ఎన్నికలలో మరల ఇజ్మత్ యునోను అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. విదేశాంగమంత్రిగా పనిచేయుచుండిన షుక్రుసారకోగ్లు ప్రధానమంత్రి అయ్యెను. 1943 సంవత్సరము డిసెంబరునెలలో తురుష్క ప్రధానమంత్రి కైరోనగరమునకు పోయి అచ్చట ఆంగ్ల ప్రధానమంత్రియగు చర్చిలును, అమెరికా అధ్యక్షులైన రూజ్‌వెల్టును దర్శించి స్నేహమైన చర్చలు జరిపి తురుష్కమునకు వచ్చెను. గాని 1945 సంవత్సరమువరకు యుద్ధము జరిగినను, తనచుట్టునున్న ఆసియా యూరపుఖండములు దేశములన్నియు యుద్ధములో చిక్కుకొనినను తురుష్కము మాత్రము యుద్ధములో తన తాటస్థ్యమును పూర్తిగ నిలుపుకొని అందరితో స్నేహముగ నుండి తన శాంతియుతమైన అభివృద్ధిని సాగించుకున్నది. యుద్ధములో చిక్కుకొనిన దేశములవారికైనట్లు తురుష్కమునకు మనుష్యనష్టముగాని ధనవ్యయముగాని కాలేదు. యుద్ధము ముగియగనే 1945 సంవత్సరములో ఐక్యరాజ్య సమితి **United Nations Organisation** లో తురుష్కదేశము సభ్యరాలుగ చేరెను.

## డెమాక్రాటిక్ కక్షి

1947 ఎన్నికలలో డెమాక్రాటిక్‌కక్షి ప్రభుత్వమునకు వ్యతిరేకపక్షముగ తలయెత్తినది. 1950 వ సంవత్సరం మేనెలలో జరిగిన నూతన ఎన్నికలలో ఇజ్మత్ యునోనుయొక్క రిపబ్లికను ప్రజాపార్టీ యోడిపోయి డెమోక్రాటిక్‌పార్టీ అధికసంఖ్యాకులుగ నెన్నుకొనబడిరి. జెలాల్‌బేయరు అను నాయన తురుష్క ప్రజాస్వామ్యమున కధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఎడ్నాన్

మెండెరిస్ ప్రధానమంత్రిగ చేయబడెను. 1954 వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలోను, 1957 వ సంవత్సరమున జరిగిన ఎన్నికలలోనుకూడ డెమోక్రాటిక్ పార్టీవారే అధికసంఖ్యాకులుగా నెన్నుకొనబడిరి. ఇప్పటికిని జెలాల్ బేయర్ అధ్యక్షుడుగను, ఎద్నాన్ మెండెరిస్ ప్రధానమంత్రిగాను నుండి తురుష్కప్రభుత్వమును సాగించుచున్నారు. 1957 నుండి ఫాతిన్ రుష్టుజోరేల్ విదేశాంగమంత్రిగా నున్నాడు. కాని 1955 అక్టోబరులో డెమోక్రాటిక్ పార్టీ నుండి 19 మంది సభ్యులు రాజీనామానిచ్చి, వారును మరికొందరును కలిసి ఫ్రీడమ్‌పార్టీ అనుదానిని ఏర్పాటుచేసుకున్నారు. 1952 వ సంవత్సరములో మతగురువులు, మతావేశపరులైన బృందములు దేశములో కొంత చురుకుగా పనిచేసి ప్రభుత్వమును తలక్రిందుచేయ యత్నించెను. తురుష్కవిప్లవము వల్ల జరిగిన సాంఘికాభివృద్ధినంతను ఊడిచివేసి పాత ముస్లింపద్ధతిలోనికి తీసుకొనిపోవలెనని వీరి యుద్దేశ్యము. ఈ అభివృద్ధిని ప్రబోధించు పత్రికాధిపతియగు అహమద్‌యాల్మాను అనునాయనను హత్యగావించిరి. ప్రభుత్వము వెంటనే ఈ బృందమువారిలో చాలమందిని జైళ్ళలోపడవేసి ఈ అభివృద్ధి నిరోధకఉద్యమమును కఠినముగ నణచివేసెను. మరల ఈ బృందమువారు తలఎత్తలేదు. సైప్రస్ దేశముయొక్క స్వాతంత్ర్యసమస్యమీద తురుష్కమునకు గ్రీస్‌దేశమునకు తీవ్రమగు అభిప్రాయభేదమేర్పడెను. సైప్రసులో 4 లక్షల 17 వేలమంది గ్రీకులు 98 వేలమంది తురుష్కులు కాపురమున్నారు. ఆంగ్లేయులు ఇతరులుకలిసి 19 వేలమంది మాత్ర మున్నారు. మొత్తము మీద డెమోక్రాటిక్ పార్టీవారుకూడ శాంతియుతమైన విదేశాంగరాజనీతినే అవలంబించుచున్నారు. గాని కమ్యూనిజముయందు భీతికలిగి కమ్యూనిస్టు ప్రభుత్వములతో చేరక ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికాలవైపుకు మొగ్గియున్నారు. 1947 వ సంవత్సరములో అమెరికాప్రభుత్వమువారు తురుష్కదేశమునకు ఆర్థిక సైనిక సహాయమును ఎక్కువగ చేసియున్నారు.

## నాటో - బాగ్దాదు పాక్టు

1952 సంవత్సరమున తురుష్కదేశము అమెరికా ఇంగ్లాండు లేర్పరచిన నాటోలో (N. A. T. O.) ఉత్తరఅట్లాంటిక్ రక్షణబృందములో పూర్తిగచేరెను. 1955 వ సంవత్సరమున ఇరాకు (Iraq), ఇరాను (Iran),

పాకిస్తాన్, తురుష్కము, ఇంగ్లాండుదేశములు బాగ్దాద్ పొత్తును (Bagdad Pact) చేసుకొనెను. సోవియట్ రష్యాయొక్క పలుకుబడినుండి మధ్యప్రాచ్య దేశములను కాపాడుటయే వీరి యుద్దేశ్యము. అమెరికాయొక్క ప్రతినిధులు కూడ ఈ బాగ్దాద్ సంధియొక్క సభలకు హాజరై పూర్తి సహకారమును సలిపెదమని హామీనిచ్చిరి. కాని 1956 సంవత్సరము జులై నెలలో సూయజు కాలవవ్యవహారములో సూయజ్ కాలువను (Suez cannol) కల్నల్ నాజర్ అధ్యక్షతక్రింద ఈజిప్టుప్రభుత్వము జాతీయముగచేసి స్వాధీనపరచు కొనగనే ఆంగ్లేయ, ఫ్రెంచిసేనలు ఈజిప్టులోని పోర్టుసైడు రేవులోను సూయజుకాలవప్రాంతములోను ప్రవేశించినపుడు, బాగ్దాద్ సంధిలో చేరిన తురుష్కము, ఇరాకు, ఇరాను, పాకిస్తానుదేశములు తమప్రజలయభీష్టప్రకారము తమతోడి ముసల్మానుదేశమైన ఈజిప్టులోనే సానుభూతిని కనబరచి ఆంగ్లేయ,ఫ్రెంచిసైన్యములు వెంటనే ఈజిప్టుదేశమును వదలిపోవలెననియు, సూయజ్ కాలువయొక్క సమస్య ఈజిప్టుతో శాంతియుతముగ, సరసముగ ఈజిప్టుకు సూయజుకాలవమీదగల అధికారమునకు భంగకరముకానివిధముగ పరిష్కరింపబడవలెననియు తీర్మానించిరి. ఆ సంవత్సరము ఆఖరున ఇండియాయొక్కయు, సోవియట్ రష్యాయొక్కయు, అమెరికాయొక్కయు ఐక్యరాజ్యసమితియొక్కయు అభిప్రాయములనుబట్టి డిసెంబరునెలలో ఆంగ్లేయ, ఫ్రెంచిసేనలు ఈజిప్టును వదలిపోగా, 1957 వ సంవత్సరము జనవరినెలలో బాగ్దాద్ సంధిలో చేరిన పై నాలుగు ముస్లిమురాజ్యములును అంకారా (Ankara) నగరమున సమావేశమై తమయొక్క హర్షమును వెలిబుచ్చిరి.

## విదేశవ్యవహారములు

1957 వ సంవత్సరములో 20 కోట్ల డాలర్లను అమెరికాప్రభుత్వమువారు ఐసనుహోవరుసిద్ధాంతప్రకారముయిచ్చెదమన్న ఆర్థికసైనికసహాయముక్రింద తురుష్కము,ఇరాకు,ఇరాను, పాకిస్తానుదేశములప్రభుత్వములకు పంచిపెట్టిరి. ఇంగ్లాండుకూడ 20 లక్షల సవరసులను తురుష్కదేశమునకిచ్చెను. ఈ విధముగ తురుష్కదేశము తన విదేశాంగనీతిలో దినదినమునకు సోవియట్ రష్యాకు వ్యతిరేకముగను, ఇంగ్లాండు అమెరికాలకు అనుకూలముగను తన

స్నేహసంబంధములను దృఢపరచుకొన్నది. 1957 సంవత్సరము ఏప్రిలు నెలలో అఫ్ఘనిస్తాన్ ప్రధానమంత్రి తురుష్కదేశమును దర్శించెను. ఆ రెండుప్రభుత్వములకును స్నేహసంబంధములు గట్టిపరచబడెను. ఆ సంవత్సరము మేనెలలో తురుష్కమునకును, పశ్చిమ జర్మనీకిని వైజ్ఞానిక, వర్తకసంధి ఏర్పడెను.

## వ్యవసాయము

తురుష్కము మంచి వ్యవసాయదేశములలో నొకటి. అనాదినుండి గల గృహపరిశ్రమలు, చేతిపనులు పాశ్చాత్యసరకుల పోటీవల్ల చాలవరకు నాశనమైనపిమ్మట తురుష్కము కేవలము వ్యవసాయదేశమైనది. ఆ దేశమునందు ఫలవంతములైన భూములు కలవు. పండ్లు బాగుగ ఫలించును. కొన్ని మంచినదులు, సరస్సులు కలవు. అడవులు, గనులు గలవు. అభివృద్ధికెంతయో అవకాశముకలదు. హిందూదేశములోవలెనే పురుషులును, స్త్రీలును పొలములకుపోయి కష్టపడి పనిచేసెదరు. జాతీయప్రభుత్వమువారు వ్యవసాయాభివృద్ధిని ప్రధానశాఖగా పెట్టుకొని రైతులయోగక్షేమములకై ఎన్నియో విధముల కృషిసలుపుచున్నారు. వ్యవసాయబ్యాంకీలను స్థాపించి వాటిలోనుండి రైతులకు అప్పులిచ్చుచున్నారు. బీదరైతులకు ఉచితముగ విత్తనములను, ఎరువులను, వ్యవసాయపనిముట్లను పంచిపెట్టుచున్నారు. పరపతిసంఘములను చాలగ స్థాపించుచున్నారు. పాత జలాధారములను వృద్ధిపరచి నదులమీద నూతనముగ ఆనకట్టలను కట్టి నూతన జలాధారముల నేర్పాటుగావించుచున్నారు. దేశముయొక్క వివిధభాగములలో వ్యవసాయికపాఠశాలలను, కళాశాలలను స్థాపించి అచట నుచితముగ వ్యవసాయవిద్యను నేర్పుచున్నారు. వ్యవసాయములో నూతనపద్ధతులు, క్రొత్తరకపుఎరువులు వేయుట, క్రొత్తరకపు వ్యవసాయయంత్రముల నుపయోగించుట మొదలైన విషయములను నేర్పుచున్నారు. జాతీయప్రభుత్వ అధ్యక్షుడగు ముస్తఫా కెమాల్‌పాషా పెద్ద విస్తీర్ణముగల కృషిక్షేత్రమును స్థాపించి స్వయముగ వ్యవసాయమును శ్రేష్టమైనపద్ధతులమీద చేయించినాడు. తీరిక కలిగినప్పుడెల్ల ఆయన ఆ క్షేత్రమునకు వచ్చి వ్యవసాయములో స్వయముగ పని చేయుచుండెను. ప్రభుత్వమువారు అనేకచోట్ల వ్యవసాయప్రదర్శనాక్షేత్ర

ములను ఏర్పాటుచేసియున్నారు. కొలది సంవత్సరములలో దేశముయొక్క అనేకభాగములలో వ్యవసాయము అత్యంతముగ వృద్ధిచెందెను. పైరు పంటల సంపద బాగుగ వికసించినది. మంచిఫలములు ఫలించుటతోటయుకూడ చాలగ వృద్ధియైనవి. మామూలు పరిస్థితులలో దేశమునకు ఆహారములో కొదువలేదు. కొద్దిగనో గొప్పగనో మిగిల్చి విదేశములకు ఎగుమతిచేయుశక్తికూడ కలదు. 1951 వ సంవత్సరములో వ్యవసాయముక్రిందనున్న భూమి 1,66,00,000 హెక్టారులుగా నుండగ 1957వ సంవత్సరములో 2,25,00,000 హెక్టారులకు వృద్ధిచెందినది. తురుష్క-ప్రభుత్వముక్రిందనున్న వ్యవసాయికబ్యాంకి 1957 వ సంవత్సరములో 194 కోట్ల తురుష్క-పౌండ్లను వ్యవసాయికులకు ఋణములుగా నిచ్చియున్నారు. తురుష్క-పౌండు 1-11/14 రూప్యములకు సరిపోవును.

## ఖనిజసంపద

గత అయిదుసంవత్సరములలో తురుష్కములో తీయబడిన ఖనిజములమొత్తము నూటికి 40 పాళ్ల వృద్ధియైనది. 1951 వ సంవత్సరములో ఇనుము 2,26,000 టన్నులు ఉత్పత్తికాగా 1956 సంవత్సరములో 9,54,000 టన్నులు ఉత్పత్తియైనది. రాతిసిబొగ్గు 1951 వ సంవత్సరములో 47,30,000 టన్నులు ఉత్పత్తికాగా 1956 వ సంవత్సరములో 58,87,000 టన్నులు ఉత్పత్తియైనది. రాగి 1951 వ సంవత్సరములో 14 వేల టన్నులు ఉత్పత్తికాగా 1956 వ సంవత్సరములో 2,41,000 టన్నులు ఉత్పత్తియైనది. లిగ్నైటు 1951 సం॥లో 12,57,000 టన్నులు ఉత్పత్తికాగా,1956 వ సంవత్సరములో 34,13,000 టన్నులు ఉత్పత్తియైనది. ఈవిధముగ గనులసంపద యెక్కువగ పెరుగుచున్నది.

## (4)
## పరిశ్రమాభివృద్ధి

డెమోక్రాటు పార్టీవారు ప్రభుత్వములోకి వచ్చినతరువాత పరిశ్రమలన్నియు జాతీయముగ నుండవలెనను సిద్ధాంతములు వదలిపెట్టినారు. వ్యక్తులకును, కంపెనీలకును పరిశ్రమలనునడుపు హక్కుల నిచ్చుచున్నారు. విదేశకంపెనీలకన్న తురుష్క-కంపెనీలకు ఎక్కువ అవకాశములు కలుగచేయు

చున్నమాట వాస్తవమే. అయినను విదేశపెట్టుబడులనుగూర్చి భయపడుట లేదు. అందువల్ల దేశములో విదేశ స్వదేశపెట్టుబడులక్రిందను, ప్రభుత్వ పెట్టుబడులక్రిందను పరిశ్రమలు త్వరితముగ వృద్ధిచెందుచున్నవి. 1951 వ సంవత్సరములో సిమెంటు 3 లక్షల 96 వేల టన్నులు తయారుచేయబడగ 1956 వ సంవత్సరములో 9 లక్షల 72 వేల టన్నులు తయారుచేయబడినవి. పంచదార 1951 వ సంవత్సరములో 1 లక్ష 86 వేల టన్నులు తయారు చేయబడగ 1956 వ సంవత్సరములో 2 లక్షల 77 వేల టన్నులు తయారుచేయ బడ్డది. ఇనుపసరుకు 1951వ సంవత్సరములో 1లక్ష 35వేల టన్నులు తయారు కాగా 1956 వ సంవత్సరములో 1 లక్ష 92 వేల టన్నులు తయారైనది. ముతకఇనుపసరుకుకూడ 1951 వ సంవత్సరములో 1 లక్ష 53 వేల టన్నులు తయారుకాగా 1956 వ సంవత్సరములో 2 లక్షల 16 వేల టన్నులు తయారైనది. ఇటులనే కాగితములు, పొగాకు సరకులు చాల వృద్ధిచెందినవి. పరిశ్రమలకు సంబంధించిన ఫ్యాక్టరీలు 1950 వ సంవత్సరములో 2,335 ఉండగ 1954 వ సంవత్సరములో 4,527 ఐనవి. నేడు పరిశ్రమలలో పది లక్షలమందిప్రజలు పనిచేయుచున్నారు.

## పెట్రోలునూనె

తురుష్కదేశముయొక్క ఆగ్నేయప్రాంతములో పెట్రోలియంనూనె గనులు కనుగొనబడినవి. 1954వ సంవత్సరములో తురుష్కములో 60,000 ల టన్నుల పెట్రోలియంనూనె తీయబడగ 1956 వ సంవత్సరములో 3 లక్షల టన్నులనూనె తీయబడినది. 1956 వ సంవత్సరము నవంబరునెలలో బ్రిటిషు పెట్రోలియం కాల్టెక్సు అండ్ షెల్ సంఘమువారితో పెట్రోలియంవిషయములో ఎక్కువగ తయారుచేయుటకును, పరిశుద్ధిచేయు టకును ఒక యొడంబడిక తురుష్కప్రభుత్వము చేసుకొన్నది.

## విద్యుచ్ఛక్తి

విద్యుచ్ఛక్తిఉత్పత్తివిషయములోకూడ తురుష్కప్రభుత్వము చాల ఎక్కువ శ్రద్ధ వహించుచున్నది. నదులమీద ఆనకట్టలుకట్టి విద్యు చ్ఛక్తి ఉత్పత్తిచేయు పద్ధతులు ఎక్కువగా ఏర్పాటుచేయు

బడుచున్నవి. సకేరియోనదిమీద ఒక విద్యుచ్ఛక్తియుత్పత్తిచేయుప్రాజెక్టు, సెయ్‌హాన్‌నదిమీద మరియొక విద్యుచ్ఛక్తిప్రాజెక్టు పెట్టబడ్డిన నిర్మాణము చేయబడినవి. ఇతర నదులమీదకూడ విద్యుచ్ఛక్తినిర్మాణములు చేయబడుచున్నవి. 1950 వ సంవత్సరములో 79 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కాగా 1957 వ సంవత్సరములో 180 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తియైనది.

## బ్యాంకులు

సెంట్రలుబ్యాంకు అనునది ప్రభుత్వబ్యాంకు. అది 1931 వ సంవత్సరమున స్థాపితమైనది. దానికే కరెన్సీనోట్లు, నాణెముల చెలామణిఅధికారము కలదు. దానిక్రింద 11 ప్రభుత్వబ్యాంకులు కలవు. ఇదికాక 1950 వ సంవత్సరమునుంచి కొన్ని ప్రయివేటుబ్యాంకులుకూడ స్థాపింపబడినవి.

## ఆదాయవ్యయములు

1958-59 సంవత్సరమునకు తురుష్క-ప్రభుత్వముయొక్క ఆదాయము 557 కోట్లు తురుష్క-పౌండ్లు. ఖర్చుకూడ దాదాపుగ అంతే. 1958 వ సంవత్సరము జూన్‌నెలాఖరువరకు అమెరికావారు తురుష్కమునకుచేసిన సహాయము 60 కోట్ల డాలర్లయియున్నది. 1955 వ సంవత్సరమునుంచి విదేశ వర్తకములో దిగుమతులను తగ్గించి ఎగుమతులను వీలైనంత వృద్ధిచేయవలెనని ప్రయత్నముచేయుచున్నారు.

## విశ్వవిద్యాలయములు

ఇస్తాంబుల్ (Istanbul)అన్నిటికన్న ప్రాచీనమైనది. దానిని తురుష్క-జాతీయప్రభుత్వమువారు వృద్ధిచేసియున్నారు. ఆర్థికశాస్త్రము, ధర్మశాస్త్రము, వైద్యప్రకృతిశాస్త్రములు, అటవీశాస్త్రము నేర్పు శాఖలను చేర్చియున్నారు. ఈ విశ్వవిద్యాలయములో నేడు 8,846 మంది బాలురును, 2,639 బాలికలును చదువుకొనుచున్నారు. దానికి తరువాత ఏర్పడ్డది ఇస్తాంబులు సాంకేతికవిద్యల విశ్వవిద్యాలయము. అచటకూడ సివిలు ఇంజనీరింగు, శిల్పశాస్త్రము, మెకానికల్ ఇంజనీరింగు, విద్యుచ్ఛక్తిఇంజనీరింగు, గనులఇంజనీరింగు నేర్పబడు

చున్నవి. అచట విద్యార్థులు, విద్యార్థినులు కలసి 2,218 మంది కలరు. 1946 వ సంవత్సరములో అంకారానగరమునందు అంకారా విశ్వవిద్యాలయము స్థాపించబడినది. ప్రకృతిశాస్త్రములు, వైద్యము, పశువైద్యము, వ్యవసాయము, మతవిద్య, రాజకీయశాస్త్రములు మొదలైనవి నేర్పబడు చున్నవి. ఇందులో 11,244 గురు బాలురును, 1,863 మంది బాలికలును చదువుచున్నారు. ఆటా టర్క్ విశ్వవిద్యాలయమును 1957 వ సంవత్సరములో ఎర్జెరం (Erzerem) పట్టణమునందు స్థాపించియున్నారు. దీనిలో ప్రకృతిశాస్త్రములు, వ్యవసాయము, భాషావిషయములు ముఖ్యముగానున్నవి. ఇంకను ఇతరశాస్త్రములుకూడ క్రమేణ నేర్పబడును. 1955 వ సంవత్సరములో కరేడియన్ విశ్వవిద్యాలయము స్థాపించబడ్డది. ప్రస్తుతము వైద్యము, వ్యవసాయము, ఈ విశ్వవిద్యాలయములో నేర్పబడుచున్నవి. 1957 వ సంవత్సరములో మధ్యప్రాచ్య సాంకేతిక విశ్వవిద్యాలయము అంకారాకు సమీపమున స్థాపించబడ్డది. ఇందులో మెకానికల్ ఇంజనీరింగు, శిల్పశాస్త్రము, పారిశ్రామిక నిర్వహణము, వ్యవసాయము, అటవీశాస్త్రము నేర్పబడును. ట్రెపెజాన్ (Trepojon) నగరమునందుకూడ ఒక సాంకేతిక విశ్వవిద్యాలయమును నిర్మించుచున్నారు. ఇవి కాక రాబర్ట్ (Robert) కళాశాల, ఘాజీ (Gazi) విద్యాలయము, ఇస్తాంబులులోని ఆర్థిక వ్యాపారశాస్త్రముల విద్యాలయముకూడ బాగుగ పనిచేయుచున్నవి.

## గ్రంథాలయములు

ఇవిగాక పెక్కుచోట్ల పెద్దపెద్ద గ్రంథాలయములును, వైజ్ఞానికసంఘములును, పరిశోధనాలయములును స్థాపింపబడినవి. (తురుష్క చారిత్రక పరిశోధనాసంఘమువారు తురుష్కభాషలో నాలుగుసంపుటములుగల ప్రఖ్యాతవంతమగు ప్రపంచచరిత్రను ప్రచురించియున్నారు. అందులో తురుష్క స్వతంత్రపోరాటపుచరిత్రకు ముఖ్యస్థాన మివ్వబడినది. దానిని ఉత్తమ పాఠశాలలన్నిటిలో విద్యార్థులకు నిర్బంధ పఠనీయగ్రంథముగా గావించినారు.) అంకారా విశ్వవిద్యాలయముయొక్క గొప్పగ్రంథాలయములో 3 లక్షల 26 వేల గ్రంథములు గలవు. దానికి జీరియా ఫ్రెడాల్‌గారు డైరెక్టరుగానున్నారు. ఇస్తాంబులులోని బెయాజిత్ గ్రంథాలయములో అన్నిభాషల

లోను 65 వేల గ్రంథములున్నవి. అంకారాలో 1955లో స్థాపింపబడిన హాల్కేవి గ్రంథాలయములో 20 వేల గ్రంథములు గలవు. ఇజ్మీరు గ్రంథాలయములో 50 వేలగ్రంథములున్నవి. ఇస్తాంబులు విశ్వవిద్యాలయపు గ్రంథాలయములో 1 లక్ష 87 వేల గ్రంథములు గలవు. తురుష్క గ్రాండు నేషనల్ ఎసెంబ్లీ గ్రంథాయములో తురుష్కభాషలో 43 వేల 5 వందల గ్రంథములును, యూరోపియన్ భాషలలో 49 వేల గ్రంథములును, అరబ్బీ భాషలో 400 ల గ్రంథములును కలవు. అంకారాలో 1946 వ సంవత్సరమున స్థాపింపబడిన నేషనల్ లైబ్రరీలో 3 లక్షల 50 వేల గ్రంథములు గలవు. అచట కళలకు ప్రకృతిశాస్త్రములకు సంబంధించిన పరిశోధనలు జరుగుటకు అవకాశములు కలుగచేయబడినవి. అంకారాలో 1922 లో స్థాపింపబడిన పబ్లిక్ లైబ్రరీలో 32,000 గ్రంథములు గలవు. 1947 వ సంవత్సరములో కారియాలో స్థాపింపబడిన పబ్లికు గ్రంథాలయములో 20 వేల గ్రంథములు గలవు. ఇటుల గొప్ప గ్రంథాలయములు గలవు. అంకారాలో 1923 వ సంవత్సరమునను, ఇస్తాంబులులో 1934 వ సంవత్సరములోను నూతనముగ చిత్రవస్తుప్రదర్శనశాలలు స్థాపింపబడెను, ఇంకా ననేక చోట్ల చిత్రవస్తుశాలలు గలవు. ప్రతిబస్తీలోను చాల పల్లెటూళ్ళలోను పఠన మందిరములు, చిన్నగ్రంథాలయములు స్థాపింపబడినవి.

## పత్రికలు

తురుష్క దేశములో 35 దినపత్రికలు కలవు. 34 వారపత్రికలుకలవు. ఇందులో 23 దినపత్రికలు ఇస్తాంబులులోను, మూడు దినపత్రికలు అంకారాలోను కలవు. 14 వారపత్రికలు ఇస్తాంబులులోను 6 వారపత్రికలు అంకారాలోను కలవు. 56 మాసవారీపత్రికలుకూడ గలవు.

## రైళ్లు, రోడ్లు

రైల్వేయువిషయములోను రోడ్లనువేయు విషయములోను తురుష్కప్రభుత్వమువారు ఎక్కువ శ్రద్ధవహించినారు. 1923 వ సంవత్సరమునుంచికూడ రైలువేలు స్వంతముగ వేసియున్నారు. 1957-58 బడ్జెటులో 10 కోట్ల రూపాయలను రైలువేల అభివృద్ధికొరకు ఏర్పాటుచేసి

యున్నారు. 1923వ సంవత్సరములో 11,450 మైళ్ళరోడ్లు వేయబడియుండగా 1956 వ సంవత్సరమునకు 45,790 మైళ్ళ రోడ్లు ఏర్పడ్డవి. 1957 వ సంవత్సరములో మరియొక క్రొత్తకార్యక్రమముప్రకారము ఇంకను 15,300 మైళ్ళ రోడ్లు వేయవలెనని తీర్మానించియున్నారు.

హైవేరోడ్లనువేయునిమిత్తము 35 కోట్ల రూపాయలను ఈయేడు బడ్జెటులో వేసినారు. స్వతంత్రమురాగానే తురుష్కములోని విదేశ పోస్టాఫీసులన్నియు మూసివేయబడినవి. తురుష్కజాతీయప్రభుత్వమువారు దేశములో పోస్టాఫీసులను టెలిగ్రాపుఆఫీసులను విశేషముగ వృద్ధిచేసియున్నారు. ఇటుల తురుష్కదేశము తమ స్వరాజ్యప్రభుత్వముక్రింద సర్వవిధముల సత్వరముగ శాంతియుతముగ అభివృద్ధిచెందుచున్నది.



# మధ్యప్రాచ్యదేశములు

[MIDDLE EAST]

(1)

(1) తురుష్కము, (2) ఇరాను (పర్షియా), (3) అరబుదేశములు మధ్యప్రాచ్యదేశములుగ పెంచబడుచున్నవి. ఈ దేశములలో సోవియటు రష్యాయొక్క పలుకుబడి ఏమాత్రము స్థాపింపబడకుండ, తమ పలుకుబడి, యాజమాన్యములు నుండునట్లు అమెరికా, ఇంగ్లాండుప్రభుత్వములు తీవ్ర కృషిని సలుపుచున్నవి. ఈదేశములలోని పెట్రోలియముగనులు ఇంగ్లాండుకు, అమెరికాకు చాల ముఖ్యము. అమెరికా ఈ దేశములను తమ పలుకుబడిక్రింద నుంచుకొనుటకై ఎంతసొమ్మైనను ఖర్చుచేయుచున్నది. ఇంగ్లాండుకూడ చాల సొమ్ము ఖర్చుచేయుచున్నది.

## అరబుదేశములు

ఇందులో నాలుగు స్వతంత్రఅరబుదేశములు, అయిదు మాండేటు దేశములు, ఇంకను కొన్ని మరీ చిన్నరాజ్యములు చేరియున్నవి. నాలుగు స్వతంత్రదేశము లేవనగ : (1) ఈజిప్టు, (2) సూడాను, (3) లిబియా, (4) సౌదిఅరేబియాదేశములు. మొదటి ప్రపంచయుద్ధము ముగియగనే తురుష్కమునుంచి లాగుకొని ఆంగ్లేయ, ఫ్రెంచి మాండేటుప్రభుత్వముల క్రింద నుంచబడిన అయిదుదేశములలో (1) ఇరాకు, (2) జోర్డాన్, (3) పాలస్తైన్ దేశములు ఆంగ్లేయపాలనముక్రిందను, (4) సిరియా, (5) లెబనాన్ దేశములు ఫ్రెంచిపాలనముక్రిందను నుంచబడినవి. 1918 లో సిరియాను ఫ్రెంచిమాండేటుక్రింద నుంచినను, పిమ్మట అచట ఫ్రెంచివారిపై అరబ్బులతిరుగబా టెక్కువగ నున్నందున సిరియాలోభాగమైన లెబనాన్ ప్రాంతములో క్రైస్తవు లెక్కువగ కాపురమున్నారను మిషతో దానిని

సిరియానుండి విడదీసి, ప్రత్యేక లెబనాన్ దేశముగచేసి, సిరియాతోపాటు లెబనాన్‌నుకూడ ఫ్రెంచివారి మాండేటుపాలనక్రింద నుంచినారు. ఇవిగాక కువైటు, ఏమెన్, మస్కటు, ఓమాన్, బహరేన్, కాటార్, ఏడెన్ మొదలుగాగల బహుచిన్నఅరబురాజ్యములు బ్రిటిషువారిసంరక్షకరాజ్యములుగ గాని బ్రిటిషువారితో ఒడంబడికలుజరుపుకొనినవిగ గాని యున్నవి.

ఆంగ్లేయమాండేటుక్రిందనుంచబడిన పాలస్తైన్ దేశమును ప్రపంచములోని యూదులందరువచ్చి కాపురముండుటకై యూదుల గృహముగ మిత్రమండలిచే గావించబడినందున ఆ దేశములో లక్షలకొలది యూదులు వచ్చి కాపురముండసాగిరి. అచట సర్వాధికసంఖ్యాకులుగనున్న అరబు ముసల్మానులు యూదులు రాకుండ ప్రతిఘటించసాగిరి. ఆంగ్లేయులు ఉభయులకు రాజీ కుదర్చలేకపోయిరి. ఐక్యరాజ్యసమితివలన పాలస్తైన్‌లోని ప్రధానభాగమును ఇస్రాయిలుదేశముగ విడదీసి యూదుల స్వతంత్రరిపబ్లికుగా గావించి మిగత కొద్దిభాగములను జోర్డానులోను, ఈజిప్టులోను కలిపిరి. ఇంతటితో సమస్య తేలలేదు. ఇస్రాయిలులో యూదులు అత్యధికసంఖ్యాకులుగ వచ్చి చేరిరి. అరబ్‌లభూములను ఎంతసొమ్మైన నిచ్చి విక్రయమునుపొందిరి. ప్రతిఘటించిన అరబ్‌గ్రామములను తగలబెట్టి 9 లక్షలమంది అరబులను వెళ్ళగొట్టిరి. వారందరు లెబనానులో, జోర్డనులో, సిరియాలో కాందిశీకులుగ నున్నారు. ఇస్రాయిలులో నేడు 17 కోట్ల 50 లక్షల యూదులు, ఒక లక్ష ఏబదివేలు అరబులు నున్నారు. అరబుదేశములన్నియు ఐక్యతచెంది ఇస్రాయిలును నాశనముచెయ్యవలెనని యత్నించుచున్నవి. అరబుదేశములను ఏకముగాకుండ ఆంగ్లో-అమెరికనులు ప్రయత్నములు చేయుచున్నారు. అరబుదేశముల ఐక్యత, ఇస్రాయిలుయొక్క స్థాపనము, మధ్యప్రాచ్యదేశముల ప్రధానసమస్యగ నున్నవి. మరియొకవైపున రష్యా, అమెరికా బ్లాకులు మధ్యప్రాచ్యదేశములలో తమతమ పలుకుబడిని స్థాపించుకొను సమస్య యున్నది.

## పెట్రోలియంనూనెగనులు

ఈ మధ్యప్రాచ్యదేశములలో సౌదిఅరేబియా, ఇరాకు, ఇరానుదేశములలోను కువైటు సంరక్షకరాజ్యములోను మిగుల ప్రసిద్ధికెక్కిన పెట్రో

లియంనూనెగనులు గలవు. విశేషముగ పెట్రోలియంనూనె తీయబడుచున్నది. మిగిలినదేశములలోకూడ నూనెగనులు కనిపెట్టుటకు అన్వేషణములు జరుగుచున్నవి. కొన్నిచోట్ల కొన్నికంపెనీలు కనిపెట్టి త్రవ్వకము ప్రారంభించినవి. 1956 వ సంవత్సరపు లెంకెలప్రకారం మీ క్రిందివిధముగ పెట్రోలు తీయబడినది.

(1) కువైటులో 5 కోట్ల 41 లక్షలటన్నులు, (2) సౌది అరేబియాలో 4 కోట్ల 79 లక్షలటన్నులు, (3) ఇరాకులో 3 కోట్ల 10 లక్షలటన్నులు, (4) ఇరానులో 2 కోట్ల 70 లక్షలటన్నులు (5) కాటార్‌లో 58 లక్షలటన్నులు, (6) బహరేన్‌లో 20 లక్షలటన్నులు, (7) ఈజిప్టులో 19 లక్షలటన్నులు, (8) టర్కీలో 2 లక్షల ఏబదివేలటన్నుల పెట్రోలియం లభించెను.

## కువైటు

కువైటురాజ్యము ఇపుడు షేకు అబ్దుల్లా ఎస్ సలీమ్ అను రాజుచే పాలించబడుచున్నది. ఆయన బ్రిటిషువారిసంరక్షకత్వముక్రింద నున్నాడు. దీనివైశాల్యము 5,800 చదరపుమైళ్ళు. జనసంఖ్య రెండులక్షల ఆరువేలు. ఇందులో రాజధానియగు కువైటుపట్టణములో ఒక లక్ష ఏబదివేలమంది జనసంఖ్య గలదు. ఈ రాజ్యములోని పెట్రోలియం యావత్తు ఆంగ్లో అమెరికనుకంపెనీలచేత త్రవ్వి తీయబడుచున్నది. ఈ కంపెనీలకు కౌలు 2026 సంవత్సరమువర కున్నది. ఒక విమానస్టేషనుకూడ కువైటుపట్టణములో కలదు. ఈ రాజ్యమునకు ఈ పెట్రోలుకంపెనీలవా రిచ్చెడు కౌలు మొత్తమే ముఖ్యమైన ఆదాయమైయున్నది.

## ఇరాను

తురుష్కమునుగూర్చి మరల నిచట చెప్పవలసినపనిలేదు. ఇరానునుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. 1923 వ సంవత్సరములో ఇరానుయొక్క జాతీయనాయకుడగు రెజాఖాన్ పెహల్వి ఇరానుప్రభుత్వమునకు ప్రధానమంత్రి అయ్యెను. 1925 లో ఇరానుయొక్క షా (రాజు)ను వెళ్ళగొట్టిరి. ఇరానుమజ్లీసు (పార్లమెంటు) వారు రెజాఖాన్ పెహల్వీని షాను

గావించిరి. ఆయన రెజాషా పెహల్వీ యను బిరుదమునొందెను. దేశము నంతను ప్రభుత్వముక్రిందికి బాగుగ తెచ్చి, శాంతిని నెలకొల్పి విదేశప్రభుత్వములను లక్ష్యపెట్టక స్వతంత్రపరిపాలనను గావించెను. అభివృద్ధికరమైన సంస్కరణములను గావించెను. స్త్రీలకు ఘోషాను లేకుండ రద్దుపరచెను. విదేశస్థులకుగల ప్రత్యేకహక్కులన్నిటిని తీసివేసెను. ఇరానుప్రజలకు స్వతంత్రభావమును ఆత్మగౌరవమును కలుగచేసెను. 1932 వ సంవత్సరములో ఆంగ్లో-పర్షియను నూనెకంపెనీ యను పేరుగల బ్రిటిషుకంపెనీ యొక్క కౌలును రద్దుపరచి ఆ కంపెనీక్రిందనున్న పెట్రోలియంనూనెగనుల నన్నిటిని జాతీయముచేసి స్వాధీనపర్చుకొనెను. ఇవి ఆంగ్లేయుల కతి ముఖ్యమైనవి. ఇంగ్లాండులో గోలపుట్టినది. ఆంగ్లేయప్రభుత్వము ఇరానుప్రభుత్వము పైన అప్పటికి అంతర్జాతీయవ్యవహారములను నిర్వర్తించుచున్న అంతర్జాతీయ సమితి (League of Nations) కి ఫిర్యాదుచేసుకున్నది. తుద కీ వ్యవహారము రాజీగా 1933 వ సంవత్సరములో పరిష్కారమై ఆ కంపెనీకి, పెట్రోలుత్రవ్వకానుప్రాంతముయొక్క వైశాల్యమునుతగ్గించి, కంపెనీవారు ఇరానుప్రభుత్వమునకు చెల్లించు కౌలుసొమ్మును ఎక్కువచేసి, 60 సంవత్సరముల క్రొత్తకౌలును ఇప్పించిరి. రెజాషా పెహల్వీ ఆంగ్లేయులను విశ్వసించక, తన కుద్యోగస్థులుగ జర్మనులను నియమించుకొనెను. 1939 సంవత్సరములో ద్వితీయ ప్రపంచసంగ్రామము ప్రారంభమైనపిమ్మట రెజాషా తన దేశముయొక్క తాటస్థ్యమును ప్రకటించెను. ఆయనక్రింద యుద్యోగములలోనున్న జర్మనులను తీసివేయవలెనని బ్రిటిషువారు కోరగ నిరాకరించెను. అందుమీద ఆంగ్లో-సోవియట్ సేనలు 1941 సంవత్సరము ఆగష్టు నెలలో ఇరానుపై దండెత్తి ఇరానులో ప్రవేశించినవి. రెజాషా పెహల్వీ తన సింహాసనమును త్యజించి తన కుమారుడైన మహమ్మదు రెజా పెహల్వీని ఇరానుకు షా (రాజు)ను జేసి దేశమును వదలివెళ్ళెను. ఆయన కొంత కాలము దక్షిణఅమెరికాలో కాపురమున్నాడు. ఇటీవలనే పరమపదించినాడు. షా మహమ్మదు రెజా ఆంగ్లేయులతోను సోవియటురష్యాతోను సంధి చేసికొని జర్మనులను వెళ్ళగొట్టెను. అప్పటినుంచి ఆంగ్లో-అమెరికనులు చెప్పినచొప్పున నడచుచున్నాడు. ప్రజలలో జాతీయభావము వృద్ధియై ఆంగ్లే

యులపట్ల వ్యతిరేకత ప్రబలెను. 1950 లో అమెరికావారు ఇరానుప్రభుత్వమునకు రెండుకోట్ల ఏబదిలక్షల డాలర్ల ఋణమును, అయిదులక్షల డాలర్లను ఉచితముగాను ఇచ్చిరి. గాని ప్రజలలో షాయందు ఆయనప్రభుత్వమునందు వ్యతిరేకభావమే వృద్ధియైనది. టూ దే పార్టీ యను పేరుగల కమ్యూనిస్టుపార్టీ ఇరానుపార్లమెంటులో కొంత బలపడెను. 1951 లో ఇరాను పార్లమెంటువారు ఇరానులోని పెట్రోలియమునూనెగనులనన్నిటిని జాతీయముగావించి స్వాధీనపర్చుకోవలెనని తీర్మానించిరి. అటుల జాతీయముచేయవలెనను కక్షికి నాయకుడైన డాక్టరు ముసాదికు ప్రధానమంత్రి అయ్యెను. ఆంగ్లో-పర్షియను నూనెకంపెనీవారు తమయొక్క కౌలు చెల్లవలెనని ఐక్యరాజ్యసమితియొక్క సెక్యూరిటీకౌన్సిలుకు ఫిర్యాదుచేసుకొనిరి. ప్రయోజనము లేకపోయెను. డాక్టరు ముసాదికు నూనెకంపెనీయుద్యోగస్థులను వెడలగొట్టి, నూనెగనులనన్నిటిని స్వాధీనమునుపొందెను. ఈ నూనెకంపెనీవ్యవహారము పరిష్కారముకానిది తా మెట్టి ఆర్థికసహాయమును చేయజాలమని అమెరికా బెదరించెను. అదికూడ నిష్ప్రయోజనమయ్యెను. అమెరికావారిసహాయముతో షా ఇరానులో డాక్టరు ముసాదికుకు వ్యతిరేకముగ మరియొకపార్టీని లేవదీసెను. అల్లరులు జరిగెను, 1953 లో షాయును ఆయనభార్యయు దేశమును విడిచి పారిపోయిరి. తాను డాక్టరు ముసాదికును ప్రధానమంత్రిత్వమునుండి తొలగించితిననియు, జనరలు జహేదిని ప్రధానమంత్రిగా గావించితిననియు, షా ప్రకటించెను. జనరలు జహేది సైనికసహాయముచే ప్రభుత్వమును స్వాధీనపర్చుకొని ప్రధానమంత్రియై డాక్టరు ముసాదికును, ఆయనపక్షముఖ్యులను అరెస్టుగావించెను. షాయును ఆయనభార్యయును దేశములోకి మరలివచ్చిరి. ఆయన మరల అమెరికావారిసహాయము కోరెను. అమెరికావారు ఇరానుప్రభుత్వమునకు వెంటనే 4కోట్లడాలర్లను ఉచితముగ నిచ్చిరి.అవసరమైన సైనికసహాయమునుకూడ వాగ్దత్తముచేసిరి. డాక్టరు ముసాదికును విచారణచేసి మూడుసంవత్సరముల శిక్షవిధించిరి. 1953 డిశంబరులో ఇరాను ప్రభుత్వము ఆంగ్లో-అమెరికను నూనెకంపెనీలకు నూనెగనులను నలుబది సంవత్సరముల కౌలునిచ్చిరి. దీనిని ఇరాను పార్లమెంటువారు ఖాయపర్చిరి. దేశములో శాంతి నెలకొల్పబడెను. టూడే పార్టీని అక్రమసంఘమని నిషే

ధించిరి. గాని మరల అశాంతి ప్రబలినందున 1955 లో జనరలు జహేది రాజీనామానిచ్చెను. హుస్సేన్ ఆలా అను నాయనను షా ప్రధానమంత్రిగా చేసెను. ఆ సంవత్సరము ఇరాను బాగ్దాదు పాక్టులో చేరెను. ఇది ఇరాను, ఇరాకు, టర్కీ, పాకిస్తాను, ఇంగ్లాండు దేశములు పరస్పర ఆర్థిక సైనికసహాయముకై చేసుకున్న ఒడంబడిక. దీనిని ఇరాకు రాజధానియగు బాగ్దాదునగరములో చేసుకొనిరి. సోవియటు పలుకుబడి మధ్యప్రాచ్యములో వ్యాపించకుండ అరికట్టుట దీని ముఖ్యోద్దేశ్యము. దీనిని అమెరికా బలపర్చెను. ఆర్థిక ఇబ్బందులు తొలగించుటకై అమెరికావారు 1956వ సంవత్సరమువరకు నాలుగుసంవత్సరములలో ఇరాను ప్రభుత్వమునకు మొత్తము నలుబదికోట్ల డాలర్లను ఆర్థిక సైనికసహాయముక్రింద నిచ్చిరి. 1956 లో షా సోవియటు రష్యానుకూడ దర్శించి కొంతవరకు స్నేహసంబంధముల నేర్పరచుకొని సరిహద్దుతగాదాలను పరిష్కరించుకొని వచ్చెను. 1957 లో ఐసనుహోవరు సిద్ధాంతము నంగీకరించి, ఇరాను ప్రభుత్వము కొంత సహాయమును పొందినది. మధ్యప్రాచ్యములోని దేశముల స్వతంత్రమును కాపాడుటకు అమెరికాప్రభుత్వము అవసరమైన సైనిక ఆర్థికసహాయము చేయుటకు సిద్ధముగ నున్నదను నదియే ఐసనుహోవరు సిద్ధాంతము (**Eisonhowar Doctrine**). 1957 లో హుస్సేన్ ఆలా రాజీనామానివ్వగ డాక్టరు మనోచిర్ ఎక్బాలు ప్రధానమంత్రియయ్యెను. ఇరానుదేశముయొక్క వైశాల్యము 6 లక్షల 28 వేల చదరపుమైళ్ళు. జనసంఖ్య 1 కోటి 90 లక్షలు. రాజధాని టెహరాను. దీని జనసంఖ్య 12 లక్షలు. ప్రస్తుత రాజుపేరు మహమ్మదు రెజాషా పెహల్వీ. ప్రధానమంత్రి డాక్టరు మనోచిర్ ఎక్బాల్. ఈ దేశములో నూటికి తొంబది నాలుగుమంది షయ్యా ముస్లిములు, అయిదుగురుమాత్రమే సున్నీలు. కొన్ని వేలమంది జొరేస్టరు పార్సీలుకూడ నున్నారు. సంపూర్ణ మతస్వేచ్ఛ కలదు.

## ఈజిప్టుదేశము

ఈ దేశపుజనసంఖ్య 2 కోట్ల 32 లక్షలు. వైశాల్యము 3,86,198 చదరపుమైళ్ళు. భాష అరబ్బీ. 1882 వ సంవత్సరమున ఈజిప్టుదేశమును ఆంగ్లేయులు వశపరచుకొనుటయు, స్వతంత్రముకొరకు ఈజిప్టుదేశీయులు

సలిపిన పోరాటఫలితముగా 1922 వ సంవత్సరములో కొన్ని మినహాయింపులతో స్వతంత్రము స్థాపితమగుటయు వెనుక చెప్పియున్నాము. ఆ మినహాయింపులలో ఒకటి : సూడాన్ దేశము, రెండు : ఈజిప్టుదేశరక్షణము, మూడు : పరదేశస్థుల చిన్నసంఘముల రక్షణ, నాలుగవది : సూయజ్ కాలువ చేరియున్నవి. ఇవన్నియు ఆంగ్లప్రభుత్వముక్రింద నుండవలెను. కింగ్ ఫాదు (**King Faud**) అను రాజుక్రింద నొక ఈజిప్టు పార్లమెంటు స్థాపించబడినది.

ఈ పార్లమెంటులో రెండు సభలుండెను. ఒకటి ప్రజాప్రతినిధిసభ, రెండు సెనేటు. ప్రజాప్రతినిధిసభ ఐదేండ్లకొకసారి ఎన్నుకొనబడును. సెనేటుసభ్యుల కాలపరిమితి పదిసంవత్సరములవరకు ఉండును. సెనేటులో అయిదింట రెండుపంతులమంది రాజుచే నియమితులుగనున్నారు. మంత్రులను రాజే నియమించును. వారు ప్రజాప్రతినిధిసభకు బాధ్యులు. ఈ రాజ్యాంగము బ్రిటిషువారితో చేసుకున్న ఒడంబడికలకు లోబడియుండును. వాఫ్డ్ పార్టీ ఇండియాలోని కాంగ్రెసు వలె దాక్షిణ్యరాహిత్యము నవలంబించిన రాజకీయ కక్షి. ఈ రాజ్యాంగవిధానము స్థాపితమైన పిమ్మటనే జగ్లులు పాషా మొదలగు నాయకులు విడిచిపెట్టబడిరి. 1923 వ సంవత్సరము ఆఖరున ప్రజాప్రతినిధిసభకు జరిగిన ఎన్నికలలో 214 మంది సభ్యులలో వాఫ్డ్ పార్టీ వారు 177 మంది ఎన్నుకొనబడిరి. జగ్లుల్ పాషా మంత్రివర్గము నేర్పరచుకొనెను. కాని 1924 వ సంవత్సరము నవంబరునెల 19 వ తేదీన సుడాను గవర్నరు జనరలగు సర్దారు లీస్టాకును ఏడుగురు ఈజిప్టుదేశీయులు కైరోలో తుపాకులుకాల్చి హత్యగావించిరి. అందుమీద లండనులోని బ్రిటిషువారు మిక్కిలి అవమానకరమైన షరతులను విధించి జగ్లుల్ పాషా ప్రభుత్వముపైన కఠినమైన ప్రతీకారము తీసుకొనుటకు అంత్యసందేశమును పంపిరి. ఆ షరతులకు జగ్లుల్ పాషా అంగీకరించక మంత్రివర్గమంతయు రాజీనామా నిచ్చెను. డిసెంబరునెల 24 వ తేదీన ఫాదురాజు పార్లమెంటును రద్దుపరచెను. తనకిష్టమైన మితవాద మంత్రివర్గమును నియమించి ఆంగ్లేయులు విధించిన షరతులకెల్ల నొప్పుకొని అమలుజరిపెను. 1925 వ సంవత్సరములో మరల నెన్నికలుజరిగి జగ్లుల్ పాషా ప్రజాప్రతినిధిసభకు అధ్యక్షుడుగ

నెన్నుకొనబడగ పార్లమెంటును ఫాదురాజు మరల విచ్ఛిన్నముచేసెను. ఆయన ఆంగ్లేయులతో కలసి వాఫ్డ్‌పార్టీని అధికారములోనికి రాకుండ కుట్రలు పన్నెను. 1926 వ సంవత్సరములో జరిగిన ఎన్నికలలోను వాఫ్డ్‌ పార్టీవారు అత్యధికసంఖ్యాకులుగ ఎన్నుకొనబడిరి. కాని ఫాదురాజు ఆంగ్లేయులసలహామీద జగ్లులుపాషాను ప్రధానమంత్రిగచేయలేదు. తన ఇష్టము వచ్చిన లిబరలుపార్టీకిచెందిన అడ్లిలు పాషాను ప్రధానమంత్రిగ చేసెను. 1927 వ సంవత్సరములో ఈజిప్టు జాతీయమహానాయకుడైన జగ్లుల్‌పాషా పరమపదించెను. వాఫ్డ్‌పార్టీకి నాయకుడుగ నహానుపాషా ఎన్నుకొనబడెను. మూడుసంవత్సరములవరకు ఫాదురాజు పార్లమెంటును రద్దుపరిచెను. 1930 వ సంవత్సరములో వాఫ్డ్‌పార్టీ అధికారములోకి రాకుండుటకై ఓట్లను తగ్గించుచు నూతన రాజ్యాంగవిధానమును తయారుచేసి మరల ఎన్నికలు పెట్టగ వాఫ్డ్‌పార్టీ ఆ ఎన్నికలను బహిష్కరించినది. మైనారిటీ పార్టీలతోనే రాజు రాజ్యముచేయసాగెను. 1935 వ సంవత్సరములో దేశములో అల్లరులు జరిగినందునను, ఇటలీలో ముస్సోలినీయొక్క ఫాసిస్టురాజ్యము ఆంగ్లేయులకు భయంకరముగ కనబడినందునను బ్రిటిషు హైకమిషనరుయొక్క సలహామీద ఫాదురాజు పాత రాజ్యాంగవిధానమును మరల స్థాపించెను. 1936 వ సంవత్సరములో ఎన్నికలుపెట్టిరి. ఆ ఎన్నికలలో వాఫ్డ్‌పార్టీవారు అత్యధిక సంఖ్యాకులుగ నెన్నుకొనబడిరి. దాని నాయకుడైన నహాసుపాషా ప్రధాన మంత్రి యయ్యెను. ఆ సంవత్సరమే ఫాదురాజు మరణించినందున మైనరుగ నున్న ఆయనకుమారుడగు ఫరూకిరాజు సింహాసనాధీశుడయ్యెను. బ్రిటిషు వారు ఆ సంవత్సరము ఆగస్టు 26 వ తేదీన ఈజిప్టుప్రభుత్వముతో నూతనఒడంబడిక చేసుకున్నారు. దానితో ఈజిప్టుకు చాల ఎక్కువగ స్వాతంత్రము లభించినది. దేశరక్షణ, విదేశస్థుల చిన్నసంఘములరక్షణ ఈజిప్టు ప్రభుత్వమునకు వదలివేయబడినవి. విదేశస్థులకు ఈజిప్టులోగల ప్రత్యేక హక్కులన్నియు రద్దుపరచబడినవి. సూడాన్ ఈజిప్టుయొక్కయు, ఆంగ్లేయులయొక్కయు సమిష్టి యాజమాన్యముక్రింద నుంచబడినది. ఈజిప్టు దేశము నానాజాతులసమ్మేళనములో సభ్యత్వమునుపొందినది. గాని సూయజ్ కాలువను సంరక్షించుబాధ్యత ఆంగ్లేయులక్రిందనే నుంచబడెను. అచట

ఆంగ్లేయసైన్యము లుంచబడునట్లు అంగీకరింపబడెను. 1939 వ సంవత్సరములో రెండవ ప్రపంచయుద్ధకాలములో ఈజిప్టులో ఆంగ్లేయసైన్యములు ఎక్కువగ ప్రవేశించి ఈజిప్టును ఉపయోగించుకొనెను. కాని ఈజిప్టుప్రభుత్వము మాత్రము యుద్ధములో చేరలేదు. తటస్థముగనే యుండెను. 1937 వ సంవత్సరమునుంచి ఫరూకిరాజు వాఫ్దుపార్టీయొక్క ఆధిక్యతను తొలగించుటకే ప్రయత్నముచేసెను గాని 1944 వరకు నహాస్ పాషా ప్రధానమంత్రిగా నుండెను. ఆ కాలములో అరబ్ దేశములన్నియు కలసి అరబ్ లీగును స్థాపించవలెనని ఇరాకుయొక్క ప్రధానమంత్రియైన నూరి యల్ సయ్యద్ అన్ని అరబ్ దేశములతోను సంప్రతించెను. నహాస్ పాషా అందుకు సమ్మతించెను. 1945 వ సంవత్సరములో అరబ్ లీగు స్థాపితమయ్యెను. దాని ప్రధానోద్దేశ్యము పాలెస్తైన్ దేశములోనున్న యూదులను ప్రతిఘటించుట అయియున్నది. అరబులీగు స్థాపితమగుటవల్ల అరబుదేశములయొక్క నాయకత్వము ఇరాకుదేశమునకు వచ్చుటకు మారుగ ఈజిప్టునకే వచ్చెను. సూయజుకాలువనుండి ఆంగ్లేయసైన్యములను తీసివేయుటకును, సూడాన్ సమస్య పరిష్కరించుటకును మరల ప్రయత్నములు జరిగెను. ఫరూకిరాజు నహాస్ పాషాను తీసివేసి తనయిష్టమువచ్చిన మంత్రివర్గము నేర్పరిచెను. కమ్యూనిస్టుపార్టీ కొంత అభివృద్ధిచెందెను. ముస్లింబ్రదర్ హుడ్ (Muslim Brotherhood) అనుపేరుగల అరాజకపార్టీకూడ కొంత బలపడెను. ఇదికాక దేశములో నొక స్వతంత్ర సైనికఉద్యోగులసంఘము స్థాపితమయ్యెను. దేశములో అశాంతి ప్రబలినందున మరల నహాస్ పాషా ప్రధానమంత్రిగ గావింపబడెను. ఆయన ఆంగ్లేయులతో రాజీపడుటకు ప్రయత్నించెను గాని ఆంగ్లేయులొప్పుకొనలేదు. 1948 వ సంవత్సరమున ఈజిప్టు ప్రభుత్వము మిగిలిన అరబుదేశములతో కలసి ఇజ్రాయిలుమీద యుద్ధము చేసి ఓడిపోయినది. తగిన సైనికఏర్పాట్లను చేయకుండ యుద్ధములోనికి దిగినదని వాఫ్దు మంత్రివర్గముమీద దేశములో వ్యతిరేకభావ మేర్పడెను. వాఫ్దుపార్టీలో గొప్ప భూస్వామ్యులు చేరి ఎన్నికలలో గెలుచుట సామాన్య సభ్యులలో ప్రబలిన లంచగొండితనము. ఫరూకిరాజుయొక్క దుష్ప్రవర్తనము ప్రజలలో నిరాశను కలుగచేసెను. ఆంగ్లేయులు రాజీకిరానందున వాఫ్

ప్రభుత్వము నిరాశచే 1936 ఒడంబడికను రద్దుపరచినట్లు ప్రకటించెను. ఆంగ్లేయసేనలు సూయిజుకాలువ ప్రాంతములను స్వాధీనముచేసి ఈజిప్టు సైన్యములను ఓడించెను. పోలీసులు అనేకులను హత్యచేసెను. కైరోలో కనివినియెఱుగని అల్లరులు జరిగెను. దోపిడీలు, హత్యలు, గృహదహనములు జరిగెను. రాజు సైన్యములను ప్రయోగించి అరాజకము నణచుటకు ప్రయత్నించగ సైన్యములు రాజుయొక్క ఆజ్ఞను మన్నించలేదు. రాజు స్వతంత్రసైనిక క్లబ్బుయొక్క అధ్యక్షుని ఎన్నికలో జోక్యము కలుగ చేసికొనినందున వారు సైన్యములన్నియు కల్నల్ నాసరు క్రింద ఏకమై ఫరూకిరాజుక్రింద పనిచేయుటకు నిరాకరించినవి. అప్పుడు సైనికనాయకు డగు కల్నల్ నాసరే దేశమును రక్షించుటకు, శాంతిని నెలకొల్పుటకు పూనుకొనెను.

1952 వ సంవత్సరము జూలై నెల 23 వ తేదీన కల్నల్ నాసరు సైనికవిప్లవమును జరిపి నహాస్ పాషా ప్రభుత్వమును, ఫరూకి రాజుయొక్క అధికారమును తీసివేసి సైనికపాలన నేర్పఱచెను. విప్లవకమిటీవారి కోరిక మీద ఫరూకి రాజు రాజ్యమును త్యజించి తన మైనరుకుమారుడైన రెండవ ఫూడ్ను రాజుగా చేసి దేశమును విడిచి వెళ్ళెను. స్వతంత్ర సైనికోద్యోగ అధ్యక్షుడైన జనరల్ నజీబు ప్రధానమంత్రి యయ్యెను. ఒక క్రొత్త మంత్రివర్గము నేర్పాటుచేసికొనెను. 1953 వ సంవత్సరము జూన్ 18 వ తేదీన రెండవ ఫూడ్ రాజును తీసివేసి రాజరికమును రద్దుచేసిరి. ఈజిప్టుదేశము సంపూర్ణమైన ప్రజాస్వామికమయ్యెను (Republic). జనరల్ నజీబు ఈజిప్టు రిపబ్లికుకు అధ్యక్షుడు, ప్రధానమంత్రికూడ నయ్యెను. ఈ సైనికవిప్లవములో నిజమైన నాయకుడగు కల్నల్ నాసర్ రిపబ్లికు స్థాపితమైనపుడు డెప్యూటి ప్రధానమంత్రిగ నుండుటకు అంగీకరించెను. కమ్యూనిస్టులను, ముస్లిం సోదరసమితి (Muslim Brotherhood) ను నిషేధించి, వారిలో ముఖ్యులైనవారినందరిని జైళ్ళలోపెట్టివేసిరి. ఆ రెండు ఉద్యమములు అణగిపోయెను. జనరల్ నజీబు ముస్లిం సోదరసమితి యొక్క ముఖ్యులకు స్నేహితుడనియు విప్లవకమిటీకి వ్యతిరేకముగ ప్రవర్తించుచున్నాడనియు కనుగొనబడినందున 1954 వ సంవత్సరము నవంబరు

నెలలో జనరల్ నజీబును పాలద్రోసి. గృహనిర్బంధములో పెట్టి, కల్నల్ నాసర్ రాజ్యాధికారమును స్వీకరించి అధ్యక్షుడు, ప్రధానమంత్రి అయ్యెను. జనరలు నజీబు పిరికివాడై యిట్టిపల సహించెను. ఆంగ్లేయులు కల్నల్ నాసర్ ప్రభుత్వముతో రాజీపడవలసివచ్చినదికాదు. సూడాన్ దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును కలుగచేసి ఆ దేశము ఈజిప్టులో కలసియుండవలెనా, లేక విడిగా సంపూర్ణ స్వాతంత్ర్యముతో నుండవలెనా అను విషయము సూడాన్ ప్రజలు తేల్చుకొనవలసినదని ఆంగ్లేయులును, కల్నల్ నాసర్ ప్రభుత్వమును రాజీపడిరి. అంతేకాకుండ ఈజిప్టులోను, సూయజ్ కాలువలోను ఉన్న బ్రిటిషు సైన్యమంతయు ఇరువదినెలలలో వదలిపోవుటకుకూడ 1954 సంవత్సరము అక్టోబరునెలలో ఆంగ్లేయప్రభుత్వము సమ్మతించెను. వీరై సంతత్సరిలో వదలిపోవుటకుకూడ ఆంగ్లేయప్రభుత్వము సమ్మతించెను. సూడాన్ దేశములో ప్రజలయెన్నికలు జరిగెను. ప్రథమమున ఈజిప్టుతో కలసియుండేపక్షికే ఎక్కువ ఓట్లు వచ్చెను. ఆ పక్షమే సూడాన్‌పై అధికారమును స్వీకరించెను. కాని ప్రజలలో అల్లరులు ఎక్కువగా జరిగెను. అందువల్ల ఆ పక్షముయొక్క నాయకుడే స్వయముగా సూడాన్ పార్లమెంటులో ఈజిప్టుతో సంబంధములేని సంపూర్ణ స్వతంత్రరాజ్యముగ సూడాన్ దేశముండునట్లు ప్రకటనగావింపచేసెను. 1955 వ సంవత్సరము డిశంబరు 19 వ తేదీన సూడాన్ స్వతంత్రమైన రిపబ్లికు అని ప్రకటింపబడెను. 1956 వ సంవత్సరము జనవరి 1 వ తేదీన సూడానుయొక్క నూతన పార్లమెంటు ప్రారంభమయ్యెను. దాని స్వతంత్రమును ఈజిప్టుప్రభుత్వము, బ్రిటిషుప్రభుత్వముకూడ వెంటనే అంగీకరించెను. సూయజ్ కాలువనుండి, యీజిప్టునుండి బ్రిటిషు సైన్యములు 1956వ సంవత్సరము జూన్ 13వ తేదీన వదలిపోయెను. ఇట్లు 1882 సంవత్సరములో ఆంగ్లేయప్రభుత్వమువారు యీజిప్టును స్వాధీనపరచుకొని సాగించినపాలనము 1956వసంవత్సరముజూన్ నెలలో సంపూర్ణముగ అంతరించినది. 1956 వ సంవత్సరము జనవరి 16 వ తేదీన కల్నల్ నాసరుచేత నూతన శాశ్వత రాజ్యాంగవిధానము తయారుచేయబడి జనవాక్యమునకు పెట్టగ నూటికి 99 మంది ప్రజలు దాని కనుకూలముగ ఓట్లనిచ్చిరి. అది సంపూర్ణ ప్రజాస్వామ్యపు ప్రజారాజ్యవిధానమై

యున్నది. ప్రజలచేత ఎన్నుకొనబడిన అధ్యక్షుడు, నేషనల్ ఎస్సెంబ్లీ, ఎస్సెంబ్లీకి బాధ్యతవహించెడి మంత్రివర్గము నేర్పాటుచేసినారు. 1957 లో ప్రథమఎన్నికలు జరిగినవి. ఆ ఎన్నికలలో కల్నల్ నాసరు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడినాడు. ఎస్సెంబ్లీయంతయు ఆయన కనుసన్నలనుగ వచ్చినది. కొంతమంది స్త్రీలుకూడ ఎస్సెంబ్లీకి ఎన్నుకొనబడిరి. వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, సభాస్వాతంత్ర్యము, మతస్వేచ్ఛ స్థాపింపబడినది. ఇస్లాం ప్రభుత్వమతము. అరబ్బి ప్రభుత్వభాష. తమసైన్యములను సొంతముగ సూయజ్ కాలువనుండి తీసివేసుకొనుట బ్రిటిషువారికి కంటకముగానే యుండెను. అదివరకు నైలునదిమీద ఆస్వానువద్ద నొక గొప్ప ఆనకట్టను కట్టుటకు కల్నల్ నాసర్ నిశ్చయించినాడు. దానికికావలసిన ఋణసహాయము, కొంత ఉచితసహాయముకూడ గావించెదమని ఆంగ్లేయులు, అమెరికావారు చెప్పియుండిరి. సోవియటురష్యావారుకూడ ఆ ఆనకట్టకట్టుటకు కొంత సహాయముచేసెదమని వాగ్దత్తముచేసిరి. ఆ ఆనకట్టవల్ల కొన్నిలక్షల ఎకరములు ఈజిప్టులో నీటిపారుదలక్రిందికి వచ్చును. దేశమునకు కావలసిన విద్యుచ్ఛక్తియంతయు లభించును. కాని 1956 వ సంవత్సరము జూలై 20 వ తేదీన అమెరికావారు ఆంగ్లేయులుకూడ ఆస్వాన్ వద్ద ఆనకట్టకట్టుటకు సహాయముచేయజాలమని ప్రకటించిరి. సోవియటు రష్యావారు అదివరకు చేసిన వాగ్దత్తముకంటె ఎక్కువ సహాయముచేయ జాలమనిరి. అందువల్ల సూయజుకాలువమీద యాజమాన్యమువహించి విశేషలాభములను పొందుచున్న సూయజుకాలువ కంపెనీని రద్దుపరచి సూయజుకాలువను జాతీయముగచేసి ఈజిప్టుప్రభుత్వము లోబరచుకొని దాని వల్ల వచ్చు లాభమంతయు ఈజిప్టుప్రభుత్వమునకే చెంది, దానివల్ల ఆస్వాను ఆనకట్ట కట్టవలెనని కల్నల్ నాసర్ కృతనిశ్చయుడై 1956 వ సంవత్సరము జూలై 26 వ తేదీన సూయజుకాలువను జాతీయముచేసెదనని ప్రకటించి, ఆ కాలువను స్వాధీనపరచుకొనెను. వెంటనే ఆంగ్లేయ ఫ్రెంచిప్రభుత్వములకు గొప్ప ఆగ్రహము కలిగినది. తూర్పుదేశములతో వారివర్తకమునకు సూయజు కాలువ మిక్కిలి ముఖ్యమైనది. సూయజుకాలువను ఇకముందునుంచి వాడుకొనుటకు కల్నల్ నాసర్ యొక్క అనుగ్రహము కావలెను అని తలచి,

వెంటనే ఆంగ్ల - ఫ్రెంచిసేనలు ఈజిప్టుసమీపమునకు పంపబడినవి. అమెరికా విదేశాంగమంత్రియగుడల్లెస్ జోక్యముపుచ్చుకొని లండనులో ఆగస్టు16 తేదీన సూయజుకాలువకుసంబంధించిన వివిధజాతులప్రతినిధులను సమావేశపరచెను. ఈజిప్టుప్రభుత్వము ఆ సమావేశమునకు హాజరగుటకు నిరాకరించెను. అప్పుడు సమావేశమైన 22 రాజ్యములలో పదునెనిమిది డల్లెస్ ప్రతిపాదించిన సూత్రములప్రకారము సూయజుకాలువను అంతర్జాతీయముచేయవలెనని అంగీకరించెను. ఆ సూచనలను, తీర్మానములను ఆస్ట్రేలియా ప్రధానమంత్రి రాజిష్టు అధ్యక్షుడైన కల్నల్ నాసర్ వద్దకు తీసుకొనిపోయి సమర్పించగా, కల్నల్ నాసర్ అంగీకరించలేదు. ఐక్యరాజ్యసమితియొక్క సెక్యూరిటీకౌన్సిలుపద్ద ఈ విషయము చర్చించబడినను ప్రయోజనములేకపోయినది. సూయజుకాలువ 99 ఏండ్ల కౌలుషరతుల ప్రకారం 1968 వ సంవత్సరములో కౌలు అంతమై ఈజిప్టుప్రభుత్వమునకు చెందగలదు. తమదేశములోని ఒక కంపెనీని జాతీయముచేయుటకును, ఆ కంపెనీభాగస్తులకు మిగిలియున్న పన్నెండుసంవత్సరముల కౌలుహక్కును రద్దుపరచినందుకు న్యాయమైన నష్టపరిహారమిచ్చి కౌలును రద్దుపరచి సూయజు కాలువను స్వాధీనపరచుకొనుటకును తమకు శాస్త్రీయమైనహక్కు కలదని కల్నల్ నాసర్ పక్షమువారు వాదించిరి. అందుమీద అక్టోబరునెలలో ఒకవైపు నుంచి ఇస్రాయిలుసేనలు ఈజిప్టుపై దండెత్తునట్లు ఆంగ్లేయులుప్రోత్సహించిరి. ఆంగ్లో ఫ్రెంచిసేనలు సూయజుకాలువను, పోర్టుసయ్యదు, ఇస్మేలియారేవులను ఆక్రమించిరి. ఐక్యరాజ్యసమితియొక్క తీర్మానప్రకారము ఇస్రాయిలు దేశము తమ సైన్యమును వెనుకకు మరల్చెను. ఈజిప్టుపై దండయాత్ర సాగించుట మానుకొనెను. సోవియటురష్యా, హిందూదేశము, బాగ్దాద్ పాక్టులో చేరిన ముస్లిముదేశములుకూడ ఈజిప్టుదేశముతోనే సానుభూతిని ప్రకటించినవి. ఈజిప్టునకును, ఆంగ్లో ఫ్రెంచిసేనలకును కలహములు చెలరేగెను. ఈ కలహము వృద్ధియైనచో తమసైన్యములను ఈజిప్టుపక్షమున పోరాడుటకు పంపెదమని సోవియట్ రష్యాప్రభుత్వము బెదిరించెను. మహమ్మదీయప్రపంచమంతయు ఆంగ్లేయులపైనను, అమెరికావారిపైనను తిరుగబడునట్లు కనబడెను. ప్రపంచములో మరల యుద్ధము ప్రారంభమగునను

భీతి కలిగెను. ఐక్యరాజ్యసమితివారు ఆంగ్లేయ ఫ్రెంచిసేనలను ఈజిప్టును వదలిపొమ్మని తీర్మానించిరి. ఐక్యరాజ్యసమితిపక్షమున కొన్నిసేనలు సూయజ్ కాలువవద్దచేరి విదేశస్థులను సంరక్షించునట్లు ఏర్పాటు జరిగెను. అందులో ముఖ్యపాత్రవహించినవి హైందవసేనలు. హైందవసేనలను ఈజిప్టుదేశీయులు గొప్పగా సత్కరించిరి. 1957 వ సంవత్సరము జనవరినెలలో ఆంగ్లో ఫ్రెంచిసేనలన్నియు సూయజుకాలువను వదలిపోయినవి. ఏమ్నాట త్వరితముగనే ఐక్యరాజ్యసమితిసేనలుకూడ ఈజిప్టునుంచి తీసివేయబడినవి. సూయజుకాలువమీద ఈజిప్టుప్రభుత్వమునకుగల సర్వాధికారము అన్ని జాతులచే నంగీకరింపబడినది. సూయాజ్‌కాలువను యీజిప్టు ప్రభుత్వము జాతీయముచేయవచ్చునని, స్వాధీనపరచుకొనవచ్చునని అందరును అంగీకరించిరి. సూయజుకాలుసకంపెనీ సూయజుకాలువను వదలిపెట్టిపోయెను. నష్టపరచబడెను. దానికి నష్టపరిహారమిచ్చు సమస్య రాజీనామాగా పరిష్కరించుప్రయత్నములు జరుగుచున్నవి. ఈజిప్టు ప్రభుత్వమే అన్నిజాతులఓడలను యుద్ధకాలములోకూడ సూయజ్‌లో రాకపోకలుచేయుటకు అంగీకరించినది. ఈజిప్టు ప్రభుత్వోద్యోగస్థులే సూయజుకాలువనుండి రాకపోకలుచేయు పొగయోడలమీద, మనుష్యలకును, సరకులకును సుంకములను వసూలుచేయుదురు. ఇంతటితో ఈ విషయము ఈజిప్టుకు అనుకూలముగ పరిష్కారమైనది. కల్నల్ నాసర్ యీజిప్టుజాతికి రక్షకుడుగను. ఏకైకనాయకుడుగను అంగీకరించబడినాడు. 1958 వ సంవత్సరము ఫిబ్రవరి 1 వ తేదీన యీజిప్టుయొక్క అధ్యక్షుడైన కల్నల్ నాసర్, సిరియాదేశముయొక్క అధ్యక్షుడైన ప్రెసిడెంట్ కువాట్లీ యీ రెండుదేశములు కలసి సంయుక్త అరబు రిపబ్లికు (United Arab Republic) అయినదని ప్రకటించినారు. ఆ ప్రకటన ఈజిప్టుపార్లమెంటువలనను, సిరియాపార్లమెంటువలనను ఫిబ్రవరి 5 వ తేదీన అంగీకరించబడినది. ఈ సంయుక్త అరబ్ రిపబ్లికుకు కల్నల్ నాసర్ అధ్యక్షుడుగ నెన్నుకొనబడినాడు. ఈ సంయుక్త అరబ్ రిపబ్లికు ఏర్పడగనే ఆంగ్లేయులకు, అమెరికావారికి గొప్ప భయమేర్పడినది. అరబుజాతులన్నియు ఐక్యమగుట వారికిష్టములేదు. అందువలన

అరబ్ దేశములలో తన పలుకుబడి క్రిందనున్న ఇరాకుదేశముయొక్క రాజయిన ఫైజల్ (King Faizal) రాజును, జోర్డాను దేశముయొక్క రాజయిన హుస్సేన్ (Hussain) రాజును సమాహర్చి రెండురాజ్యములు కలసి అరబ్ ఫెడరేషన్ (Arab Fedaration)గ సంయుక్తమగునట్లు 1958 వ సంవత్సరము ఫిబ్రవరి 14 వ తేదీన ప్రకటింపచేసినారు. యీ రెండు దేశములకు ఒకే సైన్యము, ఒకే విదేశవ్యవహారములమంత్రి, ఒకే ఆర్థికమంత్రి యుండునట్లు, దీనికి ఇరాకురాజు ఫైజల్ (ప్రెసిడెంట్) అధ్యక్షుడుగను, జోర్డానురాజు (King Hussain) (డిప్యూటీ ప్రెసిడెంటు) ఉపాధ్యక్షుడుగను ఉండునట్లును అంగవిధానములో వ్రాసుకొనిరి. దీని యొక్క ఫలితముగ ఇరాకుదేశములోని ప్రజలలో అసంతృప్తి ఎక్కువైనది. సైనికపట్లవము చెలరేగి ఫైజల్‌రాజును, ఆయనయొక్క ప్రధాన సలహాదారైన నూరీ యల్ సయ్యదును హత్యగావించి సంపూర్ణ ప్రజాస్వామ్యమును ప్రకటించిరి. దానితో అరబ్ ఫెడరేషన్ తుడముట్టింపబడెను. ఇరాకుకు సంబంధించినవిషయములు ఇరాకునుగురించి తెలిపినపుడు చెప్పెదము. ఇటీవలనే సోవియటురష్యావారు అస్వానుఆనకట్టయొక్కనిర్మాణమునకు కావలసిన ఋణమంతయు ఇచ్చెదమని కల్నల్ నాసర్‌కు వాగ్దత్తముచేసినారు. కల్నల్ నాసర్ భారతదేశముతో సంపూర్ణసహకారమును సలుపుచు, దానిమార్గమునే పంచశీలను పూర్తిగ అవలంబించుచున్నాడు. ఈజిప్టుదేశముయొక్కరాజధాని కెయిరోనగరము. కల్నల్ నాసర్ యిప్పుడుకూడ అధ్యక్షుడుగను ప్రధానమంత్రిగను నున్నాడు. ఈజిప్టుదేశీయులలో అత్యధికసంఖ్యాకులు సున్నీ మునల్మానులు. నూతన ఈజిప్టుప్రభుత్వము దేశములో విద్యావ్యాపకమున కెక్కువ ప్రధానస్థానమిచ్చుచున్నది. బడ్జెటులో నూటికి 13 వంతులు విద్యక్రింద ఖర్చుపెటబడుచున్నది. 1951-52 లో ప్రైమరీస్కూళ్ళలో. 2 లక్షల 66 వేలమంది బాలురు, 78 వేల రెండువందల మంది బాలికలు చదువుకొనుచుండగ, 1956-57 సంవత్సరములో 12 లక్షల 33 వేల బాలురు, 7 లక్షల 43 వేలమంది బాలికలు చదువుకొనుచున్నారు. అయిదు విశ్వవిద్యాలయము లున్నవి. కైరోలోని అల్ అజారు విశ్వవిద్యాలయము ప్రసిద్ధికెక్కినది. షయ్యారాజులచే పదివందలసంవత్సరముల

క్రిందట స్థాపించబడినది. పదహారువేలమంది విద్యార్థులు, విద్యార్థినులు చదువుకొనుచున్నారు. అందులోనే మన జాతీయనాయకులైన మౌలానా అబుల్ కలాం ఆజాదుగారు విద్య నభ్యసించిరి. ఇదిగాక 1908లో స్థాపింపబడిన కైరో విశ్వవిద్యాలయము, 1941 లో స్థాపింపబడిన అలెగ్జాండ్రియా విశ్వవిద్యాలయము, 1952 లో స్థాపింపబడిన ఐనుషామ్సు విశ్వవిద్యాలయము, 1957-58 లో స్థాపింపబడిన అసూట్ విశ్వవిద్యాలయము గలవు. వీటిలో విజ్ఞానము, ప్రకృతిశాస్త్రములు, లా నేర్పబడుటయే గాక ఇంజనీరింగు, వర్తకము, వ్యవసాయము, వైద్యము బాగుగ నేర్పబడుచున్నవి.

ఇట్లు విద్యను త్వరితముగ వృద్ధిచేయుటయేగాక కల్నల్ నాసరు ప్రభుత్వము గొప్ప భూసంస్కరణమును గావించి రైతుల కెంతయో మేలు చేసినది. ఆ దేశములోని వ్యవసాయభూమిలో నూటికి 37 పాళ్లు కొద్దిమంది పెద్దభూస్వాముల క్రింద నున్నది. రాజకుటుంబము క్రింద ఒకలక్ష ఎనుబది వేల యకరముల భూమి యున్నది. ఎవరిక్రిందను రెండువందల యకరముల కంటె నెక్కుడు భూమి యుండకూడదని చట్టముగావించి ఈజిప్టు జాతీయ ప్రభుత్వము, అంతకన్న ఎక్కువ భూమియున్నచో దానినంతను కొంత నష్టపరిహారమిచ్చి స్వాధీనపర్చుకొని అట్టుల తమక్రిందకువచ్చిన ఆరులక్షల యకరములభూమిని భూములులేని వ్యవసాయకులకు పంచిపెట్టినారు. కల్నల్ నాసరు జవహర్‌లాల్ నెహ్రూవలెనే (Democratic Socialism) సాంఘికతత్వపు ప్రజారాజ్యమునందు నమ్మకముకలవాడు. కమ్యూనిజమునందు నమ్మకములేనివాడు.

## సూడాను దేశము

దీనివైశాల్యము 9,67,500 చదరపుమైళ్ళు. జనసంఖ్య 1 కోటి 2 లక్షల 10 వేలు. క్రీ. శ. 1820 నుండి సుడానుదేశము ఈజిప్టుక్రిందను, 1899 నుండి ఆంగ్లో ఈజిప్టు సమష్టిపాలనముక్రిందను నుండెను. నైలునది ఈ దేశములోనుండియే ఉత్తరముగ ఈజిప్టుదేశములోకి పోయి ప్రవహించి సముద్రములో కలియుచున్నది. సూడానులోనైలునదిమీద సెన్నారువద్ద గొప్ప ఆనకట్ట కట్టబడినది. 1957 లో నీటిపారుదలను మరియొక రెండులక్షల ఎకరముల సాగుకు వీలుగ వృద్ధిచేసినారు. 1961 లో పూర్తి అయ్యే రాజేర్సు

వద్ద ఆనకట్ట మరియొక ఎనిమిదిలక్షలఎకరాలకు నీటిసరఫరా చేయునని అంచనావేయబడి, ఈజిప్టుప్రభుత్వముతో సంప్రదింపులు జరుగుచున్నవి. ఈ దేశములో మిగుల ప్రశస్తమైన ప్రత్తి పండును. 1956 లో 9 లక్షల 88 వేల టన్నుల ప్రత్తి పండినది. సూడానునుండి పోవు ఎగుమతులలో నూటికి 64 పాళ్ళు ప్రత్తియే అయ్యున్నది. దీనికిమ్మతు 1956 లో 4 కోట్ల 17 లక్షల 59 వేల పౌండ్లు. ఆంగ్లకంపెనీలక్రిందనున్న ప్రత్తితోటలు క్రమముగా దేశీయులవశమగుచున్నవి. విశేషముగా ఆంగ్లదేశముతోనే వర్తక వ్యాపారములు జరుగుచున్నవి. ఎగుమతులలో నూటికి 33 పాళ్ళు ఇంగ్లాండుకును, నూటికి 13 పాళ్ళు ఇండియాకును, 11 పాళ్ళు యీజిప్టుకును, రెండు పాళ్ళు మాత్రమే అమెరికాకును పోయినవి. దిగుమతులుకూడ దాదాపుగ అటులనే యున్నవి. 1956 వ సంవత్సరము జనవరినెల 1 వ తేదీన సూడానుదేశము సంపూర్ణస్వతంత్రముగల ప్రజాస్వామికమయ్యెను. ఆ సంవత్సరము నవంబరునెలలో ఐక్యరాజ్యసమితిసభ్యత్వమును పొందినది. ఇంకను తాత్కాలికరాజ్యాంగము అమలులో నున్నది. తుది రాజ్యాంగవిధానము నిర్మాణముగావించవలసియున్నది. తాత్కాలిక. నిర్మాణప్రకారము ప్రజాప్రతినిధిసభ, సెనేటు అను రెండుసభలుగల పార్లమెంటు గలదు. దిగువసభకు మూడేండ్లకొకసారి ఎన్నికలు జరుగును. పార్లమెంటు అయిదుగురు గల యొక అధ్యక్షులసంఘము నెన్నుకొనినది. వారే ప్రధానమంత్రిని ఇతరమంత్రులను నియమించిరి. గాని 1958 వ సంవత్సరము నవంబరునెలలో అబౌదుసేనాని సైనికవిప్లవముజరిపి తాత్కాలిక రాజ్యాంగవిధానమును రద్దుపరచి అధ్యక్షుని మంత్రివర్గమును వెళ్ళగొట్టి యావత్తురాజ్యమును తన హస్తగతము చేసికొని తన యిచ్ఛవచ్చినమంత్రులను నియమించుకొని సుడానుపాలించుచున్నాడు. కల్నల్ నాసరుకు స్నేహముగనున్నాడు. పాశ్చాత్యరాజ్యములకు వ్యతిరేకముగనున్నాడు. ఈదేశపు రాజధాని ఖార్టూన్ నగరము. ప్రధానభాష అరబ్బి. 1957లో ఖార్టూన్‌నగరమునకు ఇండియా ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ వచ్చినపుడు కనివినిఎరుగనంతమంది ప్రజలు ఆయనను దర్శించుటకు వచ్చిరి. అఖండస్వాగతమిచ్చిరి.

## లిబియా

ఇది ఆఫ్రికాఖండములోనిది. ఈదేశములోని ప్రధానభాగము ట్రిపోలీ అయియున్నది. ట్రిపోలీదేశము తుటుష్కసామ్రాజ్యములో చేరియుండగా ఇటలీవారు దండెత్తి దానిని 1912 వ సంవత్సరములో ఆక్రమించిరి. ద్వితీయ ప్రపంచయుద్ధమైనపిమ్మట దానిని మిత్రమండలివారు ఇటలీనుంచి లాగుకొని ఐక్యరాజ్యసమితిక్రిందకు తెచ్చి, ఇంకా మిక్కిలియున్న కొంతభాగముతో కలిపి లిబియారాజ్యముగ చేసిరి. ఐక్యరాజ్యసమితివారు 1951వ సంవత్సరములో లిబియారాజ్యమును సైరెనికారాజైన మహమ్మద్ ఇద్రిసు అస్సానూసి రాజుయొక్క వంశపారంపర్యమైన పాలనమునకు వప్పగింతచేసిరి. వారు తయారుచేసిన రాజ్యాంగముప్రకారము రాజుతోపాటు లిబియా కొక పార్లమెంటుకూడ ఏర్పరచబడ్డది. దానికి రెండుసభలు గలవు. ప్రజాప్రతినిధులసభ ప్రజలవల్ల నాలుగుసంవత్సరముల కొకసారి. సెనేటుసభ ఎనిమిది సంవత్సరముల కొకసారి ఎన్నుకొనబడును. సెనేటులో సగముమంది రాజువలన నియమితులు. తక్కిన సగముమంది రాష్ట్రశాసనసభలవల్ల ఎన్నుకొనబడుచురు. యీ దేశములో మూడు రాష్ట్రము లున్నవి. ట్రిపోలి, సైరెనికా, ఫెజన్. యీ మూడురాష్ట్రములకు ప్రజలవల్ల ఎన్నుకోబడే రాష్ట్రశాసనసభలు కలవు. లిబియాదేశముయొక్క విస్తీర్ణము 6 లక్షల 80 వేల చదరపుమైళ్లు : జనసంఖ్య 10 లక్షల 90 వేలు. ప్రపంచములో పెద్దదగు సహారా ఎడారి యీ దేశములోనే ఉన్నది. యీ దేశములో ప్రధానరాష్ట్రమైన ట్రిపోలీ 1 లక్ష 10 వేల చదరపుమైళ్ళ, వైశాల్యము కలిగి 7 లక్షల 47 వేల జనసంఖ్య కలిగియున్నది. మతము సున్నిశాఖకుచెందిన ఇస్లాము. ప్రధానభాష అరబ్బి. ఈ దేశములో సైరెనికారాష్ట్రములోని బెంఘాజీవద్ద 30 లక్షల ఎకరములలోను, ట్రిపోలీలో 20 లక్షల ఎకరములలోను నూనె తీయు హక్కును లిబియాప్రభుత్వ మొక అమెరికా నూనెకంపెనీకి కౌలు కిచ్చియున్నారు. ఇప్పుడిప్పుడే నూనెతీయడము ప్రారంభమైనది. పాశ్చాత్య దేశములతోను యీజిప్టుతోను లిబియాప్రభుత్వము సంధులుచేసుకున్నది. ఐసన్‌హోవరుసిద్ధాంతము నంగీకరించినది. అమెరికానుండి 1956 వ సంవత్సరములో తొంబదిలక్షలడాలర్ల సహాయమును 1957 లో ఒకకోటి డాలర్ల

సహాయమును పొందినది. ఇపుడు మహమ్మదు ఇద్రిసు అస్సనూసి రాజుగాను, అబ్దుల్ మజీదు కోబరు ప్రధానమంత్రిగను నున్నారు. మూడురాష్ట్రములకు ముగ్గురు గవర్నరులు నియమింపబడినారు.

## సౌదీ అరేబియా

దీని జనసంఖ్య డెబ్బదిలక్షలు, విస్తీర్ణము 9,00,000 ల చదరపు మైళ్ళు. దేశములో చాలభాగము ఇసుకఎడారులతో నిండియున్నది. ఈ దేశములోనే మహమ్మదు ప్రవక్త జన్మించి, తన ఏకేశ్వరోపాసన మతమును బోధించి రాజ్యమును స్థాపించెను. ఇక్కడినుంచియే మహమ్మదు ప్రవక్తయొక్క వారసులగు ఖలీఫాలు ప్రపంచములో గొప్ప ముసల్మాను రాజ్యమును వ్యాపింపచేసిరి. ఈ దేశములోనున్న మక్కా, మదీనా, జెడ్డా పట్టణములు లోకములోని ముసల్మానులకందరికి యాత్రాస్థలములు. మక్కాపట్టణముయొక్క జనసంఖ్య రెండులక్షలు. మదీనాయొక్క జనసంఖ్య 50 వేలు. జెడ్డాయొక్క జనసంఖ్య రెండులక్షల ఏబదివేలు. ఈ దేశముయొక్క భాష అరబ్బీ. మతము సున్నీ శాఖకుచెందిన యిస్లాము. ఇటీవల 50 సంవత్సరములనుంచి వాహబియను ముసల్మాను తెగ వృద్ధియైనది. వారు మహమ్మదు ప్రవక్తయొక్క బోధలను ఎక్కువ పవిత్రతతోను, క్రమశిక్షణతోను అమలుజరుపవలెనని బోధించేవారు. ఇబనుసౌదు ఈ తెగకు నాయకుడు. మొదటి ప్రపంచయుద్ధము ముగిసినపిమ్మట యీ దేశముమీద బ్రిటిషువారు మక్కా షెరీపు హుస్సేనును రాజుగా నేర్పాటుచేయుటయు, ఆయనను వెళ్ళగొట్టి, ఇబన్‌సౌదు రాజగుటయు యిదివరకు చెప్పియున్నాము, ప్రజలకు బ్రిటిషువారియందు ఇష్టము లేదు. ఇబన్‌సౌదును రాజుగా అంగీకరించిరి. ఆయన 1921 నవంబరులో నీ దేశమునకు రాజయ్యెను. 1927లో బ్రిటిషువారు ఆయనను రాజుగ అంగీకరించిరి. ఆయన దేశమునంతను ఏకచ్ఛత్రముచేసి శాంతిని నెలకొల్పెను. సర్వతోముఖమైన అభివృద్ధిని నవీనపద్ధతులమీద గావించుటకు ప్రయత్నించెను. ఆయన 71 వ ఏట 1953 వ సంవత్సరములో మరణించినందున ఆయనకుమారుడగు ఫైజల్ అల్ ఇబన్‌సౌదు రాజ్యమునకువచ్చెను. ఇచట మంత్రులందరినీ రాజే నియమించును. మంత్రులందరు ఆయనకే బాధ్యులు.

1945 లోనే సౌదిఅరేబియా ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వమును పొందెను. ఈ దేశముయొక్క రాజకీయప్రాముఖ్యత ఈదేశములో పెట్రోలియం నూనె గనులు ఎక్కువగ నుండుటయు, ఆంగ్లేయ అమెరికనుకంపెనీలు ఈ నూనెను త్రవ్వి ఎగుమతిచేయుటయు అయియున్నది. 1923 వ సంవత్సరములో ఇబన్ సౌదురాజు ఒక బ్రిటిషు నూనెకంపెనీకి కొన్నిహక్కుల నిచ్చి, పిమ్మట వాటిని రద్దుపరచి, 1933వ సంవత్సరములో ప్రధానమైనూనెహక్కులన్నిటిని అమెరికా కంపెనీయైన స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ కిచ్చెను. ఇది అరేబియన్ అమెరికన్ నూనెకంపెనీ యని పిలువబడుచున్నది. పిమ్మట 1944 వ సంవత్సరములో ఈ కంపెనీకిచ్చినహక్కులను ఖాయపరచెను. ఈ కంపెనీకి నూనెత్రవ్వుటకు ఇవ్వబడినప్రదేశము 1956 సంవత్సరములో చాలగ విస్తరించెను. నాలుగు లక్షలచదరపుమైళ్ళవరకు వృద్ధిచెందెను. ఈ అమెరికన్‌కంపెనీయొక్క నూనెగొట్టములు లెబనాన్‌దేశములోని మధ్యధరాసముద్రముమీద నున్న సైడానురేవువరకు 1068 మైళ్ళపొడుగున తీసుకొనిపోవుచున్నారు. ఇబను సౌదు 1949 వ సంవత్సరములో మరియొక అమెరికన్‌కంపెనీకికూడ మరొక ప్రదేశమును 60 సంవత్సరములకౌలుకిచ్చెను. 1957 వ సంవత్సరములో జపానువారుకూడ ప్రవేశించి, కొంత మితమైనప్రదేశములో నూనె కనుగొనుటకు, త్రవ్వుటకు హక్కులను పొందిరి. 1956 వ సంవత్సరమున 7 కోట్ల 17 లక్షల 46 వేల డాలర్ల కిమ్మతుగల పెట్రోలియం నూనె, దానిసరకులు అమెరికాదేశమునకు ఈ దేశమునుండి ఎగుమతిఅయ్యెను. ఆ సంవత్సరమున 7 కోట్ల 43 లక్షల 47 వేల డాలర్ల ఇతరసరకులు అమెరికాదేశమునుండి ఈ దేశమునకు దిగుమతి అయ్యెను. ఈ దేశముయొక్క వ్యాపారము అత్యధికముగా అమెరికాలోనే జరుగుచున్నది. ఈ దేశమునకు వచ్చెడి ఆదాయములో నూటికి 90 పాళ్లు పెట్రోలియమునూనెవలననే వచ్చుచున్నది. 1956 లో ఈ దేశప్రభుత్వమువారే సొంతముక్రింద నొక జాతీయ నూనెకంపెనీ నేర్పాటుచేసి అమెరికాకంపెనీల కివ్వనిప్రాంతములలో నూనెను త్రవ్వించుచున్నారు. ప్రపంచమునుండి వచ్చెడు ముస్లిముయాత్రికులవల్ల ఈ ప్రభుత్వమునకు ప్రతిసంవత్సరము 75 వేల రూప్యములు మాత్రము వచ్చుచున్నవి. దీనిరాజధాని మక్కానగరము. సౌది అరేబియారాజు 1945 లో

ఈజిప్టు, సిరియాలతో కలసి అరబులీగులో చేరెను. ఎప్పుడును ఇజ్రా యిలుకు వ్యతిరేకముగ నున్నాడు. బురోమి ప్రాంతముయొక్క హక్కును గూర్చి ఇంగ్లాండుతో ఇప్పటికిని తగవులున్నవి. ఇంకను రాజీప్రయత్నములు సఫలముకాలేదు. గాని అమెరికాతో మాత్రము స్నేహముగనేయున్నాడు. అమెరికానుంచి ఋణమును తీసుకున్నాడు. ఆయన 1954 లో ఈజిప్టు, సిరియాలతో పరస్పరసంరక్షణయొడంబడికలు చేసుకొనెను. సూయజుకాలువ జాతీయముచేయుటలో ఈజిప్టుతో పూర్తిగ సహకరించెను.

## సిరియా

మొదటి ప్రపంచయుద్ధమైనపిమ్మట సిరియాదేశము ఫ్రెంచివారి మాండేటుపాలనముక్రింద నుంచబడినదని వెనుక చెప్పియున్నాము. అచటి ప్రజలు జాతీయతత్వము బాగుగ కలిగినవారై విదేశపాలకులైన ఫ్రెంచివారి మీద అనేక తిరుగుబాట్లనుచేసిరి. సిరియా జాతీయస్వతంత్రనాయకుడు షుక్రీకువాట్లీ. ఆయనను తురుష్కప్రభుత్వము ఆపిమ్మట ఫ్రెంచిప్రభుత్వము అనేకసంవత్సరాలు దేశభ్రష్టునిగావించగ, ఆయన ఈజిప్టుకుపోయి నివసించి అచటిజాతీయస్వతంత్రనాయకులతోకలసి పనిచేసెను. ఫ్రెంచివారు తమసైనిక బలముతో ఆతిరుగబాట్లను అణచివేయవలసివచ్చినది.ఈ తిరుగబాట్లకారణము వల్లనే సిరియానుండిలెబనాన్ దేశమును అచటఎక్కువగ క్రైస్తవులున్నా రనుమిషతో విడదీసినారు. సిరియాలో అశాంతి హెచ్చినకొద్దీ స్వపరిపాలనా స్థాపనకై ఫ్రెంచివారుచేసిన ప్రయత్నములు విఫలమగుచువచ్చినవి. తుదకు 1941 వ సంవత్సరములో సిరియాప్రజాస్వామ్యముయొక్క సంపూర్ణ స్వతంత్రము అంగీకరించబడినది. షుక్రీకువాట్లీ అధ్యక్షుడయ్యెను. 1945 వ సంవత్సరములో ఇరాకు, ఈజిప్టు, సౌది అరేబియాలతోపాటు సిరియాకూడ అరబ్‌లీగులో చేరినది. సిరియాప్రభుత్వము ఫ్రెంచివారితో ప్రత్యేకసంధి ఏర్పాటుచేసుకొనుటకు నిరాకరించినది. ఆంగ్లో ఫ్రెంచిసేనలు సంపూర్ణ ముగ సిరియాదేశమును వదలిపెట్టి వెళ్ళినవి. యావత్తు అధికారము సిరియా ప్రజాస్వామ్యప్రభుత్వమునకు 1946 వ సంవత్సరము ఏప్రిలునెలలో సంక్ర మించినది. ఇరాక్, జోర్డాన్ రాజులు సిరియాను తమతో చేరమని కోరిరి. కాని సిరియా అందుకు అంగీకరించలేదు. సిరియాకును..ప్రక్కనున్న ఇజ్రా

యిలుకును ఎప్పుడును విరోధమే యున్నది. 1949 లో సిరియా నాయకులలో అభిప్రాయభేదములవల్ల సైనికవిప్లవము జరిగి కల్నల్ షిషాక్లి ప్రభుత్వనాయకుడయ్యెను. షుక్రీకువాట్లిని దేశభ్రష్టునిగ గావించెను. 1953 లో నూతనరాజ్యాంగవిధాన మేర్పడి ఎన్నికలు జరిగెను. ఆయనయే అధ్యక్షుడయ్యెను. ఆయన సైనికపాలనముగ. నిరంకుశముగ పరిపాలించినందున దేశములో అల్లరులుసాగెను. విద్యార్థులుకూడ ఆ అల్లరులలో పాల్గొనిరి. కల్నల్ షిషాక్లి రాజీనామానిచ్చెను. దేశమును విడచి ఫ్రాన్సుకు పారిపోయెను. 1950 సంవత్సరపు ప్రజారాజ్యవిధానమే 1954 వ సంవత్సరములో మరల నెలకొల్పబడెను. 1955లో షుక్రి కువాట్లీ మరల అధ్యక్షుడయ్యెను. సిరియాప్రభుత్వము బాగ్దాదుపాక్టులో చేరుటకు నిరాకరించి ఈజిప్టుతో స్నేహమును బలపరచుకొనెను. ఆ సంవత్సరములోనే సిరియాప్రభుత్వము సోవియట్‌యూనియన్‌తోను తూర్పు యూరపుఖండములోని కమ్యూనిస్టుదేశములతోను వర్తకఒడంబడికలు చేసుకున్నది. అన్ని అరబ్బుదేశములలోను కమ్యూనిస్టుపార్టీని నిషేధించినను, సిరియాలో నిషేధించలేదు. సూయజ్‌కాలువతగాదా జరుగుచున్నకాలములో సిరియాకును, ఇస్రాయిల్‌కును యుద్ధముతటస్థపడేపరిస్థితులు కలిగెను. కాని ఆ వ్యవహారము శాంతముగ పరిష్కారముకాగానే అట్టిపరిస్థితులు శమించెను. ఇరాక్‌లోని ఆంగ్లేయ పెట్రోలియంకంపెనీయొక్క గొట్టములు సిరియాలోగుండా సముద్రతీరమునకు పోవుచున్నవి. వాటికి ఆ కాలములో సిరియాప్రజలవలన కొంత నష్టముకలిగినది. శాంతిసదిరినతరువాత ఆ గొట్టములనుంచి సరిగా నూనె వచ్చుచున్నది. సిరియాలోకూడ పెట్రోలునూనెను కనిపెట్టి త్రవ్వితీయుటకు రెండుకంపెనీలు పనిచేయుచున్నవి. ఒకటి డచ్చికంపెనీ రెండవది సిరియాకంపెనీ అయ్యున్నవి. 1957 వ సంవత్సరము మే 4, 5 తారీఖులలో మరల సిరియాలో జరిగిన ఎన్నికలు కువాట్లీప్రభుత్వమునకే విజయమును కలుగచేసినవి. అమెరికావారు ప్రతిపాదించిన ఐసెన్‌హోవర్‌సిద్ధాంతమును సిరియా అంగీకరించలేదు. 1957 వ సంవత్సరము జనవరిలో సిరియా అధ్యక్షుడైన కువాట్లీ పాకిస్తానును, ఇండియాను దర్శించి వెళ్ళెను. తమ దేశము అమెరికా రష్యాబ్లాకులమధ్య తటస్థముగానుండునని ప్రకటించెను.

సిరియాప్రభుత్వము బాగ్దాద్‌పాక్ట్‌ను తీవ్రముగ ఖండించెను. అది అరబ్ జాతీయఐక్యతకు, అభివృద్ధికి కేవలము వ్యతిరేకమని, భంగకరమని ప్రకటించెను. ఐసెన్‌హోవర్ సిద్ధాంతమును తమమీద అంటకట్టినట్లయిన దానిని తీవ్రముగ ప్రతిఘటించెదమనికూడ సిరియాఅధ్యక్షుడగుకువాట్లీచెప్పెను. అమెరికా ప్రతినిధులు సిరియాదేశమునకు వెళ్లుట అసంభవమయ్యెను. జోర్డాను ప్రభుత్వము, సౌదీ అరేబియా, సిరియా, ఈజిప్టులతోకలసి ఒక క్రొత్త అరబు బృందముగ నేర్పడుట కంగీకరించెను. పాత అరబులీగు పనిచేయనందున ఈ క్రొత్త అరబుబృందము నేర్పరచుటకు నిశ్చయించిరి. వెంటనే అమెరికా వారికి జోర్డానుమీద ఆగ్రహముకలిగి తమ నావికాసేనలను జోర్డానుకు పంపిరి. అవి జోర్డానులో ప్రవేశించెను. అమెరికావారు హుస్సేన్ రాజుకు సహాయముచేసి ఆయనకువ్యతిరేకముగనున్నవారిని అణచివైచి అరబు బృందమునుంచి జోర్డానును విడదీయించిరి. తమవైపుకు జోర్డానును త్రిప్పుకొనిరి. అమెరికా నావికాసైనికులు జోర్డానులో ప్రవేశించుట అక్రమమని సిరియాప్రభుత్వము తీవ్రఖండనమును తెలిపెను. గాని ప్రయోజనము లేకపోయెను. తుదకు సిరియాఅధ్యక్షుడగు షుక్రి కువాట్లీ ఈజిప్టుఅధ్యక్షుడగు కల్నల్‌నాసర్ కలిసి 1958 వ సంవత్సరము ఫిబ్రవరి 1 వ తేదీన సంయుక్త అరబ్‌రిపబ్లికు (**United Arab Republic**) నేర్పరచుకొనిరి. దీనినిగూర్చి ఈజిప్టుకథలో చెప్పియున్నాము. సిరియాప్రజాస్వామ్యముయొక్క జనసంఖ్య 40 లక్షల 25 వేలు. వైశాల్యము 72 వేల చదరపుమైళ్ళు. దీనిరాజధాని డెమాస్కస్ నగరము. దీనిజనసంఖ్య 8 లక్షల 39 వేలు. ఈ నగర మొకప్పుడు యావత్తు ప్రపంచ ముస్లింరాజ్యమునకు రాజధానిగ నుండెను. ఈ దేశములో సున్నీశాఖకుచెందినముస్లిములు అత్యధికసంఖ్యాకులుగ నున్నారు. కొద్దిమంది షయ్యాలు, ఇస్మేలియాతెగవారు, డ్రూజ్‌తెగవారు, క్రైస్తవులు కూడ నున్నారు. భాష అరబ్బి. ప్రస్తుత అధ్యక్షుడు షుక్రీ కువాట్లీ. ప్రధాన మంత్రి దైసీ హుస్సేన్ అయియున్నారు.

## లెబనాన్

1920 వ సంవత్సరములో లెబనాన్‌ప్రాంతమును ఎక్కువమందిక్రైస్తవులు కాపురమున్నారనుమిషతో ఫ్రెంచివారు సిరియాదేశమునుండి విడదీసి ప్రత్యేక

దేశముగగావించిరి. సిరియాలోపరెనే లెబనాన్‌లో కూడ ఫ్రెంచివారిమాండేటు పాలన స్థాపించబడెను. గాని లెబనాన్‌లోకూడఅరబుజాతీయతత్త్వమువ్యాపించి నందున విదేశీయులైన ఫ్రెంచివారిమీద కొన్ని తిరుగబాట్లు జరిగెను. వాటిని ఫ్రెంచివారు సైనికబలములో అణచివేసినారు. లెబనాన్ జాతీయవాదులకును, ఫ్రెంచివారికిని కొన్నిసంవత్సరములపాటు తగవులుసాగెను. 1943 వ సంవత్సరములో లెబనాన్‌దేశీయులు ఫ్రెంచివారికి సంబంధములేని స్వతంత్ర ప్రజాస్వామ్యముగా నొక రాజ్యాంగవిధానమును తమదేశమునకు నిర్ణయించు కొనినపుడు ఫ్రెంచివారు లెబనాన్ అధ్యక్షుని అరెస్టుచేసి రాజ్యాంగవిధాన మును అమలుజరుగకుండచేసిరి. కాని మిగత అరబ్‌దేశములు, అమెరికా, ఇంగ్లాండులుకూడ లెబనాన్‌దేశము స్వతంత్రముగనుండుటకు సహాయపడి నందున 1944 వ సంవత్సరమునుండి క్రమముగ ఫ్రెంచివారు లెబనాన్ యొక్క స్వతంత్రపాలనమునే సాగనిచ్చి 1946 వ సంవత్సరములో పూర్తిగ తమసేనలను లెబనాన్‌నుంచి తీసివేసిరి. 1946 వ సంవత్సరమునుంచి లెబనాన్ సంపూర్ణస్వతంత్రమును పొందెను. ఇస్రాయిల్‌రాజ్యముతో విరోధ భావమేయుండెను. లెబనాన్‌దేశముయొక్క వైశాల్యము 4,015 చదరపుమైళ్లు. జనసంఖ్య 14 లక్షల 25 వేలు. ముసల్మానులుకూడ క్రైస్తవులకంటె కొంచెముతక్కువగనున్నారు. అందరును అరబిభాషనే మాట్లాడుదురు. 1950 వ సంవత్సరములో తనతో పూర్తిగ రాజకీయముగను, ఆర్థికముగను చేరవలెనని సిరియా కోరినప్పటికి లెబనాన్ అందుకు అంగీకరించలేదు. ఇటీవలి సంవత్సరములలో అమెరికావారిపలుకుబడి లెబనాన్‌లోకూడ అధిక మైనది. ఇరాకునుంచియు సౌదీ అరేబియానుంచియు పెట్రోలియంనూనె లెబనాన్‌దేశములోగుండా సముద్రతీరమునకు ఓడలమీద ఎగుమతిచేయుటకు గొట్టములువేయబడినందున లెబనాన్‌ప్రభుత్వమునకు నూనెకంపెనీలనుంచి చాలా సొమ్ము వచ్చుచున్నది. 1952 వ సంవత్సరములో నూనెకంపెనీలలో లెబనాన్‌ప్రభుత్వము క్రొత్తఒడంబడికలుచేసుకొని తన ఆదాయమును విశేష ముగ వృద్ధిచేసుకొనినది. 1955 వ సంవత్సరము ఏప్రిలునెలలో ఆసియా, ఆఫ్రికాఖండములలోని దేశములమహాసభ బాండుంగ్‌లో జరిగినపుడు లెబ నాన్‌దేశప్రతినిధులు దానికిహాజరై తాము కమ్యూనిజముకు వ్యతిరేకులమని

చెప్పినారు. ఈదేశములో కమ్యూనిజమును వ్యాపించకుండ అరికట్టుచున్నారు. ఇరాకు, ఇరాను. టర్కీ, పాకిస్తాను, ఇంగ్లండులు చేసుకొన్న పరస్పరసంరక్షణ సంధియగు బాగ్దాదుపాక్టు 1955 వ సంవత్సరములో జరిగినది. దానిలో లెబనాన్ చేరలేదు. అరబుదేశములఐక్యతకు లెబనాన్ సుముఖముగా నున్నది. కాని అరబుజాతులలో నేర్పడిన వివిధబృందములలో దేనిలోకూడ చేరలేదు. 1955 వ సంవత్సరము మార్చిలో లెబనాన్ అధ్యక్షుడగు కమిల్లె చమౌను అంకారాకు పోయి టర్కీనిదర్శించెను. టర్కీ అధ్యక్షుడగు జమాల్ బేయరు జూన్‌నెలలో లెబనాన్‌రాజధానియగు బీరట్‌కు వచ్చెను. రెండుదేశములును స్నేహసంబంధములను బలపరచుకొనినవి. అటులనే 1956 వ సంవత్సరములో లెబనాన్‌విదేశాంగమంత్రి సౌది అరేబియానుకూడ దర్శించెను. సౌది అరేబియాకూడ బాగ్దాద్‌సంధిలో జేరుటకు నిరాకరించినది. అరబ్ ఐకమత్యమునకు సుముఖముగ నున్నది. ఆ సంవత్సరము జూన్‌నెలలో రష్యా విదేశాంగమంత్రి లెబనాన్‌కువచ్చి కొంత ఆర్థికసహాయమునుచేసెదమనిచెప్పెను. కాని అమెరికావారు 36 లక్షల 76 వేల డాలర్లను లెబనాన్‌రాజధానియైన బీరట్‌లోని విమానాశ్రయముయొక్క అభివృద్ధికొరకును, లెబనాన్‌కును, సిరియాకును మధ్య రాకపోకలవీల్లకును, ఆర్థికసహాయము చేసిరి. సూయజ్ కాలువతగాదా కలిగినపుడు లెబనాన్‌కూడ ఈజిప్టుపక్షముననే తన సానుభూతిని చూపెను. 1957 వ సంవత్సరము జనవరినెలలో లెబనాన్‌ప్రభుత్వము ఐసెన్‌హోవర్‌సిద్ధాంతమునంగీకరించి అమెరికావారిలో కమ్యూనిజమును అణచివేయుటకు సహకరించుటకు ఒప్పుకొని, రెండుకోట్లడాలర్లను అమెరికానుంచి సహాయమునుపొందినది. లెబనాన్‌సైన్యములను బలపరచుటకుకూడ అమెరికావారు వాగ్దత్తముచేసిరి. లెబనాన్‌లోని యొకపక్షమువారు ఇటుల అమెరికాతో పూర్తిగ కలిసిపోవుట అరబ్ ఐక్యతకు భంగకరమని తీవ్రముగ ఖండించినను, ఏప్రిలునెలలో లెబనాన్‌పార్లమెంటు అమెరికాసహాయమును పొందుటకే తీర్మానముచేసినది. 1957 వ సంవత్సరము ఎన్నికలు జరిగినపుడు ప్రభుత్వపక్షమునకును వ్యతిరేకపక్షమునకును ఎక్కువగ తగువులు కలిగెను. వందమందికిపైగా కమ్యూనిస్టులను ప్రభుత్వమువారు అరెస్టుచేసి జైలులోపడవేసినారు. ప్రభుత్వపక్షమే జయముపొందినది. క్రొత్త

పార్లమెంటులో ముప్పాతికమంది ప్రభుత్వపక్షమునకే చేరినవారైరి. కమిల్లే చమౌను నూతనప్రభుత్వమునకు అధ్యక్షుడయ్యెను, సామీసోలా ప్రధానమంత్రి అయ్యెను. 1958 వ సంవత్సరములో ఇరాకులో సైనికవిప్లవముజరిగి, రాజరికము కూలిపోయి సంపూర్ణ ప్రజాస్వామ్య మేర్పడినపుడు, ఇరాకు నూతన ప్రభుత్వము బాగ్దాద్‌సంధిని రద్దుపరచుననియు, సంయుక్త అరబ్‌రిపబ్లికు (United Arab Republic)లో చేరిపోవుననియు ఆంగ్లో అమెరికనులు భయపడిరి. అమెరికాసైన్యములు లెబనాన్‌లో నుంచబడెను. అటులనే ఆంగ్లేయసైన్యములను జోర్డాన్‌లో నుంచిరి. ఆంగ్లో అమెరికను సైన్యములు ఇరాకులో చొరబడి క్రొత్త రిపబ్లికు ప్రభుత్వమును కూలద్రోసి, తమకు అనుకూలమైనరాజరికమును స్థాపించవలెనని యుద్దేశించినట్లు కనపడెను. కాని అటులచేయుటకు ధైర్యములేకపోయెను. ఇరాకుప్రజలలో అత్యధికసంఖ్యాకులు నూతన ప్రజాస్వామ్యప్రభుత్వపక్షమునవే యున్నందున ఆంగ్లో అమెరికనులు ఇరాకులో ప్రవేశించలేకపోయిరి. ఇరాకుప్రభుత్వముకూడ జాగ్రత్తగ సంచరించెను. బాగ్దాద్‌సంధిని బహిరంగముగ ఖండించలేదు. సంయుక్త అరబ్ రిపబ్లికులో చేరకుండ యూరకున్నది. పాశ్చాత్యదేశములతోను, పాశ్చాత్య నూనెకంపెనీలతోను చేసుకొన్న షరతులకు ఎట్టి భంగముగావించనని ప్రకటించినది. అందువల్ల ఇపు డేర్పడిన తీవ్రఆందోళన క్రమముగ తగ్గిపోయి శాంతి కుదిరినది. ఆంగ్లో అమెరికనుసేనలు ఇరాకుతో జోక్యము పుచ్చుకొనక లెబనాన్‌నుంచి, జోర్డాన్‌నుంచికూడ క్రమముగ లేచిపోయినారు. లెబనాన్‌కు ప్రభుత్వమతము లేదు. సెక్యులర్ స్టేటు (Secular State) అయ్యున్నది. బీరుటు రాజధానినగరము. దానిజనసంఖ్య 4 లక్షలు. అరబ్బి ప్రధానభాష. మతసహనము పూర్తిగ కలదు. ఒకే శాసనసభ కలదు. (Chamber of Deputies) ప్రజాప్రతినిధిసభ. స్త్రీలకు, పురుషులకు కూడ ఓటుచేయు అధికారము కలదు. ఆ శాసనసభలో 66 గురు సభ్యులు కలరు. ప్రజాస్వామ్యప్రభుత్వాధ్యక్షుడు ఆరుసంవత్సరముల కొకసారిఎన్నుకొనబడుచున్నాడు. లెబనాన్‌లోకూడ పెట్రోలియంనూనెగనులను అన్వేషించి దొరకినచోట్ల త్రవ్వితీయుటకు 1955 వ సంవత్సరములో లెబనాన్-ఫ్రాన్సుదేశములవర్తకులవల్ల నేర్పరచబడిన యొక కంపెనీకి

75 సంవత్సరములకౌలునిచ్చిరి. కొన్నిచోట్ల పెట్రోలియంనూనె దొరకు చున్నది. త్రవ్వడము ప్రారంభమైనది త్వరలో వృద్ధిచెందునని ఆశించ బడుచున్నది. లెబనాన్‌ప్రభుత్వములో అధ్యక్షుడు క్రైస్తవుడైన యెడల ప్రధానమంత్రి ముసల్మాను అగుసట్లును, అధ్యక్షుడు ముసల్మానైనయెడల ప్రధానమంత్రి క్రైస్తవుడగునట్లును ఒక సాంప్రదాయమును పెట్టుకొనిరి. 1958 సెప్టెంబరునెలలో పాశ్చాత్యరాజ్యములకు దాసుడైన కమిల్లే చమౌను ప్రభుత్వము పడిపోయినది. జనరల్ పౌదు చెహాబు అధ్యక్షుడయ్యెను. రష్షీదు కరామి ప్రధానమంత్రిఅయ్యెను. ఈ నూతనప్రభుత్వము కల్నల్ నాసరుకు అనుకూలముగనున్నది. ఆయనవలెనే అటు అమెరికాతోను ఇటు రష్యా తోను చేరక తటస్థముగనున్నది. డిశంబరు నెల 8వ తేదీన ఐసన్‌హోవరు సిద్ధాంతమును అనగ మధ్యప్రాచ్యదేశములు అమెరికాయొక్క సైనిక ఆర్థిక సహాయమును పుచ్చుకొనవలెనను సిద్ధాంతమును త్రోసివేసినది.బాగ్దాదుపాక్టులో చేరనేలేదు. ఇజ్రాయిలునుండి వెడలగొట్టబడి ప్రక్కనున్న అరబుదేశము లలో కాందిశీకులుగనున్న లక్షలాది అరబులహక్కులనుగూర్చి తాము మిగత అరబు దేశములతోకలసి పోరాడబోవుచున్నామని ప్రధానమంత్రి రష్షీదు కరామి చెప్పినాడు. కల్నల్ నాసరుయొక్కబలము అరబుదేశములలో బాగుగ వృద్ధిచెందినది.

## ఇ జ్రా యి ల్

మొదటి ప్రపంచయుద్ధము జరుగుచున్నకాలములో జర్మనీ మొదలగు దేశములన్నిటిలోని యూదులు మిత్రమండలికి సహాయము చేయుచుండి నందున యూదులందరును, పాలస్తీను దేశములోకి వచ్చి నివసించు నట్లు ఆ దేశమును వారికి మాతృభూమిగ చేయుదుమని ఆంగ్లేయమంత్రి బాల్ఫర్ 1917 వ సంవత్సరములో ప్రకటించెను. ఆప్రకారమే యుద్ధము ముగిసినప్పటినుంచి యూదులను తీసుకొనివచ్చి పాలస్తీనులో ప్రవేశపెట్ట సాగిరి. అక్కడ అదివరకు యూదులమతము దాదాపు పూర్తిగ తగ్గిపోయి, ముసల్మానులైన అరబ్బులే కాపురమున్నారు. యూదులు వచ్చినపుడు అరబు లందరును గొప్ప ప్రతిఘటనము సలిపిరి. ఇటుల అరబులకును యూదుల కును తీవ్రమైన తగాదాలు జరుగుచున్నందున 1948 సంవత్సరములో పాలె

స్తైన్‌లో పెద్దభాగమైన ఇస్రాయిలును విడదీసి ప్రత్యేకదేశముగ గావించి దానికి స్వతంత్రమిచ్చి దానిని యూదుల ప్రత్యేక గృహముగ చేసిరి. పాలెస్తైన్‌లో చిన్నభాగమును కొంత జోర్డాన్‌లోను కొంత ఈజిప్టులోను చేర్చిరి. అప్పటినుంచి ఇస్రాయిలుకు లక్షలకొలది యూదులు కాపురమునకు వచ్చిరి. అరబులను వెడలగొట్టిరి. యూదులు విశేష భాగ్యవంతులైనందున అరబ్బులభూములను ఎంతధనమైన యిచ్చి కొనుక్కొని ఫలవంతమైనభూములను, గనులను స్వాధీనపరచుకున్నారు. ఎదురుతిరిగిన అరబ్బులను హత్యగావించినారు. అరబు గ్రామములను తగులబెట్టినారు. ఆవిధముగ అరబ్బులను ఇస్రాయిల్‌నుంచి వెళ్ళగొట్టి, యూదులే అధికసంఖ్యాకులుగ ఇస్రాయిలులో కాపురమున్నారు. 9 లక్షలమంది అరబ్బులు ప్రక్కనున్న లెబనాన్ సిరియా జోర్డానులలోనికి చేరి, అచట కాందిశీకులుగ నివసించుచున్నారు. ఈ దేశముయొక్క వైశాల్యము 7,993 చదరపు మైళ్లు. జనసంఖ్య 19 లక్షల 40 వేల 480 మంది. ఇందులోనిప్పుడు 17 లక్షల 33 వేల 163 గురు యూదులు. 1 లక్ష 4 వేలమంది మాత్రమే ముస్లిములు. 87 వేలమంది క్రైస్తవులు గలరు. అందువల్ల ఇది పూర్తిగ యూదులదేశమని చెప్పవలసియున్నది. అరబ్ దేశములకును, ఇస్రాయిలుకును ఎట్టి సంధి కుదురలేదు. నిరంతరకలహాలు సాగుచున్నవి. అరబ్ లీగులో చేరిన ఈజిప్టు, సౌదీ అరేబియా, జోర్డాన్, సిరియా, లెబనాన్, ఇరాకుదేశములు 1948 వ సంవత్సరములో ఇస్రాయిలుమీద దండెత్తి దానిని జయించవలెనని ప్రయత్నముచేసినారు. కాని జయప్రదము కాలేదు. యూదులకు ఆంగ్లో అమెరికనులసహాయము ఎక్కువగకలదు. అరబ్ దేశములను బెదిరించుటకు ఆంగ్లో అమెరికనులు ఇస్రాయిలుప్రభుత్వమును పురికొల్పి వారిమీదికి పంపెదరు. పిమ్మట మధ్యవర్తిత్వమునువహించి శాంతింపచేతురు. ఇది పాశ్చాత్యజాతుల యొక్క రాజనీతి, ఇప్పటికి అయియున్నది. ఇస్రాయిల్‌దేశము బలవంతమైన, ధనవంతమైన దేశమైనది. ఇస్రాయిలున కొక పార్లమెంటు, మంత్రివర్గము కలవు. అధ్యక్షుడు పార్లమెంటుచే నెన్నుకొనబడుచున్నాడు. ఒకే సభ. దానిలో 120 మంది సభ్యులు ప్రజలవల్ల ఎన్నుకోబడ్డవారు. దేశము సర్వతోముఖముగ సత్వరముగ అభివృద్ధిచెందుచున్నది. పరిశ్రమలు

అభివృద్ధియగుచున్నవి. అమెరికావారి ధనసహాయముకూడ బాగుగ కలుగుచున్నది. గతచిన మూడుసంవత్సరములనుండి ప్రపంచముయొక్క అన్నిభాగములనుంచి ఎక్కువగ యూదులు వచ్చి ఇక్కడ నివసించుచున్నారు. అందువల్ల యూదులజనసంఖ్య అతి త్వరితముగ వృద్ధియగుచున్నది. శాంతియుతమైన ప్రజారాజ్యము బాగుగ స్థాపితమైనది. సైన్యములు పార్లమెంటుకు, మంత్రివర్గమునకు లోబడి నడచుచున్నవి. ప్రతిపురుషుడు అవసరమైనపుడు సైనికకొలువుకు రావలసియుండును. సూయజ్‌కాలువ తగువు జరిగినకాలములో ఇజ్రాయిలుసేనలు ఈజిప్టుమీద దండెత్తెను. కాని వానిని ఐక్యరాజ్యసమితివారు ఆపివేసిరి. 1955వ సంవత్సరమునుంచి ఇజ్రాయిల్‌లో పెట్రోలుసూనెగనులు కనిపెట్టబడినవి. ఆ దేశమునకు దాని స్వంత విమానాశ్రయములు కలవు. ఈ దేశములో వివిధభాగములలో పెట్రోలియమునూనెను అన్వేషణముచేసి త్రవ్వితీయుటకు ఆరు నూనెకంపెనీలు పనిచేయుచున్నవి. రెండు అమెరికావారివి, ఒకటి కెనడాదేశీయులది, తక్కినవి ఇజ్రాయిలుదేశీయులవి. దీర్ఘకౌళ్ళు ఇవ్వబడ్డవి. ఇజ్రాయిల్ పార్లమెంటులో లేబరుపార్టీ ప్రధానపార్టీగ నున్నది. ఇది కమ్యూనిస్టులకు వ్యతిరేకముగ నున్నది. ప్రస్తుత ప్రభుత్వాధ్యక్షుడు ఇత్ ఝాక్ బెన్‌జువి. ప్రధానమంత్రి డేవిడ్ బెన్‌గ్యురిన్. ఆయనే దేశరక్షణమంత్రిగ కూడ నున్నాడు. విదేశవ్యవహారములమంత్రి శ్రీమతి గోల్డా మెయిర్ అను స్త్రీ. సంయుక్త అరబురిపబ్లికు స్థాపించబడినప్పటినుంచియు కల్నల్ నాసరుక్రింద అరబుసైన్యములు కొన్నిరెట్లుగవృద్ధిచెందినవి. సోవియటుబృందమునుంచి ఆయుధములు కల్నల్ నాసరుసైన్యములకు లభించుచున్నవి. సోవియటుసైనికోద్యోగులు వీటిని తరిబీయతుచేయుచున్నారు. ఒక జోర్డానుతప్ప మిగిలిన అరబుదేశములన్నియు కల్నల్ నాసరుపక్షముననున్నవి. సంయుక్త అరబురిపబ్లికువారు తమనుఅణగద్రొక్కుదురనుభయము ఇపుడు ఇజ్రాయిలుకు పూర్తిగ కలిగినది. ఇజ్రాయిలుకు ఆయుధములను ఆంగ్లో అమెరికనులు అమ్ముచున్నారు. అందువల్ల ఆంగ్లో అమెరికనులమీద అరబులలో ద్వేషమెక్కువై అరబులందరు తమకు రక్షకుడైన కల్నల్ నాసరుపక్షమున అయననాయకత్వముక్రింద చేరుచున్నారు.

## జోర్డాన్

ఇది పాలస్తైనులో నొక భాగము. దీనిపేరు బైబిలులో విశేషముగ కనపడుచున్నది. ప్రపంచయుద్ధకాలములో జరిగిన బాల్ఫర్ ప్రకటనము ప్రకారము జోర్డానుకూడ యూదుల మాతృగృహములో జేర్చబడినది. కాని ఆంగ్లేయసేనలను వెంటబెట్టుకొని తురుష్కులనోడించి, మక్కా షెరీపు హుస్సేను కుమారుడయిన ఫైజల్ ఆక్రమించి తమకే ఈ రాజ్యము కావలెనని తగువుపెట్టినందున 1920వ సంవత్సరములో మిత్రమండలివారు ఇరాకుదేశము నకు ఫైజల్‌ను రాజుగచేసి షెరీఫు హుస్సేనుయొక్క రెండవ కుమారుడైన అబ్దుల్లాను జోర్డానుకు రాజుగచేసినారు. ఇరాకుతోపాటు జోర్డానుకూడ బ్రిటిషువారి మాండేటుపాలనముక్రింద నుంచబడినది. 1928వ సంవత్సరము ఫిబ్రవరిలో అబ్దుల్లారాజుకు జోర్డానుపరిపాలనలో ఎక్కువగ స్వతంత్రము కలుగచేయుచు బ్రిటిషువారితో సంధిజరిగినది. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలములో జోర్డానును తమ సైన్యములను త్రిప్పుకొనుటకు మిత్రమండలి వారు బాగుగ నుపయోగించుకొనిరి. 1946వ సంవత్సరము మార్చి 22వ తేదీన లండనులో ఒక సంధి జరిగి జోర్డాను అబ్దుల్లారాజుక్రింద సంపూర్ణ స్వతంత్రదేశముగ అంగీకరింపబడినది. అప్పటి కొక రాజ్యాంగవిధానము కూడ నిర్ణయించిరి. ఈ రాజ్యాంగవిధానము 1952వ సంవత్సరములో మరల సవరింపబడి, ఇపుడు అమలులోనున్నది. దీనిప్రకారము వంశపారంపర్య మైన రాజరికముండును. అధికారభాష అరబ్బి. ప్రభుత్వమతము ఇస్లాము. వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, సభాస్వాతంత్ర్యము ఇవ్వబడినవి. మతస్వేచ్ఛ పూర్తిగ కలదు. సెనేటు, ప్రజాప్రతినిధిసభ అను రెండు శాసన సభలు కలవు. మంత్రివర్గమును రాజు నియమించును. మంత్రివర్గమువారు ప్రజాప్రతినిధిసభకు బాధ్యతవహించుచున్నారు. పాషా, బే మొదలయిన బిరుదులు రద్దుపరచబడినవి. 1947వ సంవత్సరములో అబ్దుల్లా రాజు ఇరాకు, టర్కీదేశములతో సంధులుచేసుకొనెను. ఆంగ్లేయులకు జోర్డానులో శాంతి కాలములోకూడ కొన్ని సైనికహక్కులు కలిగియుండునట్లు, స్వేచ్ఛగ రాక పోకలుచేయునట్లు, విమానాశ్రయములను కట్టుకొనునట్లు; ఆర్థికసహాయము చేయునట్లు 1948వ సంవత్సరములో మరియొక సంధి జరిగినది. 1945వ

సంవత్సరములో ఏర్పడిన అరబ్‌లీగులో జోర్డానురాజుకూడ చేరెను. కొద్ది కాలములో మిగతా అరబ్‌దేశములతో అభిప్రాయభేదము లేర్పడి అరబ్‌లీగు బలహీనమై పనిచేయుట మానివేసినది. 1951వ సంవత్సరములో జరూసలేములో అబ్దుల్లారాజు హత్యచేయబడినాడు. ఆయనకుమారుడైన తలాల్ రాజుగచేయబడెను. కాని ఆయనకు మతిచాంచల్యము కలిగినందున రాజ్యమును త్యజించి తనకుమారుడైన హుస్సేనును రాజుగచేసెను. హుస్సేనురాజే ప్రస్తుతము జోర్డానుకు రాజుగనున్నాడు. 1953వ సంవత్సరములో యార్మాక్‌నదిమీద సమష్టిగ ఆనకట్టకట్టుటకు సిరియాతో ఆయన సంధి చేసుకొనెను. ఇరాకురాజవంశముతో బంధుత్వము కలిగియున్నందున ఇరాకుతో స్నేహసంబంధములను పెట్టుకొనెను. జోర్డాన్‌లో నిలకడయైన మంత్రిత్వము లేదు. ప్రధానమంత్రులు తరచుగ మారుచున్నారు. బాగ్దాద్ పాక్ట్‌లో చేరుకుటకు జోర్డానురాజు నిరాకరించినాడు. 1957వ సంవత్సరము జనవరి 18,19 తారీఖులలో జోర్డానురాజు హుస్సేను, అరేబియారాజు ఇబిన్ సౌదు, ఈజిప్టు సిరియాల అధ్యక్షులు సమావేశమయినారు.వీరందరు కలసి 10 సంవత్సరములలో 1 కోటి 28 లక్షల సవరనులు జోర్డానుకు సహాయముగ యిచ్చునట్లు అంగీకరించి జోర్డానును తమ అరబ్‌బృందములో నుండునట్లు స్థిర పరచిరి.విదేశపలుకుబడిలోనుంచి తప్పించవలెనని యత్నించిరి.ఇది అమెరికా వారికి చాల కంటకమయ్యెను. జోర్డానుదేశము సోవియటుబృందమువైపుకు మ్రొగ్గుచున్నట్లు వారు ఆరోపణచేసిరి. అమెరికా నావికాసైన్యములు జోర్డానుకు తీసుకొనిరాబడెను. జోర్డాన్‌రాజును బెదిరించి అమెరికావారు తమ వైపుకు తిప్పుకొనిరి. ఐసెన్‌హోవర్‌సిద్ధాంతము నంగీకరించునట్లుచేసిరి. జోర్డాన్‌ప్రభుత్వమునకు ధనసహాయముచేసిరి. జోర్డాన్‌చేత మిగత అరబ్‌దేశములతో ఏర్పరచుకున్న ఒడంబడికలను రద్దుగావింపచేసిరి. 1957 వ సంవత్సరము మేనెలలో సిరియాప్రభుత్వము తనసైన్యములను హుస్సేన్‌రాజు యొక్క కోరికమీద జోర్డానునుంచి తీసుకొనిపోయెను. జోర్డానుయొక్క వైశాల్యము 37,500 చదరపు మైళ్ళు. జనసంఖ్య 15 లక్షలు. ప్రస్తుతము హుస్సేను రాజుగనున్నాడు. ఇబ్రహీం హషేమ్ ప్రధానమంత్రిగ నున్నాడు. ఇటీవలి సంవత్సరములలో ఇజ్రాయిల్‌ప్రభుత్వము తమదేశములోని అరబ్బు

లను వెళ్ళగొట్టుచుండుటవలన లక్షలకొద్ది అరబ్బులు ప్రక్కనున్న జోర్డాన్, సిరియా, లెబనాన్ దేశములలోనికి వచ్చి కాపురమున్నారు. ఈ కారణములచేత జోర్డానురాజధానియైన అమ్మాన్‌నగరములో జనసంఖ్యఅత్యంతముగపెరిగినది. ఇపుడు దానిజనసంఖ్య రెండులక్షలు. ఇరాకులోని ఆంగ్లేయ పెట్రోలుకంపెనీ వారు జోర్డానుకువచ్చి, నూనెగనులు కనుగొనుటకు ప్రయత్నించిరి. కాని జయ ప్రదముకాలేదు. 1956-57 సంవత్సరములలో మరియొక అమెరికాకంపెనీవారు వచ్చినూనెగనులనిమిత్తము జోర్డానులో అన్వేషణచేయుచున్నారు. పారిశ్రామి కాభివృద్ధి బహు మెల్లగ సాగుచున్నది. వ్యవసాయసరకులు విదేశములకు ఎగుమతియగును. ఇవి సిరియా, లెబనాన్, ఇరాకులకు పోవుచున్నవి. ఇరాకు లోని ఆంగ్లపెట్రోలియంకంపెనీవారు జోర్డానులోగుండ గొట్టములువేసుకొని సముద్రతీరమునకు తమనూనెను తీసుకొనిపోవుచున్నందుకు ప్రతిసంవత్స రము 60 వేల సవరనులను, అటులనే సౌదీఅరేబియాలోని అమెరికా పెట్రో లియమునూనెకంపెనీవారు జోర్డానులోనుంచి సైడానురేవుకు తీసుకొనిపోవు టకు తమ గొట్టములను వేసుకొన్నందుకు సాలుకు 40 వేల పౌండ్లు ఇచ్చు చున్నారు.

ఆంగ్లేయులును, అమెరికావారును జోర్డానుయొక్క ఆర్థికలోటును పూడ్చుటకు విశేషముగ సహాయముచేసి, తక్కిన అరబ్ దేశములతో చేర కుండ నిలబెట్టుచున్నారు. 1958 వ సంవత్సరములో ఇరాకులో సైనిక విప్లవము లేవదీయబడి, రాజరికము కూలద్రోయబడి సంపూర్ణ ప్రజా స్వామ్యము స్థాపింపబడినపుడు జోర్డానులోకూడ అటువంటి కల్లోలము జరుగునేమోయని భయముకలిగి ఆంగ్లేయసేనలు హుస్సేనురాజును సంరక్షిం చుటకు జోర్డానులో వచ్చిచేరినవి. పిమ్మట క్రమముగ శాంతికుదిరినందున తీసివేయబడినవి. జోర్డానులో విశేషభాగము ఎడారులుగానున్నందున దానిని వ్యవసాయములోనికి తీసుకొనివచ్చుటకు జోర్డాను, యార్మాక్ నదులమీద ఆనకట్టలుకట్టుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఇస్రాయిలుతో అరబ్ దేశములు నిరంతరముచేయుచున్న కలహములవలన జోర్డానులో అరబులు లక్షలకొలది ప్రవేశించినందున జోర్డానుఆర్థికస్థితి మిగుల చిక్కులలోపడిన దని అభిజ్ఞులు తలచుచున్నారు.

## ఇరాకు (మెసపొటేమియా)

తురుష్క దేశములోని కొండలలో పుట్టిన యూఫ్రెటీస్, టైగ్రిస్ నదులు ఇరాకు దేశముగుండా ప్రవహించుచున్నవి. ఈ ప్రాంతము ప్రాచీన నాగరికతకు జన్మస్థానములలో నొకటియైయున్నది. అస్సీరియా, సుమేరియా రాజ్యములు ఇచట ప్రబలినవి. పిమ్మట బాబిలోనియా, బైజంటైను సామ్రాజ్యములు పుట్టి, కూలిపోయినవి. క్రీ. శ. 634 వ సంవత్సరములో ముస్లిం ఖలీఫాయొక్క రాజధాని మదీనానుండి సిరియాలోని డెమాస్కస్‌కు వచ్చినది. ఆపిమ్మట 754 వ సంవత్సరములో అబ్బాసీవంశమువారు ప్రపంచ ముస్లింరాజ్యమునకు చక్రవర్తులై ఖలీఫాలైరి. వారు ఇరాకు దేశస్థులు. సిరియానుండి రాజధానిని ఇరాకుకు మార్చిరి. ఇరాకులోని బాగ్దాదునగరము రాజధానిగచేయబడి అత్యంతమైనశోభను అనుభవించినది. అచటి విశ్వవిద్యాలయము 12, 13 శతాబ్దములలో జగత్ప్రసిద్ధికెక్కినది. 1253 వ సంవత్సరములో చెంఘిజ్‌ఖానువంశీకులగు మంగోలులు ఇరాకును జయించి బాగ్దాదు నగరరాజమును ధ్వంసముగావించిరి. 1434 వ సంవత్సరములో ఇరాకు దేశము తురుష్కముక్రిందికి వచ్చినది. మొదటి ప్రపంచయుద్ధకాలమునకు పూర్వమే జాతీయస్వతంత్రముకొరకు పనిచేయదలచిన (యంగ్ అరబ్‌పార్టీ) యువజన అరబుకక్షి ఇరాకులో బయలుదేరినది. దానిని మిత్రమండలివారు యుద్ధకాలములో ప్రోత్సహించి అరబ్బులలో జాతీయ స్వతంత్రభావములను పురిగొల్పి తురుష్కముపై దండయాత్రలనుచేయించిరి. కాని ప్రపంచ యుద్ధము ముగిసినతరువాత 1920 వ సంవత్సరములో ఇరాకుకు సంపూర్ణ స్వతంత్రమిచ్చుటకు మారుగ ఆంగ్లేయమాండేటుపాలనముక్రింద దానినుంచి, అచట బ్రిటిషుపాలనము సాగించుట అరబు జాతీయవాదులకు ఎక్కువ ఆశాభంగముకలిగి తిరుగబాటుగావించిరి. ఆ తిరుగబాటును ఆంగ్లేయులు సైనికశాసనము ప్రకటించి, అణచివేసిరి. 1921 వ సంవత్సరములో మక్కా షెరీఫు హుస్సేనుయొక్కకుమారుడైన అమీర్ ఫైజల్‌ను ఇరాకుపైన రాజుగ చేసి దేశములో కొంతకాలము శాంతిని నెలకొల్పి, ఆంగ్లేయులు మాండేటరీ పాలనమును సాగించిరి. 1922 వ సంవత్సరములో తురుష్కమునుంచి పెట్రోలుగనులెక్కువగనున్న మోసల్‌రాష్ట్రమును విడదీసి నానాజాతుల

సమితివారు ఇరాకులో చేర్చిరి. 1930వ సంవత్సరములో ఆంగ్లేయులకు కొన్ని విమానాశ్రయములను, సైనికహక్కులను ఇచ్చి ఆంగ్లేయులతో ఇరాకురాజు సంధిచేసుకున్నాడు. 1932 వ సంవత్సరములో మాండేటరీపరిపాలనను అంత మొందింపచేసి ఇరాకును నానాజాతులసమ్మేళనములో స్వతంత్రసభ్యురాలిగా చేర్చిరి. ఇరాకు అప్పటినుంచి స్వతంత్రదేశమైనది. 1925 వ సంవత్సరము నుంచి ఇరాకులో పెట్రోలియమునూనె ఎక్కువగ త్రవ్వబడుట ప్రారంభింప బడినది. 1934 వ సంవత్సరమునకు ఇరాకుదేశములో దొరికిన నూనెను ఇరాకుప్రభుత్వము ఆంగ్లేయకంపెనీయగు ఇరాకు పెట్రోలియంకంపెనీకి కౌలుకిచ్చిరి. మోసల్, బాస్రాప్రాంతముల పెట్రోలియంనూనె ద్వితీయ ప్రపంచయుద్ధమైనపిమ్మట విశేషముగ కనుగొనబడినది. బాస్రా పెట్రో లియముకంపెనీ, మోసల్‌పెట్రోలియముకంపెనీ ఇరాకు పెట్రోలియము కంపెనీతో కలిసి ఈ ప్రాంతములో విశేషముగ నూనెతీయుచున్నవి. బాగ్దాద్ పట్టణములో ఒకకోటి నవరసులుపెట్టి ఒకనూనె రిఫైనరీని నిర్మించినారు. ఈ నూనెకంపెనీలతో ఇరాకుప్రభుత్వము 1952 వ సంవత్సరములో చేసుకొన్న ఒడంబడికనుబట్టి ఆ కంపెనీలకు వచ్చే లాభములో సగము ఇరాకుప్రభుత్వ మునకు చెందవలసియున్నది. ఇందుమూలమున సంవత్సరమునకు 7 కోట్ల నవరసుల (100 కోట్ల రూప్యముల) ఆదా ఇరాకుప్రభుత్వమునకు వచ్చు చున్నది. ఇరాకులో దొరికే నూనెలో చాలభాగము గొట్టములద్వారా లెబనాన్ దేశముగుండ ట్రిపోలీరేవుకును, సిరియాదేశముగుండ బనియాన్‌రేవుకును తీసుకొనిపోయిసముద్రముమీద విదేశములకుఎగుమతిచేయుచున్నారు.ఇంకొక నూనెగొట్టపుమార్గము ఇజ్రాయిలుగుండ హైఫారేవునకు తీసుకొనిపోబడి, అక్కడినుంచి సముద్రముమీదఎగుమతిచేయబడుచున్నది. ఇజ్రాయిలునకును, ఇరాకు మొదలగు అన్నిఅరబ్‌దేశములకును ఎప్పుడును కలహములే యుం డుటవలన ఇజ్రాయిలులోని హైఫారేవుకు తీసుకొనిపోవు గొట్టములను తీసివైచి వాటిని లెబనాన్‌దేశముగుండ మరల్చి, సముద్రతీరమునకు తీసి కొనిపోవలెనని ఇరాకు ఒక ప్రతిపాదనచేసినది. అది ఇంకను ఆలోచ నలోనున్నది. రెండవ ప్రపంచయుద్ధకాలమునకు పూర్వమే 1937వ సంవ త్సరములో ఇరాకుప్రభుత్వము టర్కీ, పర్షియా, అఫ్ఘనిస్థానములతో సంధి

చేసుకొన్నది. ఇంగ్లండు ప్రభుత్వము ఇస్రాయిలును యూదులగృహముగ స్థాపించుచున్నందుకు ఇంగ్లండుమీద మిగత అరబ్‌దేశములలోవలెనే ఇరాకులోకూడ వ్యతిరేకభావము కలిగినది. ద్వితీయ ప్రపంచయుద్ధకాలములో జర్మనులపలుకుబడి ఇరాకులో వృద్ధియైనది. ఇంగ్లండుయొక్క పలుకుబడి తగ్గినది. అప్పుడు ఆంగ్లేయసైన్యములు ఇరాకులోనికి దండెత్తివచ్చినవి. దానివల్ల జర్మనులతో ఇరాకుప్రభుత్వము తెగతెంపులుచేసుకొని ఇంగ్లండుతో చేరినది. ఇంగ్లండుసైన్యములు యుద్ధముఆఖరువరకు బాస్రా బాగ్దాద్ పట్టణముల నాక్రమించియే యున్నవి. ఇరాకు 1943వ సంవత్సరములో జర్మనీ మీద యుద్ధమును ప్రకటించినది. ప్రపంచయుద్ధము జయప్రదముగ ముగియగనే 1945వ సంవత్సరములో ఐక్యరాజ్యసమితిలో ఇరాకుకూడ చేరినది. ఇరాకు రాజకీయవాదులలో ముఖ్యుడైన నూరీ యస్ సయ్యదు 1945 వ సంవత్సరములో మిగిలిన అరబ్‌దేశములతోకలిసి ఆరబ్‌లీగును స్థాపించెను. 1948వ సంవత్సరములో అరబ్‌దేశములన్నీ కలిసి ఇస్రాయిలుమీద యుద్ధము ప్రకటించినవి. అందులో ఇరాకుప్రభుత్వముకూడ చేరినది. ఆ యుద్ధములో ఇస్రాయిలుప్రభుత్వసేనలే ఎక్కువ జయమును పొందినవి. యుద్ధమును ఐక్యరాజ్యసమితివారు ఆపివైచినారు. ఇరాకులోని 1 లక్ష 30 వేలమంది యూదులు ఇరాకును విడిచి ఇస్రాయిలుకు వెళ్ళిపోయినారు. అరబ్‌లీగులో అభిప్రాయభేదములు కలిగి సరిగా పనిచేయలేదు. ఇరాకులో అశాంతికలిగినది. ఇరాకులో 1952 నవంబరుమొదలు 1953 అక్టోబరువరకు సైనికశాసనమే అమలులోనున్నది. కాని ఇరాకుయొక్క పెట్రోలునూనెపరిశ్రమ దినదినమునకు వృద్ధియైనది. ఇరాకు జోర్డానుదేశములు కలిసి సిరియాను తమతో చేరి, యొకే సంయుక్తరాజ్యముకమ్మని కోరిరి కాని, సిరియా అంగీకరించలేదు. అరబుదేశములలో సిరియా, ఈజిప్టు, సౌదీఅరేబియా ఒకవైపునను, ఇరాకు, జోర్డానులు మరొకవైపునను రెండు బృందములుగ నేర్పడినవి. 1955వ సంవత్సరములో ఏర్పడిన బాగ్దాద్‌సంధిలో ఇరాకు చేరెను. బాగ్దాద్ నగరము ఇరాకుయొక్క రాజధానియని ఇదివరకే చెప్పియున్నాము. అప్పటినుంచి ఇంగ్లండుతో స్నేహబంధములెక్కువయ్యెను. 1955వ సంవత్సరము నవంబరులో బాగ్దాద్‌పాక్టులో చేరిన అయిదుదేశములవారు, అనగా

ఇంగ్లడు, ఇరాకు, ఇరాను, టర్కీ, పాకిస్థానుదేశముల ప్రతినిధులు బాగ్దాద్ నగరమందు సమావేశమై ఒక శాశ్వతమైన సైనికమైత్రికిని, ఆర్థికసహాయమునకును ఏర్పాట్లుచేయుటకు నిర్ణయించిరి. అన్నివిధముల సహాయము చేయుటకు ఇంగ్లండు అంగీకరించెను. అమెరికా ప్రభుత్వముకూడ సహాయము చేసెదమని చెప్పిరి. కమ్యూనిస్టు రష్యాను, మధ్యప్రాచ్యప్రాంతములోకి రాకుండచేయుటే వారి ముఖ్యోద్దేశము. 1956వ సంవత్సరములో సూయజుకాలువసమస్యమీద ఆంగ్లో ఫ్రెంచిసైన్యములు ఈజిప్టులో ప్రవేశపెట్టబడినపుడు బాగ్దాద్‌పాక్టులోని నాలుగు ముసల్మానుదేశములు ఈజిప్టుపక్షమున సానుభూతిని కనపరచి, ఆ వ్యవహారమును రాజీగ పరిష్కారము చేసికొనవలెనని తీర్మానముచేసిరి. ఈజిప్టుకు సూయజ్ కాలువమీద సంపూర్ణ హక్కులుండవలెననియు, అన్నిదేశములవారు అన్నికాలములందు ఆ కాలువగుండ వచ్చుటకు అభ్యంతరము లుండకూడదనియు. ఆ వ్యవహారము శాంతముగ పరిష్కరించబడి, ఆంగ్లో ఫ్రెంచి సైన్యములు వెంటనే ఈజిప్టును వదలిపోవలెననియు ఈ దేశముల ప్రభుత్వములు తీర్మానించినవి. పిమ్మట ఆవిధముగనే జరిగినందున ఈ దేశములవారు తమ సంతోషమును వెలిబుచ్చిరి. ఈ నాలుగుదేశములయొక్క స్వాతంత్రమును కాపాడుటకు నిశ్చయించుకున్నామని అమెరికా ప్రభుత్వమువారు ప్రకటించిరి. ఇంతలో అమెరికాఅధ్యక్షుడగు ఐసెన్‌హోవర్ మధ్యప్రాచ్యదేశములలోదేని స్వతంత్రమునకైన విఘాతముకలుగకుండ సైనిక ఆర్థికసహాయము చేసెదమని వెల్లడించెను. దీనికి ఐసెన్‌హోవర్‌సిద్ధాంతమని పేరు. దీనిని ఈ దేశములన్నియు అంగీకరించినవి. 1 కోటి 20 లక్షల డాలర్లు వెంటనే ఈ నాలుగుదేశములకు పంచిపెట్టబడినవి. ఇరాకుప్రధానమంత్రియగు నూరీయస్ సయ్యదు అమెరికాయొక్కసహాయమును ఇరాకుకు ఎక్కువగ సంపాదించెను. బాగ్దాద్‌పాక్టుయొక్క ఆర్థికకమిటీ సమావేశము 1957 వ సంవత్సరము మే 16 వ తేదీన కరాచీలో జరిగెను. ఆంగ్లేయ అమెరికాప్రతినిధులుకూడ వచ్చిరి. 20 లక్షల నవరసులను ఇరాకుకు సహాయముచేసెదమని ఆంగ్లేయ ప్రభుత్వము చెప్పెను. సైనికవ్యవహారములకమిటీ కూడ సమావేశమయ్యెను. ఈ నాలుగు ముస్లిమురాజ్యములకు సైనికవ్యవహారములలో కూడ అమెరికా

సహాయముచేసెదమనివాగ్దత్తముచేసెను. జోర్డానువ్యవహారములలో అమెరికా వారు ఇటులే జోక్యముపుచ్చుకొని ఆ ప్రభుత్వమును మిగతా అరబ్ దేశములతో చేరకుండ తమవైపుకు పూర్తిగ తిప్పుకున్నారని పైన చెప్పియున్నాము. ఇరాకులో నూరీయన్ సయ్యద్‌కు వ్యతిరేకమైన కక్షి బయలుదేరినది. చాల చోట్ల అల్లరులు జరిగెను. కాని సైనికశాసనమును ప్రకటించి దానిని అణచివేసిరి. పార్లమెంటులో చాలమంది బాగ్దాద్‌పాక్ట్‌నుంచి ఇరాకును లేచిరమ్మని కోరినప్పటికి నూరీయన్ సయ్యదు అంగీకరించలేదు. ఈవిషయమై దృఢముగ నున్నాడు. గాని ప్రజాభిప్రాయ మతనికి వ్యతిరేకమైనందున 1957 వ సంవత్సరము జూన్‌లో నూరీయన్ సయ్యదు ప్రధానమంత్రిత్వమునకు రాజీనామా నివ్వవలసివచ్చినది. అలియాల్ అయూబి ప్రధానమంత్రి యయ్యెను. ఇరాకుప్రభుత్వము మిగతా అరబుదేశములతో చేసుకొనిన ఒడంబడికలన్నియు అంగీకరించెదమని, అమలుజరిపెదమని ఆయన చెప్పెను. ఆయన 1957 వ సంవత్సరము డిశంబరు 15 వ తేదీన రాజీనామానివ్వగ అబ్దుల్ మీర్జాను అను నాయన ప్రధానమంత్రియయ్యెను. ఆయనను నూరీయన్ సయ్యదు బలపరచినాడు. 1958 వ సంవత్సరము ఫిబ్రవరి 1 వ తేదీన ఈజిప్టు అధ్యక్షుడైన కల్నల్ నాసర్, సిరియాఅధ్యక్షుడైన ప్రెసిడెంటు కువాట్లీ చేరి (యునైటెడ్ అరబ్ రిపబ్లిక్) సంయుక్త అరబ్ రిపబ్లికును స్థాపించగ. ఆ నెల 14 వ తేదీన జోర్డాన్‌రాజైన హుస్సేనురాజు, ఇరాకురాజైన ఫైజలు రాజు కలిసి తమరాజ్యములను రెంటిని అరబు ఫెడరేషనుగ **Arab Federation)** ఏకముచేసిరి. ఈ ఏర్పాటుప్రకారము ఈ రెండురాజ్యములకు ఒకే సైన్యము, ఒకే విదేశవ్యవహారములమంత్రి, ఒకే ఆర్థికమంత్రి ఉందురు. దీనికి ఫైజలురాజు ముఖ్య అధిపతి. ఆయనక్రింద హుస్సేనురాజు డిప్యూటీగ నుండెను. తమ తమ రాజ్యములమీద తమహక్కులను నిలుపుకొనిరి. కొంతకాలము బాగ్దాద్‌నగరము, కొంతకాలము అమ్మాన్‌నగరము ఈ సంయుక్తప్రభుత్వమునకు రాజధానిగ నుండును. దీనిమీద ఇరాకుప్రజలలో వ్యతిరేకభావములు తీవ్రముగ హెచ్చెను. ఇందువల్ల అరబుఐకమత్యమునకు భంగముకలుగుచున్నదని తలచిరి. పాశ్చాత్యదేశములక్రింద ఇరాకు రాజు ఫైజలు దాసుడుగ నున్నాడని, అట్లు అతనిని నూరీయన్ సయ్యదు

దాసుడుగ చేయుచున్నాడని ఆగ్రహము—ముఖ్యముగ సైనికులలో ప్రబలెను. అందుమీద ఒక సైనికవిప్లవము జరిగినది. ఫైజలురాజును, నూరీయన్ సయ్యదును హత్యగావించిరి. రాజరికమును తీసివేసిరి. ఇరాకు దేశమును సంపూర్ణ స్వతంత్రప్రజాస్వామ్యముగ ప్రకటించిరి. బ్రిగేడియరు అబ్దుల్ కరీం ఖాశిం ప్రధానమంత్రి అయ్యెను. పాత ప్రధానమంత్రిని విదేశాంగమంత్రిని విచారించి ఉరిదీసిరి. అందువల్ల నూతన ఇరాకు ప్రభుత్వము ఈజిప్టు, సిరియాలతో చేరి సంయుక్త అరబురిపబ్లికులో చేరునేమోననియు, బాగ్దాద్ సంధిని రద్దుపరచునేమోననియు, ఆంగ్లేయ కంపెనీలకివ్వబడిన పెట్రోలియమునూనెగనులకౌళ్లు కొట్టివేసి జాతీయము చేయునేమోననియు ఆంగ్లేయులకు అమెరికావారికి సందేహములుకలిగినవి. అంతేగాక ఇటువంటి సైనికవిప్లవమే జోర్డానులోకూడ జరిగి, హుస్సేన్ రాజును చంపి, అచటకూడ నొక ప్రజాస్వామ్యమేర్పడునేమోనను భయము కూడ కలిగెను. లెబనానులో అమెరికాసేనలు ప్రవేశించగ హుస్సేనురాజును సంరక్షించుటకు ఆంగ్లేయసేనలు జోర్డానులో ప్రవేశించినవి. ఈ సేనలన్నీ ఇరాకులో జొరబడి ప్రజాస్వామ్యమును రద్దుపరచి మరల ఫైజలురాజు యొక్కవారసులను సింహాసనాసీనులుగ చేతురేమోనను వార్తలు కూడ ప్రబలెను. తుదకు ఏమియు జరుగలేదు. నూతన ఇరాకుప్రభుత్వము జాగ్రత్తగ సంచరించినది. బాగ్దాద్ సంధియందు విముఖత్వమున్నను బహిరంగముగ దానికి వ్యతిరేకమైనప్రకటనచేయలేదు. ఈజిప్టు సిరియాలతోపాటు సంయుక్త అరబురిపబ్లికులో చేరలేదు. ఆంగ్లేయ నూనెకంపెనీలతో చేసుకున్న ఒడంబడికలను అమలుజరిపెదమనియే ప్రకటించెను. మారినదల్లా రాజరికము. జరుగుచున్నది సంపూర్ణప్రజారాజ్యము. దీనిని అన్నిదేశములు అంగీకరించక తప్పినదికాదు. ఏ ప్రభుత్వముతోను తాము తగవులుపెట్టుకొనతలచలేదని ఇరాకు నూతనప్రభుత్వము చెప్పినది. నూతన ప్రభుత్వమువెనుక దాదాపుగ ఇరాకుప్రజలందరు నున్నారు. ప్రభుత్వము మిగుల శాంతముగ జరుగుచున్నది. అందువల్ల క్రమముగ జోర్డానునుండి ఆంగ్లేయసేనలు, లెబనాన్ నుండి అమెరికాసేనలు తొలగిపోయినవి. ఇరాకుదేశముయొక్క వైశాల్యము 1,43,250 చదరపుమైళ్లు. జనసంఖ్య 50 లక్షలు. ఇరాకు పార్లమెంటులో

ఒకే శాసనసభ కలదు. రాజధాని బాగ్దాద్‌నగరము. భాష అరబ్బిభాష. ఈ దేశములో షయ్యా ముస్లిములు అత్యధికసంఖ్యాకులుగ నున్నారు.

ఆంగ్ల అమెరికాసేనలు తీసివేయబడినప్పటికి అమెరికనులు రష్యనులుకూడ ఇరాకులో పలుకుబడికొరకు కుట్రలుచేయుచున్నారు. ఇరాకు ప్రధానమంత్రి కమ్యూనిస్టుల పలుకుబడిలోకి పోవుచున్నాడని అయిదుగురు ఇరాకుమంత్రులు 1958 సంవత్సరము డిశంబరునెలలో రాజీనామాలిచ్చినారు. కల్నల్ నాసరుకు ముఖ్యుడుగనుండి ఇరాకును సంయుక్త అరబురిపబ్లికులో చేరవలెనని పట్టుబట్టుచున్న కక్షికి నాయకుడైన కల్నల్ అరేపును ఇరాకు ప్రభుత్వము జైలులోపెట్టినది. అటుపిమ్మట 1958 డిశంబరునెలలోనే ఇరాకు ప్రధానమంత్రియగు అబ్దుల్‌కరీం ఖాశిమును హత్యగావించి ఆయన ప్రభుత్వమును పడగొట్టుటకుప్రయత్నము జరిగినదనియు అది యొకవిదేశప్రభుత్వము యొక్క కుట్రవలన జరిగినదనియు ఇరాకుప్రభుత్వము ప్రకటించి, కొందరు. ఇరాకుప్రముఖులను జైళ్ళలోపడవేసినది. ఆ విదేశప్రభుత్వమేమో ఇరాకు ప్రభుత్వము చెప్పలేదు. ఆ ప్రభుత్వము అమెరికాయేనని ఈజిప్టువార్తాసంస్థ ప్రకటించినది. ఆ హత్యాప్రయత్నముతో తమ కెట్టిసంబంధము లేదని అమెరికాప్రభుత్వపక్ష ప్రతినిధి ప్రకటించినాడు. గాని ఇరాకులో అమెరికాకు వ్యతిరేకముగ అతి గొప్పవాతావణ మేర్పడినది. ఇరాకుప్రభుత్వము బాగ్దాదు సంధిని **(Bagdad Pact)** రద్దుపరచుకున్నట్లు ప్రకటించినది. ఇరాకు కల్నల్ నాసరుకు ఎక్కువ అనుకూలముగ తిరిగినది. అరబుదేశములలో కమ్యూనిస్టులపలుకుబడి వృద్ధియగునేమోననుభయము అమెరికాకు కలుగుచున్నందున సంయుక్త అరబురిపబ్లికు అధ్యక్షుడైన కల్నల్ నాసరుతోనే స్నేహముచేసికొనుట యుక్తమని అమెరికాప్రభుత్వము భావించుచున్నటుల తెలియుచున్నది.

